సాధన గ్రంథ మండలి, ౫౯.

# సుందరభారతయాత్ర

## (ద్వితీయ భాగము)



గ్రంథకర్త:
బులుసు సూర్యప్రకాశశాస్త్రి
విద్వాన్.



ప్రకాశకులు
సాధన గ్రంథ మండలి - తెనాలి.

 * [వెల: రు 2-8-0



## అంకితము

'అనాయాసేన మరణం వినా దైన్యేన జీవనమ్,
దేహాన్తే తవ సాయుజ్యం దేహి మే పార్వతీపతే!'

శ్రీ విశ్వేశ్వరుని పాదపద్మములందు
నమస్కారములతో సమర్పితము.

# తీర్థయాత్రలవలని ప్రయోజనము

శ్రీ రామకృష్ణపరమహంస ఇట్లు వక్కాణించును.

"బ్రహ్మసాక్షాత్కారమును గోరి అసంఖ్యాకులైన జనులు చిరకాలము జపతపములను, ధ్యానమును, ప్రార్థనలను, పూజలను సలిపిన పుణ్యస్థలములందు భగవానుడు నిశ్చయముగా వెలసియుండునని గ్రహింపుడు. వారి శ్రద్ధాభక్తులచే పారమార్థికభావము లచ్చట ఘనీభూతమైయుండునని చెప్పవచ్చును. ఇట్టి పుణ్యతీర్థములందు మానవుడు సులభముగా ఆత్మప్రబోధము నొంది భగవంతుని గనజాలును. అనాదిగా అసంఖ్యాకులగు సాధువులు, భక్తులు జ్ఞానులును ఇట్టి పుణ్యక్షేత్రములను దర్శించి సకల వాంఛలను విడనాడి భక్తిపూరితహృదయముతో ఈశ్వర సాక్షాత్కారముకొఱకై నిష్ఠలు సలిపియుందురు. కావున భగవంతుడు సర్వత్ర నిండియున్నను ఈ క్షేత్రములందు ముఖ్యముగా వెలసియుండునని గ్రహింపుడు. ఎక్కడ త్రవ్వినను నీరు దొరకును. కాని బావియో కోనేటో సరస్సో ఉన్నతావున త్రవ్వవలసిన పని లేకయే, కావలయు నన్నప్పుడెల్ల సిద్ధముగా జలము లభించునుగదా!"



శ్రీ రామకృష్ణ పరమహంస

"ఆవులు కడుపార మేసి నెమ్మదిగా ఒకచోట పరుండి నెమరు వేయును. అటులనే నీవొక పుణ్యక్షేత్రమును దర్శించిన పిమ్మట, అచ్చట నీ మనస్సున నుదయించిన పవిత్రభావములను గైకొని, యేకాంతస్థలమున గూర్చుండి వానిలో నీవు నిమగ్నుడ వగు వఱకును మననము చేయవలయును. ఆ క్షేత్రములనుండి వెడలగనే విషయభోగములకు దాసుడవై ఆ యుత్తమభావముల నన్నిటిని బోగొట్టుకొనరాదు."

"గంగాజలమును సామాన్యమైన నీరని భావింపరాదు; బృందావన ధూళిని సామాన్యమైన ధూళియని తలపరాదు; శ్రీ శ్రీజగన్నాథదేవుని మహాప్రసాదమును అన్నముగా నెంచదగదు. ఇవి యన్నియు సాక్షాత్ పరబ్రహ్మస్వరూపములు."

(శ్రీ రామకృష్ణ బోధామృతము నుండి)



# ACKNOWLEDGMENT

The author is very happy to express his grateful thanks for the help he has received, from the various Ministries of the Government of India, such as Ministry of Information and Broadcasting, Ministry of Transport; Press Information Bureau, Regional Touriest Officer, Madras, Public Releations Officers of various Railways and Directors of Information and Publicity of various State Governments, who have very readily and willingly placed the Choicest Photographic material and other valuable information for use by the author, and this indeed is a clean indication of the value and esteem with which they look upon such efforts as the publication of this book. He further wants to make a special mention of the help he has received from the Executive Officers of various famous temples and to Sri C. Sitaram, Manager Poorna Pictures Madras, for the pictorial illustrations lent to adorn this touriest guide, the first of its kind published in Telugu. Author's thanks are also due to the literary giants of Modern Telugu, who have very generously made several good contributions, in the shape of preface etc., which have indeed enhanced the value of this book and also to the State

Governments of Madras, Assam, United Provincies, Orissa, East Punjab, West Bengal, Bombay, Kashmir, Mysore, Rajasthan, Sowrastram, Hyderabad, Ajmir, Kutch, Coorg, Bhopal, Vindhyapradesh, Pepsu - Patiyala, Himachalapradesh, Uttarpradesh, Trivoncore-Cochin & Delhi Etc.

He also wants to express his heart felt gratitude to his valued friend Sri V. Bhanumurty, B. A., (Secretary, Science Society Madras - 4, and Assistant Information Officer, Press Information Bureau, Govt. of India.) for the spontaneous and keen interest he has evinced in enabling this book rich in information and illustrations, to be brought out in this present form.

*B. SURYAPRAKASA SASTRY*

AUTHOR.



# ప్రస్తావన

"గచ్ఛ గౌతమ! భద్రం తే గ్రామేషు నగరేషు చ,
ఆహో శాసనకయ్యాదీన్ కల్పయస్వ మహామునే!"

సుందర భారత పూర్ణయాత్రోత్సుకులైన మహనీయుల అడుగుజాడలలో సంప్రదాయానుసారము ముందుగా గౌతముని ప్రార్థించి, నాకు నా సహయాత్రికులకు అభ్యుదయ పరంపరాభివృద్ధిని అనుగ్రహించవలసినదని గణనాయకునికి నా యిష్టదైవమునకు గురువులకు నమోవాకములు పలికి, ఒక శుభ ముహూర్తమున సుస్నాతుడనై దీక్షాకంకణధారినై రత్నాకరమహోదధివలయాంకితమై వింధ్యమేఖలయై స్వచ్ఛహిమాలయకిరీటినియైన భారతమాతనిసర్గ మనోహర రూపమును కాంచతలచిన తరి; ప్రయాగవాస్తవ్యులు పరమపూజ్యులు ప్రాతఃస్మరణీయులు అగు శ్రీ ౧౦౮ ప్రభుదత్తబ్రహ్మచారి మహారాజులు, లోకకల్యాణార్థమై త్రివేణీతీరమున ౧౧ రోజులు అఖండమహాసంకీర్తన, రుద్రయాగము చేయసమకట్టి మాకు తెలుపగ, కొందరమిత్రులము పరమానందముతో పయనమై తీర్థరాజమగు ప్రయాగ చేరి, వివిధ ప్రదేశములనుండి యేతెంచిన భక్తసంఘములతో వేలాదిమహాత్ములతో కలసి మెలసి, పదిరెండురోజులు గడపితిమి. పిమ్మట శ్రీ బ్రహ్మచారిగారి ఆజ్ఞ ఆశీర్వచనములబడసి, తీర్థయాత్రకు సమకట్టి పర్యటనాక్రమంబున—

"మలయమనగ శుక్తిమంతంబునా వింధ్యమనగ పారియాత్రమన మహేంద్రమన ఋక్షమన స్వహమనగ కల సప్తకులపర్వతంబులును; గంగయు, తుంగభద్రయు, వేత్రవతియు, వేదవతియు, కృష్ణవేణియు, పెన్నయు, యమునయు, తమసయు, శరావతియు, కావేరియు, గోదావరియు, నర్మదయు, బాహుదయు, సరయువును, శతద్రువును, వితస్తయు విపాశయు, తామ్రపర్ణియు నను మహానదులును—అటనటకలుగు నదీద్వీపంబులును, పాంచాల పాండ్య బర్బర వత్స మత్స్య మగధ మళయాళ కళింగ కుళింగ కురు కొంకణ టెంకణ త్రిగర్త సాముద్ర సాళ్వ శూరసేన కుధేష్ణ నహ్మ కుదు కరూశ కాశ కోసల యవన యుగంధర ఆంధ్ర సింధు చేది చోళ పుళింద పుండ్రక పాండ్య ఆభీర సౌవీర సౌరాష్ట్ర మహారాష్ట్ర విదేహ విదర్భ ద్రవిడ కుణార్ణ కర్ణాట గౌళాంగ వంగ మరాట లాట బాహ్లీక బహుదాన కిరాత కేకయ అశ్మంతక కాశ్మీర గాంధార కాంభోజ కేరళ మాళవ నేపాళ ఘూర్జర కుంతల అవంతిక అనూపాది" పూర్వ జనపదంబులకు ఆధునిక రూపు

ములుగా భాసిల్లిన త్రింశద్రాష్ట్ర విశాలరూపమైన నవభారతావనిని యథావకాశముగ సందర్శించి, సర్వ పుణ్యతీర్థంబుల నదీనదంబుల సమయానుకూలంబుగ గ్రుంకు లిడి ప్రత్యూషంబుల పవిత్ర పాద ప్రణామంబు లాచరించి, ముముక్షుజన కల్పతరువులును, భక్త బాంధవులును నగు ప్రత్యక్ష దైవతముల నారాధించి, తదీయ క్షేత్ర మాహాత్మ్య మరసి, అయ్యాయితావుల పారలౌకిక క్రియల వేదోక్తంబుగా ననుష్ఠించి, దేశాటన కుతూహలురైన నను బోంట్లకు అనుభవైకవేద్య మగు పుణ్యవినోదఫలము లన్నింటిని సంతరించుకొని ఐహికాముష్మికములు రెండింటిని సముపార్జించుకొని ధన్యులమైతిమి.

స్వగృహము చేరి మా యాత్రానుభవములను భారతమాత నిసర్గ మనోహర రూపమును పాఠకమహాశయుల మనశ్చక్షువులకు ప్రత్యక్షము గావించు తమకంబున సరసపదవిన్యాస విశేషముల యాత్రా కథాక్రమాఖ్యానంబున కుపక్రమించుతరి, స్వయంప్రకాశమాన తేజుండును మిత్రుండును మిత్రసులభుండు నైన నొక మహనీయమూర్తి నన్నావేశించి సర్వ భారతనగర స్థితంబులైన ఎల్ల చోద్యంబులను, మనోజ్ఞదృశ్యంబులను ఆయా పుణ్యతీర్థ వినోదస్థలవిశేషంబులను, కర్ణపేయమైన మధునిష్యందివచోవిలాసముతో ప్రకటపరచినందున చిరంతనమైన మదీయ మనోవాంఛితంబు ద్విగుణితోత్సాహమై అయత్న స్థిరముగా నెఱవేరినట్లయ్యె.

మనోహరమైన మా యీ సుందర భారత యాత్రాక్రమమున ఆయా తావుల తమ యాతిథ్యవిశేషంబులచేతను, చిత్ర విచిత్ర ఛాయాచిత్రదాన మహిమంబుచేతను, మరింత రమణీయముగ నేత్ర పర్వంబుగ రూపొందజేసిన అయ్యాయి ప్రభుత్వాధినేతలకు జోతలువెట్టి, సుందరంబైన అక్షర రూప మిచ్చిన కృపామతులు జానకీరాములకు, జోహారులు పలికి, రూపశ్రీ చెలువారు చిత్తరువులచే గ్రంథమునకు ఆలేఖ్యతనూ విలాసము సమకూర్చిన మునిస్వామి రామగోపాలునికి శ్రీరాములకు, సీతారాములకు ధన్యవాదంబులర్పించి, కృతార్థుండ నాదలంచితి.

ఈబృహత్ప్రయత్నంబునకు ముందునిలిచి, ఆశీఃపురస్సరముగా సువర్ణాక్షతలు దయచేసిన జ్ఞాన వయోవృద్ధులు అభినవతిక్కన శ్రీ సుబ్రహ్మణ్యకవివతంసులకు, సరస సంగీత సాహిత్య చక్రవర్తులు శ్రీ అనంతకృష్ణశర్మాభిధానులకు, కళాప్రపూర్ణులు శ్రీ చిన సీతారామస్వామి శాస్త్రులవారికి, సాహిత్యభూషణులు శ్రీ సత్యనారాయణార్యులకు, వైయాకరణశిరోమణులు శ్రీ వేంకట

రమణాభిధులకు, పూర్ణప్రజ్ఞావతంసులు శ్రీ వేంకటశేషశాస్త్రిశతావధానులకు, విద్వజ్జనమాన్యులు శ్రీ బులుసు పండితులకు, బాలవాఙ్మయబ్రహ్మలు శ్రీ దీక్షితులవారికి, చరిత్రరహస్య ప్రకాశనచణులు శ్రీ సోమశేఖరులకు, విద్యార్థికమల దివాకరులు శ్రీ వేంకటావధాని భట్టాచార్యులకు, రస హృదయ గ్రహణ పారీణులు ఆచార్య శ్రీసుబ్రహ్మణ్యశాస్త్రిపదులకు, మహానుభావులు శతావధానులు శ్రీ శివరామశాస్త్రిపాదులకు, కృతజ్ఞతాపూర్వక సాష్టాంగ నమస్కారములాచరించి, నీరాజన మర్పించిన సర్వతోముఖ ప్రజ్ఞావంతులు శ్రీ భానుమూర్తి సార్థకనామధేయులను, గ్రంథలేఖనమున సహకరించిన, నా సోదరుడు శ్రీ సూర్యప్రకాశమును, అనురాగపురస్సరముగా ఆశీర్వదించుచున్నాను.

మరియు నా యీ కృషికి బహువిధముల సహకరించిన శ్రీ కేశవతీర్థ స్వామివారికి, శ్రీవారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి, శ్రీ మద్దులపల్లి వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి, శ్రీ గట్టి లక్ష్మీనరసింహశాస్త్రిగారికి, శ్రీ కుందుర్తి వేంకటనరసయ్యగారికి, శ్రీ అవ్వారి హనుమయ్యగారికి, శ్రీ ఉపాధ్యాయుల సుబ్రహ్మణ్యముగారికి, శ్రీ దోనేపూడి సుబ్రహ్మణ్యముగారికి, శ్రీ ధన్యంరాజు అప్పారావుగారికి, శ్రీ శిష్ట్లా సత్యనారాయణగారికి కృతజ్ఞతాపూర్వక నమస్కారములు.

ఇక యీగ్రంథ విషయం బెట్టిదనిన 'బాణోచ్ఛిష్టమిదం జగత్' అన్నట్టు సర్వము సత్పురుషుల ఉచ్ఛిష్టమే కదా! నాదని సగర్వంగా చెప్పుకొనదగినది భాష. నాఅనుభవములు నా ఎఱిగినంతలో స్థలపురాణాదులనుండి, కైఫీయత్తుల నుండి, ఆయాయి రాష్ట్రప్రభుత్వములు, యాత్రికశాఖాధికారులు, వివిధరైల్వేల యాత్రిక సమాచారశాఖాధికారులు, దేవాలయపరిపాలనాధికారులు దయచేసిన గ్రంథముల నుండి, తీర్థయాత్రాసక్తులైన అనుభవజ్ఞులవలన విని స్వయముగాకని, విబుధజనుల వలన తెలిసికొన్నంత సమాచారసర్వస్వమును ఈ పొత్తమునందు పొందుపరచితిని.

అల్పజ్ఞుండను, అర్థశూన్యుండను, సామర్థ్యరహితుండను అయిన నాకీ సుందరభారతయాత్రా సంకల్పము కలుగుటయేమి? దానిని పరమపూజ్యులు, ప్రాతఃస్మరణీయులు శ్రీ ౧౦౮ ప్రభుదత్తబ్రహ్మచారి మహారాజులు ఆశీర్వదించుటయేమి? శ్రీ వేమరాజు భానుమూర్తి ప్రభృతుల వంటి మిత్రులు కరావలంబన మిచ్చుటయేమి? జానకీరామ నామాంకితమైన ముద్రణాలయాధిపతులు యీగ్రంథమునకు సర్వాంగసుందరస్వరూపంబు సమకూర్చుటయేమి? ఓరియంటు

ప్రెస్ సంస్థాపకులు ముఖపత్రము (టైటిల్) తీర్చిదిద్దుటయేమి? శ్రీ సీతారాం గారి వంటి నిపుణచాయాచిత్రగ్రాహకులు, శ్రీ శ్రీ రామపుణ్యనామధేయులు వంటి వరిష్ఠ కళాకారులు అయాచితముగ, యీగ్రంథసరస్వతిని అమూల్యమైన వేష భూషణలతో అలంకరించుటయేమి? అడిగిన తడవుగా వివిధ రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాధినేతలు, వివిధరైల్వేల యాత్రికసమాచార శాఖాధికారులు మనస్ఫూర్తిగా సహకరించి సర్వసమాచార వితరణులై సమాదరించుటయేమి? అనుభవజ్ఞాన పరిణతులైన పండితప్రకాండులు శిరోధార్యములైన రచనలతో దీనికి తిలకము దిద్దుటయేమి? గ్రంథావలోకన తత్పరులైన తీర్థయాత్రాచరణశీలురైన పరిశ్రుతాధిక పాఠకమహాశయులు ముందుగా గ్రంథమూల్యమును పంపుటయేమి? ఈ సర్వశుభశకున ఫలితముగా నే తలపెట్టిన యీ సుందరభారత యాత్ర దిగ్విజయముగా పర్యవసన్నమగుటయేమి? ధ్యానించిచూడగా ఇది సర్వము ఆంధ్రదేశపు అభిమానదైవతములైన శ్రీశైల, సింహశైల, శేషశైలేంద్రుల వరప్రసాదమే కదా!

"యదత్ర స్ఖలితం కించిత్ ప్రమాదేన భ్రమేణవా,
తత్సర్వం శోధయం త్వార్యాః కస్య న స్ఖలితం మనః.
గచ్ఛతః స్ఖలనం క్వాపి భవత్యేవ ప్రమాదతః,
హసంతి దుర్జనా స్తత్ర సమాదధతి సజ్జనాః.
బహుచ్ఛిద్రం పరిత్యజ్య గుణలేశ జిఘృక్షయా,
పరిగృహ్ణంత్వదో విజ్ఞా బుజనో దంభవర్జితాః.
యదక్షర పద భ్రష్టం మాత్రాహీనం చ యద్భవేత్,
తత్సర్వం క్షమ్యతాం దేవ! నారాయణ! నమోస్తుతే."

ఇతి శమ్

బుధజన విధేయుడు,

మన్మథ శ్రావణము,
తెనాలి

బులుసు సూర్యప్రకాశ శాస్త్రి
వ్యవస్థాపకుడు: సాధన గ్రంథ మండలి.

# పరిచయము

శక్తిపీఠములు, ద్వాదశ జ్యోతిర్లింగములు, నవనారసింహులు — ఈ పెుదలైన స్థానముల గురించి పురాణాదులలో భిన్నాభిప్రాయములు గలవు. యథావకాశముగ సవివరముగ వివరించితిని. రామేశ్వరఖండము (దక్షిణము)లో గల ప్రసిద్ధ క్షేత్రముల గురించి, మైసూరు, కూర్గు, తిరువాన్కూరు, కొచ్చిన్ ప్రభుత్వ యాత్రిక సమాచారశాఖాధికారులు సంతోషముతో అనుగ్రహించిన గ్రంథములు, ప్రసిద్ధ దేవస్థాన పరిపాలనాధికారులు అనుగ్రహించిన గ్రంథములు నాకెక్కుడు సహకరించినవి. మరియు దక్షిణయాత్ర పూర్తిగా గావించి, వివరముగ, స్వానుభవములను తెలిపిన మిత్రులు శ్రీ వెంకట సుబ్బారావు, శ్రీరామమూర్తిగార్లకు కృతజ్ఞుడను. ఇంకను బహువిధముల సహకరించిన పండితలోకమునకు కృతజ్ఞుడను.

☞ యాత్రికున కవసరమగు సమాచారమంతయు, "యాత్రాఖండ" మను పేర ప్రథమభాగమున ముద్రింపబడినది.

* ఈ గుర్తు గల చిత్రములన్నియు శ్రీ సి. సీతారాం (మేనేజరు, పూర్ణా పిక్చర్సు, మదరాసు.) గారి సౌజన్యముతో ప్రచురింపబడినవి.

# విషయసూచిక

## పరిశిష్ట ఖండము 642

# సుందర భారత యాత్ర

## జగన్నాథ ఖండము

### (తూర్పు)

ప్రాచ్య భారతఖండము (East India) మహానదులు ప్రవహించు పవిత్రభూమి. ఇందులో ముఖ్యమైనది గంగ. ఇది పుట్టిన గంగోత్రి నుండి బంగాళాఖాతమున కలియువరకు 15 వందల మైళ్లు పొడుగున ప్రవహించు మేరలో ప్రతి అంగుళము హిందువుల పవిత్రభూమి. ఈ గంగా మైదానమునకు పెట్టని కోటగోడవలెనున్నది మహోన్నతమైన హిమాలయము. దుర్గమమైన యీపర్వతశ్రేణులలోపల ఒక కనుమదారి డార్జిలింగ్ మీదుగ వెళ్లుచున్నది. ఇది టిబెట్టుతో వ్యాపారమునకు గొప్ప కూడలిగా వర్ధిల్లుచున్నది. చాల అందమైన పట్టణము. సహజముగ భూమి సారవంతమైనది. కావలసినంత వర్షపాతము. ఆపైన నిరంతరము ప్రవహించు మహానదుల ప్రవాహము. ఈ ప్రాంతమంతయు, పచ్చని వరిపొలాలతో, వెదురు, మామిడి, కొబ్బరి తోటలతో కన్నుల పండువుగా నుండును.— అస్సాములోని తేయాకుతోటలు, పశ్చిమ బెంగాలులోని జనపనార భూములు, కలకత్తా పారిశ్రామిక నగరముగ అభివృద్ధిచెందుటకు సహకారమైనది. ఈ ప్రాచ్యఖండములో బొగ్గుగనులు, ఇనుము, మైకా

గనులు పుష్కలముగ నుండుటచే నీప్రాంతమంతయు నెక్కువ పారిశ్రామికముగా నభివృద్ధి చెందుచున్నది. ప్రస్తుతమిచ్చట నిర్మింపబడుచున్న బహుళార్థ సాధకములైన అనేక ప్రాజెక్టుల వలన, ప్రజలకు విశేషమైన ఆర్థికాభ్యుదయము చేకూరనున్నది. ఈ ప్రాజెక్టు లన్నిటిలోకి పెద్దది దామోదరాలోయ ప్రాజెక్టు.

ఇది మొదలు వైద్యనాథము, కలకత్తా, భువనేశ్వరము, జగన్నాథము, సింహాచలము, రాజమండ్రి, విజయవాడ వరకు జగన్నాథఖండముగ విభాగించబడెను.

## పాట్నా

గయనుండి పాట్నా చేరవలయును. ఇది బీహారు రాజధాని. గంగానది యొడ్డున 8 మైళ్లు వ్యాపించి యున్నది. జనాభా షుమారు 2,83,478. దీని పశ్చిమభాగమున బంకీపూర్ రాజభవనము, సెక్రటేరియట్, మ్యూజియం కలవు. బంకీపూరు మైదానమున కొకమూల 90 అడుగుల యెత్తున 420 అడుగుల వైశాల్యమున, తేనెతెట్టె ఆకారముగల 'గోళి' అనబడు కట్టడము కలదు. ఇది వారన్ హేస్టింగ్స్ కాలములో ధాన్యాగారముగ నిర్మించబడినది. దీనిలో నొక చివర రహస్యముగ మాట్లాడిన రెండవ చివర గట్టిగా వినబడును. ఈ గోళ శిఖరము పైకెక్కి చూచిన పాట్నానగర దృశ్యము, దానిచుట్టూ గంగానది పరిసర దృశ్యములు మనోహరముగ కనబడును. అపూర్వమైన పర్షి అరెబ్బిక్ గ్రంథములు గలవు ఖుదావక్స్ ప్రాచ్యగ్రంథాలయములో కాడీజవా మూరిష్ విశ్వవిద్యాలయమున్నది. ఇక్కడ పరిరక్షింపబడిన ప్రాచీన రక్షణగ్రంథసముదాయము కలదు. పాత

పట్టణములోని హరమందిరము, శిక్కులను వీరజాతిగా తీర్చిదిద్దిన గురుగోవిందుని జన్మస్థానము, ప్రాచీనకాలపు పాటలీపుత్రము, చంద్రగుప్తమౌర్యుని రాజధాని యిక్కడనే కలదని చెప్పెదరు. ఇదిఅశోకుని రాజధానికూడ. క్రీ.పూ. 4వ శతాబ్దిలో మెగస్తనీసు ఈ పాటలీపుత్రమునకు రాయబారిగా వచ్చెను. ఇటీవల పురావస్తు శాఖవారు జరిపిన త్రవ్వకమువలన మౌర్య యుగానికి సంబంధించిన అనేక శిథిలములు, చారిత్రకావశేషములు బయట పడినవి.

## నలంద (విశ్వవిద్యాలయము)

పూర్వము మన భారతదేశమున పెక్కు విశ్వవిద్యాలయము లుండెడివి. అందులో రెండు యావత్ప్రపంచమునకు విజ్ఞాన క్షేత్రములుగా వాసికెక్కినవి తక్షశిల, (చూ. పరిశిష్ట ఖండము) నలంద. ఇది యొకప్పుడు ప్రఖ్యాతమైన విశ్వవిద్యాలయము. 5 వ శతాబ్దిలో స్థాపింపబడిన యీ విశ్వవిద్యాలయము 700 సం. ములపాటు అవ్యాహతముగ వేలకొలది విద్యార్థులకు జ్ఞానభిక్షపెట్టినది. 7 వ శతాబ్దిలో నిచట చదువుకొన్న చైనీసు యాత్రికుడు హుయన్‌సాంగ్ దీనిని ఎంతో గొప్పగా ప్రశంసించి యుండెను. బుద్ధుడు సన్యాసియై దేశాటనముచేయుచు, ఈవిద్యాపీఠమునకువచ్చి యిచ్చట శాస్త్రాచార్యులతో తత్త్వసంవాదము చేసెనని జనశ్రుతి కలదు. అభ్రంలిహములగు శిఖరములతో ఉత్తుంగములైన గోపురములతో, అత్యున్నతమగు స్తంభములతో చుట్టును కమ్మని వలపులజిమ్ము పుష్పకుంజములతో విశ్వవిద్యాలయ భవనములు కన్నులపండువై కుంతముగ నుండెడివి. యావద్భా


నలందా విశ్వవిద్యాలయము

రతవర్షమందే కాక చైనా, ఆగ్నేయాసియాలనుండికూడ విద్యార్థులు వచ్చెడివారు. ఇటీవల యిక్కడ పురావస్తు శాఖవారు జరిపిన త్రవ్వకమువలన ప్రాచీన విశేషము లనేకములు బయటబడినవి. తూర్పువాకిలి నుండి లోనికేగుచున్నపుడు, తూర్పువైపున ఒక వరసలో మఠములు, పడమటివైపున వాకిటికెదురుగ మరియొక వరుసలో దేవాలయములు కలవని చెప్పవచ్చును. ఇక్కడి మ్యూజియంలో చూడతగినవి చాలకలవు.

## హరిహరక్షేత్రము

పాట్నానుండి సోనాపురం చేరవలయును.

బీహార్ ప్రాంతమున సారణ్ జిల్లాయందు గండకీ, గంగానదీ సంగమస్థానమున సోనాపురము కలదు. దీనినే 'హరిహరక్షేత్ర' మని పిలుతురు. సోనాపుర మొక చిన్న గ్రామము. ఇచ్చట 'మాహీ' యను చిన్ననది ఒడ్డున 'హరిహరనాథ మహాదేవుని' యాలయము కలదు. ఇచ్చట ప్రతి కార్తీకపూర్ణిమకు పెద్ద ఉత్సవము జరుగును. ఆ రోజున చాలమంది భక్తులీ మహాదేవుని కభిషేకము గావింతురు. ఈ ఉత్సవము 2 వారము లుండును. ఇది భారతదేశమందలి పెద్దయుత్సవములం దొకటి. ఆ సమయమునం దిచ్చట ఏనుగులు, గుఱ్ఱములు విక్రయించబడును. దూర

దూరములనుండి వ్యాపారస్థు లిచ్చటకు వచ్చి, క్రయ విక్రయ వ్యాపారమును గావించుచుందురు. యాత్రికులు గండకీ, గంగా సంగమమున స్నానముచేసి, ఆ జలముచే హరిహరమహాదేవుని కభిషేకము చేయుదురు. సోనాపురమున నన్ని సౌకర్యములు కలవు.

శ్రీరాముడు సీతాస్వయంవరమునకు వెడలు సమయమునం దిచ్చటనే విశ్వామిత్రునివలన 'గంగోత్పత్తిగాథను' వినెననియు, ఆ సమయమున రాముడిచ్చట నొక విష్ణ్వాలయమును నిర్మించెననియు, అందుచే నిది 'హరిహరక్షేత్ర' మయ్యెననియు, శ్రీ మహావిష్ణువు మొసలినుండి గజేంద్రు నిచ్చటనే యుద్ధరించెననియు చెప్పుదురు.

వరాహపురాణ గాథ ననుసరించి హిమాలయపర్వతమున గండకీనదినుండి సాలగ్రామము లుత్పన్నములగు ప్రదేశముననే శ్రీమహావిష్ణువు గజేంద్రు నుద్ధరించెననియు, గండకీనదీ సంబంధమువలన కొంతకాలమున కిదియే హరిహరక్షేత్రమయ్యెననియు తెలియుచున్నది. గండకీనది యిచ్చటనుండి సుమారు 400 మైళ్లు ప్రవహించి సోనాపురమువద్ద గంగానదిలో కలియుచున్నది.

## రాజగృహము

రాజగృహము గయకు 103 మైళ్ల దూరమున గలదు. పాట్నానుండి భగతియార్‌పురము (జం) మీదుగ రాజగృహము స్టేషనుకు వెళ్లవలయును. ఇది బౌద్ధులకు, జైనులకు, సనాతనులకుగూడ యాత్రాస్థలము. పూర్వము జరాసంధుని రాజధానియే నేటి రాజగృహము. దీనిని రాజగిరి యనియు, రాజగిరికుండ మనియుకూడా పిలతురు. భీముడు జరాసంధుని మల్లయుద్ధమున

సంహారించిన ప్రదేశ మిదియే. ఇచట నొక ధర్మశాల కలదు. పండాలుకూడ గలరు.

సరస్వతీ నది:— ఇచ్చట ప్రధాననది సరస్వతి. యాత్రికులు స్నానము, తీర్థవిధియు చేయుదురు. ఈ నది వైభారపర్వతము నుండి పుట్టుచున్నది. దీనికి సమీపమున "బ్రహ్మకుండము" గలదు. బ్రహ్మకుండ ప్రాంతమున సరస్వతీ నదికి ఘట్టములు కట్టబడి యున్నవి.

కుండములు:— "మార్కండేయ కుండము, వ్యాస కుండము, గంగాయమునాకుండము, బ్రహ్మకుండము" లందు స్నానము చేయుదురు. వ్యాసకుండమున, సప్తర్షికుండమున "సప్తర్షిధారయు, కాశీధారయు" గలవు. ఇందొక ధారయందలి యుదక ముష్ణముగను, రెండవ ధారయందలి యుదకము చల్లగాను యుండును. మిగిలిన కుండములయందలి యుదక ముష్ణము గనే యుండును.

సప్తర్షి ధార:— సప్తర్షిధారలో దక్షిణ పశ్చిమముగ నేడు ధారలు సప్తర్షులపేర బ్రవహించు చున్నవి. దీనికి మీాదు భాగమున సప్తర్షుల మందిరములు కలవు.

ఇతరములు:— రాజగృహమున నింకను పవిత్రకుండము లనేకములు గలవు. అవి గంగాతీర్థము, యమునాతీర్థము, నర్మదా తీర్థము, గోదావరీతీర్థము, సూర్యకుండము, చంద్రకుండము, రామకుండము, బ్రహ్మధార, విష్ణుధార, శివధార, సరస్వతీధార మొదలగునవి.

వైతరణి:— ఇచ్చటి జనులు సరస్వతీనది ననేకపేర్లతో బిలతురు. ఈ సరస్వతీ నదియే యిచటి కొక మైలుదూరమున, "వైతరణి" యనుపేర బరగుచున్నది. ఇచ్చట యాత్రికులు తమ పితరులకు పిండప్రదానముచేసి గోదానము చేయుదురు.

సాలగ్రామనది:— వైతరణికి కొలది దూరమున నీనది "సాలగ్రామనది" యని పిలువబడు చున్నది. ఇచట స్నానము చేయుటకు ఘట్టము కలదు. ఇచ్చటనే జైనధర్మ ప్రవర్తకుడగు "ఆచార్య కోంకవేంక" సన్యాసమును స్వీకరించి "అహింసా పరమో ధర్మః" అను నుపదేశ మొసంగెను.

సోన్‌భండార్‌గుహ:— ఇందు బుద్ధ డతినిష్ఠతో తప మాచరించి యుండెనట. అందుచే దీనిని చూచుట కితర దేశములనుండి బౌద్ధులు, భారతీయులు వచ్చుచుందురు. ఇచట నొక శిలాశాసనము కలదు.

గోదావరీ సరస్వతీ సంగమము:— సరస్వతీనదిలో గోదావరీధార యను నొక ధార వచ్చి కలియుచున్నది. పండాలు దీనిని 'గోదావరీ సరస్వతీ సంగమ' మని చెప్పుదురు. యాత్రికు లిట స్నానము చేయుదురు.

వైభారపర్వతము:— వైభారపర్వతమునందు 'సోమనాథుడు, సిద్ధినాథుడు' నను రెండు శివమందిరములు గలవు. ఈ మందిరము లతి పురాతనములైనవిగ తోచుచున్నవి. పండాలీ మందిరములు జనమేజయుని కాలము నాటివని చెప్పుదురు. ఇచ్చటకు ఎక్కుట కొంచెము కష్టముగనే యుండును. శ్రావణ మాసమున నిచటి కనేకులు యాత్రికులు వత్తురు.

సుమారొక వేయి అడుగుల ఎత్తుగల పర్వతములు రాజగృహమున నైదు కలవు. ఈ కొండలమధ్యనే జరాసంధుని రాజధాని యుండెడిదని భారతము చెప్పుచున్నది. ప్రస్తుత మీకొండల మీద బౌద్ధ జైనమతస్థుల మందిరములున్నవి. నాటి జరాసంధుని కోట శిథిలములు నేడును 'బాణగంగ' కావలియొద్దున కానవగును. ఈ పర్వతముమీంద గౌతమమహర్షి నివాసముకూడ గలదు. ఇచ్చట ప్రకృతిదృశ్య మతి మనోహరముగ నుండును. ఇచ్చట నొక సంస్కృతపాఠశాలయు, పోష్టాఫీసు, ధర్మశాలయు కలవు. మహాభారత వనపర్వమున నీ యాత్రామహాత్వ మధికముగ వర్ణితమైయున్నది.

## ముంగేర్ (ముద్గరపురము)

రాజగృహమునుండి భగతియార్‌పూర్, కియోల్ (జం), జమలాపూర్ (జం) లో మారి, మాంఘేర్ స్టేషనులో దిగవలయును. ముంగేర్ ప్రాచీననామము ముద్గరపురము. ఇచట ముద్గరముని తపస్సుచేసెను. అందుచే దీని కీ పేరు వచ్చెను.

ముంగేర్ బీహారుప్రాంతమునం దొక జిల్లా. ఇది గంగా తీరమున గల యొక ప్రాచీననగరము. ఇచట గంగానది యొద్దున నొక కోట కలదు. కోటకు సమీపమున 'కష్టహారిణీ' ఘట్టము (రేవు) కలదు. ఈ ఘట్టమున చాలగ దేవమందిరములు కలవు. ఈ ఘట్టమునకు పశ్చిమముగ, గంగానదీమధ్యమున నొక రాతి చరియ కాన్పించును. ఈ ఘట్టమున యాత్రికులు స్నానము చేయుదురు.

ముంగేర్ నగరమునకు ౯ మై. దూరమున 'సీతాకుండము' కలదు. ఇచట నొక ప్రాకారమున 'రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నుల' నామములతో నాలుగు చిన్ని చిన్ని కుండములు కలవు. వీనిలోని నీరు చల్లగ నుండును. సీతాకుండమందలి జలము మాత్రము వేడిగ నుండును. సీతాకుండము ౦ దెవ్వరును స్నానము చేయరు. ఇచ్చట మాఘ శు ౧౫ కు పెద్దఉత్సవము జరుగును.

సీతాకుండమునకు 5 మై. దూరమున చండీమందిరము కలదు. ఇది యొకేరాతిలో అర్ధగోళాకృతిగా నిర్మింపబడెను. ఈ రాతికే ఒకద్వారము కలదు. ద్వారమునుండి గాంచిన వెనక నున్న గోడమీద చండికావిగ్రహముకానవచ్చును. ఇది పూర్వము చండికాదేవియొక్క 'తప్తతైలకటాహ'మనియు నిది నేడు తిరుగ బడి యుండెననియు నిచ్చటివారు చెప్పుదురు. ఈ కటాహమున దుమికినవారికి దేవి 10 వీశల బంగారము నొసంగెడిదట. కర్ణుడను రాజు ప్రతిదిన మీకటాహమున దుమికి 10 వీశెల బంగారమును బడసి, కష్టహారిణీఘట్టమునందా బంగారమును దానము చేయు చుండువాడట. ఇది పరమపవిత్రమగు స్థానము.

## భాగల్‌పూర్

మాంఘేరు నుండి భాగల్‌పూరు (జం) చేరవలయును. గంగానది దక్షిణతీరమున లాంచీలో $18\frac{1}{2}$ మై. ప్రయాణము చేయవలయును. ఇక్కడ బుద్ధుని పూర్వపు కోట గలదు. 4 మై. లో చంపానగరమను బుద్ధక్షేత్రము గలదు. ఇట రెండు జైన మందిరములుగలవు. గంగానది మధ్యలో కొండరాళ్లపై నిర్మించిన "గైబీనాథ" శివమందిరము గలదు. ప్రాచీన స్థూపములు, శిల్ప

సంపదయు ననంతముగ గలవు. భాగల్పూరు వ్యాపార కేంద్రము. పట్టు పరిశ్రమకు కేంద్రము.

## జహ్నుముని యాశ్రమము

మాంఘేర్ నుండి కురోల్ (౫౦) మీదుగ సుల్తాన్ గంజ్ స్టేషనులో దిగవలయును. ఇట కుత్తరముగ కీలాగ్రామము గలదు. ఈగ్రామ సమీపమునం దొకరాతిపైన అజాగయబీథ్ నాథ్ మందిరము కలదు. ఇదిశివాలయము. యాత్రికులిచ్చటకు నావలో ప్రయాణముచేసి యీ మహాదేవుని సందర్శింతురు. పూర్వ మిచ్చట జహ్నుముని యాశ్రమ ముండెడి దనియు, ఇచ్చట నుండియే బైజూభక్తుడు గంగాజలమును గొంపోయి వైద్య నాథున కభిషేకము గావించుచుండు వాడనియు చెప్పుదురు. వర్తమానమునగూడ నిచ్చట నుండి గంగాజలమును గొనిపోయి వైద్యనాథున కభిషేకము చేయుచుందురు. ఈ శివాలయము వద్ద పర్వత సానువులను దొలిచి సూర్యుడు, గణపతి, విష్ణువు, భగవతి, ఆంజనేయ విగ్రహములు నిర్మింపబడెను. ఇచ్చట మాఘ ౧౫ శు మొదలు శివరాత్రి వరకు పెద్దయుత్సవము జరుగును. ఈ ప్రదేశము చాల మనోహరముగ నుండును.

## శృంగేశ్వరనాథము (సింగేశ్వరనాథము)

భాగల్పూరుజిల్లాలో రాఘవపూరుస్టేషనుకు ౨౫ మైళ్ళ దూరమున దక్షిణముగ నొక నదీతీరమున 'శృంగేశ్వర' మను గ్రామము కలదు. దీనిని 'సింగేశ్వరనాథ్' అని కూడ పిలతురు. ఇచట శృంగేశ్వరనాథమహాదేవుని యాలయము కలదు. శివరాత్రి

కిచ్చట పెద్దయుత్సవము జరుగును. ఈ యుత్సవము రెండు వారములు జరుగును. ఈ యుత్సవసమయమున ఏనుగులు, గుఱ్ఱములు విశేషముగ విక్రయింపబడును. వైశాఖ బ౧౪ కు కూడ ఉత్సవము జరుగును.

పూర్వగాథ:— వరాహపురాణమునం దీ క్షేత్ర ప్రాదుర్భావమును గూర్చి యిట్లు కలదు. ఒకప్పుడు శంకరుడు మందరాచలమున కుత్తరముననుండు వనములలోనికి వెళ్లెను. దేవతలు శంకరుని వెదకుచు చాల అలసిపోయిరి. అప్పుడు వారు నందీశ్వరుని శంకరునిపోకనుకూర్చి యడిగిరి. కాని నందికూడ చెప్పలేదు. దేవతలు శంకరుని వెదకుచు శ్లేష్మాంతకవనములోనికి వెళ్ళిరి. అచట శివుడు లేడిరూపమున నుండెను. అంత దేవతలాతని గుర్తించి, వెంటనే ఇంద్రుడా మృగరూపముననున్న శంకరుని శృంగాగ్ర (కొమ్ము) భాగమును పట్టుకొనెను. బ్రహ్మ శృంగమధ్యభాగమును, విష్ణువు మూలభాగమును బట్టుకొనిరి. అప్పుడా శృంగము మూడు ముక్కలయ్యెను. మృగ మంతర్థానమయ్యెను. ఇంద్రుడు తన చేతికి చిక్కిన శృంగఖండమును స్వర్గమున స్థాపించెను. విష్ణువు లోకహితమునకయి తనచేతచిక్కిన శృంగమును యిచ్చట స్థాపించెను. అందుచే నీస్వామికి "శృంగేశ్వరు"డని పేరువచ్చెను. ఇది చాల ప్రసిద్ధమగుక్షేత్రము. శృంగేశ్వరస్వామిని దర్శించినవారు శివసాయుజ్యమును పొందుదురు.

## వైద్యనాథము

సుల్తాన్‌గంజ్ నుండి జెసీడీహ్ (జం) లో మారి వైద్యనాథధామ్ స్టేషనుకు వెళ్ళవలయును.

జాసీడీహ్‌లోను, వైద్యనాథములోను పండాలుందురు. స్టేషనుకు సమీపముననే 'రాయబహాదుర్ సేఠ్ హజారీమల్ మధువేవాలా' ధర్మశాలకలదు. ఇదికాక 'హరీరామగోయల్' ధర్మశాలకూడ యిచ్చటనే కలదు. వైద్యనాథమును 'దేవఘర్' అనికూడ పిలతురు.

వైద్యనాథాలయము:— 'దేవఘర్' రైల్వేస్టేషనుకు సుమారొక మైలుదూరమున వైద్యనాథుని మందిరము కలదు. ఈ మందిరమునకు సమీపమున నింకను మందిరములు కలవు. వీనికి నలువైపుల కోట కట్టబడియున్నది. ఎదుటనున్న ప్రాంగణ మంతయు గచ్చుచేయబడి యున్నది. దీనికి సమీపముననే పార్వతీదేవి మందిరము కలదు. వైద్యనాథాలయమునగల శివ లింగము సుమారు 11 అంగు॥ ఎత్తు గలిగియున్నది. దీని శిరో భాగమున రావణుని యంగుళీయకపు చిహ్నముగలదు. శివరాత్రి కిచ్చటకు తండోపతండములుగ జనులేతెంతురు. ఆ సమయమున వారలందరు కావళ్ళతో గంగాజలమును మోసిదెచ్చి శివున కభిషేకింతురు. ఏలనన శివరాత్రి సమయమున వైద్యనాథుని గంగాజలముతో నభిషేకించుట యధిక పుణ్యప్రదమని చెప్పబడి యున్నది. అందుచే నాడు గంగాజలముతోనే అందరును అభి షేకము గావింతురు. ఆరోజున గంగాజలము నచట కొందరు విక్రయింతురు. శివభక్తుల స్తోత్రములతో నా శివాలయము ప్రతి ధ్వనించిపోవును.

జగదంబ:— వైద్యనాథుని దర్శించి యాత్రికులు జగ దంబను దర్శింతురు. అన్నపూర్ణామందిరమునందు వలె నిటకూడ

జను లధికముగ నుందురు. ఇచట శివుడు వైద్యనాథుడు లేక రావణేశ్వరుడని పిలువబడును. ఇది ద్వాదశ జ్యోతిర్లింగముల యందొకటి.

బైజూభక్తుని మందిరము:— దేవఘర్ కు సమీపము ననే బైజూభక్తుని మందిరముగలదు. బైజూభక్తుని గాథ గోకర్ణ క్షేత్ర (చూ.) సందర్భమున చెప్పబడెను. బైజూభక్తుని వలననే యీ దేవుడు వైద్యనాథు డయ్యెనని చెప్పుదురు. అదిగాక వేరొక గాథనుకూడ చెప్పుదురు.

ఒకప్పుడొక భయంకర రోగము జనులను బాధింప మొదలిడెను. అంత బ్రహ్మ చింతించి శివుని సమీపించి యీ రోగమును నివారించి లోకములను కాపాడుమని వేడెను. శంకరు డారోగమును నివారణజేసెను. అంత దేవత లందరును శంకరుని సమీపించి మనుష్యు డమరత్వమును బొంది నీరోగియై యుండు నుపాయమును జెప్పుమని వేడిరి. అంత శివు డిట్లు చెప్పెను. 'పాప పరిణామములే రోగములు. సర్వపాపప్రణాశిని గంగ. అందుచే నిరంతరము గంగానదిలో స్నానముచేయు మనుజుడు నీరోగి యగును. అదియునుగాక వైద్యనాథమున నివసించు మనుజుడుకూడ రోగనిర్ముక్తుడగును.' అందుచే జగన్నాథమునందువలె నిటకూడ కుష్టురోగు లధికముగ నుందురు. ఇచ్చటి వాతావరణ ప్రభావమున నియమపూర్వకముగ కొలదిదినము లిటనున్న రోగుల రోగము లుపశమించును.



* వైద్యనాథాలయము

జలవాయు పరివర్తనమునకై యిట కనేకులు ధనికు లేతెంచు చుందురు.

వైద్యనాథము 'గిద్ధార్' మహారాజు జాగీరులో నున్నది. ఇచ్చట ఫలములు, భోజనసామాగ్రియు లభించును. ఇట నొక సంస్కృతపాఠశాల, గ్రంథాలయము, అన్నసత్రము కలవు. పుష్పించిన లతా గుల్మ వృక్షములతో శోభాయమాన మగు చిన్నిచిన్ని పర్వతముల ప్రకృతిదృశ్యము చూచుట కెంతయు మనోహరముగా నుండును.



* వైద్యనాథమందిరము (వేరొకదృశ్యము)

ఇచ్చట నొక ప్రాచీనమగు నశ్వత్థ వృక్షముకలదు. పూర్వము ధనావశ్యకతగలయాత్రికు లీయశ్వత్థవృక్షము క్రింద శంకర భజన గావించుచు నిరాహారులై శంకరుని ధ్యానించుచుండువారు. ఆసమయమునం దశ్వత్థ పత్రమొకటి క్రిందబడెడిది. ఆ పత్రముపై దేవనాగరి యక్షరములతో నొక సేఠ్ విలాసము వ్రాయబడి యుండెడిది. ఆపత్రమును పండాకు జూపిన యాతడు యాత్రికులను విలాసముగల సేఠ్ వద్దకు గొంపోయి యశ్వత్థపత్రమును జూపువాడు. ఆ సేఠ్ యాత్రికుల యావశ్యకతకు తగిన ధనమొసంగి పంపెడివాడు. దీనిని వైద్యనాథుని హుండీ యని పిలచెడివారు. కాని నేడావిధముగ విలాసములతో కూడిన పత్రములు క్రిందబడుటలేదు.

మాహాత్మ్యము:—"జ్యోతిర్లింగమును దర్శించి పూజించు నె జుడు మరుజన్మమున విద్వాంసుడగు బ్రాహ్మణుడై

జన్మించి సర్వసుఖముల బడసి ముక్తినొందును. జ్యోతిర్లింగమును దర్శించిన మాత్రమున గంగా గోదావరీనదుల స్నానముచేసిన ఫలము లభించును. ప్రసాదభక్షణ మాత్రమున ఆత్మజ్ఞానము కలుగును.'' అని శివపురాణమందు గలదు.

## పారస్‌నాథ్

జసీడీహ్ (జం) నుండి మధుపూర్ (జం) మారి గిరిడీ స్టేషనులో దిగవలయును. గిరిడీకి పశ్చిమ దక్షిణముగ 18 మైళ్ల దూరమున పారస్‌నాథ్ పర్వతము కలదు.



* పారస్‌నాథ్ మందిరము

ఇది హజారీబాగ్ జిల్లాలో తూర్పున గలదు. ఇది జైనుల తీర్థస్థానము క్రింద నుండి పారస్‌నాథ్ పర్వత శిఖరమువరకు చక్కని కాలి బాట కలదు. ఈ పర్వత మంతయు చక్కని చెట్లతో నిండియుండును. పలకరాళ్ల మీదుగ వెదురు పొదల మధ్యనుండి పోయిన యీ మార్గము చాల సుందరముగ నుండును.

పారస్‌నాథ్ పర్వతశిఖరము నిచ్చటివారు 'అస్మేద్‌శిఖర్' యని పిలతురు. ఈ శిఖరము సముద్రతలమునకు 4488 అ. ఎత్తు

గలిగియున్నది. ఈ శిఖరమున 22 చిన్నచిన్న జైనమందిరములు గలవు. ఇందనేక మందిరములు చాల సుందరమైనవి. ఇందొక సుందరమైన చిన్న మందిరమును నిర్మించుటకు 80 వేల రూపాయలు ఖర్చయ్యెను. జైనులకు 24 గురు మహాత్ములు గలరు. అందు పదిమంది యీపర్వతముననే నిర్వాణము జెందిరి. 19 మంది సమాధు లిచ్చటనే గలవు జైనుల యిరువదిమూడవ గురువగు పారస్‌నాథుని సమాధికూడ యిచ్చటనే గలదు. ఆయనను బట్టియే యీ పర్వతమునకు పారస్‌నాథ్ అను పేరు వచ్చెను. పారస్‌నాథ్ కాశీయందు జన్మించెను. ఆయన 100 సంవత్సరములు జీవించెను. ప్రతి సంవత్సరము 10 వేలమంది జైను లీపర్వతమునకు యాత్ర చేయుచుందురు.

జైనులకు భారతదేశమున 5 పర్వతములు కలవు పశ్చిమమున గిరినార్ పర్వతము, కథియవాడ్‌లో శత్రుంజయపర్వతము, రాజపుత్రస్థానమున ఆబూ పర్వతము, మధ్యభారతమున గ్వాలియరు, హజారాబాగ్ జిల్లాలో పారస్‌నాథ్ పర్వతము జైనులకు చాల పవిత్రమైనవి. ఇందు శత్రుంజయపర్వతము ముఖ్యమైనది. మఱియు పవిత్రమైనదని భావింతురు.

## సోనాముఖి (కుసుమ హరనాథ్)

గిరిడి, మధుపూరుమీదుగ అసన్‌సోల్ (జం), అద్ర(జం) లో మారి, ఇక్కడినుండి బంకురాలో మారి, దామోదరుపోవు చిన్నబండిలో సోనాముఖి స్టేషనులో దిగవలయును. (ఖర్గపూరు నుంచియు రావచ్చును.)

ఇది ప్రేమస్వరూపుడగు శ్రీ హరనాథబాబా జన్మస్థలము. హరనాథునివంటి విశ్వవిఖ్యాత ప్రేమపిపాసు విట జన్మించుట చేతనే యీ గ్రామము భారతీయులకొక దివ్యక్షేత్రముగ పరిణిత మయ్యెను. పూర్వ మీ గ్రామమున సుందరీ జయరాము లను పుణ్యదంపతులు నివసించుచుండువారు. జయరాము శివభక్తుడు. సుందరీదేవి విష్ణుభక్తురాలు. కాలక్రమమున నీ దంపతులకు శివరాముడను కుమారు డుదయించెను. ఒకదినమున నొక సాధువు దివ్యతేజస్వి సుందరీదేవి పరిచర్యలవలన సంతుష్టుడై యామె గర్భమున దా నుదయింతునని కలయందు గాన్పించి చెప్పెను. కొంతకాలమునకు క్రీ.శ. 1865 వ సంవత్సరమున నా దంపతులకు హరనాథు డుదయించెను. బాల్యమునుండియు హరనాథుడు తన దివ్యలీలలచే నెల్లర సమ్మోహితుల గావించుచుండెడివాడు. క్రీ. శ. 1879 సంవత్సరమున హరనాథుడు కుసుమకుమారీదేవిని పరిణయమాడెను.



శ్రీ కుసుమహరనాథ్

కుటుంబభరణమునకై హరనాథుడు కాశ్మీరున కేగెను. ఆసమయముననే యాతని తల్లి పరమపదించెను. ఒక దినమున హరనాథుడు జమ్మూనుండి కాశ్మీరమున కరుగుచు స్పృహదప్పి పడిపోయెను. బండివాడాతడు మృతుడయ్యెనని దలంచి శవదహనమునకు జనుల దీసికొని వచ్చుటకు వెడలెను. ఆసమయమున గౌరాంగప్రభువు (శ్రీకృష్ణచైతన్యుడు) హరనాథుని కళే

బరమును సంస్పృశించి యాతని దివ్యజ్ఞాన మహిమోపేతుని గావించెను. నాటినుండియు హరనాథుడు విశ్వమానవ కల్యాణ కాంక్షియై భారతీయుల కనేక దివ్యోపదేశములను గావించి సువిమలజ్ఞాన ప్రదాతయై వరిల్లెను. క్రీ. శ. 1927 వ సంవత్సర మున హరనాథుడు తన భౌతికదేహమును వీడెను. కాని ప్రేమ స్వరూపిణియగు కుసుమకుమారీదేవియందే హరనాథు డంత ర్హితుడై యుండెను. నేటికిని ప్రేమరూపిణియగు కుసుమ కుమారీదేవి భక్తులకు ప్రేమతత్వము నుపదేశించుచు, ఈ గ్రామమునం దుండెను.

## జయరాంబాటీ

## శ్రీ శారదాదేవి

బంకురానుండి జయరాంబాటీకి బస్సులు కలవు. జయ రాంబాటిలో నివసించు శ్యామసుందరీదేవి చంద్రముఖర్జీల తపః ఫలముగ శ్రీశారదాదేవి క్రీ. శ. 1853 డిశంబరు 22 వ తేదీన జన్మించెను. చంద్రముఖర్జీ రామభక్తుడు. భర్తకు మించిన భక్తు రాలు శ్యామసుందరీదేవి. శారదాదేవి జననమునకు పూర్వము శ్యామసుందరీదేవికి యనేక యద్భుతములు జరిగెను. శారదా దేవి బాల్యమునుండియు జగద్ధాత్రీ భక్తురాలు. నిత్యము పరమే శ్వరిని పూజించుచు ధ్యానమున నిమగ్నరాలగు చుండెడిది.

శారదాదేవికి 5 వ యేట వివాహమాయెను. వివాహ మైన నాటినుండియు పతిభక్తితో మెలగెను. పరమహంస శారదాదేవి కలసియున్న కాలము కొన్నిరోజులు మాత్రమె.

పరమహంస ఆశ్రమస్వీకారముచేసి దక్షిణేశ్వరమున కాళీయర్చనలో నిమగ్నుడై యుండెను. శారదాదేవియు దక్షిణేశ్వరము చేరి భర్తసన్నిధానమున నుండెను. పరమహంస శారదాదేవిని సాక్షాత్తు తన యిష్టదేవతయగు కాళీస్వరూపముగ భావించి, పూజించినాడు. ఆదర్శమాతయగు శారదాదేవి 1920 జులై 20 వ తేదిరాత్రి నిర్యాణముపొందెను. జై శారదమాతకు.

## కామార్పకూరు

## శ్రీ రామకృష్ణ పరమహంస

జయరాంబాటినుండి కామర్పకూరుకు 5 మైళ్లు. ఎద్దు బండ్లుకలవు. మార్గము చక్కగనుండును. కామర్పకూరు నివాసులగు చంద్రమణీఖుదీరాములను పుణ్యదంపతులకు క్రీ. శ. 1836 ఫిబ్రవరి 18 వ తేదీన శ్రీరామకృష్ణు డుదయించెను. ఈతనికి తల్లిదండ్రులు గదాధరుడని పేరుబెట్టిరి. గదాధరుడు బాల్యమున మిగుల బలహీనముగ నుండుటచే తల్లిదండ్రు లీతని విద్యాభ్యాసముగు గూర్చి ఎంతమాత్రము శ్రద్ధ వహించలేదు. ఈతని భావి మహాత్వమును బాల్యమునందే కొందరుకనుగొనిరి. సుందరములగుప్రకృతి దృశ్యములను గాంచినను, రామాయణమందలి రసవద్ఘట్టము



శ్రీ రామకృష్ణ పరమహంస

లను వినినను యీాతడు సమాధిస్థు డగుచుండువాడు. పాపము గదాధరున కేడేండ్లురాగనే యాతనితండ్రి ఖుదీరాముడు దివంగతు డయ్యెను. గదాధరుడు, అన్నయగు రామకుమారుడును కలకత్తా వచ్చి యందొక బడిపెట్టి కాలము గడుపుచుండిరి.

ఈసమయమునందే రాణి రాసమణి దక్షిణేశ్వరమున కాళీ దేవాలయమును కట్టించి సమర్థుడగు నర్చకునికొరకై వెదకు చుండెను. రామకుమారుని సమర్థతను విని యామె యాతనిని ప్రార్థించి కాళికాదేవాలయమున నర్చకునిగ నియోగించెను. రామకుమారునివెంట గదాధరుడుకూడ దక్షిణేశ్వరమునకు వెడలెను. అచ్చట రామకుమారుడు కాళికను, గదాధరుడు రాధాకృష్ణులను అర్చించుచుండిరి. ఇట్లుండ కొంతకాలమునకు రామకుమారుడు దివంగతు డయ్యెను. అంత గదాధరుడే కాళిక నర్చించ సాగెను.

కాళీసాక్షాత్కారము:— నాటినుండియు గదాధరుని జీవితము మార్పుచెందెను. దేవిని పూజించు సమయములం దాతడు తరచు శరీరమును మరచి సమాధినిష్ఠు డగుచుండు వాడు. కాళీసాక్షాత్కారమును కోరి దక్షిణేశ్వరమునకు సమీపమునగల "పంచవటి" యను శ్మశానమున సాధన చేయుచుండు వాడు. ఆతని భక్తికి మెచ్చి యొకదినమున దేవి యాతనికి సాక్షాత్కరించెను. నాటినుండియు రామకృష్ణు డయ్యెను. పిమ్మట రామకృష్ణునకు శారదయను కన్యతో వివాహము జరిగెను.

సన్యాసము:— ఒక దినమున "తోతాపురి" యను నొక యోగివర్యుడు దక్షిణేశ్వరమునకు వచ్చి రామకృష్ణుని

గాంచి యాతనికి సన్న్యాసదీక్ష నొసంగి యద్వైతమతసిద్ధాంతముల నుపదేశించి నిర్వికల్పసమాధి నొసంగెను.

ఈసమయమునకు యుక్తవయస్కురాలగు శారదాదేవి భర్తృసాన్నిధ్యమున కేతెంచెను. ఆమె నాతడు పూజ్యభావముతో నాదరించి పరబ్రహ్మతత్త్వము నుపదేశించి యామెను సాక్షాత్కాళికాదేవిగ భావించి పూజించెను. భర్తయొక్క మహత్త్వమును గుర్తించి శారదాదేవికూడ యాతనికి మానసిక భావముల కనుగుణముగనే వర్తించుచుండెడిది.

క్రమముగ శ్రీ రామకృష్ణుని మహత్త్వమును గుర్తించి యనేకు లాతని శిష్యులు కాదొడంగిరి. అందు నరేంద్రుడొకడు.

నరేంద్రునకు రామకృష్ణుడు వివేకానందుడని పేరుపెట్టెను. అనంతరమం దీతడే పాశ్చాత్యదేశములందు హిందూమహత్త్వమును, యాధిక్యతను ప్రచారము గావించి విశ్వవిఖ్యాతుడయ్యెను.

అవతార పురుషుడగు శ్రీరామకృష్ణుడు క్రీ. శ. 1886 వ సంవత్సరమున ఆగష్టు 16 వ తేదీ భానువారము రాత్రి సుమారు రెండుగంటలకు పాంచభౌతిక దేహమును వీడి అఖండసచ్చిదానంద బ్రహ్మైక్యము నొందెను. వివేకానందుని ప్రయత్నమున విశ్వమునం దంతట శ్రీరామకృష్ణుని బోధలను ప్రచారము గావించుటకై "శ్రీరామకృష్ణ మఠము"లేర్పడెను. ఇవి కేవలము మనదేశమునందేగాక యితర దేశములందు కూడ గలవు. వీని ప్రధాన కార్యాలయము "బేలూరు"లో కలదు. (ఖర్గపూర్ నుండియు నిచ్చటకు రావచ్చును.)

## శాంతినికేతనము

బాంకురానుండి ఆద్రా(జం), ఆసన్ సోల్(జం) ల మీదుగ ఖానా(జం)లో మారి బోల్ పూరులో దిగవలయును. బోల్ పూర్ స్టేషనుకు ఇది 2 మై. దూరమున గలదు. ఒకప్పుడిది కుగ్రామము.



రవీంద్రనాథటాగూర్

ఇక్కడ విశ్వవిఖ్యాతమైన శాంతినికేతనము గలదు. విశ్వకవి రవీంద్రనాథటాగూర్ 'విశ్వ భారతి విశ్వవిద్యాలయము'ను స్థాపించెను. ఇది భారతీయసంస్కృతికి కేంద్రము. ఇక్కడకు దేశము నలువైపులనుంచి గూడ అనేక మంది విద్యార్థులు వచ్చి లలితకళలను అభ్యసించుచుందురు. ఇక్కడి రవీంద్రునిభవనము, ఆతని పర్ణకుటీరము, మ్యూజియము తప్పక చూడతగినవి. ఈ ప్రాంతమందలి ప్రాకృతికదృశ్యము మానవుని ముగ్ధునిగా జేయును.

## తారకేశ్వరము

బోల్ పూరు నుండి ఖానా (జం), నకూఫర్ (జం), 'బండేల్' మీదుగ తారకేశ్వరము చేరవలయును.

తారకేశ్వరము బెంగాల్ లోని హుగ్లీ జిల్లాలో కలదు. ఇచ్చటకు ప్రతిదినము కలకత్తానుండి చాలమంది శివభక్తులు, ప్రదోష వ్రతము నాచరించువారు వచ్చుచుందురు. ఇచ్చట రెండు ధర్మశాలలు కలవు. 1. సతీశచంద్రగిరిది. 2. బిపిన బిహారీసేటది. తారకేశ్వరమున పూజాసామాగ్రిని విక్రయించు వారలుకూడ

యాత్రికులకు తమతమ యిండ్లయందు బసలను యిత్తురు. తాటి చెట్టునుండి ప్రకటమైన కారణమున, నీ మహాదేవునికి తారకేశ్వరు డని పేరు వచ్చెను. పూర్వ మీ ప్రదేశమును సింహళద్వీపమని పిలచెడివారు.

క్షీరసాగర కుండము:— దీనిని ఆ ప్రాంతమున 'దూధ్ సాగర్ పోఖరా' అందురు. ఇదియొక సరస్సు. యాత్రికులిందు మొదట యథావిధిగా స్నాన తర్పణ తీర్థవిధులు చేయుదురు.

తారకేశ్వరుడు:— తారకేశ్వర దేవాలయము, పాలరాతితో గచ్చుచేయబడెను. దీని శిఖరము చాలసుందరమైనది. ఈ యాలయ ప్రాంగణమున ననేకులు రోగులు, రోగశాంతికై నిత్యము భగవన్నామస్మరణ చేయుచుందురు. తారకేశ్వరమున ఔషధ మక్కరలేకయే రోగము లుపశమించును.

పూర్వగాథ:— పూర్వ మీ స్థానము సింహళద్వీపమని పిలువబడు రోజులలో 'రామవన్' అను పేరుగల గొల్లవాడు తన ఆవులను మేపుట కీప్రదేశమునకు వచ్చుచుండెడివాడు. అటు లుండగా నొక దినమున యాతని యావొకటి యింటికి మరల లేదు. దానిని వెదకుచు రామవన్ వనములోనికి వెళ్లెను. అట నొకపొదలో తన యావు పాలతో నీ మహాదేవుని నభిషేకించుట నాతడు గాంచెను. రామవన్ హృదయమున భక్తిభావము రేకెత్తెను. ఆతడు దినదినము మహాదేవుని, ఆవుపాలతో నభిషేకించి, పత్రపుష్పాదికములతో పూజసేయుచుండెను. క్రమముగా ననేకు లీమహాదేవుని దర్శించుటకు రా నారంభించిరి. భక్తులందరు కలసి శివున కీయాలయమును నిర్మించిరి.

మాహాత్మ్యము:— తారకేశ్వరుని దర్శించి, పూజించిన మనుజుడు సర్వపాప వినిర్ముక్తుడై ఇహలోకమున సర్వ సౌఖ్యములబడసి యనంతకాలము శివలోకమున సౌఖ్యమందును.

## కలకత్తా

తారకేశ్వరమునుండి కలకత్తా చేరవలయును. కలకత్తా భారతదేశమందలి ప్రధాన నగరములందొకటి. ఇచట కెల్ల సమయముల వివిధప్రాంతముల నుండి యనేకు లరుదెంచుదురు. కలకత్తాలో ననేక ధర్మశాలలు కలవు. హౌరాస్టేషనుకు సమీపమున పం. శివవినాయకమిశ్రధర్మశాల, మల్లిక్‌స్ట్రీటులో రాయ సూర్యమల్ ధర్మశాల, హారిసన్‌రోడ్‌లో సేఠ్ బాబూలాల్ ధర్మశాల కలవు. మరియు నింకను చిన్నవి, పెద్దవియు ననేక ధర్మశాలలు గలవు. ఇందు మూడురోజులకన్న నెక్కువకాలము నివసించుటకు సత్రపుఅధికారినుండి అనుమతి పొందియుండవలెను.

కలకత్తా జనాభా షుమారు 25,48,678. కలకత్తా 17వ శతాబ్దమున చిన్న పల్లెటూరు. ప్రస్తుతము ప్రపంచములోని పెద్ద పట్టణములలో నొకటిగా రూపొందినది. తూర్పుదేశముల ఓడరేవులలో నిది యొకటి. ఇక్కడ అనేక కాగితపుయంత్రములు, గోనె మిల్లులు, నూనెమరలు, ఉక్కుకర్మాగారములు, తోలు కార్ఖానాలు, ముద్రణశాలలు మొదలైన వనేకరకములు గలవు. హుగ్లీ నదిమీాద వర్ధిల్లిన యీపట్టణము ఇండియాకు వాణిజ్యకేంద్రము. ఇక్కడి మైదానము, విలియంకోట, విక్టోరియా మెమోరియల్, చౌరంగీ, ప్రభుత్వభవనము, జంతుప్రదర్శనశాలలు, సెంటుజాన్ చర్చి, కాళీఘాట్ దేవాలయము, జైనదేవాలయము, బేలూరు

మఠము, దక్షిణేశ్వరదేవాలయము తప్పక చూడతగినవి. ఇచటి ప్రభుత్వపు వృక్షోద్యానములో వేయి అడుగుల దూరము వ్యాపించియున్న 170 సం॥ల మఱ్ఱిచెట్టుకూడ అవశ్య సందర్శనీయము. ఇక్కడి హౌరావంతెన ఇంజనీర్ల నిర్మాణకౌశలమునకు అమోఘమైన నిదర్శనము.

కాలీఘాట్:— ఇది స్టేషనుకు 5 మై. దూరమున గంగా తీరమున గలదు. పూర్వ మీ మందిరోపాంతములనుండి గంగా నది ప్రవహించుచుండెడిది. కాని నేడొక పాయ మాత్ర మిట ప్రవహించుచున్నది.

కాళీకుండము:— ఇది గంగాతీరమున నొక ప్రదేశమున గలదు. యాత్రికులు ఈ కుండమునగాని, గంగలోకాని స్నానము చేయుదురు. కాళీమందిరసమీపమున పూలమాలలు మొదలగు పూజాద్రవ్యము లమ్ముదురు. ప్రతి సంవత్సరము చైత్ర, ఆశ్వయుజ మాసములలో విశేషముగ నిటకు భక్తు లేతెంచుదురు.

కాళికాదేవి యాలయముండుటవలన నీ నగరమునకు కాళీఘట్టమను పేరు వచ్చెను. ఆ పేరు మార్పుచెంది కలకత్తాగా మారెను. ఇచ్చటగల కాళికామందిర మతి విశాలమైనది. ఈ మందిరమును వేహలాచౌధరీలు క్రీ. శ. 1809 లో కట్టించిరని చెప్పెదరు. ఈ మందిరము ప్రాచీనమైనది. ఇది 51 వ దేవీపీఠ మని కొందరు చెప్పుదురు. ఇచట దేవీమూర్తికి 4 భుజములు, త్రినేత్రములు నున్నవి. సుమారు జానెడపున భయంకరముగ బయటకు నాలుక సాచబడియున్నది. ఒకచేతిలో కత్తి, మరియొక చేతిలో మధుకైటభుల మస్తకము, మిగిలిన రెండుచేతులతో

భక్తాభయ ముద్రను వహించి, ఈ మూర్తి నరముండ మాలను ధరించి, మహాదేవుని వక్షస్థలమున చరణములుంచి యున్నది. సామాన్యముగ యాత్రికులు ఈ మూర్తిని ప్రక్కనుంచియే దర్శనము చేయుదురు. ఎదుటికిపోరు. అంత భయంకరముగ నుండును.


కాళీ ఆలయము

ఈ సిద్ధపీఠమున పాఠ పురశ్చరణలు జరుగుచుండును. ఇచట చాలమంది సాధువులు, సన్యాసులు నివసించుచుందురు. ఈ సిద్ధపీఠమున సతీదేవి చేతి వ్రేళ్లు పడెను. (చూ. కాశీ మణికర్ణికా) ఆ వ్రేళ్లు పడినచోటనే మందిరము కట్టబడినది.

చిడియాఖానా :—

(జంతు ప్రదర్శన శాల) ఇందు సజీవములగు, రకరకములైన పశు పక్ష్యాదులు కాననగును. వివిధములగు పశు, పక్షులు వాటివాటి కనువగు స్థానములందు పెంచబడుచున్నవి. జలచరములగు మీనమకరములు, అరణ్యములందుండు పెద్దపులులు, చిరుతపులులు, ఎలుగుబంటి, తోడేలు, చెవులపిల్లి మొదలగు జంతువు లిట సజీవములై కాననగును. ఈ చిడియాఖానా తప్పక చూడతగినది.

మ్యూజియం:— ఇందద్భుతములగు జలస్థలధాతువులు, వనస్పతులు, కృత్రిమముగ కొన్ని, నైజముగ కొన్ని సంగ్రహించబడినవి. ఇచట దేశదేశాంతరము లందలి ఫలపుష్పములు, మృతమనుష్యుల శరీరములు, కీటక పతంగాదులు, విచిత్రములైనవి కానవగును. ఇవియేకాక, యిచట నన్నిరకములగు ప్రాచీన కళాశిలమును గానబరచు ఖండములును గలవు.

టంకసాల:— ఇచట ప్రభుత్వము నాణెములు (రూపాయలు) తయారు చేయుచుండును. ఇది చూచుట కనుమతియున్నగాని ప్రవేశముండదు.

హౌరాబ్రిడ్జి:— గంగానదిపై నిర్మింపబడిన యీ వంతెన నూతనపద్ధతులతో నిర్మింపబడెను. దీని అవసరము వచ్చినపుడు, వంతెన రెండుగా విడివడును. లేనప్పుడు కలసియుండును. రెండుగా విడినప్పుడు స్టీమరులు పోవుచుండును. వంతెన విడివడినపుడు మార్గస్థులు అటునిటు స్టీమరుమీద ప్రయాణము చేయుచుందురు.

ధనికులకు కలకత్తా స్వర్గమువంటిది. ఇచట సర్వవిధములగు వస్తువులు లభించును. భోగవిలాసోపకరణముల కిది ప్రధానస్థానము. నిర్ధనుల కిది రౌరవనరకముకంటె కష్టదాయకమగు ప్రదేశము. వారు నివసించుటకు తగు స్థానముగాని, పుష్టికరమగు నాహారముగాని యిట లభించదు. ఇచటి వాతావరణము మధ్యమముగ నుండును. ఇచట ప్రతిపేటలోను తంతికార్యాలయము, పోష్టాఫీసు కలవు. ఇవికాక యిచట యూనివర్సిటీ, గవర్నమెంటు హౌసు, కాలేజీలు, అనాథాలయములు, చికిత్సాలయములు

వసుమహాశయుని విజ్ఞానశాలయు కలవు. అన్నియు చూడతగి నవే. గంగాతీరమున నిట ననేకఘట్టములు కలవు.

## దక్షిణేశ్వరము

ఇది కలకత్తా కుత్తరమున నాల్గుమైళ్ళ దూరమున గలదు. ఇది చాల పురాతనమైన శక్తిక్షేత్రము. ఈ క్షేత్రమునకు 'భవ తారిణీదేవి' యధిదేవత. ఇచ్చట భవతారిణీదేవి యాలయము గలదు. ఇదికాక రాధా కృష్ణాలయమును, నురి పంద్రెండు శివాలయము లును గలవు. వీనికి సమీపమునందే దేవీ భక్తురా లగు రాణి రాసమణి కట్టించిన కాళికాదేవి యాలయము కలదు. ఇది చాల పెద్ద యాల యము. ఈ యాలయ మును కట్టుటకు 8 సంవ త్సరములు పట్టెను. రాస మణి కట్టించిన యీ ఆలయమువలననే దక్షి ణేశ్వరము సుప్రసిద్ధమైన క్షేత్రమయ్యెను. శ్రీరామకృష్ణపరమహంస యీ యాలయము నందే యాధ్యాత్మిక సాధనము లనేక మొనర్చి జగన్మాతయగు



కాళీ మందిరము

కాళి సాక్షాత్కారము నొంది యవతారపురుషుడని జగత్ప్రసిద్ధి గాంచెను. ఆ మహనీయుని యాధ్యాత్మిక విభూతిచే నీ క్షేత్రము పరమపవిత్రమయ్యెను.

శ్రీరామకృష్ణ పరమహంస జగన్మాతయగు కాళీభక్తుడు. జగద్ధాత్రి పరమహంసకు దర్శన మిచ్చెను. ఆమె యనుగ్రహమునసే యాతడు యౌగిక, తాంత్రిక సాధనలయందు సిద్ధహస్తుడై సిద్ధపురుషుడు కాగల్గెను. అమెరికాయందు జరిగిన సర్వమత మహాసభయందు హిందూమతౌన్నత్యము వెల్లడిచేసి, విజయ శంఖమును పూరించి, వివేకానందుడు దిగ్విజయము బడసెనన్న నీ దేవి, శ్రీరామకృష్ణుల యనుగ్రహమె కారణము. శ్రీ పరమహంస యచట నివసించిన నాటి చిహ్నము లనేకములు కానవగును. పరమపావనియగు గంగాతీరమున నీ క్షేత్రము మిక్కిలి ప్రశాంతముగ నుండును.

## బేలూరు మఠ్

దక్షిణేశ్వరమునకు సమీపమున గంగాతీరమున నీ బేలూరు మఠ్ గలదు. ఇచట శ్రీరామకృష్ణమఠ ప్రధానకార్యాలయము కలదు. ఈ ప్రదేశమంతయు మిక్కిలి ప్రశాంతముగ నుండును. ఇక్కడ శ్రీరామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి, వివేకానందుల మందిరములు కలవు. వీరల మూర్తులు పాలరాతి ప్రతిమలు. జీవకళ యుట్టిపడుచుండును. ఇక్కడ నిత్యము ఉపన్యాసములు జరుగుచుండును. శ్రీరామకృష్ణమఠమునకు సంబంధించిన వివిధశాఖలు యిచట కలవు. ఈ ప్రాంతము తప్పక చూడతగినది.

## వివేకానందుడు

భారతీయప్రతిభను ఖండఖండాంతరముల చాటిన వీరో త్తంసుడు వివేకానందుడు. భువనేశ్వరీ విశ్వనాథుల తపఃఫలముగ 12-2-1863 న వివేకానందుడు జన్మించెను. శైశవమునుండియు వివేకానందునకు భారత రామాయణములందు భగవంతునియందు భక్తి విశ్వాసములు మెండు. సీతారాముల పూజించుట అతని నిత్యకృత్యము. నరేంద్రున కాఱవయేటనే విద్యారంభము జరిగెను. ఆతడేకసంథాగ్రాహి. నరేంద్రుడు జంతగాత్రములలో కూడ దంట. ఇతడు ముక్తికన్యను తప్ప లౌకికన్యలను వరించలేదు.

నరేంద్రునకు క్రమక్రమముగా భగవత్సాక్షాత్కార వాంఛ హెచ్చుదముగ నధికమయ్యెను. కనుపించిన పెద్దల నందరను 'స్వామీ! మీరు భగవంతుని చూచితిరా?' అని ప్రశ్నించుచుండెను. కాని ఒక్కరుకూడ చూచితిమనువారే లేకపోయిరి. ఈ రీతిగా శాంతిలేని స్వాంతముతో తుదికి శ్రీరామకృష్ణ పరమహంసను దర్శించి, అందరివలె నతనినిగూడ ప్రశ్నించ, పరమహంస 'నాయనా! చూచితిని, నీకును చూపింతు' నని జవాబిచ్చెను. నాటినుండి నరేంద్రుడు పరమహంసకు శిష్యుడయ్యెను.

నరేంద్రుడు సన్యాసమును స్వీకరించి హిమాలయము నుండి కన్యాకుమారివరకు నానాయాత్రల గావించెను. ఇతని 28 వ యేట విదేశములకేగి పరతత్త్వమును గురించి గంభీరోపన్యాసములిచ్చి,హిందూమతాధిక్యమును విజయదుందుభి మ్రోగించెను. పెక్కండ్రు వివేకానందుని శంకరాచార్యుల అవతారమని తలంతురు. ఈమహనీయుడు 1902 సం॥న మహాసమాధినొందెను.

# శ్రీ రామతీర్థ ఆశ్రమము

ప్రపంచము, భౌతికభావ విభ్రాంతమై, పరమసత్యమును విస్మరించి, శోకసంకులితమైయున్న తరుణమున జనతామధ్యమున బ్రహ్మజ్ఞాన సందేశముతో అవతరించిన ఒకానొక మహాజ్యోతి శ్రీరామతీర్థస్వామి. విశ్వమత శంఖారావముతో సనాతన ధర్మ సందేశముతో నిద్రితప్రపంచమును మేలుకొల్పిన జగదాచార్య పుంగవుడు శ్రీరామతీర్థస్వామి.

జ్ఞానభూమియగు భారతవర్షమునందు, పంజాబులో గుజరన్వాలా మండలమందుగల మురళీవాలా అను నొక గ్రామమందు, ఒక నిరుపేద బ్రాహ్మణ కుటుంబమున శ్రీవసిష్ఠ మహర్షియు, శ్రీ గోస్వామి తులసీదాసును అవతరించిన పవిత్రవంశమందు 1873 సంవత్సరమున దీపావళికి ఒకదినము తరువాత, కార్తీక శుక్ల ప్రథమ దివసమందు శ్రీరామతీర్థ పరమహంస ఉదయించినాడు. ఆయన మొదటి నామము తీర్థా రామగోస్వామి. తండ్రిపేరు హీరానందుడు. శ్రీరామతీర్థస్వామి జన్మించిన కొలది దినములకే ఆయనతల్లి గతించినది.

ప్రహ్లాదునివలె, బాల్యమునుండియే తీర్థారాముడు పరమ భాగవతలక్షణ సంపన్నుడు. అయిదవయేట, ఆయన పాఠశాలలో ప్రవేశించినాడు. అత్యంతమేధావి. శైశవమందే ఆయన కఖండ గురుభక్తి గలదు. ప్రాథమిక పాఠశాలనుండి వెళ్లుచు, గురుదక్షిణగా రాముడు, తనకున్న ఒక్క బక్క చిక్కిన ఆవును సమర్పించినాడు. గురుభక్తిలో రాముడు ధౌమ్యుడని చెప్పవచ్చును.

రాముడు, లాహోర్, ఫోర్మన్ క్రిష్టియన్ కాలేజీలో 20 వ ఏట యం. ఏ. పదవియందు ఉత్తీర్ణుడైనాడు. ఆయన కళాశాలా జీవనమంతయు ఒక అనర్వాచనీయ తపస్సు. దారిద్ర్య



శ్రీ రామతీర్థ స్వామి

జ్వాలలమధ్య, ఆ బాలవీరుడు నడువవలసి వచ్చినది. తీర్థారామగోస్వామి కొలది దినములు గణితశాస్త్రాధ్యాపకులుగా పనిచేసి

నాడు. మహౌదార్యపూరితమై, ఆయన గార్హస్థ్యము భాసించినది. తీర్థరాముడు కృష్ణభక్తశిఖామణి. గీతయందాయనకు అఖండప్రేమ. ప్రాచ్య పాశ్చాత్య శాస్త్రము లన్నియు, నూరిత్రాగిన మహాపండితు డాయన. శ్రీకృష్ణధ్యాన పరతలో, ఆయన లాహోర్‌లోని రావీనదీతీరమునందు ఎన్నిసిశీథములో గడిపినాడు. గౌరాంగునివలె రాముడు, అనుపమాన భక్తిరసమయుడు. గణిత శాస్త్రాధ్యాపకులుగా పనిచేయుచునే తీర్థరామగోస్వామి విరక్తిభావ పరవశుడై హిమాలయ నిబిడారణ్య గర్భములకు నిర్గమించినాడు.

హృషీకేశ ప్రాంతమందలి బ్రహ్మపురి తపోవనములో, రాముడు రెండు సంవత్సరములు, ధ్యాననిష్ఠలో మునిగి, ఇరువది మూడవయేట ఆత్మ సాక్షాత్కృతిని పొందినాడు. అద్వైత సిద్ధి గాంచినాడు.

ఈశ్వరప్రేరితుడై స్వామి 1903 లో పాశ్చాత్యఖండములకు వేదాంతసందేశమొసంగ పయనించినాడు. జపాన్, అమెరికా మొదలైన దేశము లన్నింటను, తన ధర్మసందేశమును ప్రతిధ్వనింపజేసినాడు. ఆయన బోధలు సర్వమతాంతర్గత సత్యమత బోధలు. రెండుమూడు సంవత్సరములు విదేశములందు ధర్మప్రచార మొనర్చి, రామతీర్థుడు తిరిగి భారతవర్షమునకు వచ్చి ధర్మప్రచార మొనర్చి, తిరిగి తన హిమాలయారణ్య సాంద్రతలలోనికి అధిగమించినాడు.

శ్రీ రామతీర్థభగవాను డా హిమారణ్యములలో కేవల బ్రహ్మనిష్ఠలో నివసిస్తూ 1906 సంllన, దీపావళి పర్వదినంనాడు,

బ్రహ్మగహ్వారవాల్ దగ్గర గంగానదిలో స్నానమొనర్చుచు అందు విలీనమైనాడు. సరయూనదిలో రాముని వలె, రామపరమహంస దేవుడు గంగాగర్భములో శరీర పరిత్యాగ మొనర్చినాడు. తన 33వ ఏట, ఆ అమరమూర్తి ఇట్లు మహాపరినిర్వాణపద మధిష్ఠించినాడు. ఆయన అమోఘప్రబోధనలు, నవ్యప్రపంచమునకు నిజముగా ప్రాణాధారములు.

లక్నో, సారనాధ్, రాజపూర్, డెహ్రాడూన్, అమృతసర్, అలహాబాద్, లూధియానా, జలంధరు, రాయకోట, బొంబాయి మొదలైన స్థలములలో శ్రీ రామతీర్థాశ్రమములు గలవు. ఆంధ్రప్రాంతమున గుంటూరుజిల్లాలో పిడుగురాల యను గ్రామమున శ్రీ కేశవతీర్థస్వామివారు శ్రీ రామతీర్థ సేవాశ్రమమును స్థాపించి, శ్రీ స్వామివారి వాఙ్మయమును ప్రచారము చేయుచు' అపార సేవ చేయుచున్నారు.

## నవద్వీపము

ఆపారే భవసంసారే సారభూతం సనాతనమ్,

సర్వ కామప్రదం పుణ్యం హరేర్నామైవ కేవలం ॥

హౌరానుండి నవద్వీపమునకు రైలుమార్గము, కారుమార్గము కలదు. రైలుస్టేషనుకు గ్రామమునకు సుమారొక మైలుదూరముండును. బండ్లు, ఎక్కాలు దొరకును. ఇది గంగాతీరమున గల ప్రసిద్ధమగు పట్టణము. ఇది బెంగాల్‌లో కలదు. ఇది గౌడీయ సంప్రదాయాచార్యుడగు శ్రీ చైతన్యమహాప్రభుని జన్మస్థలమగుటచేత నిది వైష్ణవులకు ప్రధాన తీర్థరాజమైయున్నది.

ఇచట శ్రీకృష్ణ చైతన్యుని భార్య విష్ణుప్రియాదేవి స్థాపించిన చైతన్యవిగ్రహము కలదు. ప్రస్తుతకాలమునకూడ నీ మహానగరము హరినామసంకీర్తనలతో ప్రతిధ్వనించుచుండును. గౌడీయ సంప్రదాయానుయాయులగు వైష్ణవులు దీనిని బృందావనమువలె పవిత్రమగు పుణ్యక్షేత్రముగ భావింతురు.

ఈ నగరము పూర్వము సంస్కృత విద్యకు కేంద్రమై యుండెడిది. శ్రీ చైతన్యుని సమయమునం దిచ్చట వందలకొలది విద్యార్థులు సంస్కృత విద్యాభ్యాసము చేయుచుండువారు. న్యాయశాస్త్రమునకు 'దీధితి' యను సుప్రసిద్ధమగు వ్యాఖ్యను రచించిన రఘునాథు డీ కాలమువాడే అతడే మిథిలావాసియగు 'శ్రీ పక్షధరమిశ్రు' ను న్యాయశాస్త్రమున పరాజితుని గావించి నవద్వీపమునకు గౌరవము దెచ్చెను. అప్పటినుండియు నీ నగరము న్యాయశాస్త్రమునకు ప్రసిద్ధిజెందియుండెను. న్యాయశాస్త్రము నభ్యసించుట కిచ్చటకు భారతవర్షమందలి భిన్నభిన్న ప్రాంతముల నుండి ప్రకాండులగు పండితు లేతెంచుచుందురు.

నవద్వీపమును 'నదియా' అని కూడ పిలతురు. ఒకప్పు డిది సేనవంశీయులగు రాజులకు రాజధానిగ నుండెడిది. వర్తమానమున నీ నగరము తన వైభవమును గోల్పోయినను భావుకులగు భక్తులయొక్కయు, పండితులయొక్కయు హృదయములం దీ నగరరాజ మత్యున్నత గౌరవస్థానము నందియే యున్నది. ఇచ్చటి జనాభా సుమారు పదివేలుందురు. ఇచ్చట నేడును 15 ఛాత్రావాసములు గలవు. వీనియందు వందలకొలది విద్యార్థులు సంస్కృతవిద్య నభ్యసించుచుందురు.



శ్రీకృష్ణ చైతన్యమహాప్రభువు

శ్రీకృష్ణచైతన్యుని మందిరము:— ఇచట శ్రీకృష్ణ చైతన్యుని భార్య విష్ణుప్రియాదేవి స్థాపించిన శ్రీ చైతన్యుని మందిరము కలదు. ఈ మందిరమున నిత్యము సంకీర్తన జరుగుచుండును. ఈ పట్టణమున చైతన్య మందిరములు చిన్నవి అనేకములు గలవు. ప్రతి గృహమున పూజా మందిరము వలె చైతన్య ప్రభు మందిరములు కలవు.

ఈ గ్రామమున అఖండ హరినామసంకీర్తన సంస్థలు కలవు. సుమారు 15 సంవత్సరములనుండి నిత్యసంకీర్తన చేయు స్త్రీ మండలి కలదు. ఇందు నిత్యము 15 వందలమంది స్త్రీలు సంకీర్తన చేయుచుందురు. ఈమండలియందు స్త్రీ లెవరైనను సభ్యురాండ్రగ జేరవచ్చును. అట్టివారికి భోజన, వస్త్ర, వసతు లీయబడును. పురుషుల కిందెంతమాత్రము ప్రవేశములేదు. బయట నుండి చూడవలసినదే.

మధురం మధురేభ్యోపి మంగళేభ్యోపి మంగలం,
పావనం పావనేభ్యోపి హరేర్నామైవ కేవలమ్॥

— నీలకాన్త గోస్వామి.

## మాయాపురము

ఇది నవద్వీపమునకు సమీపమున గంగా - ఖండునా నదీసంగమ మధ్యనగలదు. ఇచ్చట నొక మఠమునకు చెందిన విశాల మందిరము గలదు. శ్రీకృష్ణచైతన్యుని మందిరముకూడ కలదు. ఇచ్చటి జను లిదియే గౌరాంగుని (చైతన్యుని) జన్మ స్థలమని చెప్పుదురు. అందుచేత నిచ్చట చైతన్యుని జన్మమంది రముకూడ కలదు. ఇది చూడదగిన స్థానము లందొకటి. ఇట పండాల గృహమున యాత్రికులు నివసించవచ్చును. అన్ని సౌఖ్య ములు గలవు. యాత్రికులు సంగమస్నానముచేసి, శ్రీకృష్ణ చైతన్యుని దర్శింతురు.

## శాంతిపురము

ఇది నదియా (నవద్వీపము) జిల్లాలో గంగాతీరమునగలదు. ఇదియొక చక్కని నగరము. ఇచట గంగానదియందు స్నానము చేసిన విశేష పుణ్యము లభించును. ఇచ్చట ప్రతి కార్తీక ౧౫ కు 'శ్రీకృష్ణుని రాసలీలోత్సవము' మూడురోజులు మహావైభ వముగ జరుగును. మూడవరోజు శ్రీకృష్ణుని ఊరేగింపు జరు గును. ఆ సమయమున వేలాదిజనులు వత్తురు. ఇచ్చట శ్రీకృష్ణ మందిరము ప్రధానము. ఇంకను చూడతగినమందిరములు గలవు.

## గంగాసాగర సంగమము

కలకత్తానుండి డైమండ్ హార్బరువరకు రైలుమీదను, తరువాత స్టీమరుమీదను ప్రయాణము చేయవలయును. మకర సంక్రమణమున కిచటికి కనేకులు యాత్రికులు వత్తురు. ఆ సమ

యమునందిట నున్న షాహుకార్లు యాత్రికులకు భోజనసదు పాయము, టిక్కెట సమకూర్తురు. స్టీమరుమీద కూర్చుండు నపుడు యాత్రికులు భోజనసామగ్రిని, కొన్ని ఔషధములను తమవెంట నుంచుకొనవలయును. త్రాగుటకు నీరుకూడ జాగ్రత్త చేసుకొనవలసి యుండును. స్టీమరు బయలుదేరగనే యాత్రికులు కపిలదేవునకు, గంగానదికి ' జయజయ నాదములు ' గావింతురు.



లింగరాజాలయము

(చూడుడు. భువనేశ్వరము 415 పేజీ)

ఇట గంగానది కిరు వైపుల నరణ్యముకలదు ఆ యరణ్యములనుకొట్టి తీరములను బాగు చేసి నను క్రూరమృగము లచ్చటచ్చట గనబడు చునేయుండును. ఇచ్చట నొక తియ్యనీటి సరస్సు కూడ గలదు. సముద్ర మునకు సమీపమున నుండుటచే గంగానది లోని నీరు ఉప్పగా నుం డును. పర్వసమయము లందు జన మధికముగ నుండునపుడు జలభావ ముకూడ సంభవించుచుండును. గంగాసాగర సంగమస్థానమున పండాలుండరు. ఇచట కపిలమహాముని విగ్రహము కలదు.

యాత్రికులు గంగాసాగర సంగమమున స్నానముచేసి కపిలుని పూజింతురు. ఇట యాత్రికులు పిండప్రదానముకూడ గావింతురు.

పూర్వగాథ:— పూర్వము సూర్యవంశీయుడగు సగర చక్రవర్తి దిగ్విజయార్థియై యశ్వమేధయాగమును జేయ సంకల్పించి యశ్వమును విడచి దానివెంట తన పుత్రులను పంపెను. ఆ యశ్వరాజము దశదిశల సంచరించుచుండెను. అంత నొకదినమున యింద్రు డాయశ్వమును దొంగిలించి ప్రస్తుత గంగాసాగర సంగమస్థానమున తపస్సు చేసుకొనుచున్న కపిలమహర్షి యాశ్రమమున కట్టివేసెను. సగరపుత్రు లశ్వమును వెదకుచు కపిలుని యాశ్రమమును చేరిరి. అచట నధ్వరాశ్వమును గాంచి వారలా మహాసీయుని చోరుడనియెంచి యనేకములగు దుర్భాషలు పలికిరి. సమాధిస్థుడగు కపిలుడు కనలి రూక్షేక్షణముల వారల గనెను. అంత వారందరును భస్మమైపోయిరి. అనంతరము సూర్యవంశీయుడగు భగీరథుడు తన తండ్రులకు ముక్తి గలుగు నుపాయమును జెప్పుమని కపిలుని వేడెను. కపిలుడు గంగానదీజల స్పర్శముచే వీరలు ముక్తిని గాంతురని చెప్పెను. భగీరథుడు హిమాలయమున గంగనుగూర్చి ఘోరమగు తపస్సుజేసి* గంగానదిని భూలోకమునకుదెచ్చి సగరపుత్రుల శరీరముల మీదుగ ప్రవహింపజేసి, వారలకు ముక్తిని కలుగజేసెను.

ఈ సంగమస్థానమున భగీరథుడు తన పితరులకు పిండప్రదానము జేసెను. పాండవులుకూడ నిచట పితృదేవతలకు పిండప్రదానము చేసిరని మహాభారతమున కలదు.

---

* మా బదరీయాత్ర చూడుడు.

కపిలుడు తల్లి యాజ్ఞచొప్పున నా సంగమస్థానమున నివసించియుండెనని భాగవతమున గలదు. ఈప్రదేశము సముద్రప్రాంతమున నొక యరణ్యమధ్యమున నొక ద్వీపోపరిభాగమున గలదు. ఇచ్చట భోజనసామగ్రి ఏమియు లభించదు. యాత్రికులు మరలిన మీాదట నిది మఱల జలమగ్నమగునని చెప్పుదురు.

**మాహాత్మ్యము:—** 'పూర్వపుణ్యవశమునగాని గంగాసాగరయాత్ర సిద్ధించదు. ఇచట స్నానముచేసిన మనుజుడు బ్రహ్మహత్యాది పాపములనుండి గూడ విముక్తుడగును. యథావిధిగా గంగాసాగర యాత్రను గావించిన మనుజుడు సహస్ర గోదానముల ఫలితముల నొందును.' అని వరాహపురాణమున గలదు. అన్యక్షేత్రము లనేకమార్లు సేవించబడి యొసంగు ఫలమును గంగాసాగర మొకపర్యాయముననే యొసంగును.

> ఆర్ద్రాయాం మృగశీర్షేవా గంగాసాగర సంగమే,
> సర్వపాప వినిర్ముక్తః శివసాయుజ్య మాప్నుయాత్. —సూతసంహిత

## ఖర్గపూర్

ఇది జంక్షను. పట్టణము చిన్నదైనను చూడ ముచ్చటగనుండును. చక్కని బజారులు, చూడ సొంపైన బాటలు, ధర్మశాలలు కలవు. ఆధునికదృశ్యములన్నియు చూడవచ్చును.

## జంషెడ్‌పూర్ (తాతానగరము)

ఖురదారోడ్ (జం) నుండి ఖర్గపూర్ (జం) లో మారి, తాతానగరుస్టేషనులో దిగవలయును. ఇది కలకత్తాకు 163 మైళ్లు. బీహారులోని ఇనుము, బొగ్గుగనులకు అతిసమీాపమున ఇండియా

దేశపు ఉక్కుపరిశ్రమకు కేంద్రమయిన జంషెడ్‌పూర్ పట్టణము కలదు. ఒకప్పుడు రెండునమలమధ్య యడవిగానుండే ప్రాంతమున టాటాకంపెనీవారు ఇక్కడ 2½ చ.మై. ప్రాంతములో బ్రహ్మాండమైన ఉక్కుకర్మాగారము నెలకొల్పుటచే నీ పట్టణము విలసిల్లినది. ఈ కర్మాగారయంత్రములు చూచితీరవలయును.

## వైతరణీ (నాభిగయ)

కలకత్తానుండి ఖర్గపూర్ (జం) మీదుగ వైతరణీరోడ్డు స్టేషనులో దిగవలయును. వైతరణీరోడ్డుకు వైతరణి 11 మైళ్లు.

ఇచ్చట కులారామ్‌ధన్నాజీ ధర్మశాల కలదు. ఇందు బసచేయవచ్చును. ఋషికుల్యాధారనుండి వైతరణివరకు పది యోజనముల దూరము. పురుషోత్తమక్షేత్రమని చెప్పబడును. ఈ ప్రాంతము ఉత్కళదేశము.

యాత్రికులు పాదగయాతీర్థమనిపిలువబడు వైతరణియందు స్నానము చేయుదురు. ఇట పిండప్రదానము చేసిన పితరులు తరింతురు సంపన్నులగు యాత్రికులు వైతరణి నావుతోక బట్టుకొని తరింతురు. అనంతరమా గోవును బ్రాహ్మణునకు దానము చేయుదురు. వైతరణీ ఘట్టమున విష్ణుమందిరము, వరాహమందిరము గలవు.



లింగరాజమందిరము

(చూడుడు. భువనేశ్వరము 415 పేజి)

గరుడ స్తంభము; విరిజాదేవి:— ఇచ్చటకు సుమారొక మైలుదూరమున గరుడస్తంభము గలదు. ఇచ్చట బ్రహ్మకుండ మను నొక కుండము. విరిజాదేవీ మందిరమును గలవు. ఇది శక్తి పీఠములలో నొకటి. యాత్రికులు బ్రహ్మకుండమున స్నానముచేసి విరజాదేవిని దర్శింతురు. వైతరణీక్షేత్రమును విరజాక్షేత్రమని కూడ పిలుతురు. ఈ విరజాదేవిని బ్రహ్మప్రతిష్ఠించెనని పండాలు చెప్పుదురు. జాజిపురము (నాభిగయ) లో నాభియాకారముగల నొక కూపమున పిండప్రదానము చేయుదురు. ఇక్కడివారు నాభి గయావళీలు అని పిలువబడుదురు.

'దేహావసానమున పాపాత్ములు చీముసెత్తురులతో నిండి సర్పమకరాది క్రూరజంతు సమన్వితమై యుండు వైతరణిని తరింపవలసియుండును. పుణ్యాత్ముల కా వైతరణి పరిశుద్ధజల సమన్వితమై గోచరించును' అని గరుడపురాణమున గలదు. అందుచే నీ వైతరణిని గాంచి కొందరు యాత్రికులు భీతిల్లు చుందురు. ఇచ్చట వైతరణీ స్నానమొనర్చి గోదానమొనర్చిన మనుజుల కా భయంకర వైతరణీ తరణమున బాధ కలుగదని చెప్పుదురు. యమలోకమునకు పోవుమార్గమున గల వైతరణీ తరణ బాధనుండి విముక్తులగుటకు వారుణీ పర్వసమయమునం దిటకు లక్షలకొలది యాత్రికు లరుదెంతురు.

వైతరణీ క్షేత్రవాసులగు పండాలధికముగ శైవులు. ఇట ననేక శివాలయములు గలవు. దీనిని పార్వతీ నివాస స్థానమని చెప్పుదురు. ఇట నొక ఔషధాలయము, సంస్కృతపాఠశాల, పోస్టాఫీసు కలవు. భోజన పదార్థములన్నియు లభించును.

మాహాత్మ్యము :— బ్రహ్మ, వాయు పురాణములలో వైతరణీక్షేత్ర మాహాత్మ్యము కలదు. ఇచట బ్రహ్మచే స్థాపించ బడిన విరజాదేవిని దర్శించిన మనుజుడు సర్వపాప విముక్తుడగును. భక్తి శ్రద్ధలతో వైతరణియందు స్నానముచేసిన మనుజుడు దేహావసానమున విష్ణుసాయుజ్యము నందును. ఇచట మరణించిన వార లుత్తమగతుల నొందుదురు.

## భువనేశ్వరము

వైతరణినుండి (62 మై.) భువనేశ్వరము స్టేషనులో దిగ వలయును. భువనేశ్వర మొక ప్రసిద్ధ శివక్షేత్రము. ఇది ఉడీసా ప్రాంతమున కాశీవలె ప్రసిద్ధిజెందినది. హౌరానుండి 'భువనేశ్వ రము' 272 మైళ్లు. భువనేశ్వరము స్టేషనులో పండాలు యాత్రికు లను తీసుకొనివెళ్లుటకు వత్తురు. స్టేషనుకు భువనేశ్వరమునకు 4½ మైళ్లు. ఇచ్చట ఎక్కాలు, టాంగాలు దొరకవు. ఎద్దుబండిమీాదనే ప్రయాణము చేయవలయును. లేదా నడచివెళ్లవలసియుండును. మేము నడచివెళ్లితిమి. భువనేశ్వరము 4 వేల జనాభాగల బస్తీ.

ఇది దేవాలయములతో కూడిన పట్టణము. ఇది ఒరిస్సాకు నూతనరాజధాని. పూర్వమిచట 7 వేల దేవాలయము లుండెడివట. కాని ప్రస్తుత మొక శతమానమువరకు గలవు. రకరకాల శిల్ప నిర్మాణమున కిది నిదర్శనము. అన్నిటిలోకి లింగరాజాలయము ప్రధానమైనది. మరియు భగవతి, పార్వతి, ముక్తేశ్వర, అనంత వాసుదేవ, బ్రహ్మేశ్వర, భాస్కరేశ్వర, పరశురామేశ్వర దేవా లయములు ముఖ్యమైనవి. ఇక్కడికి సమీాపమునగల ఉదయగిరి, ఖండగిరి గుహాలలో పూర్వము ఒకప్పుడు జైనసన్యాసు లుండెడి

వారట. వీటిలో కొన్ని క్రీ.పూ. 2వ శతాబ్ది నాటివి. వీటి శిల్ప సంపద మిక్కిలి ప్రసిద్ధమైనది. ఇచట పండాల గృహము లధికముగ గలవు. సంస్కృతపాఠశాల, అన్నసత్రము, పోష్టాఫీసు కలవు. భోజనసామగ్రి యంతయు లభించును.



ముక్తేశ్వర దేవాలయము

భువనేశ్వరమున 'రాయ బహాదుర్ విశ్వేశ్వర దయాల్ హాలవాసియా ధర్మశాల' గలదు. ఈ మహానీయుడు తన యంత్యకాలమున 60 లక్షల రూపాయలు నీ ధర్మశాలకొసంగెను. యాత్రికుల కిందు సర్వ సౌకర్యములు లభించును. భువనేశ్వరము శిల్ప సంపదకు, ప్రకృతిసౌందర్యమునకు నాటపట్టు. ఇచట పంచశతాధికములగు దేవాలయములు పూర్వ శిల్ప వైభవముతో జీర్ణావస్థయందున్నవి. ఆలయములు, కుండములు, ధారలు చూడతగినవి శతాధికముగా గలవు.

బిందుసరోవరము:— భువనేశ్వరమున 'బిందుసరోవరము' గలదు. మొదట యాత్రికులు బిందుసరోవరమున స్నానముచేసి

పితృదేవతలకు పిండప్రదానము చేయవలయును. ఈ సరోవరమున నింద్రద్యుమ్న మహారాజు స్నానముచేసి దివ్యజ్ఞానమును బడసెను. తరువాతనే యా మహారాజు దేవాదిదేవుడగు జగన్నాథుని మందిరమును నిర్మించెను. పూర్వ మీ క్షేత్రమున ననేకులు ఋషులు సర్వతీర్థముల నట సమకూర్పనెంచి సర్వతీర్థములనుండి జలబిందువులను దెచ్చి యీ సరోవరమున నింపిరట. అందుచేతనే యీ సరోవరమునకు బిందుసరస్సను పేరు వచ్చెను. ఈ సరస్సున స్నానము జేసినవారలకు సర్వతీర్థస్నానఫలము కలుగును.

భువనేశ్వరనాథుడు:—— బిందుసరోవరమున స్నానము జేసి భువనేశ్వరుని దర్శించవలయును. ఈ మహాదేవుని హరిహరాత్మకుడనియు, ఏకాభువనుడనియు పిలతురు. ఈ మందిరము 180 అడుగులు యెత్తుగలిగి మిగుల ప్రాచీనమైనదై యుండెను. జగన్నాథమందిరముకంటె నిది చాల పెద్దది. దీనిని బాగుచేయుటకు మూడులక్షల రూపాయలు ఖర్చయ్యెనట. ఒక లక్షరూపాయలు ప్రభుత్వమువలనను, రెండులక్షల రూపాయలు చందాలవలనను ప్రోగుచేసి యీమధ్యనే దీనిని బాగుచేసిరి. ఇచట శివు నభిషేకించుటకు యాత్రికులు గంగాజలమును దెత్తురు. ఇచటకూడ గంగాజలమును విక్రయింతురు. బిందుసరోవర జలముతోకూడ మహాదేవు నభిషేకింతురు.

పూర్వ మీ క్షేత్రము 'కోటిలింగక్షేత్ర' మని పిలువబడుచుండెడిది. కాశీయందువలె నిటగూడ చాల శివలింగములు గలవు. పూరీయందు జగన్నాథునికివలె నిట నీ మహాదేవునకు గూడ నిత్యమనేక భోగోపహారములు సమర్పింపబడుచుండును.

ముఖ్యములగు నుత్సవసమయములం దుత్సవ విగ్రహములను నావయందుంచి బిందుసరోవరమున జలవిహారము చేయింతురు. బిందుసరమున స్వామి విశ్రాన్తి దీసుకొనుటకు జలమధ్యమున నొక మండపము గలదు. ఇచ్చట 'కుంజవన' మను పేరు గల యొక వనము గలదు. ఇట చాల దేవాలయములు కలవు. ఇవి చాల పురాతనములైనవి. అందుచే నిందు కొన్ని శిథిలములై పతనావస్థయందున్నవి. కొన్ని భూమిలో సగము కప్పడిపోయినవి.



ముక్తీశ్వరాలయ ముఖద్వారము

ఒకానొక సమయమునందిట నొక వేయి శివాలయము లుండెడివి. కాని నేడిచట 5, 6 వందల మందిరములు మాత్రము గలవు. ఇచ్చటి మందిరములన్నియు నొకేవిధముగ నిర్మింపబడెను. శిల్పముకూడ నంతట నొకేవిధముగ నుండెను. ఇచట 'పరశురామేశ్వరమందిరము' కలదు. ఈ మందిరము 5వ శతాబ్దియందు

కట్టబడెను. ఇది దక్షిణాత్య శిల్పకళాచాతుర్యమును చాటు శిల్ప ఖండము. భువనేశ్వరమహాదేవుని ప్రధానమందిరముకూడ 1100 సంవత్సరములు పురాతనమైనది. ఇందలి శిల్పకళ, చిత్రకళ యత్యున్నతమైనవి. దీనిని ఉడీసామహారాజు యయాతికేసరి కట్టించెను.

ముక్తీశ్వరుడు:— భువనేశ్వరమహాదేవుని యాలయమున కొక యర్ధమైలుదూరమున సిద్ధారామవనమున ముక్తీశ్వరుని మందిరము గలదు. ఇది యొక ప్రసిద్ధ శిల్పకళాఖండము. కలావిదులు దీనినిగూర్చి యిది ఇసుకరాతితోగాక పాలరాతితో నిర్మింపబడిన యాగ్రాయందలి తాజ్‌మహాలున కెనయై యుండెడిదని చెప్పుదురు. భువనేశ్వరమందిరమునకు పూర్వోత్తరకోణమున భాస్కరేశ్వరుని మందిరము కలదు. దానికి పశ్చిమమున నత్యంత సుందరమగు 'రాజరానీ మందిరము' గలదు. ఇవికాక వాసుదేవ మందిరము, వైతాలమందిరము మొదలగునవి కలవు.



శ్రీరామకృష్ణ పరమహంస

శ్రీరామకృష్ణ సేవాశ్రమము:— ఈ యాశ్రమమున శ్రీ రామకృష్ణ మిషనుకు సంబంధించిన సన్న్యాసులు, బ్రహ్మచారు లుందురు. వీరు అసహాయులకు, అనాథులకు పలువిధముల సేవ చేయుదురు. ఉత్సవసమయము లందు వీరిసేవ నిరుపమానముగ నుండును. ఇట శ్రీరామకృష్ణ పరమహంసకు నిత్యార్చన జరుగును.

**మాహాత్మ్యము:—** శివపురాణములోను, స్కాందపురాణములోను భువనేశ్వర మాహాత్మ్యము కలదు. భువనేశ్వరమహాదేవుని దర్శించిన మనుజుడు సర్వపాప విముక్తుడై దేహావసానమున శివలోకమున కేగును. ఈ క్షేత్రము కాశీవలె పరమపవిత్రమైనది. గ్రహణసమయములందును, సంక్రాన్తి సమయములందును యిచట దానధర్మములు జేసిన కోటిగుణితముగ ఫలము గలుగును. ఈ క్షేత్ర వైశాల్యము రెండు యోజనములు.

## ఉదయగిరి, ఖండగిరి

భువనేశ్వరమునకు 4 మై. దూరమున ఉదయగిరి, ఖండగిరి యను రెండుకొండలు గలవు. అందు బుద్ధుని కాలమునాటి గుహాలు కలవు. ఇందు బౌద్ధభిక్షువు లాత్మజ్ఞానమునకై సాధన చేసెడివారు. ఇందలి శిలాశాసనములవలన నిందు కొన్ని క్రీస్తుకు 50 సం॥లు పూర్వముననను, మరికొన్ని 500 సం॥లు పూర్వముననను నిర్మింపబడినట్లు తెలియుచున్నది. ఈగుహాల కెదుట ప్రాంగణము కూడ మలపబడియున్నది. ఇవి కొండలను దొలిచి నిర్మింపబడినవి. ఈ గుహాలయందు చాల గదులు గలవు. ఇందు సర్పగుహా, వ్యాఘ్రగుహా, రాణీనూర్ గుహా, గణేశగుహా, వైకుంఠగుహా, హాథీగుహా, బాయేగుహా ప్రసిద్ధమైనవి. ఇవి ఉదయగిరి గుహాలు.

**పారసనాథుడు:—** ఖండగిరియందు జైనాచార్యుడగు పారసనాథుని మందిరము గలదు. ఇచట నాకాశగంగ యను పేరుతో నొక కుండముకూడ గలదు. ఇచటి ప్రాకృతిక దృశ్య


పారసనాథ మందిరము

ములు చూడదగినవి. ఈ కొండలు బౌద్ధులకు, జైనులకు యాత్రాస్థలములై యున్నవి. ఈ గుహాలు రెండువేల సంవత్సరములకు పూర్వము భారతదేశమునగల శిల్పకళా చాతుర్యమును చాటుచున్నవి. ఇవి యెంతసేపు చూచినను ఇంకను చూడవలయునని మనసు ఉవ్విళ్లూరుచుండును.

## జగన్నాథము

నిత్యానందైకరసం సచ్చిన్మాత్రం స్వయం జ్యోతిః,
పురుషోత్తమ మజ మీశం వన్దే శ్రీ యాదవాధీశమ్॥

భువనేశ్వరమునుండి ఖురదారోడ్డు (జం) మీదుగ పూరీ (38 మై.) చేరవలయును. స్టేషనును సమీపించగనే జగన్నాథ మందిరోపరిభాగమున గల నీలచక్రము కనబడును. యాత్రికు లా నీలచక్రమును దర్శించి జగన్నాథుని దర్శించినటులే సంతసింతురు.

తూర్పు సముద్రతీరమున గల యీ పట్టణము ఆరోగ్య కేంద్రమేకాక పవిత్రక్షేత్రముకూడ. ఈ నగరమునకు మధ్యభాగ

ములో క్రీ.శ. 13 లో కట్టబడిన 192 అ. యెత్తుగల జగన్నాథ మందిరము గలదు. దానిపై విష్ణుచక్రము ధ్వజము చెక్కబడి యున్నవి. పంజాబును పాలించిన రంజిత్ సింగ్ మహారాజు కోహినూరు వజ్రమును జగన్నాథస్వామి ఆలయమునకు కానుకగా నర్పించెనట. కాని ఆయనవారసుడు ఈ వాగ్దానమును నిలబెట్టలేను. ఇక్కడి రథయాత్ర తప్పక చూడతగినది.

పండాలు ఖురదారోడ్డుస్టేషనునుండియే యాత్రికుల వెంటబడి తమతమ బసలకు రావలయుననియు, మీ యిష్టానుసారము యాత్రలను చేయించగలమనియు చెప్పుచు, యాత్రికులను వెంటబెట్టుకొని తీసుకొనివెళ్ళుదురు. ఇచట పండాల ఒత్తిడి యధికము. స్టేషనుకు తీర్థస్థానము 2 మై. దూరమున గలదు. ఇక్కడనుండి ఎద్దుబండి లేదా గుఱ్ఱపుబండి దొరకును. పూరీలో చాల ధర్మశాలలు కలవు. యాత్రికులు తమ యిష్టానుసార మందు బసచేయవచ్చును. వానిలో ముఖ్యములగు ధర్మశాలలు:—
1. శ్రీధనజీమూలజీ ధర్మశాల (భాటియా ధర్మశాల), 2. సర్ హరీరామ్ గోయంకా ధర్మశాల, 3. సేఠ్ హజారీమల్ ధవేలా ధర్మశాల, (ఇది పురీ మహారాజభవనమున కెదుట గలదు) 4. శ్రీ ఆశారామ్ మోతీలాల్ ధర్మశాల (ఇది ధనజీ మూలజీ ధర్మశాల). ఇంకను చాల కలవు.

జగన్నాథుని అస్పృశ్యులు దర్శింప నధికారము లేదు. అందుచే వారలకై సింహద్వారమున జగన్నాథుని విగ్రహము కలదు. అస్పృశ్యు లీ విగ్రహమునుగాంచిన, వారలకు జగన్నాథుని దర్శించిన ఫలితము లభించును.

మార్కండేయసరోవరము:— యాత్రికు లీ సరోవరమున ప్రథమమున స్నానముచేసి తీర్థవిధి చేయవలయును. ఇచట మార్కండేయ మహాదేవుని దేవాలయము కలదు. ఈ ప్రదేశమున మార్కండేయుడు చాలకాలము తపస్సు చేసి శంకరుని ప్రసన్నుని గావించుకొని పదియారుకల్పముల దీర్ఘాయువును బడసెను.



* జగన్నాథమందిరము - పూరి.

జగన్నాథమందిరము:— పిమ్మట యాత్రికులు శ్రీ జగన్నాథుని దర్శింతురు. జగన్నాథ మందిరము నీలగిరిమీాది గలదు. దీని ఎత్తు సుమారు 25 అ. లుండును. మందిరమునకు ప్రాకారము కలదు. ఆ ప్రాకారమునకు నలుదిశల నాల్గు ద్వారములు

గలవు. ఇందు తూర్పుద్వారము చాల పెద్దది. ఈ ద్వారమునకు ముంగిట 2 సింహ విగ్రహములు కలవు. యాత్రికు లీ ద్వారము గుండా లోనికి ప్రవేశింతురు. ఈ ఆలయము వెలుపల యద్భుత మైన శిల్పము కలదు.

అరుణ స్తంభము:— ఈ ద్వారమున కెదుట నల్లరాతి అరుణ స్తంభము కలదు. దీని ఎత్తు సుమారు నలుబది యడుగు లుండును. దీనిమీద సూర్యసారథి యనూరుని మూర్తి కలదు. యాత్రికులు దీనికి ప్రదక్షిణముగా లోనికేగవలయును.

మొదటిప్రాకారము లోపల రెండవప్రాకారము గలదు. దీనికి నాలుగుద్వారములు - మొదటి ప్రాకారద్వారముల కెదుట గలవు. ఈ ప్రాకారాంతరమున ననేకమందిరములు గలవు. అందు 'పాతాళేశ్వర మందిరము' సుప్రసిద్ధమైనది. యాత్రికు లీ పాతా ళేశ్వరమహాదేవుని దర్శించి ముందునకేగిన గరుడ స్తంభము కాన నగును. గరుడ స్తంభమును దాటిన పతితపావనుడగు జగన్నా థుని సందర్శనమగును. జగన్నాథమందిరము నాల్గుభాగములుగ గలదు. 1 విమానమందిరము, 2 సభామందిరము, 3 నృత్య మందిరము, 4 భోగమందిరము.

విమానమందిరము:— విమానమందిరమున జగన్నాథుని విగ్రహము కలదు. దానికి ముందు సభామందిరము కలదు. సభా మందిరమునకు ముందు భోగమందిరమును, దీనికి ముందు నృత్య మందిరమును గలవు.

నృత్యమందిరము:— నృత్యమందిర మెల్లపుడు యాత్రి కులతో నిండియుండును. ఈ మందిరము లోపల పై భాగమున

ననేకచిత్రములు చిత్రితములై యున్నవి. సముద్రమథనము, రాసక్రీడ, గోపీవస్త్రాపహరణము, క్షీరోదధిశాయియగు విష్ణుమూర్తి మొదలగు మనోహరచిత్రము లనేకము లిందు కాననగును.

యాత్రికు లొక్కుమ్మడి లోనికి రాకుండచేయుటకు కర్రబల్ల లడ్డముపెట్టి పోలీసులు కాపలాకాయుదురు. ఈ యడ్డకట్లు సుమారు నాలుగుండును. ఒక యాత్రికదళము రెండవబల్లను దాటిన, మొదటిబల్లకు ముందుండు యాత్రికులు రెండవబల్లను సమీపింతురు. ఇట్లు క్రమముగ నీ బల్లలను దాటి జగన్నాథుని దర్శించవలసియుండును.

ఈ మందిరము చాల చీకటిగా నుండును. నిరంతరము నొక ఘృతదీపము వెలుగుచుండును. ఆ దీపపువెలుగుననే జగన్నాథుని దర్శించవలయును. జగన్నాథుని విగ్రహము రత్నవేదికమీద గలదు. ఈ వేదిక సుమారు $1\frac{1}{2}$ గజము ఎత్తును, 5 గజముల పొడవు గలిగియున్నది. దీనికి మూడువైపుల యాత్రికులు ప్రదక్షిణము చేయుట కనువుగ నాలుగడుగుల వెడల్పుగల సందు గలదు. రత్నవేదికమీద నుత్తరముగా సువర్ణచక్రము గలదు. దానికి దక్షిణమున జగన్నాథస్వామి, సుభద్ర, బలభద్రుల విగ్రహములు గలవు. జగన్నాథున కొకవైపున లక్ష్మియు, రెండవవైపున సత్యభామయు గలరు. సత్యభామావిగ్రహమున కెడుటనే యింద్రద్యుమ్నుని విగ్రహము కలదు. బలభద్రుని విగ్రహము 6 అడుగులు, జగన్నాథుని విగ్రహము 5 అడుగులు, సుభద్రామూర్తి 4 అడుగులు ఎత్తు గలిగియున్నవి. మూర్తులు చాల పెద్దవిగనున్నను అందముగ లేవు. ఈ మూడువిగ్రహముల

శిరస్సునం దొక్కొ-క వజ్రము కలదు. ఇట నెవ్వరును భగవంతుని తాకరాదు.

"నమస్తే హలభృగ్ రామ నమస్తే ముసలాయుధ,
నమస్తే రేవతీకాంత నమస్తే భక్తవత్సల॥
జయకృష్ణ జగన్నాథ జయసర్వాఘ నాశన,
జయ చాణూర కేశిఘ్న జయ కంస నిషూదన॥
నమస్తే సర్వగేదేవీ నమస్తే శుభసౌఖ్యదే,
త్రాహిమాం పద్మపత్రాక్షి కాత్యాయని నమోస్తుతే॥"

—నారదపురాణము

ఇట్లు బలరాముని, జగన్నాథుని, సుభద్రను స్తుతించి, రత్నవేదిక మీద శిరసునుంచి నమస్కరించి భక్తులు తృప్తిజెందుదురు. ఇట్లు జగన్నాథుని దర్శించి యాత్రికులు రెండవమార్గముగుండా బయటకు రావలసియుండును.

జగన్నాథుని భోగములు:— ఇట జగన్నాథుని కైంకర్యమునకు చాల సుందరములగు నేర్పాట్లు కలవు. ప్రతిదినము జగన్నాథునకు రకరకముల శృంగారములను గావింతురు. ప్రాతః కాలమున 'మంగళహారతీ శృంగారము' గావింతురు. అనంతరము అవకాశవేషము, ప్రహారవేషము, చందనవేషము మొదలగునవి శృంగారింతురు. సాయంతనవేషము చాల సుందరముగ నుండును. ఇవికాక విశేషసమయములందు దామోదరవేషము, వామన వేషము, బుద్ధవేషము, గణేశవేషము మొదలగు నలంకారములు గూడ చేయుదురు. యాత్రికులకు మధ్యాహ్నము 12 గంటల ప్రాంతమునను, రాత్రియు రత్నవేదికను సమీపించి భగవంతుని

దర్శించుటకు వీలుచిక్కును. ఇతరసమయములందు సభామందిరము నుండియే జగన్నాథుని దర్శించవలసియుండును.

విమానమందిరము:— జగన్నాథుని ముఖ్యమందిరము (విమానమందిరము) 214 అ. ఎత్తు, 80 అ. వెడల్పు, అంతే పొడవును గల్గియుండెను. దీని కుపరిభాగమున నీలచక్రము, గరుడ ధ్వజము గలవు. క్రిందనుండి చూచిన యీచక్ర మొక మూరెడు వ్యాసము కల్గియున్నట్లు కానుపించును. కాని దీని వ్యాసము 12 మూరలు. ఈ మందిరోపరిభాగమున వరాహ, నృసింహ, వామనాది భగవన్మూర్తు లతి సుందరముగ చెక్కబడియుండెను.

సభా మందిరము:— విమానమందిరమునకు చేరియే సభామందిరము కలదు. ఇది 120 అ. ఎత్తును, 80 అ. వెడల్పు, అంతే పొడవును కలిగియున్నది.

నృత్యమందిరము, భోగమందిరము:— దీనికి చేరియే నృత్యమందిరము, భోగమందిరమును కలవు. నృత్యమందిరద్వారమున జయ విజయుల విగ్రహములు కలవు.

అక్షయవటము:— జగన్నాథుని మందిరమునకు ప్రదక్షిణము చేయునపు డక్షయవటము కానవచ్చును. యాత్రికులు దీనిని పూజింతురు. ప్రలయకాలమున నీయక్షయవటమున భగవంతుడు శయనించునని చెప్పుదురు.

ఓం నమో వ్యక్తరూపాయ, మహాతే నతపాలినే,
మహోదకోపవిష్టాయ, న్యగ్రోధాయ నమోస్తుతే॥
— నారద పురాణము.

అని స్తుతించుచు నీ యక్షయవటమునకు నమస్కరించవలెను.

ఇచ్చటకు సామీప్యముననే రోహిణీకుండము గలదు. దీని యొద్దున విమలాదేవి మందిరము గలదు.

**ముక్తిమండపము:—** జగదీశమందిరమునకు దక్షిణమున నొక యశ్వత్థవృక్షమును, దానికి సమీపమున నొక మండపమును గలవు. ఈ మండపమును 'ముక్తిమండప' మందురు.

**పాకశాల:—** భోగమందిరమునకు కొలది దూరమున జగన్నాథుని పాకశాల గలదు. ఇందు జగన్నాథుని భోగముకొరకనేక భక్ష్యములు వండబడుచుండును. ఇచట వందలకొలది పొయ్యిలు కలవు. ఆ పొయ్యిలమీద దొంతర దొంతరలుగా నొకదానిమీద నొకటి చాలా హండీలు పెట్టుదురు.



**12 చక్రములుగల రథాకార సూర్యమందిరము (చూ. కోణార్కుం 439 పేజి)**

జగన్నాథ మందిరములోపల నలుబది చిన్న చిన్న మందిరములు గలవు. అందు "గణేశమందిరము, దేవరాజ మాధవ

మందిరము, మంగలాదేవి, లక్ష్మి, కర్మాబాయి, ధర్మరాజు, పాతాళేశ్వర మందిరములు" ప్రసిద్ధములైనవి. ఇందు "లక్ష్మి మందిరము" చాల పురాతనమైనది.

జగన్నాథ మందిరమునకు స్థిరముగ వచ్చు వార్షికాదాయము మూడులక్షల రూపాయలు. అదికాక యాత్రికు లర్పించిన కానుకల రూపమున నైదులక్షలు రూపాయలు ఆదాయము వచ్చును. ఇచట నిత్యము స్వామిసేవకు వందలకొలది పూజారులు నియుక్తులై యుండిరి.

పూర్వగాథ:— నేడు జగన్నాథమందిరముగల ప్రాంతము పూర్వమొక యరణ్యప్రాంతము. అట నెవ్వరును నివసించెడివారుకారు. కాని విశ్వవసువను శంబరుడొక డచ్చట మృగములను వేటాడుచు నివసించు చుండెడివాడు. ఒకదినమున వానికొక గుహాయందు జగన్నాథుని విగ్రహము కనబడెను. విగ్రహమును దర్శించగనే శంబరుని హృదయము భక్తిపూరితమయ్యెను. అంత నాతడు కందమూల ఫలములను గొనితెచ్చి భగవంతుని ముందుంచి 'వీనిని నీవు స్వీకరించినగాని నే నేయాహారమును స్వీకరించ'నని పట్టుబట్టి కూర్చుండెను. భక్తవత్సలుడగు భగవంతుడా మూఢభక్తుని భక్తికి మెచ్చి ప్రసన్నుడై యాఫలముల నారగించెను. ప్రతిదినమిటులనే జరుగుచుండెను. ఇట్లు చాలకాలము జరిగెను. క్రమముగ నీవార్త అవంతీప్రభువగు నింద్రద్యుమ్నునకు తెలియవచ్చెను. అంత నాతడు చతురంగ సేనాపరివృతుడై వివిధ వాద్యములతో భగవంతుని దర్శించుటకు గుహావద్దకు వచ్చెను. రాజునకు గుహ కనబడెనేకాని భగవంతుడు కనబడలేదు. అందు

లకు ఖిన్నుడై రాజు విద్వాంసులగు బ్రాహ్మణులను రప్పించి, భగవంతుని దర్శించు నుపాయము చెప్పుడని వేడెను. వారు దీర్ఘముగ నాలోచించి 'రాజా! నీవిచట భగవంతునకు రత్నజటిత మందిరము నొకదానిని కట్టించి యశ్వమేధయాగమును జేసిన నీకు భగవంతుడు దర్శన మిచ్చు'నని చెప్పిరి.

అంత నింద్రద్యుమ్ను డీ మందిరమును కట్టించి యశ్వమేధ యాగమును జేసెను. ఒకనాటిరాత్రి రాజునకు భగవంతుడు స్వప్నమున సాక్షాత్కరించి, 'రాజా! రేపు ప్రాతఃకాలము నీవు సముద్రతీరమునకు బొమ్ము. అట నీకొక దేవదారువృక్షము సముద్రతరంగముల తేలియాడుచు కానవచ్చును. నీవు దానితో నా మూర్తులను దయారుజేయించి యిట స్థాపించు'మని యాన తిచ్చెను. రాజటులనే యా వృక్షమూలముతో విగ్రహములను తయారుచేయించి ప్రతిష్ఠించెను.* స్వయముగ బ్రహ్మ యా సమయమున బ్రాహ్మణవేషమున వచ్చి యా ప్రతిష్ఠాకార్యమును నిర్వర్తించెను. అందుచేత నిట 11 నెలలు పండాలు పూజింతురు.

---

* ఇంద్రద్యుమ్నమహారాజు ప్రసిద్ధిజెందిన శిల్పి నొక్కని రావించి సుందరమైన విగ్రహములను తయారుచేయుమని యానతిచ్చెను. అతడు "రాజా! నేను విగ్రహములు దయారుసేయు ప్రదేశమున కెవ్వరును రాకూడదు. అట్లు వచ్చిన నే నెచ్చటివాని నచ్చటనే నుంచి వెడలిపోవుదును" అని చెప్పెను. రాజును అందుల కంగీకరించి యాతని కొక సౌధము నేర్పరచెను. అందా శిల్పి ప్రవేశించి తలుపులు మూసుకొనెను. 6 నెలలు గడచినను శిల్పి తలుపులు తెరువ లేదు. అది గాంచి రాజు తలుపులను బ్రద్దలుకొట్టించి యందు ప్రవేశించెను. అందు గల శిల్పి వెంటనే యదృశ్యుడైపోయెను విగ్రహములు సగము సగము తయారై యుండెను. అందువలననే జగన్నాథుని మూర్తి సుందరముగ లేకుండెననికూడ చెప్పుదురు.

జ్యేష్ఠ శు ౧౫ మొదలు ఆషాఢ శు ౧౫ వరకు శబరవంశీయులు జగన్నాథుని పూజింతురు.

ఉత్సవములు:— ప్రతి సంవత్సర మిట నుత్సవములు చాల జరుగును. అందు రథోత్సవము చాల ప్రసిద్ధమైనది. ఇది ఆషాఢ శు ౨ కు ఆరంభింతురు. ఆ సమయమునందిచట మూడు పెద్ద పెద్ద రథములను నూతనముగ నిర్మింతురు. ఈ రథములు సుమారు 40, 50 అ. ఎత్తుగలిగి యుండును. జగన్నాథుని రథమునకు 16 చక్రములును, బలభద్రుని రథమునకు 14 చక్రములును, సుభద్ర రథమునకు 12 చక్రములు నుండును. రథ చక్రముల వ్యాసము 6-6 అ. వుండును. వీటిని తయారుచేయుటకు 6 మాసములు బట్టును. యాత్రానంతర మీ రథములను విరుగకొట్టి యాత్రికులకు పంచుదురు. జగన్నాథుని రథమును 'గరుడధ్వజ'మనియు, బలభద్రునిరథమును 'తాళధ్వజ'మనియు, సుభద్రరథమును 'పద్మధ్వజ'మనియు పిలతురు.

ఆషాఢ శు ౨ కు మూర్తులను సింహద్వారమువద్దకుగొని తెత్తురు. మొదట 'చక్రమూర్తిని' గొని తెత్తురు. అనంతరము 'బలభద్రమూర్తి'ని తీసుకువచ్చి రథమునందుంతురు. తరువాత సుభద్రామూర్తిని రథమునందుంతురు. అనంతరము శ్రీ జగన్నాథుని రథారోహణము సేయుంతురు. జగన్నాథునిమూర్తిని రథమునందుంచగనే 'పూరీ' మహారాజు ప్రతిరథమును తుడిచి పన్నీరు చల్లును. తరువాత కర్రతో చేయబడిన సారథివిగ్రహములను ప్రతిరథమున నుంతురు. ఈ రథములకు 4, 5 లావైన పగ్గము లను కట్టుదురు. యాత్రికులీరథములను లాగుదురు. అదియును

గాక యీ రథములను లాగుటకు **4200** కూలీలు గలరు. వీరు సంవత్సరమం దీ రోజున మాత్రమే పనిచేయవలసి యుండును. ఇందులకై వీరలకు కొన్ని మాన్యము లీయబడియుండెను. రథమును లాగుటకూడా పుణ్యప్రదమైనకార్యము. అందుచే యాత్రికులుకూడ రథమును లాగుదురు. ఈ రథములు క్రమముగా 'జనకపురము' లోని 'గుడీచామందిరము' నుంగిటకు చేరును.



సూర్యుడు
(చూ. కోణార్కం
439 పేజి)

తద్దియ సాయంకాలమువరకు విగ్రములు రథమునందే యుండును. సాయంత్రము విగ్రహములను రథమునుండి తీసి మందిరమున నుంచెదరు. దశమివరకు స్వామి యిచ్చటనే యుండును. ఆషాఢ శు ౧౦ సాయంకాలమునకు రథములు మరల సింహద్వారమునకు చేరును. ఏకాదశి నాడుకూడ మూర్తులు రథముమీదనే యుండును. ద్వాదశినాడు విగ్రహములను మరల మందిరమున ప్రవేశపెట్టుదురు. ఈవిధముగ దేవశయనీ ఏకాదశివరకు నీ యుత్సవము జరుగును. ఇవికాక సంవత్సరముపొడుగునా కొన్ని ఉత్సవములు జరుగును.

చైత్ర శు ౯ కి రామజన్మోత్సవము, ఈ సమయమునందు పూర్ణిమవరకు రామలీలోత్సవము జరుగును.

వైశాఖ. శు 3 నుండి "చందనయాత్ర" జరుగును. ఈ సమయమునందు భగవన్మూర్తులను పాలకిలోనుంచి "చందనసరోవరము" నకు తీసుకొని వెళ్లెదరు. అట చెరువుమధ్య గల మందిరమునందు 21రోజు లావిగ్రహములనుంచి యారాధింతురు.

జ్యేష్ఠ శు ౧౫ కు జగన్నాథుని విగ్రహామును "స్నాన మండపము" నకు దెచ్చి 108 కడవలతో నభిషేకింతురు. సంవత్సరమున కీయొక్క దినముననే స్వామికి అభిషేకము జరుగును. ఇతర దివసములందు స్వామి ఎదుట నొక యష్టధాతుదర్పణము నుంచి యందలి ప్రతిబింబమునకు మాత్రమే స్నానము చేయింతురు.

ఇతరస్థానములు:—

జనకపురము:— ఇచ్చటనే జగన్నాథుని దారువిగ్రహములు తయారు చేయబడెను. అందుచే దీనిని జనకపురమని పిలతురు. ఇది పూరీకి రెండుమైళ్లు దూరమునగలదు. ఇచ్చట మందిరము జగన్నాథ మందిరముకంటె పురాతనమైనది. ఇది మూడు భాగములుగ గలదు. రథయాత్రా సమయమున స్వామి యిచ్చటనే సుమారొక వారమురోజులు నివసించును.

ఇంద్రద్యుమ్నసరోవరము:— జనకపురమున కింద్రద్యుమ్న సరోవరమొక యరమైలు దూరమునగలదు. స్నానముచేయుటకు చక్కని మెట్లుకలవు. జలమంత స్వచ్ఛముగ నుండదు. ఇట తీర్థ విధికూడా చేయుదురు. ఇంద్రద్యుమ్న మహారాజు అశ్వమేధ యాగముచేసి ఆ యాగస్మృతి చిహ్నముగ దీనిని నిర్మించెను. ఈ సరస్సున పిండప్రదానముచేయుమనుజుని ఇరువదియొక్కతరముల వారు తరింతురని పురాణములు చెప్పుచున్నవి. ఇచ్చట 3 మందిరములు కలవు. ఇందొకదానియందు యింద్రద్యుమ్నమహారాజు విగ్రహామును, రెండవదానియందు నీలకంఠమహాదేవుని విగ్రహామును, మూడవదానియందు పద్మనాభుని విగ్రహామును కలవు.

చందనసరోవరము:— పురిలోని సరోవరములం దిది పెద్దది. ఇది సుమారు 225 గజముల వెడల్పును, అంతకు మించిన పొడవును కలిగియున్నది. వైశాఖ శుద్ధ తదియ మొదలు యిరువదియొక్క రోజులవరకు యిందు జగన్నాథుని ఉత్సవ విగ్రహములను నావయందుంచి జలవిహారము సేయింతురు. ఈ సరస్సుకు మధ్యభాగమున నొకమందిరము కలదు. యాత్రికులు నావమీద నటకుపోయి భగవంతుని సందర్శింతురు. ఇటకూడ తీర్థవిధి చేయుదురు.

లోకనాథమహాదేవుడు:— ఇది జగన్నాథదేవాలయమునకు సుమారు 2 మై. దూరమున గలదు. మార్గమంతగా బాగుండదు. ఈ మందిరమం దొక జలప్రవాహము కలదు. ఆ ప్రవాహమధ్యమున నొక శివలింగము కలదు. శివరాత్రికి ఉత్సవము జరుగును. ఈమందిరములోని జలము 'పార్వతీసరోవరము' అను పేరుగల నొకకుండములోనికి పోవుచున్నది. ఈ మహాదేవుని పేరెత్తిన పురిలోని జనులు భయపడుదురు. అవసరమువచ్చిన జగన్నాథునిమీదనైనా ఒట్టు పెట్టుకొందురుగాని లోకనాథుని మీద శపథముజేయుట కందరును భయపడుదురు. ఈ మహాదేవుని శ్రీరాముడు ప్రతిష్ఠించెనని పండాలు చెప్పుదురు. ఇచ్చట రామసైన్య మధికముగా కలదు. యాత్రికులు వానికి శనగ గుగ్గిళ్లు కొనిపెట్టుదురు.

స్వర్గద్వారము:— ఇది సముద్రతీరమున 2 మై. పొడవుగల యొక ఘట్టము. ఇచట స్నానముజేసిన మనుజుడు మరణానంతరము స్వర్గమునకు వెడలునని చెప్పుదురు. పురిలోని జనులు

ఆసన్నమృత్యుడగు మనుజునకీ స్వర్గద్వారఘట్ట దర్శనము సేయింతురు. ఇచట సముద్రమున కొన్ని ఏనుగులు మునుగుచున్నటుల ధ్వని వినిపించును.

అమృతకూపము:— సముద్రస్నానము చేసిన తరువాత యాత్రికులు సమీపమునగల 'సముద్రకూపము' లేక 'అమృత కూపము' అను పేరుగల కూపమున స్నానము చేయుదురు. ఈ కూపమందలి నీరు తీయగనుండును.



* సూర్యమందిరము (చూ. కోణార్కం 439 పేజి)

శ్రీ రామకృష్ణ సేవాశ్రమము:— ఈ యాశ్రమమున అసహాయులకు, అనాథులకు సేవచేయబడును. శ్రీరామకృష్ణ మిషనుకు చెందిన సన్యాసులు పెక్కండ్రు ఇందు గలరు. ఆశ్రమ మందలి సన్యాసులే యీ సేవ చేయుచుందురు. ఉత్సవసమయ ములం దీ సంస్థ చేయు సేవ నిరుపమానము.

కర్మాబాయి కుటీరము:— సముద్రతటమున నీ కుటీరము కలదు. ఇచ్చట ఉదయము పులగము, ప్రసాదము బెట్టుదురు. కర్మాబాయి భగవద్భక్తురాలు. ఆమెభక్తి - వాత్సల్యభక్తి. భగవంతు నామె తనబిడ్డవలె ప్రేమించుచుండెడిది. ఆమె ఉదయము ననే లేచి స్నానాది శౌచవిధుల నాచరించకయే పులగమునువండి జగన్నాథునికి నివేదించెడిది. ఇందువలన చాలసేపటివరకు జగన్నాథు డాకలితో బాధపడనక్కరలేదని యామెయూహ. నివేదనానంతర మామె స్నానాది శౌచకృత్యములను నిర్వర్తించెడిది. భక్తవత్సలుడగు భగవంతు డామె భక్తిని గని యొక దినమున మందిరమున ప్రాతఃకాల భోగమును స్వీకరించక కర్మాబాయి నివేదితమగు పులగమును స్వీకరించెను. నాటినుండియు పులగమే జగన్నాథుని ప్రాతఃకాలభోగము. యాత్రికులు ప్రేమతో నీ ప్రసాదమును స్వీకరింతురు.

మలూకాదాసాశ్రమము:— సముద్రతీరమున ననేక మఠములు గలవు. అందు మలూకాదాసు ఆశ్రమము ప్రసిద్ధమైనది. మలూకాదాసజీ సుప్రసిద్ధులగు మహాత్ములు. ఈయన 108 సంవత్సరములు జీవించియుండిరి.

గోవర్ధనమఠము:— జగద్గురు శ్రీశంకరాచార్యులవారు అద్వైతమతమును స్థాపించుటకు, భారతదేశమున పర్యటించుచు నలుదిక్కుల నాలుగు మఠములను స్థాపించిరి. గోవర్ధనమఠము యందులో నొకటి. ఈ భవనము సముద్రతీరమున గలదు.

శ్వేతగంగాసరోవరము:— ఇదియొక కుండము. లోకనాథ మహాదేవుని మందిర సమీపమున గలదు. దీనిఒడ్డున 'శ్వేతకేశవ

స్వామి' మందిరము కలదు. ఇదికూడ దారువిగ్రహమే. ప్రతి పండ్రెండు సంవత్సరములకు నొక మంచిగంధపు వృక్షము 'జగన్నాథ క్షేత్రమునకు' సముద్రమున కొట్టుకొని వచ్చుచుండును. అప్పు డాదారువుతో నవీన విగ్రహమును దయారుచేసి పురాతన విగ్రహస్థానమున స్థాపింతురు. ఆసమయమునం దీశ్వేతకేశవ స్వామి విగ్రహమునుకూడ మార్తురు.

చక్రతీర్థము:— స్టేషనుకు సమీపమున సముద్రతీరమున చక్రతీర్థము కలదు. ఇందు జగన్నాథుని సుదర్శనచక్రము గలదని చెప్పుదురు. ఇది సముద్రమునకు 20, 25 అడుగుల దూరమున గలదు. అటులయ్యు నిందలి జలము మధురముగనే యుండును. ఇది భగవన్మహిమ కాక వేరేమియని చెప్పనగును.

జగన్నాథక్షేత్ర పరిక్రమణము:— జగన్నాథక్షేత్రము నందలి దర్శనీయస్థానముల నన్నిటిని చూచినతరువాత, క్షేత్రమునకు ప్రదక్షిణము చేయవలయును. యాత్ర పూర్తిచేసుకొని మరలునప్పుడు మరల జగన్నాథస్వామిని దర్శించవలయును. మొదట నిచ్చటి వాతావరణము బాగుండెడిది కాదు. కాని నేడు ఆరోగ్యమునందుటకు చాలమంది ధనికులగు రోగులిటకు వచ్చుచుండిరి. ఇచట నన్నసత్రము, సంస్కృతపాఠశాల, గోశాల, అనాథాలయము, పోస్టాఫీసు, తంతికార్యాలయమును గలవు. ఇచ్చట బియ్యము నధికముగ నుపయోగింతురు. ఇచ్చటివారు 'ఉడియా' భాషను మాట్లాడుదురు. ఇది మనకు తెలియకున్నను పండాలు స్వచ్ఛముగు హిందీని మాట్లాడుదురు.

జగన్నాథక్షేత్ర మాహాత్మ్యము:— ఒకప్పుడు శౌనకాది ఋషులు భువియందతి పవిత్రమైయుండు క్షేత్రమాహాత్మ్యము నభివర్ణించుమని సూతుని ప్రార్థించిరి. అంత సూతు డిటుల చెప్పెను. ఉడీసాప్రాంతమున 10 యోజనముల పొడవును, 5 యోజనముల వెడల్పును గల్గియున్న పురుషోత్తమక్షేత్రమునందు నీలగిరిపర్వతమున శ్రీమహావిష్ణువు జగన్నాథరూపమున నివసించి యుండెను. యథాశాస్త్రము యాత్రచేసిన మనుజుడు పాప విముక్తు డగును.

జగన్నాథుని దారుమూర్తిని బ్రహ్మ ప్రతిష్ఠించెను. పురుషోత్తమక్షేత్ర యాత్ర చేసిన మనుజుడు జననమరణముల నొందడని 'పద్మపురాణము' చెప్పుచున్నది. ఈ క్షేత్రమున మృతినొందిన మనుజు లుత్తమగతుల నందుదురు. జగన్నాథుని ప్రసాదముతో పితృశ్రాద్ధము చేసిన పితృదేవతలు వైకుంఠమునకు పోవుదురు. దేవతలు జగన్నాథుని దర్శించుటకు నిత్యము యీ క్షేత్రమునకు వచ్చుచుందురు. అందుచేత నో మునులారా! పాపక్షయమునకు, పుణ్యవృద్ధికి మీరు జగన్నాథుని సందర్శించుడని సూతుడు మునులకు చెప్పెను.

ఈ క్షేత్రమును యాత్రాదృష్టితో సేవించిన పుణ్యము కలుగును కాని యితరదృష్టితో యీ దేశమును ప్రవేశించిన మరల నుపనయనాది సంస్కారములను జేసుకొనవలయును.

"తీర్థయాత్రాం వినా గచ్ఛే త్పునస్సంసార మర్హతి"

ఈ క్షేత్రమున పొగడవృక్షము లధికముగ కలవు. ఈ వృక్షముల మధ్య రాధాకృష్ణుల మందిర మతి మనోహరముగ

నున్నది. ఈదృశ్యమునుగాంచి యాత్రికులు ముగ్ధులై తన్మయత నొందుచుందురు.

## కోణార్కము

ఇది పూరీకి 18 మై. దూరమున ఉత్తరముగా కలదు. సాధారణముగ దీనిని 'కనారక్' అని పిలుచుచుందురు. ఇచటకు పోవుమార్గము మనోహరముగ నుండును. మార్గమున 'కుశభద్రా'నది కన్పించును. భోజనసామగ్రులు జగన్నాథమునుండి తీసుకొనివెళ్ళవలసియుండును. మాఘశుద్ధ సప్తమి కిచ్చట గొప్ప యుత్సవము జరుగును. ఇచ్చట 'చంద్రభాగ' యను చిన్ననది కలదు. యాత్రికు లిందు స్నానము చేయుదురు. నృసింహదేవు డీ మందిరమును 'ఉడీసా' రాష్ట్రపు పండ్రెండు సంవత్సరముల యాదాయమును వెచ్చించి క్రీ.శ. 1237–1282 మధ్య కట్టించెను. వర్తమానమం దీ మందిరము జీర్ణావస్థయందున్నది. ప్రస్తుత మీ మందిర శిఖరము 124 అ. ఎత్తు గలిగియున్నది. మందిరకుడ్యములు మనోహరమగుశిల్పములతో శోభిల్లుచున్నవి. జగన్నాథమందిరమున సింహద్వారసమీపమున గల పదునారు కోణముల యరుణస్తంభ మిచ్చటిదే. ఇటనుండియే తెచ్చి దాని నట నుంచిరి. ఈ దేవాలయమంతయు రాతితో నిర్మింపబడెను. ఒకరాతికి నొకరాతికి మధ్య యినుముతో నతుకబడెను.



సూర్యమందిరము (మరొకదృశ్యము)

ఇక్కడ నల్లరాతితో కట్టబడిన కోణార్క దేవాలయము కలదు. ఇది ఇండియాలోని మహోగ్రశిల్పములలో నొకటి. ఇది సూర్యునిపేరుతో నిర్మించబడిన ఆలయము. పూర్వమిది గొప్ప యాలయముగ నుండియుండవచ్చును. ఇప్పుడు శిథిలములు మాత్ర మనేకము లున్నవి. రథసప్తమినాడు ఇక్కడి సూర్య విగ్రహముగుండా సూర్యకాంతి ప్రసరించును. దీని గోడలనిండ సహజముగ చిత్రింపబడిన నిలువెత్తు గుఱ్ఱములు, సింహములు. సింహాసనములు, యుద్ధపు దృశ్యములు అనేకములు కలవు. ఈ ఆలయము 12 చక్రములుగల సూర్యుని రథయాకారమువలె నిర్మింపబడెను. (చూ. సూర్యమందిరం 423 పేజి)

## సాక్షిగోపాలము

జగన్నాథమునకు సాక్షిగోపాలము 12 మైళ్లు. జగన్నాథమునుండి తిరిగి వచ్చునపుడు ఈ క్షేత్రము వచ్చును. ఇచట రాయబహదూర్ విశ్వేశ్వరలాల్ హాలవాసియా ధర్మశాల కలదు. యాత్రికులకు సర్వసౌఖ్యము లిందు గలవు. స్టేషనుకు సుమారొక మైలుదూరమున మందిరము కలదు. ఈ ప్రాంతమంతయు పోగడవృక్షములతో నతిరమణీయముగ నుండును. మందిరమునకు సమీపమున నిర్మలపయఃపూరితమగు చిన్న సరస్సు కలదు. ఈ ప్రశాంతప్రదేశము గాంచినంతనే, యాత్రికుని మార్గాయాస మంతయు నంతరించును. మందిరమున నతి మనోహరమగు శ్రీకృష్ణుని విగ్రహము కలదు. యాత్రికు లీ శ్రీకృష్ణుని తమ యాత్రకు సాక్షిరూపునిగా దలంచి భక్తితో శక్తికొలది పూజింతురు. యాత్రికుడు తా జేసిన యాత్రనంతయు శ్రీకృష్ణునికి

నివేదించవలయును. తన యాత్రకు యీ దైవమె సాక్షి గాన యాత్రికులు ముఖ్యముగా యీ సాక్షిగోపాలుని దర్శించకున్న తమయాత్రకు సాఫల్యములేదు. ఇందునుగూర్చి యొక కథ గలదు.

పూర్వమొక వృద్ధుడు, నొకయువకుడు "బృందావన యాత్రకు కాలినడకను ప్రయాణమైరి. బృందావనమును చేరి యాత్ర నెటులో పూర్తిచేసుకొని యింటికి వెడలుదమనుకొను నంతలో వృద్ధునకు జ్వరమువచ్చెను. ఆ జ్వరముతో నతడు బాధ పడుచుండ యువకు డాతని కనేక సపర్యలు గావించుచుండెను. కొంతకాలమునకు వృద్ధుడు స్వస్థుడై బృందావనమున శ్రీకృష్ణుని సమ్ముఖమున "నే నీ యువకునకు నా కూతునిచ్చి వివాహము గావింతు"నని శపథము చేసెను.

ఇంటికి చేరినమీాదట వృద్ధు డాయువకుడు దరిద్రుడని దలచి వానికి తన కూతునీయ నిరాకరించెను. యువకు డందులకై పంచాయితీ నేర్పాటుచేయించెను. న్యాయముచెప్పు పెద్దమనుష్యులా యువకునిగాంచి 'సోదరా! యీావృద్ధు డెవరియెదుట నీకు కన్య నొసంగెదనని ప్రతినజేసెనో వారిని సాక్ష్యముగా దీసుకువచ్చిన నీకు వారి కన్య నిప్పించి వివాహము చేయించగలము. లేకున్న నీమాట చెల్లుట కాధారమేమియు గాన్పించుటలేదు' అని చెప్పిరి.

అప్పు డాయువకుడు భగవంతునిచే సాక్ష్యము నిప్పించు టకు నిశ్చయించి మరల బృందావనమునకు వెడలి శ్రీకృష్ణుని సాక్ష్యముచెప్పుటకు రమ్మనియు నీవురాకున్న నేను నిరశనవ్రతము చేసి ప్రాణములు వీడుదునని ప్రతినబట్టెను. అటు లాత డశనవ్రత ముతో నొక సప్తాహము గడిపెను. అంత భక్తవత్సలుడగు భగ

వంతుడాతనికి స్వప్నమున సాక్షాత్కరించి నేను నీవెంట నుత్కల దేశమునకు వచ్చెదను. కాని నీవెన్నడును వెనుకకు తిరిగి చూడకుము. అటులజూచిన నేనచటనే నిలబడిపోదును.

మరుసటిదినము యువకుడింటికి బయలు వెడలెను. శ్యామసుందరుడుకూడ నాతనివెంట బయలుదేరెను. యువకునకు భగవత్పాద మంజీరధ్వని మాత్రము వినిపించుచుండెను. సముద్రతీరమును జేరగనే యామంజీరధ్వని నిలచిపోయెను. భగవంతుడు నెనుదిరిగి పోవుచుండెనేమోయని యువకుడు వెనుదిరిగి చూచెను. భగవంతుడాతనికి మర్త్యరూపమున దర్శనమిచ్చి యంతర్ధానమయ్యెను. అచ్చటనే సాక్షిగోపాలుడు స్థాపించబడెను. అప్పటి నుండియు జగన్నాథుని దర్శించ నేతెంచు యాత్రికులు తమ యాత్రకు సాక్షీరూపుడగు సాక్షిగోపాలుని దర్శించుటకు వచ్చుచుండిరి.

## తప్తకుండము

సాక్షిగోపాలము నుండి ఖురదారోడ్డు చేరవలయును. ఖురదారోడ్ స్టేషనుకు 6 మై. దూరమున 'బాఘీదూర్' గ్రామమున తప్తకుండము గలదు. ఇది యొక కూపము. ఇందలి జల మెల్లపుడు నుష్ణముగనుండి పొంగుచుండును. ఈ కూప సమీపమున 'హాటకేశ్వరమహాదేవుని' మందిరము కలదు. ఈ మందిరమున మకరసంక్రాంతిసమయమున నొక నెలరోజులు ఉత్సవము జరుగును. యాత్రికులు తప్తకుండమందలి యుదకమును శిరమున చల్లుకొని, హాటకేశ్వరుని దర్శింతురు. ఈ గ్రామమున నన్ని సౌకర్యములు గలవు.

## చిలకసముద్రము

ఖురదారోడ్ నుండి ఛత్రపురంలో దిగవలయును. ఛత్రపుర సమీపమున యీ సరస్సు చిలకసముద్రమనుపేర బరగుచున్నది. ఈ సముద్రతీరమునుండియే రైలుమార్గము పోయినది. ఒక వైపు నయనానందకరములైన ఉత్తుంగపర్వతములు, మరియొక వైపు చల్లని మలయమారుతము వీచుచు నేత్రపర్వమొనర్చు చిలకసముద్రము ప్రయాణీకుల హృదయమునకు మిక్కిలి సంతసమును చేకూర్చును. ఇచట ప్రకృతిదృశ్యము చూచితీరవలెను. ఇక్కడినుండి లాంచిమీదుగ జగన్నాథము వెళ్ళవచ్చును. రైలుమార్గముకన్న యిది దగ్గర.

## బరహాంపూరు

ఛత్రపూరునుండి బరహాంపూరులో దిగవలయును. ఇది చక్కని గ్రామము. ఇది పట్టుపరిశ్రమకు కేంద్రము. ఇక్కడ పట్టువ్యాపారము విశేషముగ జరుగును. విలువైన పట్టువస్త్రములు తయారుచేసి వివిధప్రాంతములకు రవాణా చేయబడును.

## మహేంద్రాచలము

బరహాంపూరునుండి సోంపేటస్టేషనులో దిగవలయును. ఇటకు 20 మైళ్లు. చక్కనిమార్గము కలదు. బస్సులు, బండ్లు కలవు. సోంపేటకు సమీపమున 'మహేంద్రతనయ' యను నది కలదు. స్నానమునకు చక్కని వసతి కలదు.

మహేంద్రము;— ఇచ్చటకు సముద్రము సుమారు 10 మైళ్ళు. ఈ పర్వతప్రశస్తి భారత రామాయణాది గ్రంథములలో

మిక్కిలి యభివర్ణితము. ఈ పర్వతమున పాండవులు కొంత కాలము వసించిరని కంవదంతి. ఇచట భీమ, యుధిష్ఠిర, కుంతీ ఆలయములు గలవు. 10, 11 వ శతాబ్దములనాటి శాసనములు గంగవంశమునకు సంబంధించిన విశేషములను తెలుపుచున్నవి.



మాచ్‌ఖండ్‌లో పర్వతముపానుకొనియున్న వసతిగృహము (చూ. 446 పేజి)
(పాలకొల్లు, మునిసిపల్ హైస్కూలువారి సౌజన్యముతో)

ఈ పర్వతయాత్ర శివరాత్రికి జరుగును. ఇతరదినములలో నెక్కువగ నెవరును పోరు. శివరాత్రికి ముందు యీ పర్వత పరిసర గ్రామములు ప్రభుత్వము బాగుచేయించును. వేలాది యాత్రికులు వత్తురు.

## గోకర్ణేశ్వరమందిరము

500 అడుగుల యెత్తుగల మహేంద్రపర్వత శిఖరమున నీ మందిరము కలదు. ఇది పూర్వము కళింగదేశ భూభాగమునకు చెందినది. కళింగదేశము గాంగులు పాలించుటకు పూర్వమే యీ

మందిరము నిర్మింపబడెను. ఇచట కొన్ని శిలాశాసనములు గలవు. వీనినిబట్టి గంగవంశమునకు జెందిన కామార్ణవుడును, అతని సోదరుడును గలిసి గోకర్ణేశ్వరు నారాధించి, ఆతని వరప్రసాదమున నాటి కళింగ పాలకుడును, మహారాష్ట్రవంశీయుడు నగు శబరాదిత్యునివధించి, కళింగదేశమునకు రాజులైరి. నాటినుండియు గోకర్ణేశ్వరమహాదేవుడు గాంగులకు కులదేవతయై యుండెను. అందుచేతనే గాంగుల శిలాశాసనములలో గోకర్ణేశ్వరనామము కాన్పించును. ఈ మందిరమున చాలశాసనములు కలవు. అందొక దానియందు కుళోత్తుంగచోళదేవుని జయవర్ణన గలదు. భక్తులీ శిఖరము నధిష్టించి గోకర్ణేశ్వరుని ఆరాధింతురు.

## ముఖలింగము (మధుకేశ్వర మందిరము)

ఇచటకు శ్రీకాకుళమునుండి చక్కనిమార్గము కలదు. ఇది ముఖలింగగ్రామమున వంశధారనదీతీరమున గలదు. ప్రసిద్ధ శివక్షేత్రము. ఈ లింగము మధుకవనమున లభించుటచే మధుకేశ్వరమని యేర్పడెను. గాంగ వంశజుడగు కామార్ణవు డీ మందిరమును నిర్మించెను. ఈ యీశ్వరుని మహాత్మ్యము పురాణములం దభివర్ణితము. ఆలయమున నొక శిలాశాసనము కలదు. దానినిబట్టి యీ మందిరము కళింగదేశ పట్టమహిషి యధీనమున నున్నటుల తెలియుచున్నది. ఈ ముఖలింగగ్రామము దక్షిణకాశి యని ప్రసిద్ధి. కాశీయందువలె నిచటకుకూడ యాత్రికులు వత్తురు.

## కాశీబుగ్గ

సోంపేటనుండి పలాస్ స్టేషనులో దిగవలయును. ఈగ్రామమున నొక తటాకము కలదు. దీనిని 'కాశీబుగ్గ' యందురు.

ఇందలి జలము సర్వకాలములందు స్వచ్ఛముగ నుండును. తొలైకాదశి, వైకుంఠఏకాదశి, శివరాత్రి మొదలైన పర్వము లలో చుట్టుప్రక్క గ్రామాలనుండి యీ తటాకమున స్నానా ర్థము యాత్రికు లరుదెంతురు. పర్వపురోజులలో కాశీనుండి గంగ యిందులోనికి వచ్చునని జనశ్రుతి కలదు. ఈ తటాకము మిక్కిలి రమణీయముగ నుండును.

## డుడుమా జలపాతము
### (మాచ్ ఖండ్)


* డుడుమాజలపాతం

బరహాంపూరునుండి నౌపడా (జం) లో మారి, గుణుపురములో దిగవలయును.

గుణుపురమునుండి యీ ప్రాంతమునకు బస్సుసర్వీసు కలదు. విశాఖపట్నము, విజయ నగరము, జయపురముల నుండియు బస్సులు వచ్చును. మార్గదృశ్యము మిక్కిలి మనో హరముగ నుండును. ఇచట ఆంధ్ర, ఒరిస్సాప్రభుత్వములు కలసి ఒక పెద్ద విద్యుచ్ఛక్తిప్రాజెక్టును నిర్మించుచున్నారు. దీని ఎత్తు 540 అడుగులు. పూర్వము నిర్మానుష్యమైన యీ ప్రాంతము నేడు చిన్న బస్తీ అయినది. ఈప్రాంతమందలి ప్రకృతిరమణీయము చూడతగినది. ఈ మాచ్ ఖండ్ స్కీమున కాంధ్రప్రభుత్వము, ఒరిస్సాప్రభుత్వము కొన్నిలక్షల రూపాయలు యిచ్చినవి. ఇంకను కొన్నిలక్షలు ఖర్చుకావలసియున్నది. 1958 సంగ్గనాటికి పూర్తి కావచ్చును. మాచ్ ఖండ్ కి సుమారు 200 మై. లోపునగల సమీప

ప్రాంతముల భూగర్భశాస్త్రజ్ఞులు పరిశోధనగావించి బంగారము, మైకా, బొగ్గు, ఇనుము గనులున్నవని కనిపెట్టి, వానికి ప్రతి



మాచ్‌ఖండ్ డాము

కూలముగనున్న ప్రకృతిని జయించి ప్రయోజనమును పొంద దలచుచుండిరి.

## మిన్నాజోలె



* మిన్నాజోలె పర్వత దృశ్యము

గుణపురమునుండి గుడారికి బస్సు, అక్కడ నుండి బండిమీాద యీా స్థానమునకు చేరుకొనవలయును.

ఇది కోరాపుట్టిజిల్లా లోనిది. ఇక్కడ 3 చిన్న సెలయేళ్లు కలయుచున్నవి. స్వర్ణముఖి, బావల్‌ధువా, సాలకానియా అని వాని పేర్లు. ఇక్కడ ఊరేమియు లేదు. ప్రతి శివరాత్రికి పెద్ద యుత్సవము జరుగును. 3, 4, వేల ప్రజ

లరుదెంచుదురు. తిరునాళ్ల సమయమున ఆకుల పందిరి క్రింద యాత్రికులు తలదాచుకొందురు. ఇక్కడి ప్రవాహ వేగమునకు కొండరాళ్లు అరిగి శివలింగములుగ నేర్పడినవి. అందుచే నిది పుణ్య క్షేత్రమయినది.



* ఇంటికి మరలిన సంతపడుచు (కోరాపుట్టిలోని స్త్రీలు)

ఇక్కడ ప్రతిఆదివారము పెద్ద సంత జరుగును. చాలదూరము నుండి ఓఢ్రులు వత్తురు. వారి ఆచార వ్యవహారములు, ఆకారములు, అలవాట్లు మనకు వింతను గొల్పుచుండును. ఇక్కడ కోయ సంతతికి చెందిన అనాగరికులను చూచిన ఆశ్చర్యము కలుగును. వారి యాభరణములు, వస్త్రధారణ చూడ ముచ్చట కలుగుచుండును. వీరు చాల నిష్కల్మషులు, సానుభూతిపరులు.

## శ్రీ కూర్మము

కలౌ కూర్మపురీ రమ్యాం యే గచ్ఛన్తి నరోత్తమాః ।
కులకోటిపతై ర్యుక్తా స్తే గచ్ఛన్తి హరేః పదమ్॥

— బ్రహ్మాండపురాణము.

నౌపడానుండి చికాకోల్ రోడ్ స్టేషన్‌లో దిగవలయును. శ్రీకూర్మము ఇటకు 10 మైళ్లు. బస్సులు కలవు.

కూర్మక్షేత్రము పురాణప్రసిద్ధము. ఆదికూర్మక్షేత్రమని ప్రసిద్ధి. స్వయ ముద్భవము. కాశీక్షేత్రమువలె నీకూర్మక్షేత్రము ప్రసిద్ధమైనదని పురాణములు వర్ణించినవి. ఈక్షేత్రమును గురించి, పద్మమున ౩౦ అధ్యా. బ్రహ్మపురాణము, ౩అధ్యా. పాంచరాత్ర సంహితయు నభివర్ణించినవి — పూర్వము శ్వేతచక్రవర్తి యీస్థానమును పాలించినట్లు పురాణమున గలదు. ఆరాజుకు కూర్మనాథు డిష్టదైవము.

ఇచట వంశధారా సాగర సంగమము ప్రధానము. ఈ క్షేత్రము వంశధారా, లాంగలీనదులమధ్య పంచక్రోశాత్మకముగ కలదు. ఈ క్షేత్రమున కుత్తరమున కూర్మశైలము కలదు. ఈ క్షేత్రమునకు నలువైపుల, భైరవేశ్వరుడు, కోటీశ్వరుడు, హాటకేశ్వరుడు మొదలైన దేవతలు, నక్రతీర్థము, చక్రతీర్థము, దూర్వాసతీర్థము, అష్టతీర్థము మొదలైన తీర్థములు, సుధాకుండము, నారాచకుండము, శ్వేతకుండము మొదలైన కుండములు గలవు. వీనికన్నిటికి ప్రసిద్ధములైన ఆఖ్యాయికలు గలవు.

ఈ గ్రామానికి కుత్తరమునగల డోలామంటపమున ఫాల్గుణ శు ౧౧ డోలాయాత్ర జరుగును. ఈ మంటపము తిలోత్తమ వంశీకులు కట్టించిరి. ఇంకను చైత్ర, వైశాఖ, జ్యేష్ఠ మాసములందును కూర్మజయంతి, నరసింహ జయంతులకు పెద్ద యుత్సవములు జరుగును. వైశాఖ శు ౧౧ కల్యాణోత్సవము జరుగును.

యాత్రికులు కూర్మశైల ప్రదక్షిణము చేయుదురు. ఈ పరిక్రమ యందంకను కుండములు, తీర్థములు గలవు. చాల వరకు భూగర్భమున జీర్ణించి నామమాత్రావశిష్టములైనవి.

## అరసవిల్లి

"మంగళం పద్మినీభర్త్రే మంగళం లోకబంధవే,
మంగళం పాపసంహర్త్రే మంగళం కర్మసాక్షిణే."

శ్రీకాకుళమునకు సమీపమున గల ప్రసిద్ధ సూర్య క్షేత్రము. ఇది పవిత్రమైన నాగావళీతీరమునగలదు. ఇచట భాస్కరుడు ప్రత్యక్ష దైవము. అరోగ్యహారి, హార్షవల్లి, అరసవల్లి (వికృతి) అరసవెల్లి, అరసిల్లి అను నామములతో నొప్పుచున్నది. కొలది దినము లిచట నియమపూర్వకముగ నరుణము పారాయణము చేసిన దుస్సాధ్యములగు రోగములు పటాపంచలగును. భారత దేశమున సూర్యక్షేత్రములు చాల తక్కువ. ఇది ఇంద్రప్రతిష్ఠ. ఐరావత సమారూఢుడైన ఇంద్రప్రతిమ యిచట కలదు. ఇది బలరామక్షేత్రము. బలరామక్షేత్ర మాహాత్మ్యమున యీక్షేత్ర మహిమ విపులముగ గలదు. చాలదేశములనుండి యాత్రికు లీ సూర్యభగవానుని అర్చించుట కరుదెంతురు. గంగానదివలె నాగావళీనది చాల పరమపవిత్రమైనది. వేయి సంవత్సరములకు మున్నె యీక్షేత్రము వెలసినట్లు శాసనములు గలవు. కళింగరాష్ట్రమును బాలించిన గంగాన్వయసంభవభూపతులలో నొకడైన అనంతదేవ వర్మ (క్రీ. శ. 1100, 1200) కాలమునాటి శాసనము లిందు గలవు. 'ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్' అను సూక్తి వలన యాత్రికులు తప్పక భాస్కరక్షేత్రదర్శనము చేయవలయును.

## విజయనగరము

చికాకోల్‌రోడ్‌నుండి, విజయనగరము (౫౦), చేరవలయును. ఈ మార్గము ప్రకృతిరమణీయము.

ఇది పూసపాటివారి మహారాజుల పరిపాలనలోగల పట్టణము. కందకముతోకూడిన చక్కనికోటయు, లోపల రాజ భవనములు గలవు. కోటచూడతగినది. పూసపాటివంశము ధర్మ మూర్తులు. నేటికిని బహువిధములయిన ధర్మములు నిత్యము జరుగుచుండును. ఈ సంస్థానముతరఫున, ఇంగ్లీషు, సంస్కృత, సంగీతకాలేజీలు గలవు. మరియు ననేకపాఠశాలలు గలవు. ఇవ న్నియు సంస్థానమే పోషించును. ఈ పట్టణము ప్రాచీన నగర వైభవమునకు నిదర్శనముగ నుండును. నేటికిని అన్నివిద్యలలో ప్రచండులైన పండితులు గలరు. అన్నివసతులు గలవు.

## రామతీర్థము

ఇది విజయనగరమునకు షుమారు 8 మైళ్లు. ఇచట బౌద్ధ స్తూపము లనేకములు గలవు. భారతభూమిలో బౌద్ధమతవ్యాప్తికి చిహ్నములుగా, నిట్టి స్తూపము లనేకస్థానములందు గలవు. ఇక్కడ కొన్ని ఆలయములు గలవు. శివరాత్రికి యిచట పెద్ద యుత్సవము జరుగును.

## బొబ్బిలి

విజయనగరమునుండి రైలు, బస్సులు కలవు. మడమ త్రిప్పని యోధులకు, జంకుగొంకులు లేకుండగ వీరవిహారము గావించిన వీరులకు ఇది పుట్టినిల్లు. విజయనగరరాజులకు, బొబ్బిలి వారికి నాడు జరిగిన రణరంగమందలి చిహ్నములు నేటికిని గాన నగును. నాటి వీరుల విజయచిహ్నములైన విజయ స్తంభములు పూర్వచరిత్రను స్మృతిపథమునకు తెచ్చును. నాటినుండియే యిది 'వీరబొబ్బిలి'గా సార్థకమయినది.

# సింహాచలము

విజయనగరమునుండి సింహాచలము స్టేషనులో దిగవల యును. స్టేషనుకు క్షేత్రము ౩ మైళ్లు. ఎద్దుబండ్లుగలవు. విశాఖ పట్నమునుండి బస్సులుకూడ కలవు.

ఇక్కడ పర్వతమున వరాహలక్ష్మీనృసింహస్వామి యాల యము కలదు. కొండ నెక్కుటకు మెట్లు గలవు. ఈ పర్వతము సుమారు 850 అ. ఎత్తుగలదు. ఈ కొండపైన పూర్వమొక కోటకలదు. దానిచిహ్నములు నేడు కానవగును. ఇది విజయనగర సంస్థానమునకు చెందినది.



జాతి రథము

పర్వతమెక్కుటకు ప్రారంభించినది మొదలు క్రమముగ గంగాధర, గోదావరిధార, కూర్మధార, మాధవధార, ఆకాశ ధార మొదలగు ధారలు కలవు. ఈ జలధార లెటనుండి వచ్చు

నదియు తెలియదు. నిరంతరము ప్రవహించుచుండును. స్నాన మునకనుకూలముగ నుండును. పిమ్మట ఆంజనేయస్వామి యాలయము అంజనేయధార కలదు. పిమ్మట నృసింహస్వామి ఆలయ దర్శనము. వైశాఖ శు. 3 రోజు. స్వామి నిజరూపదర్శనము. మిగిలిన రోజులలో స్వామికి దేహమంతయు గంధము పూయుదురు. నిత్యముపూసిన గంధమును నిజరూపదర్శనము రోజున తీసివేసి వెంటనే గంధముచే స్వామిని అలంకరింతురు. పూర్వము హిరణ్యకశిపుని వధానంతరము స్వామి శాంతికయి మంచిగంధము దేహమున పూసిరట.

పూర్వము హిరణ్యకశిపుని వధానంతరము ప్రహ్లాదునిచే నీ స్వామి ప్రతిష్ఠింపబడినట్లు చెప్పుదురు. ఇందు ప్రధానదైవము విష్ణువు. ఈ క్షేత్రమును రక్షించువాడీశ్వరుడు. ఆంజనేయ, కాలభైరవులు ద్వారపాలకులు. శైవ వైష్ణవములకు పరస్పరమెంతమాత్రము భేదములేదని నిరూపించునది యీ క్షేత్రము. పూర్వమొకప్పుడు పురూరవచక్రవర్తి విహారమునలుపుచు యీ పర్వతమున స్వామిని దర్శించి, యీ యాలయము నిర్మించెనట. నవనారసింహాలలో నిది యొకటి యని జనశృతి గలదు. ఈ పర్వత పరిసరమంతయు ప్రాకృతిక దృశ్యములు మనోహరముగ నుండును. లక్ష్మీనృసింహస్వామికి యాత్రికులు పుట్టుకొప్పులు విశేషముగ సమర్పించుచుందురు. ఇంకను, శ్రీ త్రిపురాంతకేశ్వర, సీతారామాలయములు కలవు. ఈ పర్వతమున అనాస, పనస ఫలము లధికముగ పండును. ఈ క్షేత్రమహాత్మ్యము పురాణములు మిక్కిలి వర్ణించినవి.





* ఓడరేవు

# విశాఖపట్నము

సింహాచలమునుండి వాల్తేరు(జం) చేరవలయును. ఇది చక్కని పట్టణము. ఇది పూర్వము చోళరాజుల రాజధాని. ఈ పట్టణము సముద్రతీరమున గలదు. పూర్వమిచట విశాఖేశ్వర దేవాలయ ముండెడిదట. ప్రస్తుతము కాల గర్భమున జీర్ణించిపోయినది. ఈ స్వామినిబట్టియే యీ పురమున కీ నామము కలిగెనందురు.

ఇచట చూడతగినవి:— అగ్రికల్చరల్ డైరీ ఫారము, (ఇచట పశుపోషణ ఆదర్శము. తప్పక చూడతగినది.) జంతుప్రదర్శనశాల, దీనికి సంబంధించిన ఇంజనీరు, వ్యవసాయ, చికిత్సా శాఖలు, ఆంధ్రవిశ్వవిద్యాలయము, విమానాశ్రయము, వివిధ కళాశాలలు, ప్రేమసమాజము, రామకృష్ణమఠము మొదలగునవి తప్పక చూచితీరవలయును.

హార్బరు:— ఇది సహజసిద్ధముగా చాల లోతుగలిగి మూడునైపులను కొండలను గలిగియుండుటచే పెద్దపెద్ద ఓడలు సైతము ఒడ్డునకు రాగలుగుటకు వీలుగానున్నది. ఇండియాలోని ఉత్తమ రేవు కేంద్రములో నిదియొకటి. ఇచటినుండియే బర్మా మొదలగు విదేశములకు ఓడమీద వెళ్ళుదురు. ఇచట సింధియా స్టీం నావిగేషన్ కంపెనీ కలదు. ఇది ఓడలను తయారుచేయును. ఇండియా ప్రభుత్వముకూడ ఆర్థికముగా యీ కంపెనీకి కొంత ద్రవ్యసహాయముచేయుచున్నది. ప్రస్తుతమిప్పుడు దీనిలో రెండు

మూడు ఓడలు ఒకేసారి తయారుచేయుటకు వీలగునంత బ్రహ్మాండముగా పునర్నిర్మించబడినది. 'జలఉష, జలపద్మ' మొదలగు ఓడలు ఇచ్చట నిర్మింపబడినవే.



ఆంధ్ర విశ్వవిద్యాలయము – వాల్తేరు.
(పాలకొల్లు మునిసిపల్ హైస్కూలువారి సౌజన్యముతో)

ఇచ్చట వేసవికాలములో సమశీతోష్ణముగా నుండును. అందువలననే ఆంధ్రప్రభుత్వమువారు దీనిని 'వేసవి రాజధానిగా' యెన్నుకొనినారు. గవర్నరు వేసవికాలమున మకాముచేయుటకు ఇక్కడ ప్రభుత్వపు అతిథిభవనముకూడా కలదు.

## భీమునిపట్నము

ఇచటకు విశాఖపట్నమునుండి బస్సులు గలవు. ఇచట గోస్తనీనదీ సాగరసంగమ స్థలము. ఇక్కడ పర్వతమున నృసింహస్వామి యాలయము కలదు. ఇది పాండుపుత్రుడగు భీమునిచే

ప్రతిష్ఠితమని చెప్పుదురు. ఈ కారణమునుబట్టియే నీ గ్రామము నకు భీమునిపట్నమని సార్థకత కలిగెను. ఈ పురమున ప్రాచీన వైభవములు కాననగును. పూర్వమిది విదేశములకు వ్యాపార కేంద్రముగా నుండెడిది.

## అన్నవరము

వాల్తేరునుండి అన్నవరము స్టేషనుకు చేరవలయును. క్షేత్రము స్టేషనుకు సుమారు $1\frac{1}{2}$ మైళ్లు. బండ్లు కలవు. ఇట శ్రీ సత్యనారాయణస్వామి ప్రధానదైవము. ఈ స్వామి కొండ పైన గలదు. కొండ ఎక్కుటకు చక్కని మెట్లు కలవు. కొండకు



శ్రీ సత్యనారాయణస్వామి వ్రతము ఆచరించుట
(పాలకొల్లు మునిసిపల్ హైస్కూలువారి సౌజన్యముతో)

క్రింద పైనకూడ చక్కని వసతులు గలవు. నిత్యము యాత్రికులు పలువిధములైన మ్రొక్కుబడులు చెల్లించుకొనుచుందురు.

నిత్యము అనేకులు సత్యనారాయణ వ్రతములు జరుపుచుందురు. రు. 5 లు యిచ్చిన వ్రతమునకు కావలసిన పరికరములన్నియు నిచ్చి, వ్రతముకూడ చేయించుదురు. ఉపనయనములు, వివాహములు జరుగుచుండును. వైశాఖ శు ౧౧ కల్యాణోత్సవము జరుగును. తిరుపతివలె నీ క్షేత్రముకూడ నిత్యము యాత్రికులచే సమ్మర్దముగ నుండును. దేవస్థానము తరఫున వేద, సంస్కృత పాఠశాలలు కలవు స్వామికి మంచి ఆదాయము వచ్చును.

## పిఠాపురము (పాదగయ)

అన్నవరమునకు 9 మైళ్ళ దూరమున మదరాసు పోవు లైనులో పిఠాపురము కలదు. ఇది స్టేషను. అన్నవరమునుండి బస్సుమీదకూడా పోవచ్చును. స్టేషను నానుకొనియే గ్రామము కలదు. యాత్రికులు వసించుటకు సత్రము కలదు. ఇచట నన్ని వస్తువులు లభించును.

పిఠాపురము:— దీనికి 'పీఠికాపురము, పీఠపురము, పీఠాపురము, పిఠాపురము' అని నామములు కలవు. 'పీఠాయాం పురుహూతికా' అని 'పురుహూతికాశక్తి'కి పీఠమగుటచే యీ పేరు లేర్పడినవి. మరియు గయాసురుని పాదస్థానమగుటచే పాదగయయనియు, పితృదేవతలకు ప్రీతికరమగుటచే పితృపురియనియు కూడ ప్రసిద్ధము. పిఠాపురమును గూర్చి మహావైభవముగ 'భీమఖండము'న వర్ణింపబడెను.

కుక్కుటేశ్వరస్వామి:— ఇచ్చట కుక్కుటేశ్వరస్వామి, పురుహూతికాదేవియు గల యాలయము గలదు. పురుహూతిక యష్టాదశపీఠములలో నొకటి. ఇచ్చట శివలింగము కుక్కుటాకృతి

(కోడి) కలిగియుండుటచేత యీస్వామి కీపేరు కలిగెను. లింగమునకు వెనుకభాగమున కుక్కుటాకృతి స్పష్టముగ కానవచ్చును. స్వామి శిరమున గంగయు, పార్థప్రహారణమును గలవు. ఈ స్వామి నాసిక (ముక్కు) నుండి యెల్లపుడు జలము స్రవించుచుండును. ఇది యొక గొప్ప నిదర్శనము. చూడదగినది.

పూర్వమొకప్పుడు 'ఏలామహాముని' ఏలానదిని (ఏలేరు) తీసుకొనివచ్చుటలో కోడికూతవేళను హద్దుచేసుకొని యుండ, యావేళ యైనదని వెల్లడించుటకై ఈశ్వరు డిచ్చట కోడియై కూసెనని యైతిహ్య మొకటి కలదు. (ఏలామాహాత్మ్యము)



ఉండవల్లిలోని చిత్రములు (చూ. 472 పేజి)
(T. H. న్యూ్కాలు, తెనాలివారి సౌజన్యముతో)

పాదగయ:— గయాసురుని పాదస్థానమని ఈ తీర్థమునకు పేరు. గయాసురుని శిరస్థానము 'శిరోగయ' అని, పాదస్థానము 'పాదగయ' యని, నాభిస్థానము 'నాభిగయ' (జాజిపూరు చూ. వైతరణి) అని వ్యవహారము. ఆలయమునకు వెనుక శ్రీ విష్ణుపాదము కలదు. ఇచ్చట పితృదేవతల తృప్తికై యాత్రికులు పిండప్రదానముచేసి పుష్కరిణీకుండమున వేయుదురు.

## చామర్లకోట (సామల్‌కోట)

పిఠాపురమునుండి చామర్లకోట(జం)లో దిగవలయును. ఇక్కడ కాకినాడపోవుటకు మారవలయును. ఇది మదరాసుపోవు రైనులో గలదు. ఇచట యాత్రికుల కన్నివస్తువులు లభించును. సత్రముకలదు. ఇది మంచివ్యాపార కేంద్రము. ఇచట పంచదార ఫ్యాక్టరీగలదు. చూడతగినది. ఇచటను, ఈ పరిసరములందును ముఖ్యముగ చెఱకుపండును. ఈస్థానము మనోహరమైనది. మరిడి మహాలక్ష్మి, నూకాలమ్మయు గ్రామదేవతలు.

## భీమవరం (కుమార భీమేశ్వరం)

కుమారభీమేశ్వరాలయము:— చామలకోట స్టేషనుకు భీమేశ్వర మందిరశిఖరము గోచరించుచుండును. స్టేషనుకు దక్షిణ ముగ 3 ఫర్లాంగులదూరమునం దీయాలయము గలదు. క్రి. శ. 10 వ శతాబ్దమున చాళుక్యభీముఁ డీదేవాలయమును గట్టించెను. ఆతఁడు 108 యుద్ధములుజేసెను. దానికిఁ బ్రాయశ్చిత్తముగ 108 శివాలయములను గట్టించెను. వానికి 108 అగ్రహారముల నొసంగెను. ప్రస్తుత భీమేశ్వరునకుఁగూడ నాతఁ డిటనొక యగ్ర హారమును గట్టించి యిచ్చియుండెను. దానిపేరు భీమవరము. పూర్వమిది చాళుక్యభీమవరమని ప్రసిద్ధిగాంచి యుండెను. వీర భద్రారెడ్డి శ్రీనాథుని కాశీఖండమును గృతిగ నిమ్మని కోరుచు

"... ద్రాక్షారామ చళుక్యభీమవర గంధర్వా ప్సరోభామినీ..."

యని యీభీమవరమునుగూర్చి ప్రసంగించియుండెను. కొంత కాలమున కీభీమవరగ్రామము కాలగర్భమున లీనమైపోయెను,

అనంతరము పెద్దాపురపురాజుల పరిపాలనాసమయమునందిచ్చట నొక శ్యామలాంబికాలయమును, ఒక కోటయు కట్టబడెను. శ్యామలాంబికపేర నీకోటకు శ్యామలకోటయని పేరువచ్చెను. అదియే మార్పుచెంది నేడు చామర్లకోట యయ్యెను. ఆకోట శిథిలములు నేడును సూక్ష్మదృష్టితో పరిశీలించిన నిచ్చట గాన వచ్చును. కుమార భీమేశ్వరాలయము పంచారామములలో నొకటి (చూ. పంచారామములు — పరిశిష్టఖండము) తారకాసురుని కంఠమందలి అమృతలింగపంచశకలములందిది యొకటి. దీనికి చుట్టును సుమారు 18 అ. యెత్తుగల ప్రాకారముగలదు. ఈ ప్రాకారమునకు నలుమూలల 4 గోపురములు కలవు. యాత్రికు లుత్తర ద్వారమునుండి తూర్పుద్వారమునకు వచ్చిన నచ్చట నొక కోనేరు గాన్పించును. ఈకోనేటియందు స్నాన తర్పణాదిక మునుగావించి యాత్రికులు స్వామిని దర్శింపనేగుదురు. ఈ కోనేటి మధ్యనొక మంటపముగలదు. అనంతరము ధ్వజస్తంభమునుదాటి ముందునకేగిన బృహదాకారముగల నందీశ్వర విగ్రహమును, దానికి నెడమవైపున బాలాత్రిపురసుందరీ మందిరమును గలవు. ఇదిరెండవ ప్రాకారాంతమున గలదు. ఈ ప్రాకారములోపల గణపతి, సరస్వతి మొదలగు దేవతల విగ్రహములు గలవు. యాత్రికులు వీనిని సందర్శించుచు భీమేశ్వరస్వామిని దర్శించుటకు మేడ నెక్కుదురు. ఈ లింగము సుమారు 18 అ. ల ఎత్తుగలిగి యున్నది. అందుచే స్వామికి నభిషేకాదులు మేడమీదనే జరుగును. మూలవిరాట్టును సందర్శించుటకు క్రింద చీకటిగనుండు గది యందు దీపమువెలిగించి చూడవలయును. ఈలింగము గోధుమ వన్నెగలిగి శిరమున పార్థప్రహారమేకాక నింకను ఎగుడుదిగుడులు

గలిగియుండును. ద్రాక్షారామ భీమేశ్వరునకువలెనే యీకుమార భీమేశ్వరుఁడుగూడ స్వయంప్రాదుర్భూతమని కొందరుచెప్పెదరు. కొందరిది కొమరారామక్షేత్రమనియు, మఱికొందరు భీమారామమనియు చెప్పెదరు. ఈ ఆలయమునగల శిల్పవిన్యాస వైఖరి, ఆలయనిర్మాణము ద్రాక్షారామమును బోలియుండును.

ఊయల మండపము:— ఆలయమున నుత్తరదిశయందొక మూలగ నొక మండపము గలదు. ఈ మండపముమీఁది కెక్కి యూపిన, కొలఁదిగ నూగును. ప్రాచీనులగు శిల్పులు తమ శిల్పశాస్త్రజ్ఞతను బ్రదర్శించుటకీ మండపమును విశేషవిధానము నవలంబించి నిర్మించిరని చెప్పెదరు. ఆలయ పశ్చిమద్వారమునకు కొలఁదిదూరమున నొక రాతిస్తంభమును, ఆ స్తంభముపై నొక నందివిగ్రహమును గలవు. భీమవరాగ్రహారము పాడుబడిన తరువాత నిట నొక గొల్లది స్వామికి నిత్యము పాలు, పెరుగు నివేదన యిడెడిదనియు, నామె స్మృతిచిహ్నముగ నిది నిర్మింపబడెననియు చెప్పెదరు.

విష్ణ్వాలయము:— భీమేశ్వరాలయమునకు బశ్చిమముగ 2 ఫర్లాంగుల దూరమునం దొక విష్ణ్వాలయము గలదు. ఇందలి మూర్తులు మాండవ్యనారాయణస్వామి, శ్యామలాంబిక. ఇందు విష్ణువిగ్రహముక్రింద పరశువేది యుండెననియు, దానిని దొంగిలించుట కొక చోరుడు యత్నింపగ నాతనిచేయి యందంటుకొని యూడిరాలేదనియు, నప్పుడాతడు స్వామిని బ్రార్థించి క్షమార్పణ వేడగ చేయి యూడివచ్చెననియు చెప్పెదరు.

పర్వసమయములందు, విశేషముగ శివరాత్రిసమయమున నిచ్చట పెద్ద యుత్సవము జరుగును. ఆ సమయమునం దనేకులు యాత్రికులు స్వామిని సందర్శింప నేతెంతురు.

## రాజమహేంద్రవరము

ఆంధ్రదేశమున రాజమహేంద్రవరము ప్రాచీనముగను, నవీనముగను కూడ నతి ప్రసిద్ధమైన నగరము. పూర్వ మీ నగర రాజమును రాజధానిగ జేసుకొని విమలాదిత్యతనయుడు, ఆంధ్ర భాషోద్ధారకుడు నగు రాజరాజనరేంద్రుడు 11 వ శతాబ్దమున నాంధ్రదేశమును పరిపాలించియుండెను. ఆదికవి, వాగనుశాసనుడు నగు నన్నయభట్టారకుడు, భారతమును నాంధ్రీకరించిన మహానీయుడు యాతని యాస్థానముననే విద్వత్కవియై విరాజిల్లెను. నాటినుండియు నీ నగరము రాజకీయముగనేగాక, పాండితీ విషయమునగూడ సకలాంధ్రదేశ రాజధానియై వెలుగొందెను. 15 వ శతాబ్దమున నీ నగరము రెడ్డిరాజుల పాలనయందుండెను.


* గోదావరి బ్రిడ్జి

ఆ సమయమున కవిసార్వభౌముడగు శ్రీనాథుడు వీరభద్రారెడ్డి, వేమారెడ్ల యాస్థానమున కవియై 'కాశీఖండము' నాతని కంకితమిచ్చి రాజమహేంద్రనగర వైభవమును తన 'భీమఖండము'న నధికముగ వర్ణించియుండెను.

కోట:— పూర్వ మిచ్చట నొక కోట యుండెడిది. కాని నేడు దాని శిథిలములుమాత్ర మచ్చటచ్చట సూక్ష్మదృష్టితో పరిశీలించిన గానవచ్చును.

రాజమహేంద్రవరము గోదావరీతీరమున గలదు. ఇచ్చట గోదావరి పొడవునను రేవులు గలవు. ఇందు కోటిలింగముల రేవు, పుష్కరఘట్టము, మార్కండేయఘట్టము ప్రధానములు. పుష్కర ఘట్టమున జలచరములబాధ యుండదని బ్రహ్మ వరమిచ్చెను.

ఈ నగరమున 2 స్టేషనులు గలవు. మొదటిది గోదావరి స్టేషను. ఇచ్చటకు గోదావరీనది సమీపముననే గలదు. సాధారణముగ యాత్రికు లీ స్టేషనులోనే దిగుచుందురు. ఈ స్టేషను కెదురుగనే 'మార్వాడీసత్రము' అను నొక ధర్మశాల గలదు. అందు యాత్రికులు బసచేయవచ్చును. ఇంకను ధర్మశాలలు గలవు. రెండవస్టేషను రాజమండ్రిటౌను.

కోటిలింగక్షేత్రము:— యాత్రికులు గోదావరీతీరమున గల కోటిలింగేశ్వరుని సందర్శింప నేగుదురు. ఇచట యాత్రికులు గోదావరియందు స్నానముచేసి పితృతర్పణాదికమును గావించి కోటిలింగస్వామిని దర్శింతురు

పూర్వగాథ:— పూర్వము దేవతలు కాశీక్షేత్ర మహాత్త్వము నడగ్గించుటకై రాజమహేంద్రవరమును 'దక్షిణకాశి'గ జేయ సంకల్పించి యొక రాత్రియందు కోటిలింగముల నిచ్చట బ్రతిష్ఠింపసాగిరి. కాశిమీది ప్రేమచే శివుడు కాశిని విడువలేక చివరిలింగమును ప్రతిష్ఠించుచుండగ తొలికోడై కూసెను. అంత దేవత లా లింగప్రతిష్ఠను ముగించకయే స్వర్గమున కేగిరి. అందు చేత నిచ్చట ౧ తక్కువ కోటిలింగము లున్నవనియు నిది కాశీ క్షేత్రమునకు సమానమగు పుణ్యక్షేత్రమనియు చెప్పుదురు.

గౌతమీ మహాత్మ్యమునం దీ క్షేత్రమహత్వము యధికముగ వర్ణింపబడెను.

మార్కండేయస్వామి ఆలయము:— కోటిలింగక్షేత్రము నుండి యాత్రికులు మార్కండేయస్వామి యాలయమునకు వెళ్లుదురు. ఇది గోదావరిస్టేషనుకు సమీపముననే గలదు. మార్కండేయస్వామి యాలయమునకు బోవుమార్గమున ఆంజనేయస్వామి



గోదావరీతీరము — నాసిక. (చూ. 120 పేజీ)

యాలయము కలదు. మార్కండేయస్వామి లింగము స్వయం ప్రాదుర్భూతము. ఇచట స్వామి కొకవైపున విఘ్నేశ్వరుడును, ఇంకొకవైపున పార్వతియును గలరు. మార్కండేయు డిచట శంకరునిగురించి తపమాచరించి, ఆయన యనుగ్రహమును బడసి మార్కండేయుడు ప్రతిష్ఠించినటుల గౌతమీ మాహాత్మ్యమున గలదు. మార్కండేయస్వామి యాలయమునకు ప్రక్కనే శంకర

మతము గలదు. పూర్వమిది శిథిలావస్థయందుండగ నొక స్వామి దీనిని బాగుచేయించెను. మార్కండేయస్వామి యాలయమునకు జేరియే మరికొన్ని యాలయములుకూడ గలవు. ఇవికాక జైన దేవాలయములుగూడ నిచ్చట గలవు.

పూర్వ మిచ్చట నింకను ననేకదేవాలయము లుండెడివి. తురుష్కుల దౌర్జన్యమున గొన్ని రూపు చెడియున్నవి. ఈ నగరమున కూరలమార్కెట్టుకు సమీపమునందు ప్రస్తుత మొక మసీదు కలదు. పూర్వమిది గోపీనాథమందిరము. మసీదులోపల ప్రాచీనాలయ స్తంభములు, శిల్పములు నేటికిని గానవచ్చును.

మదనగోపాలవిగ్రహము:— పూర్వము కోటకు ద్వారముండెడి స్థానమును నేడు కోటగుమ్మమని వ్యవహరింతురు. దేవాలయ చిహ్నములుగూడ నేడచ్చట గానరావు. కాని యా విగ్రహము నేడు మునిసిపల్ ఆఫీసులో గన్పించును. కుళాయి చెఱువు త్రవ్వుచుండ కొన్ని శిథిలములు లభించెను. అందు కూర్మేశ్వరుని విగ్రహము కలదు. దానికూడ మునిసిపల్ ఆఫీసులో జూడనగును.

గుహ:— గోదావరీతీరమున రైలువంతెనకు సమీపమున డిస్ట్రిక్టుయింజనీరింగు బంగళాకలదు. పూర్వమిది రత్నాంగి మేడయనిచెప్పుదురు. ఇచట భూమిలోనికొక గుహాముఖము గలదు. ఇది పెద్దాపురమువరకు గలదనియు, పెద్దాపురమునగల పాండవులమెట్టమీద గల గుహాముఖము దీనికే చెందినదనియు, పూర్వము రాణులు పెద్దాపురమునుండి, యీగుహాముఖమున గోదావరీస్నానమునకు వచ్చెడివారనియు చెప్పుదురు. కొందరిది

యొక శివాలయమనియు, కాలక్రమమున భూగర్భమున లీనమగు టచే, ప్రస్తుతము గుహవలె గన్పించుచున్నదనియు చెప్పెదరు. గుహాముఖము నేడు కప్పబడియున్నది. గుహాముఖద్వారము శిల్పకళతో విరాజిల్లుచున్నది.

అన్యములు:— రాజమహేంద్రవరమున చూడతగినవి చాలకలవు. సారంగధరమెట్ట, కుళాయిచెఱువు, వైశ్యసేవాసదనము, ఆర్ట్సుకాలేజి, ట్రెనింగుకాలేజి, సెంట్రలుజైలు, పేపరుమిల్లు, రామకృష్ణమఠము, విక్రమహాలు మొదలగునవి.

మాహాత్మ్యము:— రాజమహేంద్రవరము, ఇందలి తీర్థములు, గౌతమీమాహాత్మ్యమున విపులముగ నభివర్ణింపబడినవి. ఇది దక్షిణకాశియని ప్రసిద్ధిజెందినది. ఇచట గోదావరీస్నానము, గంగాస్నానమువలెనే యనంతపుణ్యప్రదము. గోదావరీతీరమున గల యీనగరము, గంగాతీరమునగల వారణాసివలె స్వాస్థ్యప్రదమై యందముగ నుండును. ఇచటనుండి గోదావరీలాంచీల మీాద భద్రాచలము వెళ్లుదురు.

## ధవళేశ్వరము

రాజమండ్రినుండి సిటీబస్సులుకలవు. ఇదియు గోదావరీతీరమె. ఈనగరముకూడ రాజరాజు రాజధానికి సంబంధించినదే. గోదావరి రాజమహేంద్రవరమునకుండి దక్షిణముగ ప్రవహించు చున్నది. ధవళేశ్వరమున నొకకొండమీాద ఈశ్వరాలయము, గ్రామమున విష్ణ్వాలయము గలదు.

ఆనకట్ట:—గోదావరీనీరు వ్యర్థమగుచుండుటగాంచి కాటన్ అను పాశ్చాత్యుడిచ్చట గోదావరినది కడ్డముగ 4 ఆనకట్టలను



దుర్గామల్లేశ్వరస్వామిగోపురము _ విజయవాడ.
చూ 474 పే. (T. H. న్యూ_లు, తెనాలివారి సౌజన్యముతో)

గట్టి, యాజలము కాలవలగుండా ప్రవహింపజేసి పేలాది ఎకరములు వ్యవసాయమున కుపయోగించునట్లు చేసెను. దీనివలన డెల్టాభూము లన్నియు సస్యశ్యామలములయ్యెను. ఈ ఆనకట్టలు చూడతగినవి. ధవళేశ్వరమున P. W. D. ఆఫీసులు అన్నియు కలవు.

## కొవ్వూరు (గోష్పాదక్షేత్రము)

రాజమండ్రినుండి కొవ్వూరుస్టేషనులో దిగవలయును. ఇది తాలూకాగ్రామము. ఇట సంస్కృతకాలేజి గలదు. ఈ గ్రామము గోదావరీతీరమున గలదు. ఇట సత్రము కలదు. అన్ని సౌకర్యములు గలవు.

గోష్పాదక్షేత్రము:— గోదావరీతీరమున గౌతముడు ఘోరముగ తపమాచరించెను. ఇందులకు దేవతలు భయపడిరి. ఇంద్రుడు గోరూపముదాల్చి గౌతమాశ్రమము చెంతకు వచ్చి, ఆశ్రమవృక్షముల పాడుచేయుచుండ, గౌతముడు దర్భతో నా గోవును మరలించ, అది చనిపోయెను. గోహత్యా నివారణకై గౌతముడు గంగను తీసికొనివచ్చెను. గౌతమునిచే తీసికొని

రాబడినదిగాన గంగయె గౌతమియయ్యెను. ఇక్కడ నాటి గోవు యొక్క పాదచిహ్నములు నేటికిని కానసగును. ఈ చిహ్నములు వేసవికాలమున గోదావరి తగ్గినప్పుడు బాగుగ కనుపించును. ఈ కారణముచే నిది గోష్పాదక్షేత్రమయ్యెను. ఇచట నొక శివాలయము కలదు. గోదావరికి మంచి ఘట్టము కలదు. తొలుత గోవూరు, కాలక్రమమున కొవ్వూరుగా మారెను.

## చిన్న తిరుపతి

కొవ్వూరునుండి భీమడోలు స్టేషనులో దిగవలయును. స్టేషనుకుషుమారు 12 మైళ్లు. బస్సులుగలవు. పెద్దతిరుపతియందు వలెనె మ్రొక్కుబడులు, ఇతరభోగములు, ఉత్సవములు యిచట కూడ జరుగును. ఇది చిన్నగ్రామము. అన్నివసతులు గలవు. అలివేలు మంగమ్మతో వేంచేసియున్న శ్రీ వెంకటేశ్వరస్వామి కొండపైన, క్రిందనకూడ కలదు. పైతిరుపతి, క్రిందతిరుపతు లని యిచటను వాడుదురు. కొండ యెక్కుటకు చక్కని మెట్లు కలవు. చూడతగిన క్షేత్రము.

## వేదాద్రి

భీమడోలునుండి బెజవాడ చేరవలయును. బెజవాడ నుండి జగ్గయ్యపేటకు బస్సులు కలవు. జగ్గయ్యపేటలో వర్తక ప్రముఖులు కలరు. ఇటకు వేదాద్రి 6 మైళ్లు. బండ్లు కలవు. నడచియు వెళ్ళవచ్చును. వేదాద్రి కృష్ణాతీరమున గలదు. ఇది అనాదిక్షేత్రము. ఇక్కడ కృష్ణ ఉత్తరవాహిని. ఇచటకు సమీపమున భరద్వాజాశ్రమము గలదు. ఈ యాలయ ధర్మకర్తలు ముక్త్యాల జమీందారులు, ముక్త్యాల కృష్ణాతీరమున గలదు.

వేదాద్రిలో లక్ష్మీనృసింహస్వామి యాలయము కొండ మీద కలదు. కృష్ణలో లింగాకారమున యొక నృసింహస్వామి కలదు. ఆలయమునుండియే కృష్ణలోనికి చక్కని మెట్లు కలవు. ఇట ధర్మశాల కలదు. సౌకర్యములు తక్కువ. ఈ క్షేత్రము నవనారసింహులలో నొకటియని జనశ్రుతి. ఈ దైవము ప్రత్యక్ష దైవము. నిత్యము అనేకులు తమతమ కోరికల సఫలతకొరకు యేతెంచుచుందురు. కోరిక కలవారు కృష్ణలో స్నానముచేసి, లక్ష్మీనృసింహస్వామిని దర్శించి, ఆలయమునకు 108 ప్రదక్షిణ ములు చేసి, ఆలయమునకు వెనుకభాగమున బోర్లగిల పరుండు దురు. వెంటనె నిద్రపట్టును. స్వామి కలలో వేదోరూపమున కనుపించి కామ్యఫలిత పర్యవసానము నిర్ణయించి, ఇన్నిరోజులు ప్రదక్షిణము చేయుము అని చెప్పును. ఆ ప్రకారము భక్తులు, ప్రదక్షిణములుచేసి తమకోరికలు నిర్వర్తించుకొనుచుందురు.

## మంగళగిరి

బెజవాడనుండి గుంతకల్లుపోవుమార్గమున బెజవాడదాటిన 3 వ. స్టేషను మంగళగిరి. స్టేషనుకు గ్రామమునకు 1 మైలు. ఇక్కడ మంగళగిరి (శుభమైన కొండ) మీదను నృసింహస్వామి కలదు. ఈ మంగళగిరియె, గ్రామనామముగ మారెను. ఇచట ధర్మశాలలుకలవు. అన్నివస్తువులు లభించును. ఆదర్శసతీమణియు, భక్తురాలు నగు శ్రీ బాలాంబగారి ధర్మసత్రము కలదు. ఇచట నేవేళ యెవరేతెంచినను మృష్టాన్న మిడుదురు.

నృసింహస్వామి యాలయము:— ఈ యాలయము చుట్టు ఎత్తైన ప్రాకారములతో, గాలిగోపురములతో విశా

లమై విరాజిల్లుచుండును. దక్షిణ, ఉత్తర దేశములనుండి యాత్రికు లరుదెంతురు. ఫాల్గుణమాసమున బ్రహ్మోత్సవములు, పూర్ణిమకు రథోత్సవము జరుగును. ఈయాలయమంటలి శిల్పవిన్యాసము చూడతగినది.



శ్రీ లక్ష్మీనృసింహస్వామి

పానక నృసింహస్వామి:— ఈ యాలయము కొండపైన కలదు. నృసింహస్వామి మూలమూర్తి నిరాకారముగ గలదు. పర్వతపు గోడకు బిలమొకటి కలదు. ఈ బిలమునకు ఇత్తడికవచము కలదు. దాని కిరుపార్శ్వముల శంఖ, చక్రములు కలవు. భక్తులు తమతమ కోరికలు నేరవేరుటకయి పానకము చేయింతుమని మ్రొక్కుదురు. నిత్యము భక్తులు వచ్చి తమ మ్రొక్కులు చెల్లించుచుందురు. ఈ యాలయమున చీమలుగాని, దోమలుగాని గానరావు. ఒక విశేషనిదర్శన మేమన, భక్తులు మ్రొక్కిన పానకమును అర్చకుడు శంఖముతో ముంచి స్వామి నోట పోయుచుండును. సగము పానక మగుసరికి స్వామి నోట నుండి వెలిగ్రక్కును. అనగా మ్రొక్కినది గ్లాసుగాని, ఒక బిందె గాని, పదిబిందెలుగాని, సగము మాత్రమె స్వామి స్వీకరించును. ఈ పర్వతము యెక్కుటకు చక్కని మెట్లు కలవు. ఈ క్షేత్ర మహిమ బ్రహ్మవైవర్తమున ३० అధ్యాయములు వర్ణింపబడినది. ఇది నవనారసింహములలో నొకటియని జనులు వాకొందురు.

## అమరావతి

బెజవాడనుండి గుంటూరు (జం) లో దిగి బస్సుమీద యీ క్షేత్రము చేరనగును. ఇది కృష్ణాతీరమున గలదు. ఇది పంచారామములో నొకటి. తారకాసురుని కంఠమందలి అమృత లింగ పంచశకలములలో నిది యొకటి. ఇతర పంచారామము లందలి యాలయములవలెనె యిదియు కలదు. ఆలయము మేడ పై కెక్కినగాని శివుని శిరమున నభిషేకించుటకు వీలుండదు. ఈ లింగము తెల్లగ నుండును. శివరాత్రికి పెద్దయుత్సవము జరుగును. కృష్ణలో స్నానము, తీర్థవిధియు ముఖ్యములు. ఈ క్షేత్ర మహిమను గూర్చి పురాణములు మిక్కిలి అభివర్ణించినవి.

## ధరణికోట

కృష్ణాతీరమునగల పూర్వపు ధాన్యకటకమే నేటి ధరణికోట. బౌద్ధుల ప్రధాన బౌద్ధస్తూపములలో నిదియొకటి. అమరావతి పరిసరమున నుండుటచే దీనిని అమరావతీస్తూపమనియు పిలుచుచుండిరి. స్తూపమనగా ఇటుక లేక రాయితో నర్ధగోళాకృతిగా కట్టబడినది. ఈ స్తూపమునందు బుద్ధుని జీవితగాథలు, ఆతని బోధలు చిత్రింపబడినవి. ఈ స్తూపనిర్మాణకాలమున కాధారము కానరాదు. ఆంధ్రుడైన శాతవాహనుడు బౌద్ధమతమునం దభిమానముజూపి, ఆదరించి యీ స్తూపమును బహుముఖముల పెంపొందించెను. పూర్వ మొకప్పుడు ద్వీపాంతరములనుండియు పెక్కురు బౌద్ధయాత్రికుల నాకర్షించు యీ స్తూపము నేడు చాల శిథిలమైనది. అనేకుల నాకర్షించు ధాన్యకటక రాజధాని వైభవము కాలగర్భమున జీర్ణమై, నామమాత్రావశిష్టములైన

చిహ్నములు మాత్రమునేడు మిగిలినవి. ఈ బౌద్ధస్తూపముల వలన భారతీయుల ప్రాచీన శిల్పసంపద బహుముఖముల చాటుచున్నది.



అమరావతీ స్తూపము

## ఉండవల్లి

ఉండవల్లి బెజవాడకృష్ణ ఆనకట్టకుదిగువ నైఋతిమూలన రెండుమైళ్ల దూరముననున్నది. సీతానగరంకొండలకు తిన్నగ పడమరగ నున్నది. ఉండవల్లి చిన్నగ్రామము. పర్వతమయము. ఆ పర్వతశ్రేణిలో పడమటివైపున కట్టకడపటికొండలో బౌద్ధులు

గుహాలుచెక్కి తమనివాస మేర్పరుచుకొనిరి. ఈగుహాలు ఉత్తర ముఖముగా కృష్ణానదిని చూచుచున్నవి. ఉండవల్లి బౌద్ధులకు చరిత్రలో ప్రముఖస్థానము గలదు. ఈ గుహాలు శాతవాహనుల కాలమునాటికే ఉన్నట్లు ఆతరువాతపుట్టిన శాసనములద్వారా తెలియవచ్చుచున్నవి.



ఉండవల్లి గుహాముఖద్వారము
(T. H. నూక్కాలు, తెనాలివారి సౌజన్యముతో)

ఉండవల్లిగుహాలు మూడంతస్తులుగా నున్నవి. పై అంతస్థులో పడమటిదెస శేషశయ్యపై యోగనిద్రాపరవశుడై యున్న అనంతపద్మనాభస్వామివారి విగ్రహము ఒకేరాతిలో చెక్కబడి యున్నది. ఈ విగ్రహముపొడవు 8 గ, వెడల్పు గజము మున్నా

తిక. చుట్టూగోడలపై మధుకైటభులు, బ్రహ్మ మొదలగు దేవతలు, మహర్షులు చెక్కబడి యుండిరి.

రెడ్డిరాజుల కాలమున అవతరించిన ఉండవల్లి శాసనములలో ఈ యనంతపద్మనాభస్వామివారి కైంకర్యమునకు ఒక మహారాజు అగ్రహారము నిచ్చినట్లుకూడ నున్నది. ఈశాసన మిప్పటికిని ఉండవల్లి గుహాలలో బయటిదరి తూర్పుగోడపై చెక్కబడియున్నది.

గుహాల వెలుపల పెద్దపెద్ద విగ్రహములు ఋషులు సింహములు మున్నగునవి, గుహాలలో గోడలపై భాగమున నాగులు, యక్షులు, ఏనుగులు మున్నగునవి చెక్కబడియున్నవి.

ఉండవల్లికివలెనె బెజవాడకు తూర్పుదారిని మొగలరాజపురము కొండలలోకూడ బౌద్ధులగుహాలు పెక్కులున్నవి. ఇతర స్థలములలోగల బౌద్ధులగుహాలలో ఎచ్చటను కానరాని ఆంజనేయునివిగ్రహము ఒకగోడపై పెద్దప్రమాణమున చెక్కబడియుండుట, మొగలరాజుగుహాల శిల్పములోని విశేషము.

## విజయవాడ

ఇది పెద్ద రైల్వేజంక్షను. ఇది మదరాసు - విశాఖపట్టం, మదరాసు - ఢిల్లీ, బందరు - ద్రోణాచలం, నైజాం పోవు రైలు మార్గముల కూడలి. ఈ పట్టణము కృష్ణాతీరమున గలదు. దీనిని విజయవాడ యనియు పిలతురు. ఇచట పురాతన కోట చిహ్నములు, అనేక ప్రాచీనమందిరములు గలవు. ఈ పట్టణ పరిసరములందు కొండలనుదొలచి నిర్మించిన అనేక బౌద్ధగుహాలు కలవు. ఈ పట్టణమునకు చుట్టూగల పర్వతములు పెట్టని కోటగోడలవలె నుండును. సహ్యాపర్వతమునపుట్టిన పరమపావనియగు

కృష్ణానది యొక్కయు, విజయవాడ యొక్కయు మహాత్మ్యము సూతసంహితయందు విపులముగ గలదు. పర్వతమున గల కనక దుర్గా మల్లేశ్వరులు ప్రధానదేవతలు. దుర్గ నగర సంరక్షకురాలు. ఈ నగర చరిత్రనుగురించి అనేక శాసనములు గలవు. అగస్త్యు



దుర్గకొండమీదనుంచి చూచిన కనబడు నగర దృశ్యము
(T. H. స్కూలు, తెనాలివారి సౌజన్యముతో)

డిచట తపమాచరించి మల్లేశ్వరస్వామి యనుగ్రహమును బడ సెను. పూర్వమిది రాజేంద్రచోళుని పురము. కొండమీద గల 'దుర్గ' మందిరమున నుండి క్రిందికి చూచిన నీ పట్టణ సౌంద ర్యము, కృష్ణానదీ రామణీయకత, పరిసర కొండలమీద గల ప్రకృతిదృశ్యములు చూచితీరవలయునేగాని వర్ణింప నలవిగాదు.


* కృష్ణ ఆనకట్ట

విజయవాడదగ్గర కృష్ణానదికి ఆనకట్ట గలదు. దీనిపొడవు 3313 అడుగులు. క్రీ.శ. **1873** లో కట్టబడిన పెద్ద రైల్వేవంతెన గలదు. ఇచటగల కొండలలో నింద్రకీలాద్రి పర్వతము కలదు. పాండవ మధ్యముండగు అర్జును డిచటనే శివునిగూర్చి తపమాచరించి పాశుపతమును బడసెనని జనశృతి కలదు. పూర్వమిది వేంగీ రాజ్యమునకు రాజధానీ నగరము. ధర్మపరిపాలనము చేసిన మాధవవర్మ యిచటివాడె. క్రీ. శ. 7వ శతాబ్దమున చైనా యాత్రికుడు హుయాన్‌సాంగ్ తన యాత్రాకాలమునాటికి యీ పట్టణము మిక్కిలి బౌద్ధమత వ్యాప్తిలో నున్నట్లు పేర్కొనెను. ఇది వ్యాపార కేంద్రము. ధర్మశాలలు గలవు. అన్ని సౌకర్యములు గలవు.

ఇచట ఎలక్ట్రిసిటీ పవరుహౌసు, ఆల్ ఇండియా రేడియో కేంద్రము, కళాశాలలు, టెలిఫోన్ ఎక్స్చేంజి ఆఫీసు కలవు. గవర్నమెంటు ఆఫీసులు కూడా కలవు. ఇక్కడ పట్టణమునందు చాల కాలువలు గలవు. వీటిద్వారాగూడ ఎక్కువగా వ్యాపారము జరుగుచుండును. ఇక్కడ సినిమాహాలులు డిస్ట్రిబూటర్సు ఆఫీసులు కలవు. ఇక్కడ వేసవికాలమందు ఉష్ణోగ్రత ఎక్కువగా నుండును. ప్రస్తుతము విజయవాడకు సమీపమున కృష్ణానదిమీద 'రెగ్యులేటర్ బ్రిడ్జి' నిర్మించుచున్నారు. దీనివలన దక్షిణాదినుంచి కలకత్తావరకు రహదారి 'యేర్పడును. అప్పుడు రాకపోకలకు, వర్తకవ్యాపారములకు చాల అనుకూలముగా నుండును. స్టేషనుకు

సమీపములో సిమెంటు ఫ్యాక్టరీగలదు. విజయవాడలోని సీతా నగరముదగ్గర 'వర్కు-షాపు'కూడ నిర్మించుటకుఇండియా ప్రభుత్వ మువారు నిశ్చయించినారు. ఈకారణములవలన నిది పారిశ్రామిక కేంద్రముగా విలసిల్లుటకు చాల అవకాశములున్నవి. ఇది ఆంధ్ర దేశమునకుమధ్య నుండుటచే రాజధానికి అన్నివిధముల తగి యున్నది. ప్రస్తుతమిది రాజధాని గాకపోయినను, రాజకీయ రాజ ధానిగనే విలసిల్లుచున్నది. విజయవాడకు సమీపమునగల గన్న వరములో విమానాశ్రయము గలదు. ఇది సుమారు 6 మై. దూరము. యాత్రికులు కృష్ణానదిలో స్నానము, తీర్థవిధి చేయు దురు. పన్నెండుసంవత్సరముల కొకసారి కృష్ణానదీ పుష్కరములు వచ్చును. అప్పుడు ముఖ్యముగా పిండప్రదానాదికర్మలు చేయు చుందురు. ఇచట నింకను అనేక దర్శనీయస్థానములు గలవు.



# సుందర భారత యాత్ర

## మధ్య భారతము

కేవలము కాశీ ప్రయాగ, గయలు మాత్రము యాత్ర చేయువారు, ఈ మార్గమున ప్రయాణముచేసి, నాగపూరు మీదుగ అలహాబాదు (ప్రయాగ) చేరవచ్చును. మధ్యలో చిత్రకూటము మొదలైన కొన్ని క్షేత్రములు దర్శింపవచ్చును.

మధ్యభారతము (Central India) చరిత్ర అతివిచిత్ర మైనది. సాహసగాథలకు ఆలవాలమైనది. ఇక్కడి శిల్పసంపద, కళావైభవము కమనీయమైనది. మధ్యభారతము, వింధ్యప్రదేశ్, మధ్యప్రదేశ్, భోపాలు రాష్ట్రాలు కలసి ఉన్న ప్రాంతమే మధ్య భారతమని వ్యవహరింపబడుచున్నది. కజురాహో దేవాలయములు ఈ ప్రాంతపు సంస్కృత వైభవమునకు గొప్ప నిదర్శనములు.

దీని ద్వారా తూర్పు పడమరలుగా వ్యాపించియున్న, వింధ్యపర్వతశ్రేణులు, రాసులు రాసులుగా గోధుమలు పండే నర్మదానదీలోయ, దక్షిణకనుమలో అత్యున్నతమైన సాత్పూరా పీఠభూమి నిబిడారణ్యమయమైన పర్వతోపరిభాగములు, పాతాళమునంటి ప్రవహించు సెలయేళ్లు, నాగపూరు మైదానము ఈ ప్రాంతపు ప్రత్యేకత. ఇక్కడి నల్లరేగడిమట్టి సారవంతమైనది. ఇండియాలో ప్రత్తిపండేభూములలో నిది యతిప్రధానమైనది. ఇక్కడి పట్టణములు:— ఇండోరు. దీనిని హోల్కారు వంశములో

అతి సుప్రసిద్ధురాలు, రాణిఅహల్యాబాయి సరస్వతీ, ఖాన్ నదులయొద్దున నిర్మింపజేసినది. ఇది సముద్రపుమట్టమునకు 1830 అడుగుల యెత్తున నున్నది. బొంబాయికి 400 మై. నగరము మధ్యభాగములోగల పాతభవనపు, అందము, అదోకతరహా మైనది. దీని సింహద్వారము యనేక యంతస్థులుగలది. నదీతీరమున హోల్కారు వంశస్థుల జ్ఞాపకార్థము ఛత్రీలనేకములు గలవు. ఈ ఛత్రీబాగ్‌లో మొదటి హోల్కారుఅయిన ములహారి సమాధి కలదు. దీనియందము, శిల్పము, అలంకారమైభవము ప్రేక్షకుల ప్రశంసలకు పాత్రమైనది. క్రొత్తగాకట్టిన భవనములలో కింగ్ ఎడ్వర్డుహాలు, సరస్వతీ నదియొద్దున రమణీయోద్యానముల మధ్య కట్టిన లాల్‌బాగ్ భవనము కడు మనోహరమైనవి.

# భద్రాచలము

బెజవాడనుండి సికింద్రాబాదుపోవు లైనులో డోర్నకల్ (జం) లో మారి, కొత్తగూడెం (భద్రాచలంరోడ్) లో దిగి, అటనుండి గోదావరివరకు బస్సు, గోదావరి దాటిన భద్రాచల శ్రీరామాలయము దృగ్గోచరమగును. భద్రాచలమున సత్రములుకలవు. అన్ని సౌకర్యములు కలవు. పరమపావనియగు గౌతమి నాసిక్‌లో ప్రాదుర్భవించి భద్రాచలము, రాజమండ్రి మీదుగ సముద్రమున కలిసినది. గోదావరి షుమారు 900 మై. ప్రవహించుచున్నది.

భద్రాచలము ఆంధ్రదేశమున ప్రధానక్షేత్రము. చైత్ర శు ౯ కి శ్రీ సీతారాముల కల్యాణము జరుగును. నలుపైపుల నుండి వేలాదిప్రజలు వత్తురు. మరియు ధనుర్మాసమున ఉత్సవ

ములు జరుగును. ఈ యాలయమందలి మూర్తులు స్వయముద్భవము.



శ్రీ రామాలయము

రామదాసు నామ మెరుగనివారుండరు. నైజాంరాజ్యములోగల యీ భద్రాచలమున రామదాసు ప్రభుత్వోద్యోగమున తహసిల్‌దారుగ నియమితుడయ్యెను.

రామదాసు (గోపన్న) పుట్టుకనుండియు భక్తుడు. ఒకనాడు కొందరుభక్తులు శ్రీరాముని చూడ నేతెంచుతరి తాను కూడ వెడలెను. ఈ భక్తులలో కబీరుదాసుకూడకలడు. కబీరుని తురకవాడని హిందువులు ఆలయము లోనికి రానీయలేదు. అప్పుడు శ్రీ సీతారాములమూర్తులు అంతర్ధానమాయెను. ఈ సంగతి గ్రహించి హిందువులు కబీరుదాసుని ఆలయములోనికి రమ్మనిరి. ఆతడాలయములోనికి రాగానే దేవతామూర్తులు

మరల ప్రత్యక్షమాయెను. కబీరుదాసుని భక్తికాశ్చర్యమొంది గోపన్న, ఆతనివలన మంత్రోపదేశమంది; కబీరునివలన రామదాసను నామమును ధరించెను.

రామదాసు ప్రభుత్వపు ఖజానాలోని 6లక్షలు వెచ్చించి స్వామికి ఆలయములు, గోపురములు కట్టించెను. దీనికి ఫలితముగ నైజాం ప్రభువగు నవాబుచే రామదాసు బంధితుడాయెను. భక్తరక్షకుడగు రాముడు సోదరునితో సేవకుల వేషముదాల్చి, 6 లక్షల పైకమును నవాబున కిచ్చెను. రామదాసుని వెంటనే కారాగారవిముక్తునిజేసి నవాబు ఆతనికి మ్రొక్కి తానుకూడ రామభక్తుడాయెను. నాటినుండియు ప్రతి సంవత్సరము సీతాకల్యాణమునకు నైజాంప్రభువులు (నవాబులు) ముత్యాలు తలంబ్రాలు పంపుదురు.

పూర్వగాథ:— పూర్వము పర్వతశ్రేష్ఠుడగు మేరువు సంతానమునకై బ్రహ్మనుగురించి తపమాచరించి బ్రహ్మవరంబు వలన మేరువు సుపుత్రునిం బడసెను. అతని పేరు భద్రుడు. భద్రుడు తండ్రి యాజ్ఞచొప్పున ప్రస్తుతము భద్రాచలమున, గౌతమిలో స్నానమొనర్చుచు తపమాచరించుచుండెను. ఆతని తపమునకు సంతసించి, సీతారాములు ప్రత్యక్షమై ఆతని కోరిక ప్రకారము యీ పర్వతమున నివసించుట కంగీకరించి భద్రగిరి యందు వేంచేసియుండిరి అందువలన యిది భద్రాచలమాయెను.

"యత్ర భద్రాచలే రామః సీతా నిష్కల్మషా శుభా,
తత్రైవ ముక్తిస్సులభా కలౌ నాన్యత్ర నారదా."

— భవిష్యోత్తర పురాణము.

ఈ భద్రాచలమును గురించి భవిష్యోత్తరమున మిక్కిలి వైభవముగా వర్ణితమైనది. ఆదివారమున భద్రాచల ప్రదక్షిణము భూప్రదక్షిణ తుల్యము.


కబీరుదాసు

పూర్వ మొకప్పుడు భద్రరెడ్డిపాలెము వాస్తవ్యురాలు పోకలదమ్మక్కయను భక్తురాలుకు స్వప్నమున సీతారాములు కనుపించి 'తమ మూర్తులు ఈ భద్రగిరియందు కలవనియు, వానిని ఆరాధించు'మని చెప్పగ, ఆ ప్రకారము దమ్మక్క ప్రస్తుతమున్న మూర్తులను భద్రాచలమున దర్శించి, సీతారాములకు చిన్న ఆలయమును నిర్మించెను. పిమ్మట రామదాసుచే ప్రస్తుతమున్న ఆలయప్రాకారాదులు నిర్మింపబడెను.

ఇతరస్థానములు:— భద్రాచలమునకు పరిసరములందు చూడతగిన పుణ్యస్థలము లనేకములు కలవు. మల్లూరు నృసింహస్వామి, పర్ణశాల, సీతనాగు, లక్ష్మణపర్వతము, గోపాలస్వామి, వీరభద్రుడు, జటాయుగుట్ట, నీలకంఠేశ్వరదేవి, ఉష్ణగుండము, చుప్పనాతిగుట్ట మొదలగు స్థానములు దర్శనీయములు. వీటిని గురించి రామాయణాది గ్రంథములలో వివరముగ గలదు.

## చాందా

భద్రాచలంరోడ్ నుండి డోర్నకల్ (జం), కాజీపేట (జం) మీదుగ చాందాస్టేషను 115 మైళ్లు. ఇది నాగపూరప్రాంతమున గల చాందాజిల్లాలోని ప్రధాననగరము. ఈ గ్రామము 5½ మై.

పొడవుగల రాతిగోడతో పరివేష్టింపబడి యుండెను. ఇచ్చట అచలేశ్వర, మురళీధర, కాళీమందిరములు కలవు. ఇచ్చట వైశాఖమాసమునం దుత్సవములు జరుగును. ఈ ప్రదేశము రమణీయముగ నుండును.

## సేవాగ్రామ్ (వార్ధా)

చాందానుండి వార్ధా 74 మై. స్టేషనుకు 7 మై. లో గాంధీమహాత్ముడు చిరకాలము నివసించిన సేవాగ్రామాశ్రమము కలదు. ఇక్కడ ఆయన కుటీరములో గాంధీజీ వదలిపెట్టిపోయిన వస్తువులు భద్రపరచబడినవి. వీనిని సందర్శించుటానికి వేనవేలు ప్రజలు వచ్చుచుందురు. నయీ తాలీంసంఘ ప్రధాన కార్యాలయము యిచట కలదు. అఖిల భారత గ్రామోద్యోగి సంఘ కార్యాలయము మగన్ వాడిలో కలదు.

## నాగపూరు

వార్ధానుండి నాగపూరు 48 మైళ్లు. స్టేషనుకు సమీపమున ధర్మశాల కలదు. ఇది మధ్యప్రదేశ రాష్ట్రమునకు రాజధాని. జనాభా షుమారు 4,49,098. ఈ నగరము పారిశ్రామిక కేంద్రము. ఇచ్చట బట్టలమిల్లులు అధికముగా గలవు. ఈ నగము చుట్టుప్రక్కల దట్టమైన యడవులు గలవు. చక్కని పంటలు పండు సారవంతమైన భూప్రదేశము. ఇచట విశ్వవిద్యాలయము, కాలేజి, హైస్కూల్లు కలవు. విశ్వవిద్యాలయము చూడతగినది. ఇచట కమలాఫలము లతిచౌకగ లభించును. మరియు పాతబస్తి, భాన్సలేకోట, దీనికి సామీప్యమున గల సరోవరము, తత్తీర

ముసగల సుందర ప్రాసాదములు, నూతన నాగపూరునందలి కోర్టు మొదలైన కార్యాలయములు చూడతగినవి.

ధర్మశాలకు సమీపమున చలువరాతితో నిర్మించబడిన కోదండరామాలయము కలదు. ఈ యాలయమున సీతారాములయు, పార్వతీపరమేశ్వరులయు పాలరాతి ప్రతిమలు చూడవలయును. ఆలయములోని గోడలమీది చిత్రకళ చూడవలసినది.

తాజూద్దీన్ బాబా:— నాగపూరుకు చక్రధర్ 5 మైళ్లు. టాంగాలు కలవు. ఇచట తాజూద్దీన్ బాబా సమాధి కలదు. ఇతడు మహమ్మదీయుడు. మహాభక్తుడు. ఇతని దేహావసాన సమయమున, ఇచట గల పాండురంగస్వామి నేత్రములనుండి మూడురోజులు సంతతధారగ నీళ్ళుకారినవట. ఇచట లక్ష్మీనారాయణ, పాండురంగాలయములు గలవు.

## రామటేక్

నాగపూరుకు పూర్వోత్తరముగ 24 మైళ్ళ దూరమున రామటేక్ అను నగరముగలదు. నాగపూరునుండి ఆర్. హెచ్. (జం) మీదుగ రామటేక్‌లో దిగవలయును. ఇది తమలపాకులకు భారతదేశమున మిక్కిలి ప్రసిద్ధిగాంచెను. ఇచ్చటకు సమీపమునగల కొండమీద నుత్తరదిశయందు పురాతన దేవాలయమొకటిగలదు. ఇచ్చట నింకను కొన్ని దేవాలయములు గలవు. కొండమీద పశ్చిమముగ నొక ప్రాకారాంతరమున విశాలమగు శ్రీరామాలయము గలదు. ఇది చాలపురాతనమైనది. రామటేక్ నగరమునుండి పర్వతశిఖరమువరకు మెట్లుగలవు. ఇచ్చటకు

సుమారు 2 మైళ్ళ దూరమున 'అంబాలా' అను నొక సరస్సు గలదు. ఈ సరస్తీరమున మహారాష్ట్రులునిర్మించిన 10, 15 మందిరములు గలవు. ఇచట కార్తీక శు ౧౫ కు ఉత్సవములు జరుగును. ఈ ప్రదేశము రమణీయమైనది. మిక్కిలి పవిత్రమైనది.

## ఇటార్సి

రామటేక్ నుండి నాగపూరుమీదుగ ఇటార్సి (జం) చేరవలయును. ఇటార్సి చక్కని గ్రామము. స్టేషనుకు సమీపమున ధర్మశాలకలదు. ఇందన్ని వసతులు కలవు.



శ్యామలాంబికా దేవి (చూ. మంగళగిరి)
(జగన్నాథఖండము - 469 పేజి)

హోసంగాబాదు, (నర్మద):— హోసంగాబాదు రైల్వే స్టేషను. ఇటార్సినుండి బస్సులు కలవు. హోసంగాబాదు నర్మదాతీరమున గలదు. యాత్రికులు తప్పక యీ నదిలో స్నాన తర్పణ తీర్థవిధులు చేయుదురు. ఇచట నదికి చక్కనిస్నానఘట్టములు కలవు. ఇచట తీరమందలి పురమందిరము, ధర్మశాలలు భవనములు, నర్మదానదిలో ప్రతిబింబించు వాని సౌందర్యము తప్పక చూడతగినవి,

## భోపాల్

భోపాల్ రాష్ట్ర వైశాల్యము 6,878. చ. మైళ్లు. జనాభా **8,36,474.** భోపాలు మాలిక దేశమునకు హృదయమువంటిది. ఇది భోజుని రాజధానీనగరము. ఒకప్పుడిది బౌద్ధసంస్కృతికి నిలయము. ఇక్కడ అందమైన సరస్సు, పూర్వమెప్పుడో నిర్మించిన కోటగోడల శిథిలములు, కొండకొమ్మన నిర్మించిన అహమ్మదార్ భవనము చూడతగినవి. ఈ పరిసరమంతయు రామణీయకముగ నుండును.

## సాంచి

భోపాలుకు 25 మైళ్లు. బొంబాయి - ఢిల్లీకిపోవు మార్గమున సాంచి స్టేషను గలదు. ఇండియాలోని బౌద్ధ శిథిలావశేషముల కిది నెలవు. ఇక్కడ యున్నవాటిలో ప్రధానమైనది **103** అ. వ్యాసముతో 42 అ. యెత్తున యిసుకరాతితో నిర్మించిన మహాస్తూపము. దీనిచుట్టూ పెద్దరాతిగోడ, **4** సింహద్వారములు గలవు. క్రీ. పూ. మొదటి రెండుశతాబ్దములనాటి లిపిలో వ్రాయబడిన పెక్కు శాసనములు కలవు. ఇక్కడి రాతిచెక్కడపు పని సున్నితముగా సుందరముగ నుండును. ఇక్కడి స్తూప సింహద్వారములన్నిటిపైన జాతకకథలన్నియు చక్కగ చెక్కబడినవి. మరియు తాటితోపు, అశోకుని శిలాస్తంభపు శిథిలములు చూడతగినవి.

పర్వతమున నూతనముగ నిర్మింపబడిన బౌద్ధమందిరము గలదు. దీనిని భారతప్రధాని పండిత జవహర్‌లాల్ నెహ్రూ తెరచెను. ఈ మందిరమున బుద్ధుని బంగారు ప్రతిమ కలదు. బుద్ధుని

జీవితమునకు సంబంధించిన చిత్రపటములు గలవు. ఇచ్చటి మ్యూజియం తప్పక దర్శించతగినది.

సాంచీకి 5 మైళ్ళ దూరమున గల సోనారీదగ్గర 8 బౌద్ధ స్తూపములు గలవు. ఇచ్చటకు సమీపమున గల సాధతాదగ్గర 101 అడుగుల వ్యాసముగల స్తూప మొకటి కలదు. సాంచీకి 7 మై. దూరమునగల భోజపురమువద్ద 37 స్తూపములు గలవు. ఇందొకస్తూపము 66 అడుగుల వ్యాసము కలిగియున్నది.

క్రీ. శ. 1883 లో చేసిన భారతప్రభుత్వపు టాజ్ఞ ననుసరించి యీ స్తూపములు జాగ్రతగ సంరక్షింపబడుచుండినవి.

## భే ల సా

సాంచీనుండి భేలసాస్టేషనులో దిగవలయును. ఇది గ్వాలియరు రాజ్యమున వేతవానదీతీరమున గలదు. ఇచ్చట హిందువుల మందిరములు, బౌద్ధస్తూపములు చాల గలవు. వేతవానదీ మైదానమున దేవమందిరము లనేకములు గలవు. భారతదేశమునందు భేలసాయందున్నన్ని బౌద్ధస్తూపములు మరెచ్చటను లేవు.

## జ బ ల్ పూ రు

భేలసానుండి భోపాల్ (జం), ఇటార్సీ (జం) మీదుగ జబల్ పూరు (జం) లో దిగవలయును. ఇది మధ్యప్రదేశమునగల రెండవ పెద్దపట్టణము. ఇక్కడికి 13 మై. దూరమున పాలరాతి గనులుగలవు. ఈ పట్టణమునకు సమీపమున చూడతగిన ప్రాచీన దేవాలయ మొకటి కలదు. 4 మై. పశ్చిమముగ ఒక గుట్టమీద గోండురాజులు నిర్మించిన మదనమహాల్ దుర్గము కలదు.

# గౌరీశంకరము - గుప్తేశ్వరము

జబల్‌పూరునకు 13 మై. దూరమున నర్మదా సరస్వతీ సంగమము కలదు. ఈ సంగమమునకు సమీపమున గౌరీశంకర మందిరము కలదు. ఈ ప్రాంతమంతయు మిక్కిలి మనోహరముగ, నయనానందకరముగ నుండుటచే దేశదేశములనుండియు యాత్రికు లిచటి కేతెంతురు. సంగమమున కనతిదూరమున పంచవటీ, భృగుతీర్థము మొదలగు తీర్థస్థానములు గలవు. ఇచటి మన్ను పాలరాతివలె స్వచ్ఛముగ నుండును. విదేశీయులు దీనిని పౌడరు తయారుచేయుటకు తీసికొనిపోవుదురు.

ఈ గౌరీశంకరమందిరము శకకర్తయగు శాలివాహనుడు నిర్మించెనని చెప్పుదురు. ఈ మందిరముకూడ మహమ్మదీయుల బారి పడెను. ఐనను దర్శనీయము లనేకములు గలవు. ఆలయ మతి మనోహరము. ఇచట స్వామి లింగాకారముగాక పార్వతీ సహితుడై విగ్రహరూపమున నుండెను. స్వామి కాలిబొటనవ్రేలు గజనీమహమ్మద్ గదాభిఘాతమును పొందెను. ఈవిగ్రహమును పాడుచేయ నెంచిన గజనీని, ఇచట కుండమందుండి యసంఖ్యాకములుగా తుమ్మెదలు ఆతనిని చుట్టుముట్టగా, గజనీ భీతుడై పలాయితుడాయెను. మందిరమునకు క్రింద కొన్ని గుహలు కలవు. ఈ గుహలయందు నేటికిని కొందరు బౌద్ధయోగులు నివసించుచుందురని చెప్పుదురు. ఈ గుహలకు, కుండమునకు సంబంధము గలదు. ఆ యోగులను గాంచుటకు కొందరు యీ కుండమున మునిగి, మరల బయటకు రాలేదని చెప్పుదురు. ఈ కుండమున పూర్వ మొక నాగు కాన్పించుచుండెడిది. అది యిప్పుడు కాన

వచ్చుటలేదు. మందిరావరణలో 64 తాంత్రికయోగినీ విగ్రహములు కలవు. ఇవి తంత్రశాస్త్రప్రకారము నిర్మితములు.

గుప్తేశ్వరుడు:— జబల్‌పూరుకు 2 మై. దూరమున దక్షిణముగ నర్మదానది కలదు. పట్టణమునకు మధ్య కొండగుహయందు, గుప్తేశ్వరస్వామి లింగము కలదు. ఇది చాలరమ్యమగు ప్రదేశము. వేయిసంవత్సరములకు పూర్వ మీ స్వామి స్వయముగ ఆవిర్భవించెను. ఈ మందిరమున కెదుట నుత్తరముగ పార్వతీమందిరము గలదు. ఇది మిక్కిలి యందమైనది. గుప్తేశ్వర స్వామి యాలయమునకు పశ్చిమమున గల పర్వతప్రదేశముల ప్రకృతిశోభచే పరమానందమును కలుగజేయును.

## శబరీనారాయణము

జబల్‌పూరునుండి కటనీ (జం), బిలాస్‌పూర్ (జం) మీదుగ నైలాస్టేషనులో దిగవలయును.

ఈ స్టేషనుకు దక్షిణముగ 16 మై. దూరమున బిలాస్‌పూర్ జిల్లాలో మహానదీ శివనాథనది సంగమస్థానమునకు పశ్చిమముగ 10 మై. దూరమున శివనాథనదీతీరమున శబరీనారాయణ తీర్థము కలదు. ఇచ్చట శబరీనారాయణ మందిరము, రామ లక్ష్మణమందిరము, శివమందిరములు కలవు. ఇచ్చట విజయ దశమి, శివరాత్రిసమయములం దుత్సవములు జరుగును. యాత్రికులు శబరీనారాయణతీర్థమున స్నాన, తర్పణ, తీర్థవిధులు చేయుదురు. ఈ ప్రాంతమంతయు ప్రకృతిచే మనోహరముగ నుండును.

## కబర్ దహ్

మధ్యప్రదేశమున బిలాస్‌పూర్ జిల్లాలో కబర్ దహ్ నగరము కలదు. ఇచ్చట కబీరుసంప్రదాయమునకు చెందిన ప్రధాన పీఠము కలదు. కొన్ని దేవమందిరములుగూడ కలవు.

## అమరకంటకము

బిలాసపూర్ నుండి మరలి పిండారారోడ్డులో దిగవలయును. లేక అలహాబాదునుండి మణిక్‌పూరు (జం) కటనీ మీాదుగ కూడరావచ్చును.

రావణుడిచ్చట చాలకాలము నివసించెనట. అందుచేత దీనికి 'అమరకంటక' మని పేరు వచ్చెనని చెప్పుదురు. (అమర కంటకమన దేవతలకు కంటకప్రాయమైనది.) ఇచట నొక 'గులబకావళి' వృక్షము కలదు. భారతదేశమున మరెచ్చట నీ వృక్షము లేదని పండాలు చెప్పుదురు.

పిండారారోడ్డులో యాత్రికులకు తగు సౌకర్యములు గలవు. ఇచ్చట పండాలుకూడ నుందురు. ధర్మశాలలుమాత్రము లేవు. ఇచ్చటనుండి అమరకంటకమునకు యాత్రికు లధికముగ నడచివెళ్లుదురు. నడువలేనివారికి కేరాయికి ఏనుగ, గుఱ్ఱములు దొరకును. పిండారోడ్డునుండి 'అమానాలా' వరకు రోడ్డు బాగున్నది. ఇచ్చటనుండి బదరీకొండ లెక్కినటుల మెరకకు ఎక్కవలెను. ఆమానాలాకు సుమారు 5 మైళ్ళ దూరమున నర్మదానది గలదు. ఈ మధ్యభాగమున నరణ్యముగలదు. రీవాం రాజ్యము నర్మదానది కుత్పత్తిస్థానము. నర్మదాతీరమున క్షయ రోగులకు ఔషధము లేకుండనే రోగనివారణ జరుగును.

నర్మదాకుండము:— అమరకంటక మొక పర్వతము. అందు 'నర్మదాకుండము' గలదు. దాని ఒడ్డున యాత్రికులు బసచేయుదురు. ఈ కుండమునందలి జలము బయటకు 2 మైళ్ళ వరకు ప్రవహించి కొండ మీదనుంచి క్రిందకు పడుచున్నది. యాత్రికులిందు స్నానము చేయుదురు.

కపిలధార:— ఇచట యాత్రికులు బసచేయుటకు ధర్మశాలలు, పండాలగృహములు గలవు. ఇచ్చటి దేవాలయములు మహాభారతమునకు పూర్వమువని పండాలు చెప్పుదురు.

గాయత్రీకుండము:— అమరకంటకమునే 'రత్నపురమ'ని కూడ పిలతురు. కాళిదాసు తన మేఘసందేశమున నీయమర కంటకమును బేర్కొనెను. నర్మదా, జుహేలా, సోనా నదు లిచ్చటనే పుట్టుచున్నవి. ఇచ్చట 'గాయత్రీ కుండము' గలదు. గాయత్రీమంత్రోపాసకు లిచ్చట హోమాదికములు జేయుదురు.



అమరకంటక దేవాలయము
(పంజాబు రాష్ట్రప్రభుత్వ సౌజన్యముతో)

అమరనాథమందిరము:— 'అమరనాథ మహాదేవు'ని మందిరమును యుధిష్ఠిరుడు కట్టెనని చెప్పుదురు. అమరనాథుని పేరనే దీనికి అమరకంటక మని పేరు వచ్చెనని కింవదంతికూడ గలదు.

ఇచట భోజనసామాగ్రి సౌకర్యము తక్కువ. యాత్రికులు పిండారారోడ్‌నుండి భోజనసామాగ్రి తెచ్చుకొందురు.

**మాహాత్మ్యము:—** నర్మద శంకరునినుండి యుద్భవించెను. అందుచే నిది గంగకంటె శంకరునికి ప్రీతికరము. గంగయందు స్నానముచేసిన గలుగుఫలము, నర్మదను దర్శించినంత మాత్రమునగలుగునని 'అగ్నిపురాణమున' గలదు. నర్మదా జలముతో తర్పణము చేసిన పితృదేవత లనంతముగ తృప్తి చెందుదురు.

"నర్మదాచ మహాతీర్థం నరకద్వారనాశకమ్,
బ్రహ్మవిష్ణ్వాదిభిర్నిత్యం సేవితం శంకరేణచ" —సూతసంహిత

నర్మద నరకద్వారమును నశింపజేయు మహాతీర్థము. ఈ తీర్థరాజమును బ్రహ్మవిష్ణుమహేశ్వరు లెల్లపుడు సేవించుచుందురు.

## దమోహ్

పిండారారోడ్డునుండి, కట్నీ మీదుగ దమోహ్‌లో దిగవలయును. దమోహ్‌జిల్లాలోని కుండలపురమున, బాండకపురమున ప్రతిసంవత్సరము ఉత్సవములు జరుగును.

**కుండలపురము:—** ఇచ్చట జైనుల దేవుడగు నేమినాథుని మందిరము గలదు. హోలీ దాటినతరువాత నిచ్చట యుత్సవము జరుగును.

**బాండకపురము:—** క్రీ. శ. 1789 సం॥న దమోహ్‌లో నాగోజీవల్లాలు అను నొక పండితుడు నివసించుచుండెను. అతని తండ్రి కొకరోజున ఈశ్వరుడు స్వప్నమున గాన్పించెను తరువాత

నాతడు బాండకపురమున యోగేశ్వరమహాదేవ మందిరమును నిర్మించెను. శివరాత్రికి, వసంతపంచమికి నిచ్చట పెద్దయుత్సవము జరుగును. ఇది నర్మదాతీరమున గలదు. యాత్రికు లిందు స్నానము చేసి మహాదేవుని దర్శింతురు.

## సాగర్

దమోహ్‌నుండి సాగర్ స్టేషనులో దిగవలయును. ఇది సముద్రమునకు 1940 అ. యెత్తున గలదు. ఇది మధ్యభారతమున జబల్‌పూర్ రాష్ట్రమునకు చెందిన యొక నగరము. ఇచ్చట 'సాగర్' అను పేరుగల యొక నదము కలదు.



మహాదేవమందిరము (చూ. ఖజురాహో 501 పేజీ)

ఈ నదము 1 మైలు వెడల్పు గలిగియున్నది. దీనియొద్దున స్నానార్థము నిర్మింపబడిన ఘట్టము లనేకములు గలవు. ఇచ్చట మందిరములు చాల గలవు. విశ్వవిద్యాలయముకూడ కలదు.

## చందేరీ (చేదినగరము)

సాగర్‌నుండి బీనా (జం) మీదుగ లలితపురం చేరవల యును. లలితపురమునకు పశ్చిమముగ 18 మైళ్ల దూరమున గ్వాలియరు రాజ్యమున చందేర్ నగరము గలదు. పూర్వమిది చేదినగరము. ఇచ్చట శాలువలు, తలపాగలు బాగుగ తయారు చేయుదురు. ప్రస్తుత మీనగరమంత ప్రసిద్ధిగాంచి యుండ కున్నను పూర్వ మీనగరము వైభవోపేతమై విలసిల్లెను. అక్బరు రచించిన 'ఆయినే-అక్బరీ' యను గ్రంథమునం దీనగరము పేర్కొనబడెను. ఆగ్రంథమున చందేరీయందు 1400 రాతి భవ నములును, 384 బజార్లును, 360 కార్ఖానాలును, సత్రములు మఱియు 12000 మసీదులు ఉన్నట్లు వ్రాయబడెను. ఇవిగాక నిచ్చట నింకను దేవాలయము లనేకముకలవు. నొకయెత్తైన కొండమీద నొకకోటగలదు. ప్రాచీనభవనము లనేకములు నశించి పోయెను. వాని శిథిలములు దర్శనీయములు.

చేదిదేశాధిపతియగు (చందేల్) దమఘోషుని కుమా రుడు శిశుపాలుడు. ఇతడు రుక్మిణిని వివాహమాడుటకు కుండిన పురమునకువెళ్లి శ్రీకృష్ణునిచే పరాజితుడైనట్లు భాగవతమున గలదు.

భారత, భాగవతములలోని కథనుబట్టిచూడ ఈ నగరము మహాభారత కాలమునాటి దనియు, అతిప్రాచీనమైనదనియు తెలియుచున్నది. లలిపురమునకు దక్షిణముగ 10 మై. లో జాఖ లోన్ స్టేషను గలదు. ఇటకు 2. మై. లో గల జహాజ్‌పూరు నందనేక హిందూ జైన మందిరములు గలవు. చూడతగినవి.

## బాణాపురము - కుండేశ్వరుడు

లలితపురమునుండి టీకమ్‌గఢ్ మీదుగ రోడ్డుమార్గము కలదు. బుందేల్‌ఖండమున ఓఛడాయను రాష్ట్రమునకు టీకమ్‌గఢ్ అను నగరము రాజధానిగా నున్నది. ఆ నగరమునకు దక్షిణముగ 4 మై. దూరమున 'జమడ్‌దార్' యను నది కలదు. ఈ ప్రదేశము మనోహరముగ నేత్రపర్వ మొనర్చును. ఆలయమునకు దిగువ చిన్ననద ప్రవహించుచున్నది. ఇచట కుండమువలె నేర్పడి యగాధజలపూరితమై యున్నది. కుండమునకు ప్రక్కన నుండుటచే నీ స్వామికి కుండేశ్వరుడని పేరు వచ్చెను.

ఈ మందిరమున కారుమైళ్ళ దూరమున బాణాపురమను గ్రామము కలదు. శ్రీకృష్ణుని పౌత్రుడగు అనిరుద్ధుని మామగారగు బాణాసురుడు నివసించిన ప్రదేశ మిదియే యని చెప్పుదురు. ఈ కుండేశ్వరస్వామి యాతని యారాధ్యదైవమని కూడా చెప్పుదురు. వర్తమానమున నీ మందిరపరిసరములం దనేక భవనములు కట్టబడెను. మందిరమునకు కుడివైపున నొక జలపాతము గలదు. ఈ ప్రదేశము నయనానందకరముగ నుండును. ఇచట శివరాత్రికి ఉత్సవము జరుగును.

## ఝాన్సీ

లలితపురమునుండి ఝాన్సీ స్టేషనులో దిగవలయును. భారతదేశము వీరవనితలకు పుట్టినిల్లు. రణరంగమున వైరివీరులను చీల్చి చెండాడిన వీరనారీమణి ఝాన్సీ లక్ష్మీబాయి. ఆమె పేరు విన్నంతనే సింహస్వప్నమువలె వైరివీరులు పలాయనము చేసిరి.

ఆమె దర్శనము శత్రుభీకరము. వైరుల సంహరించికాని నిద్రించ నని ప్రతినబట్టి, శత్రువుల యమపురి కనిపి, తుదకు తన ప్రాణము లను యుద్ధరంగమున కోల్పోయిన సాహసికురాలు లక్ష్మీబాయి.



ఝాన్సీకోట (ఉత్తరప్రదేశ్ ప్రభుత్వ సౌజన్యముతో)

భాగీరథీబాయి మోరోపంతుల తపఃఫలమె లక్ష్మీబాయి. ఈమెకు తండ్రి చేసిన నామకరణము మనూబాయి. వివాహానంతరము అత్తవారి ఆచార ప్రకారము లక్ష్మీబాయి. భర్త గంగాధరరావు. రాజ్యమునకై శత్రువుల చీల్చి చెండాడుటచే ఝాన్సీ లక్ష్మీబాయి యని సార్థకమాయెను. ఆచంద్రతారకముగ ఆదర్శముగ వర్ధిల్లు కీర్తిగల వీరవనితలకన్న భారతాంబ భాగ్యమే భాగ్యము. లక్ష్మీబాయిచిహ్నముగ నేడు కోట, అందలి భవనములు విదేశీయులు సైతము గాంచుచుండిరి.

## సోనాగిరి

ఝాన్సీకి ఉత్తరముగ 15 మై. దూరమున దతియా స్టేషను కలదు. దతియా బుందేల్ఖండమునకు చెందిన యొక రాష్ట్రము. ఇచ్చటి రాజభవనము సుందరముగనున్నది. దతియాకుత్తరముగ 7 మై. దూరమున సోనాగిరిస్టేషను కలదు. ఇచ్చట

నొక పర్వతముపైన జైనుల సమాధు లనేకము గలవు. ఇటకు జైను లధికముగ వచ్చుచుందురు.

## గ్వాలియరు

దతియాకు 45 మై. దూరమున గ్వాలియరుస్టేషను కలదు. మధ్యభారతమునగల రాజధానులందు గ్వాలియరు పెద్దది. ఇది రాజధానీనగరము. వర్తమానమున పెరిగిన పట్నమును లశ్కర్ అనియు, పురాతన నగరమును గ్వాలియర్ అనియు పిలచుచుందురు. ఈ నగరమున నాగరికవ్యవస్థలన్నియు చాల సుందరముగ నున్నవి. ఒక మంచినగరమునం దుండవలసిన సౌకర్యములన్నియు నిందు గలవు.

ఇది చరిత్రప్రసిద్ధమైన నగరము. ఆకర్షణీయమైన శిల్ప సంపద యిక్కడ కొల్లలుగా నున్నది. ఇసుకరాతితో నిర్మించిన 2 మై. పొడవు, 300 అ. యెత్తుగల పురాతనమగు గ్వాలియర్ కోట మధ్యయుగమునాటి దుర్గనిర్మాణమునకు నిదర్శనము. కోట యొక్క ప్రధానద్వారము పూర్వోత్తరదిశామధ్యమున గలదు. ఈ కోటకు 6 ద్వారములు గలవు. వానికి వేర్వేర పేర్లు గలవు. ఈ కోటలో నడచుతఱి, అరేబియన్ నైట్సు కథలలోని మహా భవనములు మనోవీధిలో గోచరించును. దీని ఆవరణలో రాజా మాన్‌సింగ్ నిర్మింపజేసిన మాన్‌మందిరము హిందూ శిల్ప వైభవమునకు తార్కాణము. గోపురాలమీద సహజ సౌందర్యముతో నొప్పారు చిత్రకళ చూచుట కింపుగా నుండును. రాజా మాన్‌సింగ్ తన ముద్దులరాణి నిమిత్తము నిర్మించిన గుజారా మహాల్ ప్రస్తుతము పురాతన వస్తుశాఖవారి ప్రదర్శనశాలగా

మారినది. ఇందు అత్తగారియొక్కయు, కోడలియొక్కయు ఆలయములు ప్రధానములు. 1093 లో నిర్మించిన తేలీకామందిరము కోటలోని భవనము లన్నిటికంటె ఎత్తైనది. కోటచుట్టూ జైనతీర్థంకరుల విగ్రహము లనేకములు గలవు. అందొకటి 57 అ. ఎత్తు. జైవిలాసభవనము, దీనిలో ప్రపంచములోకెల్ల పెద్దది, బరువైనది ఇటాలియన్ పద్ధతిలో నిర్మించిన తివాచీయు చూడ తగినవి. మాజీమహారాజుల పాలరాతి ప్రతిమలు చాల కలవు.



సహస్రబాహు మందిరము

పాతబస్తీలో కోటకు సమీపమున గల మహమ్మద్ ఘోరీ మసీదు ముస్లిం శిల్పానికి నిదర్శనము. ప్రఖ్యాత గాయకుడైన తాన్‌సేన్ సమాధియు కలదు. దేశము నలుమూలలనుండి ప్రతి ఏటా గాయకు లిచ్చటకు వచ్చి, తాన్‌సేన్ సంస్మరణార్థము పాటకచేరీలు చేయుదురు. మరియు తమ గాత్ర మాధుర్యము పెంపొందటానికి సమాధిప్రక్కన గల చింతచెట్టు చిగురును భక్షించుదురు.

గ్వాలియా యనః పేరుగల సాధువునుబట్టి యీ నగరమునకు గ్వాలియర్ అను పేరు వచ్చెను. ఇచ్చట గ్వాలియా సాధు మందిరముగూడ కలదు. ఇచ్చట నొక సరస్సుగూడ కలదు. లక్ష్మణద్వారమను పేరు గల ద్వారముయొద్ద శ్రీ మహావిష్ణు మందిరము గలదు. క్రీ. శ. 877 కు చెందిన యొక శిలాశాసనమిచ్చట గలదు. ఈ మందిరద్వారమున రాతిని దొలిచి 50 శివలింగములు నిర్మింపబడెను. ఈ కోటలోని వాపీ, కూప, తటాకములందు జల మెన్నడు నెండిపోదు. క్రీ. శ. 300 లో నిర్మింపబడిన సూర్యకుండ మొకటి యీ కోటయందు గలదు.


తెలీకామందిరము

**కోటలోని మందిరములు:**— ఈ కోటలో చాలగ దేవతామందిరములు గలవు. గ్వాలియా మందిరము, తిల ఘాతకు మందిరము (దీని నొక తిల ఘాతకుడు కట్టించెను. పూర్వ మిది వైష్ణవమందిరము. కాని నేడిది శైవ మందిరముగ మారిపోయెను) సూర్య మందిరము, మాలాదేవ మందిరము, ధోదా దేవమందిరము, మహాదేవ మందిరము మొదలగునవి యిందు గలవు. కోటలో జైనమందిరములుగూడ చాల కలవు. ఇందు గుహాలసంఖ్యాకముగ గలవు. గ్వాలియరు దుర్గమునం దున్నంత పెద్ద జైనవిగ్రహములు ఉత్తర భారతదేశమునం దెచ్చటను గానరావు. ఈ విగ్రహములు కోట క్రిందగల పర్వతపు చరియలు దొలిచి నిర్మింపబడెను.

పూర్వగాథ:— పూర్వము సూర్యసేనుడను నొక రాజు గలడు. ఆతని మంత్రికి కుష్ఠురోగము వచ్చెను. ఆత డొక దినమున గ్వాలియరు పరిసరములకు వేటాడవచ్చి గ్వాలియా సాధు విచ్చిన జలమును ద్రావి, రోగవిముక్తుడయ్యెను. ఆతడు గ్వాలియా సాధువునకు తన కృతజ్ఞతను దెలుపుచు నీ దుర్గము నాతని పేర నిర్మించెను. కోటయందున్న సూర్యమందిరమును, సూర్యకుండమును ఆ మంత్రియే నిర్మించెను.

గ్వాలియరు నగరమున యాత్రికు లాగుటకు స్టేషనుకెదుట మహారాజు కట్టించిన ధర్మశాల యొకటి కలదు. ఇదికాక యొక ధర్మశాల నగరమధ్యమున గలదు.

## ముచికుందతీర్థము

గ్వాలియరునుండి ఢోల్‌పూర్ (జం) లో దిగవలయును. స్టేషనుకు సమీపమునందొక ధర్మశాల కలదు. యాత్రికు లిందు బసచేయవచ్చును. ఇచ్చటకు 3 మైళ్ళ దూరమున ముచికుంద తీర్థము కలదు. స్టేషనునుండి యీ తీర్థస్థానమువరకు చక్కని రోడ్డు కలదు.

ఈ తీర్థ మొక ఎత్తైన మనోహరస్థానమున గలదు. ఇచట నొక సరస్సు కలదు. దీనికి నలువైపుల చక్కని మెట్లు గలవు. చిన్న చిన్న పర్వములందుకూడ నిచ్చట నుత్సవములు జరుగును. ఈ సరస్సును ముచికుందతీర్థమని పిలతురు. భాద్రపదమాసమున పంచమీ షష్ఠీ దివసములం దిచ్చట పెద్దయుత్సవము జరుగును. వర్షాకాలమునం దిచ్చట ప్రకృతి సౌందర్యము మనోహరముగ నుండును. ఇచ్చట ముచికుందగుహకూడ కలదు.

పూర్వ మిక్ష్వాకువంశపు రాజగు ముచికుందు డీ గుహ యందు తపము చేయుచుండెను. ఆతడు దీర్ఘజీవి. ద్వాపరమున జరాసంధుని మిత్రుడగు కాలయవనుని తరుముకొనుచు కృష్ణు డిచ్చటకు వచ్చెను. భయముచే కాలయవను డీ గుహాయందు ప్రవేశించి ముచికుందుని తపస్సునకు భంగముగలుగజేసి యాతని క్రోధాగ్నిచే భస్మమైపోయెను. అని భాగవతమున గలదు. ఈ పర్వతమును గంధమాదనమని పిలతురు. ఈ ప్రదేశము చాల రమణీయముగ నుండును. ఇచటకు ఆగ్రానుండియు రావచ్చును.

## ఖజురాహా

ధోల్‌పూర్, ఝాన్సీ (జం) మీదుగ హరపాల్‌పూరులో దిగవలయును. ఇది బుందేల్ ఖండమునకు భూతపూర్వరాజధాని. ఇచ్చటనుండి ఛత్రపురము మీదుగ ఖజురాహో వరకు 60 మైళ్ల రోడ్డు కలదు. బస్సులు కలవు.



జవేరీదేవాలయము

(వింధ్యప్రదేశ్ ప్రభుత్వ సౌజన్యముతో)

ప్రస్తుత మీ రాజధాని తన ప్రాచీన వైభవమును గోల్పోయి పాడువారి యున్నది. చీనా యాత్రికుడగు హుయాన్‌సాంగ్, ఆతని తరువాత భారతదేశ పర్యటనకై క్రీ. శ. 4వ శతాబ్దారంభమున వచ్చిన ఇబ్నబతూతా ఖజురాహో నిట్లు వర్ణించిరి·

"ఖజురాహో నగరమున పెద్దపెద్ద జటలుగల యోగులు చాలమంది గలరు. వీరివద్ద మంత్రముల నుపదేశము పొందుటకు మహమ్మదీయులుకూడ వచ్చుచుందురు. ఈ నగరము చాల విశాలమైనది."—కాని ప్రస్తుత మీనగరమున జనసంఖ్య చాల తక్కువగ నున్నది. అటులయ్యునిచ్చట చాల శివమందిరములు, వైష్ణవ మందిరములు గలవు. ఈ మందిరముల శిల్పసంపద ఏమాత్రము చెడలేదు. ఖజురాహో చేరు మార్గము



దుల్హాదియా దేవాలయము
(వింధ్యప్రదేశ్ ప్రభుత్వ సౌజన్యముతో)

ప్రాచీనకాలమున దుర్గమముగ నుండుటచే మహమ్మదీయు లిచ్చటకు రాజాలకపోయిరి. అందువలననే యీ మందిరములన్నియు యథానిర్మితములుగ, సుందరముగ నున్నవి.

ఇచ్చట కండారియా మహాదేవీ మందిరమును, విశ్వనాథ మహాదేవమందిరమును చాల ప్రసిద్ధమైనవి. శివరాత్రిసమయము నందిచ్చట పెద్దయుత్సవము జరుగును.

భువనేశ్వర మందిరమువలె నీమందిరముకూడ శిల్పసంపదతో నొప్పారుచుండును. ఈ మందిరమున విగ్రహములు చెక్కబడని ప్రదేశము కానరాదు. పురాతత్త్వవేత్తల యభి

ప్రాయము ననుసరించి యీమందిరమున 900 విగ్రహములు గలవు. విశ్వనాథమందిరముకూడ నిట్లేయున్నది. కాని యీ మందిరము కండారి మహాదేవమందిరము కంటె చిన్నది. ఈ మందిరమునకు నలువైపుల నాల్గుమందిరములు గలవు. ఈ మందిరమున కేవల శివలింగమే కాక నందీశ్వరారూఢుడగు శివుని విగ్రహముకూడ గలదు. దీనికి నొకప్రక్క హంసవాహనారూఢుడగు బ్రహ్మ, రెండవప్రక్క గరుడవాహనారూఢుడగు విష్ణువుయొక్క విగ్రహములు గలవు. ఈ మందిరమునకు బయట చిన్న చిన్న విగ్రహము లనేకముః గలవు. ఈ రెండుమందిరములు 10 వ శతాబ్దమున నిర్మింపబడెనని చెప్పుదురు.

## మహోబా

హరపాల్‌పూరునుండి మహోబాస్టేషనులో దిగవలెను. ఇది హమీరాపూర్ జిల్లాకు చెందిన నగరము. 8 వ శతాబ్దమున చందేల్ రాజగు చంద్రవర్మ యీనగరమును నిర్మించెను. ఇచ్చట నొక మహోత్సవము కూడ చేయించెను. అందుచేతనే దీనికి 'మహోబా' యని పేరు వచ్చెను. చందేలురాజులు త్రవ్వించిన "మదనసాగర సరస్సు" యొక్క యొడ్డున నీ నగరము కలదు. చందేలువంశీయులనాటి శిల్పమును బ్రదర్శించు ప్రాచీనభవనము లనేకము లిచ్చట గలవు.

రాజా చంద్రవర్మ చనిపోయినప్రదేశమునం దొకకుండము గలదు. దీనిని రామకుండమని పిలతురు. ఇచ్చటికోట శిథిలమై పడి యున్నది. ఇచ్చట మదనవర్మ కట్టించిన మునిచాదేవి మందిరము కలదు. ఈ మందిరద్వారమున మదనవర్మ శిలాశాసనము కలదు.

కీర్తి సాగరమను వేరొకసరస్సుకూడ నిచ్చట కలదు. ఈ సరస్సులు స్వచ్ఛ జలపూరితములై చాల లోతుగ నున్నవి. ఈ సరస్తీరము నందును, ద్వీపములందును ప్రాచీనములగు ననేక భగ్నమందిర చిహ్నములును, పెద్దపెద్ద విగ్రహముల ముక్కలును కాన వచ్చును. ఇచ్చట కొండలమీద రాజపుత్రులు వేసవిలో నివసించు టకు, పూర్వము కట్టబడిన భవనములు గలవు. ఇచ్చట జాలాక్ ఖాన్ గోరీ, మసీదుకూడ గలవు.

## కబరాయా

మహోబానుండి కబరాయీ స్టేషనులో దిగవలయును. ఇచ్చట చందేల్ రాజగు వర్బాహమ్ త్రవ్వించిన బ్రహ్మకుండము గలదు. దీని యొడ్డున చాల మందిరములు, భవనముల శిథిల ములు కానవచ్చును. అన్నియు దర్శనీయములు.

## బాందా

కబరాయీనుండి బాందా స్టేషనులో దిగవలయును. ఇది 'కేన' నదీతీరమున గలదు.

బాందాయందు 161 మందిరములు కలవు. బాందాలో నొక చిన్నకొండయందు పాండవేశ్వరమహాదేవమందిరము కలదు. ఇచ్చట నొక చిన్న గుహాకూడ గలదు. పాండవులు వనవాస సమయమునం దిచ్చట నివసించిరని చెప్పుదురు. కేననదీతీరమున క్రీ.శ. 1784 లో గుమాన్‌సింహుడు కట్టించిన "భూరాగఢ్" అను పేరుగల దుర్గము శిథిలమైపడియున్నది.

# కాలింజర్ కోట

చాందానుండి బదౌసా స్టేషనులో దిగవలయును. బదౌసాకు 18 మైళ్ల దూరమున కాలింజర్ నగరము గలదు. ప్రసిద్ధమగు కోట. ఇది సముద్రతలమునకు 1230 అడుగుల యెత్తున గలదు. ఇది పర్వతప్రదేశము. ఇందధికముగ బ్రాహ్మణులు నివసించుచుందురు. పూర్వ మీ నగరమునకు ప్రాకారమండెడిది. ప్రస్తుతము మూడుద్వారములు మాత్రము గానవచ్చుచున్నవి. వానికి 'కామర, రీవా, పన్నా' ద్వారములని పేర్లుగలవు. కాలింజర్ పర్వతసమీపమున సురసరిగంగాయను సరస్సు గలదు. దీనికి చక్కని రాతిమెట్లు గలవు.


ఖుండారియా మహాదేవాలయము
(వింధ్యప్రదేశ్ ప్రభుత్వ సౌజన్యముతో)
(చూ. ఖజురాహో 501 పేజి)

కోట, చరిత్ర:— ఈ కోట బుందేలఖండమునకు చెందిన కోటలలో చాలప్రాచీనమైనది. క్రీ.శ. 3వ శతాబ్ద మధ్యభాగమునం దీ కోటను చందేల్ రాజవంశమునకు జెందిన చంద్రబ్రహ్మ కట్టించెనని హిందీ కవులం దగ్రగణ్యుడు పృథ్వీరాజునకు మిత్రుడు నగు చందబరదాయిమహాకవి తన 'పృథ్వీ రాజురాసో' యను గ్రంథమున జెప్పెను. 3వ శతాబ్దాంతమున హైహాయవంశజు లీ కోటను జయించిరి. క్రీ. శ. 336 ప్రాంతమున సముద్రగుప్త మహారా

జీకోటను తన రాజ్యమున గలుపుకొనెను. క్రీ. శ. 9వ శతాబ్దమున మరల నీకోట చందేల్ రాజవంశీయులకు వశమయ్యెను. క్రీ. శ. 10వ శతాబ్దాంతమున మనదేశమునకు యాత్రకై వచ్చిన మహమ్మదీయ ఇతిహాసకారుడగు అబూరిహాను కాలింజరుకోట ఖజురాహో రాజ్యాంతర్గతమై యున్నదని వ్రాసెను.

క్రీ.శ. 1022లో గజనీ యీకోటలోని రాజగు నందదేవునకు మిత్రుడై యిచ్చటకు వచ్చియుండెను. నందదేవుని పౌత్రుడే పరమాల్ సుప్రసిద్ధవీరులగు "ఆల్హా, ఊదల్" యీ రాజునకే సైన్యాధిపతులుగ నుండెడివారు. ఈపరమాల్ రాజ్యకాలముననే క్రీ. శ. 1203 లో కుతుబుద్దీన్ ఐబక్ కాలింజరును ముట్టడించి జయించెను. అనంతరము 6 సంవత్సరములకు హిందువులు మరల నీకోటను స్వాధీనము జేసుకొనిరి. మరల క్రీ. శ. 1530 లో హుమాయూను కోటను వశపరచుకొనెను. ప్రసిద్ధ శాసనకారుడని కీర్తిగాంచిన శేరశాహ్‌సూర్ యీకోటను ముట్టడించుచునే ప్రాణములను క్రీ. శ 1545 లో గోల్పోయెను. అక్బరు సమయమున కాలింజర్ దుర్గాధిపతి అక్బరునకు సామంతుడై నడిల్లెను. 17 వ శతాబ్దము వరకు మరల నెట్టిదండయాత్రలు యీకోట మీద జరుగలేదు. 18 వ శతాబ్ద ప్రారంభమున ఔరంగజేబు మరణించగనే బుందేల్‌వీరుడగు ఛత్రసాలు డీకోటను వశము జేసికొనెను. క్రీ. శ. 1812 లో యీకోట యింగ్లీషువారికి వశమయ్యెను.

కోటలోని మందిరములు:— సురసరి గంగా సరోవరమునకు పూర్వోత్తరముగ కొండమీదకు పోవు మార్గమున నగము

దూరమున 'వనఖండేశ్వర మహాదేవమందిరము' కలదు. ఇంత వరకు నేటవాలుగ మార్గము కలదు. ఇటనుండి యుత్తరముగ నేడు మార్గములు దాటి కోటలోనికి వెళ్ళవలయును. ఆలమ్ (షౌరంగ జేబు), గణేశ, చండీ, బలభద్ర ద్వారములను దాటగనే 45 గజముల పొడవు, 10 గజములవెడల్పుగల భైరవకుండము కాన్పించును. దీనికి 30 అ. దూరమున భైరవ విగ్రహము కలదు. దీనికి దిగువ నొక గుహ కలదు. ఇట నొక శిలాశాసనము కలదు. తరువాత అరుణద్వారము, ముఖ్యద్వారమునుదాటి కోటలో ప్రవేశించవలయును. కోటలోపల నొకచోట రాతిని దొలిచి నిర్మించిన సీతాదేవి శయ్య కలదు. ఇటకూడ నొక శాసనము కలదు. ఇటనుండి పాతాళగంగకు పోవు మార్గము కలదు. ఈ గంగలోనికి దిగుట కష్టము. ఇది 40 అ. పొడవు, 30 అ. వెడల్పు



తూర్పుద్వారము - సాంచి (చూ. 488)
(భోపాల్ ప్రభుత్వ సౌజన్యముతో)

దూరమున 'వనఖండేశ్వర మహాదేవమందిరము' కలదు. ఇంత వరకు నేటవాలుగ మార్గము కలదు. ఇటనుండి యుత్తరముగ నేడు మార్గములు దాటి కోటలోనికి వెళ్ళవలయును. ఆలమ్ (షౌరంగ జేబు), గణేశ, చండీ, బలభద్ర ద్వారములను దాటగనే 45 గజముల పొడవు, 10 గజముల వెడల్పుగల భైరవకుండము కాన్పించును. దీనికి 30 అ. దూరమున భైరవ విగ్రహము కలదు. దీనికి దిగువ నొక గుహ కలదు. ఇట నొక శిలాశాసనము కలదు. తరువాత అరుణద్వారము, ముఖ్యద్వారము నుదాటి కోటలో



తూర్పుద్వారము - సాంచి (చూ. 486)
(భోపాల్ ప్రభుత్వ సౌజన్యముతో)

ప్రవేశించవలయును. కోటలోపల నొకచోట రాతిని దొలిచి నిర్మించిన సీతాదేవి శయ్య కలదు. ఇటకూడ నొక శాసనము కలదు. ఇటనుండి పాతాళగంగకు పోవు మార్గము కలదు. ఈ గంగలోనికి దిగుట కష్టము. ఇది 40 అ. పొడవు, 30 అ. వెడల్పు

కలిగియున్నది. దీనికి తరువాత పాండుకుండము కలదు. ఇటనుండి యొకమార్గము బుద్ధిసరస్సునకు పోయెను. తరువాత నీశ్వరుని శయ్య కలదు. ఇటకు సమీపమునందే మృగధారా యను ప్రసిద్ధ స్థానము కలదు. ఇట నొక కుండము, రెండు రాతిగదులు కలవు. ఇచ్చటనే 7 హరిణవిగ్రహములు కలవు. సప్తర్షులు గురుశాప వశమున నిట్లు హరిణరూపము నొందిరని యిచ్చటివారు చెప్పు దురు. యాత్రికులు వీనిని పూజింతురు. మృగధారాకుండమునుండి కొంచెము ముందునకేగిన కోటితీర్థము కానవచ్చును. ఇది కోటకు మధ్య కలదు. ఇది యొక పెద్ద చెఱువు. దీని యొడ్డునం దనేక భవనములు కలవు. దీనినుండియే మృగధారాకుండములోనికి జలము వచ్చుచుండును.

ఇచ్చటనుండి క్రిందికి దిగుచుండగ జైనతీర్థంకరుల ప్రతి మలు కానవచ్చును. తరువాత జటాశంకర, క్షీరసాగర, తుంగ భైరవ మందిరములు, కొన్ని గుహలు, నీలకంఠమందిరము కాన వచ్చును. ఇచట చాల శిలాశాసనములు కలవు. నీలకంఠమందిర మొకప్పు డేడంతస్తులు కలిగియుండెడిది. కాని నేడొకేయంతస్తు కానవచ్చును. ఇటకూడ ననేక శిలాశాసనములు కలవు. పిమ్మట నొక సరోవరము, 30 అడుగుల యెత్తు గల భైరవవిగ్రహము కానవచ్చును.

కాలింజర్ మాహాత్మ్యము మహాభారత వనపర్వమునం దధికముగ వర్ణింపబడెను. అదికాక లింగపురాణమునందు, శివ పురాణమునందు నీస్థాన మహాత్మ్య మధికముగ వర్ణింపబడెను. 'కాలింజర్ మాహాత్మ్య' మను పుస్తకమున నీ దుర్గము నాల్గు

యుగములకు చెందినదని చెప్పబడెను. ఈ కోట చాల విచిత్రమైనది. భాగవతమున వర్ణింపబడిన * జడభరతుడు యిటచనే తపస్సు చేసెను.

## పన్నా

కాలింజర్‌కు దక్షిణముగ చాందాజిల్లాలో 'పన్నా' నగరము కలదు. ఇది సముద్రతలమునకు 1147 అడుగుల యెత్తున గలదు. ఇది యొక సుందరమైన నగరము. ఇచ్చట బలదేవ



బుద్ధునిఆలయము _ సాంచి. (చూ. 486 పే.) _ భోపాల్ ప్రభుత్వ సౌజన్యముతో

మందిరము చూడదగినది. ఇదికాక నిచ్చట నింకను మందిరములనేకములు కలవు. ఈ నగరము వజ్రపుగనులకు ప్రసిద్ధి చెందినది. పూర్వమువలె నధికముగ వజ్రములు లభింపకున్నను సంవత్సరమునకు సుమారు 1 లక్ష రూపాయలు విలువగల వజ్రము లీగనుల

---

* చూడుడు "జడభరతుడు" అను గ్రంథము. (మా ప్రచురణ)

నుండి లభించుచుండెను. పూర్వము పన్నా నగరాధీశున కొక మహాత్ముఁడు పన్నానగరమున వజ్రములు లభించునని వరమిచ్చె నని చెప్పుదురు.

## బృహస్పతి కుండము
### ( శైలోదకము )

బదాౕసానుండి 'సతనా' స్టేషనులో దిగవలయును. అతర్ స్టేషనులో దిగికూడ యిచ్చటకు వెళ్ళవచ్చును. సతనా స్టేషనులో దిగిన 2 మైళ్లు నడువవలసియుండును. 'అతర్' స్టేషనులో దిగిన సుమారు 6 మైళ్ల దూరము నడువవలసియుండును. ఇచ్చట నొక కుండము గలదు.

పూర్వము మహావిష్ణువు వరాహావతారము ధరించినపుడు భూమి యాతనిభారమును వహించలేక యణగిపోయెను. అప్పు డామె కతి భారవహనముచే చెమటబట్టెను. ఆ స్వేదజలము పర్వతములనుండి ప్రవహించుచు నీ కుండమును జేరెను. ఈ జలమున కనేకములగు నద్భుతగుణములు గలవు. ఈ జలమును సేవించిన రోగుల రోగములు నశించును. ఇచట నొక శతవృద్ధుడగు మహాత్మున కీ జలమువలన ననేకాద్భుత శక్తులు కలిగెను. ఈ కుండమునందలి జలము ప్రతిఋతువునందు వేర్వేరు రంగులు కలిగియుండును.

## రాజాపురము

సతనానుండి కరవీ స్టేషను లేక చిత్రకూటము స్టేషనులో దిగవలయును. ఇది కరవికి 18 మైళ్ళదూరమున, చిత్రకూటము

నకు 23 మైళ్ళ దూరమున యమునాతీరమున కలదు. ఇది యొక సుందరమైన గ్రామము. గోస్వామి తులసీదాసు యీ గ్రామముననే జన్మించెను. తులసీదాసు వంశస్థులు నేటికిని యీ గ్రామమున గలరు. గోస్వామి తులసీదాసు వ్రాసిన హస్తలిఖితప్రతి యొకటి యీ గ్రామమున గలదు.



తులసీదాసు

## చిత్రకూటము

"సురమ్య మాసాద్యచ చిత్రకూటం నదీంచ తాం మాల్యవతీం సుతీర్థమ్,
ననంద రామో మృగపక్షిజుష్టాం జహౌచ దుఃఖం పురవిప్రవాసాత్॥

— స్కాందము

ఇచటకు అలహాబాదునుండి మణిక్‌పూరు (జం) మీదుగను రావచ్చును. కరవీనుండి 5 మైళ్లు. బండ్లు గలవు. కాలిమార్గమునను వెడలుదురు. చిత్రకూటముస్టేషన్ లోను దిగవచ్చును.

పరోష్ణీ:— మార్గమధ్యమున ఉత్తరవాహినిగా ప్రవహించు పరోష్ణీనదికలదు. ఇందు వర్షాకాలముతప్ప యితరకాలములో మోకాలుబంటికన్న నీరుండదు. యాత్రికులిందు స్నానతర్పణములు గావింతురు.

సీతాపురము:— చిత్రకూటమునకు సమీపమున సీతాపురము (చిన్నగ్రామము) కలదు. చిత్రకూటమున ధర్మశాలలు కలవు. చిత్రకూటము ఉత్తరవాహినియగు మందాకినీ తీరమున గలదు. ఈ నదిని గురించి కవికులతిలకుడు శ్రీ కాళిదాసు తన

మేఘసందేశమున మిక్కిలి మనోహరముగ వర్ణించియున్నాడు. ఈ నదికిరుప్రక్కల తీర్థములందు పెద్దపెద్ద దేవాలయములు, గృహములుగలవు. మందాకినిలో స్నానము, తీర్థవిధి గావించవలయును. సీతాపురములో వానరములు విపరీతముగా నున్నవి. యాత్రికులు వీనికి జామిపండ్లు, శనగలు కొనిపెట్టుదురు. సీతాపురమున రాతితో చిన్నచిన్న పాత్రలు బహువిధముల మిక్కిలి యందముగా జేతురు. అన్నివసతులుగల ధర్మశాలలు గలవు.



హరగౌరి _ రీవా. (చూ. 516 పేజి)
(వింధ్యప్రదేశ్ ప్రభుత్వ సౌజన్యముతో)

రామఘాట్ :— మందాకినీనదికి ప్రధానఘట్టము. పూర్వము రాముడు అరణ్యావాసకాలమున అలహాబాదు మీదుగ యమునదాటి యిటకు వచ్చి చిత్రకూటమున నివసించెను. రాముడిచటనే యింగుదీఫలములతో పితృశ్రాద్ధము చేసెను. శ్రీ గోస్వామితులసీదాసున కిచటనే రామలక్ష్మణులు దర్శనమిచ్చిరి.

బ్రహ్మయజ్ఞ కుండము:— రామఘాటుకు కొంచెము పైభాగమున పూర్వము బ్రహ్మ యజ్ఞముచేసిన స్థానము కలదు. ఇచట సీతారామలక్ష్మణుల యాలయములు గలవు. దశరథుడు

చనిపోయినపుడు రాముడు పురమునకు వెళ్లుటగురించి ఋషులతో చర్చించిన దిచటనె.

చిత్రకూటము:— సీతాపురమునకు చిత్రకూట మొక మైలు. మార్గము పొడవున గృహములు కలవు. చిత్ర విచిత్ర దృశ్యములు కలది గాన 'చిత్రకూట'మనియు, కోరికలిచ్చునది గాన 'కామదగిరి' కామదనాథుడు యనియు నామములు గలవు. శ్రీరాముడు వనవాస కాలమున యిచటకు వచ్చి తొలుత నీకామదనాథుని పూజించి, పిమ్మట నీ పర్వతమున నివసించెనట. కామదనాథుని ముఖగులు ఈ



చిత్రకూటము (వింధ్యప్రదేశ్ ప్రభుత్వ సౌజన్యముతో)

పర్వతమునకు నలువైపుల కలవు. యాత్రికులు యీచిత్రకూటమునకు ప్రదక్షిణము చేతురు. ఇందువలన మహత్తరఫలము గలదు. ఈ పర్వతమును గురించి రామాయణమున విపులముగ వర్ణింపబడినది. ఈ పర్వతము చుట్టుకొలత 3 మైళ్లు. క్రీ శ. 1725 సం॥న ఛత్రపాలుని రాణి చాంద్‌కనరి ఈ పర్వతమునకు చుట్టు గచ్చు చేయించెను. ప్రదక్షిణసమయమున, రాముడు నివసించిన కాలమునాటి దృశ్యములు (మందిరములు) కొన్ని చూడవచ్చును.

సీతారామవృక్షము:— చిత్రకూట పరిక్రమణ సమయమున మార్గమధ్యలో నొక వృక్షము కలదు. ఇది మేడిచెట్టువలె నున్నది. ఈ వృక్షము మొదటినుండి చివరవరకు లోపల, పైన కూడహిందీలిపిలో 'సీతారామ' అను యక్షరములు కలవు. దానిని 'సీతారామ వృక్ష' మందురు. మేముస్వయముగ చూచితిమి. చిత్రకూటమున శతసంఖ్యాకములగు తీర్థములు, విశేషస్థానములుగలవు. ఇట శక్తిసంపన్నులగు మహార్షులు గలరు.



చచాయిఫాల్సు - రీవా. (చూ. 516 పేజి)
(వింధ్యప్రదేశ్ ప్రభుత్వ సౌజన్యముతో)

జానకీకుండము:— సీతాపురమునకు 2 మైళ్ళ దూరమున నదీతీరమున యీ కుండము గలదు. కుండములో మధ్య నొక తెల్లరాతిమీద సీతారాముల చరణచిహ్నములు గలవు.

అనసూయాశ్రమము:— అనసూయాదేని సీతాదేవికి పాతివ్రత్యధర్మముల నిచ్చటనే బోధించెను. ఇచ్చట నొక మందిరమున అనసూయా, అత్రిమహర్షుల విగ్రహములు గలవు.

లక్ష్మణపహాడ్:— వనవాస సమయమున రాత్రియందు లక్ష్మణు డీ పర్వతము నధిరోహించి, జాగరూకుడై యుండెడి

వాడు. కామదగిరికి సమీపమున నొక పర్వతముమీద సుమారు 225 మెట్లెక్కిన శ్రీ లక్ష్మణస్వామిని దర్శించవచ్చును.

హనుమాన్ ధార:_ ఇదియొక పర్వతముమీద నున్నది. యాత్రికులు నడచి లేక డోలీలమీద వెళ్లుదురు. ఇచట పర్వతముమీద పెద్ద హనుమంతుని విగ్రహము గలదు. హనుమంతుని పైభాగమునుండి, యొకజలధార క్రింద నొక కుండమున పడుచుండును. పూర్వము ఆంజనేయుడు లంకాదహనము చేసి, రామసన్నిధికివచ్చి 'దేహముమండుచున్నది బాధసహించలేనని' నుడువగా, రాముడు బాణమువేసి యీజలధార, ఆవిర్భవింపజేయగా నిందు స్నానముచేసి, ఆంజనేయస్వామి సుఖుడాయెనని చెప్పుదురు.



మీరాబాయి

(చూడుడు. చిత్తూర్ ఘర్)

ఇతరములు:— సిద్ధబాబా కుటీరము, గుప్తగోదావరి, భరతకూపము, రామశయ్య, కోటితీర్థము, దుర్గాలయము, లక్ష్మీనారాయణ మందిరము మొదలగు దర్శనీయము లనేకములు గలవు. చిత్రకూటమున శ్రీరామనవమికి, కార్తీకమాసమున పెద్ద యుత్సవముజరుగును. ఆసమయమున వివిధ ప్రదేశములనుండి చాలమంది యాత్రికులరుదెంతురు. - ఆశ్వీయుజ శుద్ధపూర్ణిమ కిచట నొక సాధువరుదెంచి, క్షీరాన్నముతో నొక మూలికను శ్వాసరోగుల కిచ్చును. రోగము వెంటనే పోవును. ఇచట నొక సంస్కృతపాఠశాల, పోష్టాఫీసు, ప్రభుత్వపు హాస్పటల్ కలవు. ఇచ్చట గుహాల్లయందు ధనేకులు తపస్సంపన్నులు నేఁడును గలరు.

మాహాత్మ్యము:–కోటితీర్థములలోను, మందాకినిలోను, స్నానముచేసిన మనుజు డశ్వమేధయాగ ఫలమందును. మందాకినీ గుప్తగోదావరులందు, నిరాహారియై తీర్థవిధిచేసిన మనుజున కైశ్వర్యము, జ్ఞానముకలుగును. అని మహాభారతము, శివపురాణాదులలో చెప్పబడియున్నది.

చిత్రకూటప్రదక్షిణము:— చిత్రకూటమునకు ప్రదక్షిణము చేయుటకు, అయిదురోజులు పట్టును. ఈ ప్రదక్షిణమున యింకను ననేకవిషయములు చూడనగును. కేవల చిత్రకూట పర్వత ప్రదక్షిణమున కొక పూట చాలును.

## రీవా

మాణిక్‌పూరు (జం) కు దక్షిణమున 'శత్న' స్టేషనులో దిగవలయును. ఇటకు రీవా ౩౧ మైళ్లు. మంచిమార్గము కలదు. బస్సులు, బండ్లు గలవు.

రీవా వింధ్యప్రదేశ్ రాష్ట్రమునకు రాజధాని. వాఘేల ఖండము, బుందేలఖండములలోని ఇరువదియైదు సంస్థానములు కలిసి వింధ్యప్రదేశ్ రాష్ట్రమయినది. ఈ సంస్థానము లన్నిటిలోను రీవాయే పెద్దది. వింధ్యప్రదేశ్‌కు ఉత్తరముననను, తూర్పునను ఉత్తరప్రదేశ్ రాష్ట్రమున్నది. దానికి దక్షిణమున మధ్యప్రదేశ్ రాష్ట్రమును, పడమట మధ్యభారత్ రాష్ట్రమును సరిహద్దులు. 1954 వ సంవత్సరపు జనాభా లెక్కల ననుసరించి వింధ్యప్రదేశ్ జనాభా 35,74,690. ఇక్కడ మాతృభాషలు హిందీయును, దానికి సంబంధించి యించుక భేదముగల వాఘేల ఖండ్, బుందేలఖండ్ భాషలును, ఈ రాష్ట్రములో ఖనిజములు

చాల కలవు. వాటిలో ముఖ్యమైనది నేలబొగ్గు. ఈ రాష్ట్రములోని పన్నావజ్రములు ప్రసిద్ధిగాంచినవి. రీవాసంస్థానము పూర్వపు రాజధాని చాంధోగఢ్. దానిని 1597 లో అక్బరుషాదుషా నాశనముచేసిన తరువాతనే రీవా ముఖ్యపట్టణమైనది. విక్రమాదిత్యుడిక్కడ రమ్యహర్మ్యములు, సుందరభవనములు కట్టించి దీనిని ఒక గొప్పసంస్థానమునకు తగిన పెద్దనగరముగా రూపొందించెను.

రీవా పురమునకు పూర్వపు పేరు రేవా. నర్మదా నదికి రేవాయనియు పేరు కలదు. సుప్రసిద్ధపుణ్యతీర్థము అమరకంటక్ (అమరకంటకము) వింధ్యప్రదేశ్ లోనిది. ఈ యమరకంటకము వద్దనే నర్మదానది పుట్టుచున్నది.



రీవాకోట – పుటాలియాద్వారము (వింధ్యప్రదేశ్ ప్రభుత్వ సౌజన్యముతో)

ఈసంస్థానమునకు రీవా యను పేరు. దీనిని పాలించిన పాలకవంశమునుబట్టి ఇటీవల 17, 18 వ శతాబ్దములలో వాడుకలోనికి వచ్చినది. మహామ్మదీయ చరిత్రకారు లెన్నడును దీనిని రీవా యని వ్యవహరించియుండలేదు. మహామ్మదీయ యుగమునకు పూర్వ మిది మహాకోసలము, చేదిదేశము, డాహాలదేశము అను పేర్లతో వ్యవహరింపబడుచువచ్చిన ప్రదేశములో అంతర్భాగముగ నుండెడిది. రీవా పాలకులు వాఘేలా రాజపుత్రులు. వీరిది సోలంకి (చాళుక్య) వంశములోని ఒక శాఖ. వీరు మొదట

అనహిల్వాడ పట్టణము రాజధానిగా ఘూర్జరమును పరిపాలించిరి. (క్రీ. శ. 1286 - క్రీ. శ. 1304). వీరికాలములోనే మహమ్మదీయులు ఘూర్జరమును చిట్టచివరిసారి జయించి వశపరచుకొనిరి. వీరిమంత్రులు వస్తుపాల, తేజపాలురు జైనులు. వీరు ఆబూపర్వతము మీఁదను, గిర్నారువద్దను అత్యంత రమణీయములయిన జైనదేవాలయములను నిర్మించిరి. పూర్వపు వాఘేలా వంశమునకుచెందినవారే రీవా సంస్థానాధీశులు.



గోవిందదేవ మందిరము - ఓర్ఛా.
(వింధ్యప్రదేశ్ ప్రభుత్వ సౌజన్యముతో)

ఖజురాహోలోని అద్భుత దేవాలయములు పురాతనమైన చాంధోగఢ్ (దుర్గము), ఓర్ఛా దేవాలయములు, ఓర్ఛావద్ద కట్టబడిన ఉద్యానవనముతో కూడిన జహాంగీర్ మహాలు, అమరకంటకమువద్ద నర్మదానది జన్మస్థానము — ఈ మొదలైనవి వింధ్యప్రదేశ్ లో చూడదగిన స్థలములు.

# అమరావతి

వార్ధాకు పశ్చిమముగ బడనేరా స్టేషను కలదు. ఇటకు నుత్తరముగ 6 మై. దూరమున అమరావతీస్టేషను కలదు. ఈ నగరమున 8 సుప్రసిద్ధములగు మందిరములు గలవు. వీనియందు

అంబామందిరము సుప్రసిద్ధమైనది. అంబామందిరముండుటవలననే దీనికి 'అంబావతి' యను పేరు కల్గెననియు, అదియే రానురాను అమరావతిగమారెననియు చెప్పుదురు. ఇచ్చట దూదివ్యాపారము జరుగును. ఇచటకు వార్ధా (చూ. 483 పే.) నుండి పోవలయును.

## భాకులబాబా (మణిపర్వతము)

ఈ మందిరము నాగదా రాజ్యాంతర్గతమగు భమరా గ్రామ సమీపమున పారస్ మణిపర్వతమున ఘోరారణ్యమున గలదు. ఈ మందిరము చాల పురాతనమైనది. ఇది క్రీ. శ. 2వ శతాబ్దమున గట్టబడెను. ఈ మందిరమున నొకముఖముగల శివ లింగము కలదు. క్రీ.శ. 2వ శతాబ్దమునకుచెందిన శాసనములు కలవు. పురాతత్త్వ పరిశోధకుల యభిప్రాయము ననుసరించి యీ యాలయము 'భారశివ' వంశీయులు నిర్మించినదిగ దోచు చున్నది. క్రీ.శ.1వ శతాబ్దమున విదిశానగరమును నాగవంశీయులు పరిపాలించిరి. వీరు శివభక్తులు. ఈ సమయముననే కుషాణులు భారతదేశముమీద దండెత్తి యుత్తరభారతము నంతను వశము జేసుకొనిరి. వీరి పరిపాలనాసమయమునం దనేక హైందవ దేవా లయములు భగ్నముగావించి, హిందువులు దేవతలను పూజిం చుట నిషేధింపబడెను. ఇట్టితరి విదిశానగరము నేలు నాగవంశీ యుల పరిస్థితి కూడ మారెను. వారును తమ రాజ్యమును గోల్పోయి ప్రస్తుత భాకులబాబా మందిరముగల యరణ్యమున తలదాచుకొనిరి. ఈ స్వామిని (లింగమును) వారు మోసి యీ యరణ్యమునకు దెచ్చి పూజించుచు, నిచ్చటనే యొక చిన్న రాజ్యమును స్థాపించిరి. శివలింగభారమును వహించుటచేత వీరు

భారశివు లనబడిరి. పిమ్మట శివానుగ్రహమున వీరు కుషాణులను గంగానదీతీరమునం దోడించి రాజ్యాభిషిక్తులైరి. వీరనేక శివ మందిరములను, భాకులబాబామందిరమును గట్టించిరి. భారకుల శబ్దము భాకులముగ మార్పుచెందెను. భారశివులు చాలకాలము రాజ్యముచేసినట్లు చరిత్ర వలన తెలియుచున్నది. భారశివవంశమునకుజెందిన 7వ చక్రవర్తియగు భవనాగునికి పుత్రికయే జనించెను. ఈ శైవులగు వకాటక రాజవంశమునం దిచ్చి వివాహముగావింపబడెను ఇట్లుభారశివవంశము వకాటక వంశముగ మారెను. వీరుకూడ ననేక శివాలయములను గట్టించిరి. వీరి వలననే దక్షిణాపథమున గూడ శైవమత మభివృద్ధి గాంచెను. వాకాటక వంశీయులే దక్షిణాపథమునకు వచ్చి పల్లవవంశమును స్థాపించిరి.



దుల్హాదియా దేవాలయము (మరియొకదృశ్యము)
(చూ. ఖజురాహో 501 పేజి)

ఈ వాకాటకవంశీయులు గట్టించిన శివ, పార్వతీ మందిరములు భుమరాకు 13 మైళ్ళ దూరమున 'నచనా'యందు గలవు. ప్రస్తుత మిందు విగ్రహము కానరాదు. హిందూదేవాలయము లిట్టులనేకము కాలగర్భమున లీనమయ్యెను. ఇవి చూడదగినవి.

# సుందరభారతయాత్ర

## రామేశ్వరఖండము

### [ దక్షిణము ]

ఇది మొదలు నెల్లూరు, మదరాసు, చంగల్పట్టు, రామేశ్వరం, కన్యాకుమారి, మైసూరు, కొల్హాపూర్, హంపి, శ్రీశైలం, గుంటూరు, బెజవాడ వరకు దక్షిణభారతముగా పరిగణింపబడెను.

దక్షిణభారతదేశము (Southern India) ఉష్ణమండల ప్రాంతము. అతి సారవంతమైనది. జనాభా చాల యెక్కువ. మలబారుతీరమున, పడమటికనుమల సహజసౌందర్యము కొబ్బరితోటల కమనీయదృశ్యములు మరతుమన్నను మరపురానివి. మైసూరు సహజసుందరమైనదేశము. పండుగరోజులలో నిక్కడ కనుపడు వైభవము, ఆడంబరము, అక్కడి చేతిపనులు, కొండలు, అడవులు, జలపాతములు చిరస్మరణీయములు. ఇక ప్రకృతి రమణీయతకు ఆటపట్టయిన నీలగిరులు, వానిమీద గల మనోహరమైన వేసవి విశ్రాంతికేంద్రములు, ఉదకమండలము, కోటగిరి, కూనూరు మిక్కిలి యందముగ నుండును. దక్షిణభారతమున, దక్షిణాగ్రమున గల తిరువాన్కూరు, కొచ్చిన్ సీమసౌందర్యము అపూర్వము, అనుపమము. అతి ప్రాచీనమైన ద్రావిడ నాగరికతకు దక్షిణభారతము ఆటపట్టు. దాక్షిణాత్యుల

శిల్పకళానైపుణ్యము ఇక్కడి దేవాలయములలో విశేషముగ వ్యక్తమగుచుండును.

దక్షిణభారతమున 6 వ శతాబ్దిలోని జైనదేవాలయములకు ప్రసిద్ధిచెందిన బాదామీ, ప్రపంచప్రఖ్యాతమైన గోల్ గుంబజ్ మసీదుగల బీజపూరు, నటరాజమందిరముగల చిదంబరము, జలపాతములకు ప్రసిద్ధిజెందిన కోర్తాలము, మహోన్నత పురాతనశిల్పమునకు గీటురాయి యనదగిన హంపి, మనోహరముగా పర్వతాగ్రమున సంశోభితమై యొప్పు కోడైకెనాల్, మీనాక్షీదేవాలయ విరాజితమైన మధుర, రమ్యవన సంశోభితమై విద్యుద్దీపశోభితమగు మైసూరు, పర్వతాగ్రనగరములకుఁ బ్రఖ్యాతిచెందిన ఉదకమండలము, సముద్రతీరస్థమై బృహత్తర మందిర మనోహరమైన రామేశ్వరము, కలియుగ వైకుంఠమగు తిరుపతియు, ఇక్ష్వాకులనాటి విమానము గల శ్రీరంగమును, వస్తు జంతు ప్రదర్శనశాలలకు బేర్వడసిన తిరువాంద్రమును ముఖ్యముగా జూడదగినవి.

## తెనాలి

ఇది బెజవాడకు 20 మైళ్లు. స్టేషనుకుసమీపమున సత్రము గలదు. గ్రామములో నింకను ధర్మశాలలు గలవు. అన్ని వసతులు గలవు. ఇది చరిత్రాత్మకమైన పట్టణము. శ్రీకృష్ణదేవరాయల యాస్థానకవి యగు తెనాలి రామలింగకవి యిచటనే నివసించెను. ఇది గొప్ప వ్యాపారకేంద్రము. అన్ని కళలయందు నిష్ణాతులైన పండితులు గలరు. కళాశాలలు, ఉన్నతపాఠశాలలు కలవు. పర్వతవర్ధని రామలింగేశ్వరాలయము ముఖ్యముగ చూడ

తగినది. ఇది పరశురామ ప్రతిష్ఠితమని జనశ్రుతి. ఈయాలయ మున షుమారు $1\frac{1}{2}$ గ. పొడవుగల పద్మాసనాసీనుడైన బుద్ధ మూర్తి కలదు. ఇంకను శివాలయములు, గోవర్ధనస్వామి, వేణు గోపాలస్వామి, కోదండరామస్వామి, పంచముఖాంజనేయ మొదలైన ఆలయములుగలవు. అన్ని సౌకర్యములు కలవు. శివరాత్రికి, ముక్కోటికి రథోత్సవము జరుగును. శ్రీరామనవమికి 5 రోజులు గొప్పవైభవముగా నుత్సవములు జరుగును. వేలాది ప్రజలు వత్తురు. రెండవ భద్రాద్రివలె నుండును.

## పొన్నూరు

తెనాలినుండి పొన్నూరుస్టేషనులో దిగవలయును. ఇది చారిత్రికప్రదేశము. అన్నిసౌకర్యములు కలవు. పూర్వ మొకప్పు డిచట ఋషులు సద్గోష్ఠి జరిపిన కారణమున నిది గోష్ఠీవనమని స్థలపురాణమున గలదు. ఇచట అనాదిసిద్ధమైన శ్రీ రాజ్యలక్ష్మీ భావనారాయణస్వామి యాలయముగలదు. మహిమగలస్వామి. వైశాఖ శు౹౹ మొదలు ౧౦ రోజులు ఉత్సవములు జరుగును. రథయాత్ర కూడ జరుగును. ఇపు డిచట శ్రీ జగన్నాథముగారు గొప్ప దేవాలయమును నిర్మించుచున్నారు. అచట సహస్ర లింగములు, దశావతారములు షుమారు 6, 8 గ. ల ఎత్తు గల ఆంజనేయ, గరుత్మంతుల విగ్రహములు గలవు. యాత్రికు లనేకులు వచ్చుచుందురు. సమీపమున నిడుబ్రోలులో కాలేజి



ప్యారిస్ కార్నరు - మద్రాసు.
చూడుడు 533 పేజి

గలదు. ఈ గ్రామము కలప వ్యాపారమునకు కేంద్రము. శ్రీ భావనారాయణస్వామికి సంబంధించిన యనేక తిహ్యాములు గల గ్రంథము యీ దేవస్థానమున లభించును.

## బుద్ధాం

పొన్నూరునుండి బాపట్ల స్టేషనులో దిగిన బస్సుమీద బుద్ధాం చేరనగును. పూర్వ మిది బౌద్ధపురి. ఇందు్ధులకు నిదర్శన ముగ స్థూపములు నేటికిని గలవు.

శ్రీరామశరణ మందిరము:— ఇందు లక్ష్మీనారాయణ, సీతారామ, రాధాకృష్ణమూర్తుల పాలరాతి ప్రతిమలు ఒక్కే మందిరమున గలవు. ఓంకారము కూడ గలదు. పై మూర్తు లన్నియు ఓంకారరూపమె అని వ్యక్తపరచుటకై యీమందిరము స్థాపింపబడినది. శివ, ఆంజనేయ మందిరములు గలవు. ఆంజనే యులు ప్రత్యక్షదైవము.

## సింగరాయకొండ (సోమరాజుపల్లె)

పొన్నూరునుండి సింగరాయకొండ స్టేషనులో దిగవల యును. స్టేషనుకు సమీపముననే సోమరాజుపల్లె గలదు. 'వాణి నారాణి' యని నాటి కవిరాజలోకములకు చాటిన పిల్లలమఱ్ఱి పినవీరభద్రు డిచటివాడె. సమీపముననే చిన్నమిట్టమీద వరాహ లక్ష్మీనృసింహస్వామి యాలయము కలదు. ఈ సోమరాజుపల్లియు నరసింహస్వామిదే. ఏడంతస్థుల గోపురము కలదు. ప్రత్యక్ష దైవము. పూర్వమిది ఖరదూషణుల రాజధాని యని జనులు వాకొందురు. నవనారసింహాలలో నిది యొకటి యని కింవదంతి

గలదు. ఇట్లే పంచనారసింహాలనియు లోకమున కలదు. అందిది యొకటియని కొందరి యభిప్రాయము. కాని పంచనారసింహాలు ప్రసిద్ధిగా నీ క్రమమున గలవు. 1 వేదాద్రి 2 గరుడాద్రి (పండరి సమీపము) 3 సింహాద్రి 4 నాగాద్రి (నాగార్జునకొండ) 5 మంగళాద్రి (మంగళగిరి). కొన్ని స్థలపురాణములు ఖిలమగుటచే కొన్ని క్షేత్రముల యథార్థస్థితి నిర్ణయించుటకు వలనుపడుటలేదు.

## నెల్లూరు

సింగరాయకొండ నుండి నెల్లూరుస్టేషను (5 మై.) లో దిగవలయును. నెల్లూరు పెన్నాతీరమున గలదు. ఈనదికి చక్కని ఘట్టములు గలవు ఇది మనుమసిద్ధ రాజధాని. చక్కనిబస్తీ. అన్నివసతులు గలవు. శ్రీరంగనాథస్వామి ఆలయము, మూల పేటలోని శివాలయము ప్రసిద్ధములు. ఇచట పెద్దవినాయకుడు, నవగ్రహ దేవాలయములు గలవు. ఈ ప్రాంతమంతయు మైకా గనులధికము. దగ్గర గూడూరులోని పింగాణి పరిశ్రమ చూడ దగినది. పెన్న దాటిన పెరుమాళ్ల సేవ, అని ప్రతీతి. ఇది మొదలు విష్ణుభక్తి యధికము. మంత్రిగా, కవిగా పేరుగాంచిన తిక్కన సోమయాజి భారతరచన యిచటనే సాగినది. మడమ త్రిప్పని యోధాగ్రేసరు డగు ఖడ్గతిక్కనయు నెల్లూరు సీమవాడె. పూర్వమునుండియు నిది చక్కని విద్యాకేంద్రము. ఉన్నత కళా శాలలు గలవు.

## వేదగిరి

నెల్లూరుకు వ్యాయవ్యముగ 10 మైళ్ళలో పినాకినీ తీరమున గలదు. వేదగిరికి నెల్లూరుకుమధ్య పెన్నలోబడిన, ఆస్తికలు

శిలలుగా మారును. ఇచట కొంకమైలుదూరమున, జున్నువాడలో కామాక్షి, మల్లిఖార్జునులు ప్రత్యక్ష దైవములు. చూడతగినవి.

## కాళహస్తి

నెల్లూరునుండి గూడూరు (జం) లో మారి తిరుపతిపోవు బండిలో వెళ్ళవలయును. నెల్లూరుకు కాళహస్తిస్టేషను 38 మైళ్లు. ఇది ఆర్కాటుజిల్లాలో సువర్ణముఖి నదీతీరమునగల ప్రసిద్ధ శివ క్షేత్రము. ఇచటది వాయులింగము. ఈ యాలయము చాల ఎత్తుగ నున్నది. మందిర గర్భాలయమున గాలి, వెలుతురు నుండదు. ఇచట నీశ్వరుడు వాయువీచికారూపమున నివసించును. ఈ దృశ్యము ప్రత్యక్షముగ కానవచ్చును. ఈ లింగము నలుపలకలుగ నున్నది. ఈ లింగమున కెదుట మహాభక్తుడగుకన్నప్ప విగ్రహము కలదు. కన్నప్ప చరిత్ర ప్రసిద్ధము. దైవము కాళహస్తీశ్వరుడు. దేవి జ్ఞానప్రసూనాంబ.



* కాళహస్తి ఆలయము

శివుని పంచలింగములలో నొకటి. శివుని యష్టమూర్తులలో నొకటి. శ్రీ = సాలెపురుగు, కాళ = సర్పము, హస్తి = ఏనుగు. ఈ మూడును ఈశ్వరునిసేవించుటచే శ్రీకాళహస్తీశ్వరము అయినది. ఈ పరిసరములందు చూడదగినవి యనేకములు గలవు.

సువర్ణముఖీనదికి, ఈ లింగమునకు మిక్కిలి సన్నిహిత సంబంధము కలదు. సాలగ్రామమును బూజించు యాత్రికు లధమ మొక రాత్రియైనను ఇచట నివసించుదురు. దాక్షిణాత్యు లీ క్షేత్రమును కాశివలె పుణ్యప్రదమైనదనియు, దక్షిణకాశి యనియు భావించుదురు. ఈ క్షేత్రమునుగురించి సూతసంహి తాది గ్రంథములలో మిక్కిలి వైభవముగ వర్ణింపబడినది. ఇచట కైలాసగిరి యను పర్వతమున "మణికుండీశ్వర" మందిర మొండు కలదు. మృత్యువు సమీపించిన మనుజుని మణికుండీ శ్వర సమీపమున పరుండబెట్టుదురు. కాశియందువలె నిచట కూడ నాసన్నమృత్యుడగు మనుజునకు ఈశ్వరుడు తారకోప దేశము గావించునని జనుల విశ్వాసము. శివరాత్రి కిచట, ఏడు రోజులు పెద్దయుత్సవము జరుగును. ఇచట నొక కొండమీద దుర్గాలయము కలదు. ధర్మశాలలు కలవు. అన్ని వస్తువులు లభించును. కంచుపాత్రల కిది ప్రసిద్ధి.

పూర్వము ఆలయనిర్మాణకాలమున వేలకొలది కూలీలు నిత్యము పనిచేసి సాయంసమయమున నీశ్వరుని ప్రార్థించి నదీ తీరమున చిన్నగొయ్యి తియ్యగా నందు నాటికి సరిపోవు ద్రవ్యము లభించెడిదట. ఇందువలన నీ నదికి సువర్ణముఖ యని నామ సార్థక్యమని జనశ్రుతి కలదు.

## శివుని యష్టమూర్తులు

శంకరుఁ డష్టమూర్తి రూపమునం దీ విశాలవిశ్వమున వ్యాపించియుండెను. అష్టమూర్తి స్వరూపుడగు నీశ్వరునియం దీ విశ్వమంతయు సూత్ర మందుమణులవలె నిమిడియుండెను.

పంచమహాభూతములు, సూర్యచంద్రులు యజమాని శివుని యష్టమూర్తులని శివపురాణమునుబట్టి తెలియుచున్నది.

భూమ్యంభోగ్ని మరుద్వ్యోమ క్షేత్రజ్ఞార్క నిశాకరాః
అధిష్ఠాతా మహేశస్య సర్వాదే రష్టమూర్తిభిః॥ —శివపురాణము

ఈ తత్త్వములతో నా పురాణపురుషుడు జగత్కల్యాణమునకై భారతదేశమునందు లింగరూపమున నవతరించెను. ఈ లింగములు భారతదేశమున వేర్వేఱు ప్రాంతములందు గలవు. వృక్షమూలమున నీరుపోసిన యా నీరా తరువుయొక్క సూక్ష్మ పత్రములకుగూడ వ్యాపించునట్లే యీ యష్టమూర్తులను సేవించిన మనుజుడు జగత్తునంతను సేవించినవాడగును. అవి క్రమముగ శివకాంచీయందు 'క్షితిలింగము', శ్రీరంగనాథమునకు సమీపమునగల జంబుకేశ్వరమున 'ఆపోలింగము', అరుణాచలమున 'తేజోలింగము', కాళహస్తియందు 'వాయులింగము', చిదంబరమున 'ఆకాశలింగము', ప్రభాసక్షేత్రమున 'సోమనాథలింగము', నేపాల్ రాజ్యమున యజమానరూపమగు 'పశుపతినాథలింగము'ను గలవు. (చూ. పరిశిష్టఖండము) సూర్యుడు ప్రత్యక్షదైవము కదా! ఇట్టీశ్వరుడు సర్వజగత్స్వరూపుడై విశ్వమున విలసిల్లియుండెను. ఈ యష్టమూర్తుల మాహాత్మ్యము శివపురాణమునం దధికముగ నభివర్ణింపబడెను.

## ఏర్పేడు

కాళహస్తినుండి ఏర్పేడు స్టేషను 8 మైళ్లు. స్టేషనుకు షుమారు 1 మై. లో శ్రీ వ్యాసాశ్రమము కలదు. ఈ యాశ్రమ

స్థాపకులు శ్రీమళయాలస్వాములవారు. నిత్యము కార్యక్రమాను సారము ఆధ్యాత్మికసాధనలు జరుగుచుండును. శ్రీ స్వాములవారు ఆధ్యాత్మికప్రబోధము చేయుచు లోకమునకు మహోపకారము చేయుచుండిరి. అనేక ఉత్తమ ఆధ్యాత్మిక గ్రంథములు ప్రచురించిరి. సాధకులకు ఉచిత భోజనవసతి కలదు.

## తిరుపతి

పర్వేడునుం తిరుపతిస్టేషను 12 మైళ్లు. స్టేషనుకు సమీపమున నన్ని సౌకర్యములుగల ధర్మశాల కలదు. గ్రామములోను కొండమీదను నింకను ధర్మశాలలు గలవు.

అశ్వత్థామ మందిరము:— ఇచటకు 1 మై. దూరమున సువర్ణముఖి నదియు, దానికి సమీపమున కపిలగంగా సరోవరము కలదు. ఇచట యశ్వత్థామ మందిరము కలదు. అశ్వత్థామ తపస్సుచేసిన స్థానమిది. ఈతడు చిరంజీవి. నేటికిని జీవించి యుండెనని చెప్పుదురు. భారత దేశమున నిచటతప్ప మరెచటను అశ్వత్థామ మందిరము లేదు.



కపాలేశ్వరాలయము - మైలాపూరు
(చూడుడు 533 పేజీ మద్రాసు)

బాలాజీ:— శ్రీ వేంకటేశ్వరస్వామి ఏడు కొండలమీద గలడు. కొండలెక్కుటకు మెట్లుకలవు. మార్గమధ్యమున విశ్రాంతి స్థానములు, చల్లనిజలము లభించును. ప్రస్తుతము కారుమార్గము

కూడ నేర్పడినది. ప్రయాణము చాల సుకరము. 'కలౌ వేంకట నాయకః' కలిలో వెంకటేశ్వరుడే ప్రధానదైవమని పెద్దల యభిప్రాయము. ఈ క్షేత్రమును గురించి పంద్రెండు పురాణములలో నభివర్ణింపబడినది. ఈ స్వామి సర్వదేవతాస్వరూపుడు. శ్రీనివాసుడగుటచే విష్ణువు, అడుగున నీశ్వరలింగము మీదనుండుటచే నీశ్వరుడు, భుజంగవలయాదు లుండుటచే సుబ్రహ్మణ్యేశ్వరుడు, ఉత్తరదేశీయులు బాలాజీయనియు అందురు. ఈ పర్వతము సముద్రతలమునకు 2500 అ. ఎత్తు. ఆలయ సమీపమున గల పుష్కరిణిలో స్నానముచేసి స్వామిని దర్శించవలయును.



శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయము

బాలాజీమందిరము విశాలముగను, సుందరముగను నుండును. 3 ప్రాకారములు గలవు. వేలకొలది యాత్రికులు వచ్చుచుందురు. ఈ మందిరమునకు సం. 1 కి లక్షలకొలది ఆదాయము వచ్చును. నిత్యము పలువిధములగు మొక్కుబడులు భక్తులు చెల్లించుచుందురు. రు. 1-4-0 మొ॥ రు. 116 ల వరకు భోగములు గలవు.

పాపనాశని గంగ:— ఇది మందిరమునకు 3 మైళ్ళు. మార్గము ప్రకృతిసౌందర్యముచే కనులపండు వొనర్చుచుండును. ఈ గంగ పర్వతముల మధ్యనుండి ప్రవహించుచు క్రింద పడుచున్నది. ఇందు యాత్రికులు స్నానముచేసి మరలి వచ్చునపుడు

'ఆకాశగంగ'ను దర్శించవచ్చును. ఇచట హాథీబాబా ఆశ్రమము గలదు. ఈమహనీయుడు ఆకులు తినుచు 12 సం॥ తపస్సుచేసెను. ఈ రీతిగ యాత్ర ముగించుకొని యాత్రికులు కొండదిగి వత్తురు.

కపిలతీర్థము:— ఇది కొండక్రింద (దిగువతిరుపతి) గలదు. ఇది మిక్కిలి గొప్పది. మరియు గోవిందరాజస్వామి, రామస్వామి ఆలయములు గలవు. చూడతగినవి.

తిరుచానూరు (తిరుశుగనూరు):— ఇది శుకుని పేరు మీద వచ్చినది. ఇది తిరుపతికి 2 మైళ్ళు చక్కని మార్గము, బండ్లు కలవు. ఇచ్చట పద్మావతీదేవి ఆలయము, పుష్కరిణియు కలవు దానిని అలిమేలు మంగాపురమనియు నందురు. ఇచట వివాహము లెక్కువగ జరుగును. ఇచట నిత్యకల్యాణము, పచ్చ తోరణము. అనేక సత్రములు కలవు. పండాల గృహములలోను ఉండవచ్చును. ఇక్కడ తిరుమల విశ్వవిద్యాలయము, కాలేజీ, హైస్కూలులు కలవు.

దక్షిణదేశమునగల తీర్థములందు బాలాజీ చాల ప్రసిద్ధ మైన దైవము. ఈ వేంకటాచలమును గరుడుడు వైకుంఠము నుండి తెచ్చి యిచట స్థాపించెనని చెప్పుదురు. ఈ పర్వతము ఆది శేషుని యాకృతి కలిగియున్నది. ఏడుకొండలు ఏడు శిరములట. ఈ పర్వతములు భగవత్స్వరూపముగ భావించి, అంబరీషుడు, ప్రహ్లాదుడు, భృగువు మొ॥వారు చిరకాలమిచట తపస్సు చేసిరి.

## తిరువళ్లూరు

తిరుపతినుండి రేణిగుంటమీదుగ అరుకోణము 47 మైళ్ళు. ఇచటకు తిరువళ్ళూరుస్టేషను 17 మైళ్ళు

ఇది చెంగల్పట్టుజిల్లాకు చెందినది. ఇట ప్రసిద్ధమైన వరదరాజస్వామి మందిరము, మండపము కలదు. స్వామిని వీరరాఘవస్వామి యని కూడ పిలతురు. మందిరాంతరమున శేషశయనుడగు వరదరాజస్వామి విగ్రహము కానవచ్చును. ఈ మందిరమునకు ప్రక్కన శివాలయము కలదు. ప్రతిఅమావాస్యకు సీగ్రామ పరిసరములనుండి భక్తులు వరదరాజస్వామిని సందర్శింప నేతెంతురు. ఉత్సవసమయములందు జను లధికముగ నుందురు. ఏప్రియల్, మే నెలలలో బ్రహ్మోత్సవము జరుగును.

## భూతపురి
## (పెరంబుదూర్)

తిరువల్లూరు స్టేషనుకు దక్షిణముగ 11 మై. దూరమున భూతపురి యను నగరముగలదు. ఇది శ్రీరామానుజస్వామి జన్మస్థలము. ఇచట అనంతసరోవరమను సరస్తీరమున నొక పెద్ద శ్రీ రామానుజస్వామి ఆలయముగలదు. రామానుజస్వామి విగ్రహము దక్షిణ ముఖమై యున్నది. ఇచ్చట కేశవమందిరముకూడ గలదు. ఉత్సవసమయములందు యాత్రికు లధికముగ వచ్చుచుందురు. ఇట మండపము లనేకము కలవు.



శ్రీ రామానుజస్వామి

భూతపురి యుత్పత్తిని గూర్చి యొక కథ చెప్పుదురు. సృష్ట్యారంభమున విభూతి నలదుకొని నృత్యము గావించు మహా దేవుని గాంచి భూతములన్నియు నవ్వెను. వెంటనే శివుడు కోపించి భూతములు తనకు దూరమగునట్లు శపించెను. అంత భూతము లన్నియు మిగుల విచారించి బ్రహ్మను ప్రార్థింపగా, బ్రహ్మ భూలోకమున సత్యవ్రతతీర్థమున కేశవు నారాధింపుడని చెప్పెను. భూతము లనేక వత్సరములు కేశవు నారాధించెను. సంతుష్టుడై విష్ణువు ఆదిశేషసహితముగ భూతములకు దర్శనమొసంగి శివుని ప్రార్థించి మరల భూతములను శివుని గణము లగునట్లు చేసెను. ఆ సమయమునం దాదిశేషు వా సత్యాశ్రయ తీర్థమునం దొక సరస్సును నిర్మించెను. శివుని గణములందు జేరిన భూతములు సంతోషముతో నచ్చట నొక నగరమును నిర్మించెను. ఆ సత్యాశ్రయతీర్థమే ప్రస్తుత పెరంబుదూరు. భూతనిర్మితమగుట దీనిని భూతపురి యని పిలతురు. ఆదిశేషుని యవతారమగు శ్రీరామానుజస్వామి జన్మస్థలమగుటచే కూడ ఇది యొక ప్రసిద్ధక్షేత్ర మయ్యెను. అనంతసరోవరమున చైత్ర శు ౧, ౭, ౧౫ లకు, వైశాఖ శు ౧౨ కి స్నానముచేసిన యనంతఫలము లభించును.

## మద్రాసు

పెరుంబుదూరు, తిరువళ్లూరుమీదుగ మద్రాసు చేరవల యును. ఇది హిందూదేశపు నగరములలో మూడవది. ఈ పట్ట ణము మిక్కిలి అందముగ నుండును. రాయపురమునుండి అడ యారువరకు 8 మైళ్ళు. సముద్రము పొడవున గల యీ పట్టణ వైభవము చూచితీరవలెను. చంద్రగిరిరాజువద్ద దీనిని తూర్పు

యిండియా సంఘమువారు కోట నిర్మించుకొనుటకు అడిగి తీసి కొని "సెంటు జార్జి ఫోర్టు"ను నిర్మించిరి. పెయ్యాళ్వారు అను వైష్ణవభక్తునకు సంబంధించిన పవిత్రమగు బావి మైలాపూరులో కలదు. కోటలో ప్రదర్శనశాల, వెనుకటి ఫిరంగులు, కత్తులు మొదలగునవి కలవు. ఫోర్టు భవనములలో మద్రాసుప్రభుత్వపు కార్యాలయములన్నియు కలవు. తిరువల్లిక్కేణిలోని పార్థసారథి స్వామి మందిరమును, మైలాపూరులోని కపాలేశ్వరస్వామిఆలయ మును, తిరువత్తియూరులోని శివాలయమును చూడదగినవి.

అడయారులో దివ్యజ్ఞాన సమాజముయొక్క ప్రాపంచిక కార్యాలయమును, దానికిచెందిన లైబ్రరీ, సంగీత నృత్య నాట్య ములు నేర్పు కళాశాలయు నిచట కలవు.

మహోన్నత తరంగమాలికా శోభితమగు సముద్రము నంటియున్న యీ నగరమంతయు దర్శనీయమె. అందును ప్రధా నముగ యూనివర్శిటీ భవనములు, లైట్‌హౌస్ (ఎత్తు 150అ.),



* జార్జిటౌను



* హైకోర్టు

హైకోర్టు భవనములు, మ్యూజియము, జంతుప్రదర్శనశాల, సెంట్రల్‌స్టేషను, జనరల్ ఆసుపత్రి, గిండీరాజభవనము, ఇంజ నీరింగ్ కళాశాల, ఆల్ ఇండియా రేడియోస్టేషను, వాహినీస్టూడి

స్టూడియోలు, కాంగ్రెసు ఎగ్జిబిషన్ కార్పొరేషను స్టేడియము చూడదగినవి. వీనిని చూచుటకీనగరమున 'సిటీ బస్సు' సౌకర్యము కలదు. యాత్రికులకు సర్వసౌకర్యములు కలవు. సెంట్రల్ స్టేషనుకు సమీపమున ధర్మశాల కలదు. ఇంకను పురమందు యనేక ధర్మశాలలు గలవు.

రామకృష్ణ మఠము:— ఇది మైలాపూరులో గలదు. ఈ మఠము శ్రీపరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానంద సిద్ధాంతములను, ఆశయములను పత్రికలద్వారా, గ్రంథములద్వారా లోకమునకు అందజేయుచున్నది. ఈ మఠము ఆంధ్రదేశమునకు ఆధ్యాత్మికప్రచారము అపారముగ చేయుచున్నది. మఠమున నిత్యము సాయంకాలము ఆధ్యాత్మికఉపన్యాసముజరుగుచుండును. ఈ మఠము తప్పక చూడతగినది.



శ్రీ రామకృష్ణ పరమహంస

## పక్షితీర్థము

మదరాసునుండి చెంగల్పట్టుస్టేషను 35 మైళ్ళు. స్టేషనుకు సమీపమున ధర్మశాల కలదు. ఇటకు పక్షితీర్థము 10 మైళ్ళు.

మోటారు కలదు. మార్గమున శ్యామల తృణాచ్ఛాదితములగు పర్వతపంక్తుల ప్రకృతిశోభ వర్ణనాతీతము. పక్షితీర్థము చిన్న పట్టణము. అన్నియు లభించును. ఇచట పండాలు లేరు. గోస్వామి జాతికి చెందిన పూజారులు గలరు.

శంఖసరోవరము:— ఈ సరస్సు చాల పెద్దది. ఇచ్చట శంఖముని వేలకొలది సంవత్సరములు తపస్సు చేసెనట. ఈ సరస్తీరమున చాల దివ్యభవనములు కలవు. ఇచ్చట స్నానముచేసి యాత్రికులు పంచదేవి మందిరమునకు వెళ్ళుదురు. ఈ మందిరము చిదంబరమువలె చాలపెద్దది. దీనిప్రాకారమునకు నాలుగు ద్వారములు గలవు. ఇందు శివుడు, విష్ణువు, దేవి, సూర్యుడు, మఱియు విఘ్నేశ్వరునియొక్క విగ్రహములు కలవు. ప్రాకారాంతరమున కొబ్బరిచెట్లధికముగ గలవు.

వేదగిరీశ్వరుడు:— ఈ యాలయము పర్వతము మీద గలదు. ఇది 500 అ. యెత్తు. పర్వతము నెక్కజాలని యాత్రికులు డోలీమీద వెళ్ళుదురు. ఈ పర్వతమునకు 1000 మెట్లు కలవు ఇచ్చట గం. 11 లకు వేదగిరీశ్వరమహాదేవుని పూజ జరుగును. ఈ మందిరము నల్లనిరాతితో నిర్మింపబడెను. మందిర పూర్వద్వారమును సమీపించిన వేదగిరీశ్వరమహాదేవుని దర్శనమగును. స్వామి రజతత్రిపుండ్రమును ధరించియుండును. (రామేశ్వర మహాదేవుని త్రిపుండ్రము స్వర్ణమయము.) పూజావసానమునం దిచ్చట తెరవేయుదురు. యాత్రికులు హారతికై నిరీక్షించుచుందురు. తెరను దొలగించినంతనే శ్వేతవస్త్రములను, శ్వేతభస్మమును పుష్పహారములను, బిల్వపత్రములను ధరించిన

స్వామి దర్శనమగును. వేదగిరీశ్వరమహాదేవుని దర్శించి యాత్రికు లానందమగ్నులగుదురు.

పక్షితీర్థము:— యాత్రికులు వేదగిరీశ్వరుని మందిరము నుండి కొన్నిమెట్లుదిగి క్రిందగల తృణమండపమునకు వెళ్లుదురు. ఈ మండపమునకు సమీపముననే 6 అ. ఎత్తుగ నొక పర్వతము యొక్క సమతలమగు శిలాఖండము గలదు. ఈ శిలకు నలువైపుల నూచల కటకటాలు గలవు అచటనుండి క్రిందకు దిగుటకు మెట్లు కలవు. ఇచ్చట కొలది జల మెల్లప్పుడు నుండును. దీనినే పక్షితీర్థ మందురు. ఈ పర్వతమున ప్రకృతిదృశ్యము చాల మనోహరముగ నుండును. పండ్రెండుగంటలకు రెండు శ్వేత గృధ్రము లాకాశమునం దెగురుచు గోచరించును. కొలది నిముసములలో నా పక్షులు పూజారులవద్దకు వచ్చును. పూజారులు మొదటనే వానికై యాహారమును సిద్ధమొనర్చుకొని యుందురు. ఆ యాహారము నవి తినును. శేషమును యాత్రికులకు ప్రసాదముగ పూజారులు పంచియిత్తురు.



పక్షుల కాహారమిడుట

ఈ పక్షులు పూజారులు పెంచినవిగా గోచరించుచుండెను. కాని యిట్టి పక్షుల యెంగిలిని దినుట ధర్మవిరుద్ధమని కొందరి భావన. అనంతరము యాత్రికులు క్రింద కరుదెంతురు. పక్షితీర్థమున నూరాదు మంచి ధర్మశాలలు గలవు ఇచ్చట పోష్టాఫీసు, ఔషధాలయము, సంస్కృతపాఠశాలయు కలవు. భోజనసామగ్రి సర్వమునులభించును.

## మహాబలిపురము

మద్రాసుకు దక్షిణముగ చెంగల్పట్టుజిల్లాలో మహాబలి పుర గుహాలు గలవు. ఇది పక్షితీర్థమునకు 10 మైళ్ల దూరమున గలదు. బండ్లు, బస్సులు దొరకును. ప్రతి శని, ఆదివారములు మద్రాసునుండి ప్రభుత్వపు బస్సులు వెళ్ళుచుండును.

ఇది సముద్రతీరమున గలదు. తీరమునను, సముద్రము నందును ఱాతితో నిర్మింపబడిన గుహామందిరము లనేకము కలవు. వీని వలననే మహాబలిపురము సుప్రసిద్ధమై యున్నది. ఇచ్చటి గుహామందిరము లన్నియు నిచటగలకొండలను దొలచి నిర్మింపబడెను. ఈ గుహామందిరము లన్నియు చాల ప్రాచీనములైనవి. ఇవి "సల్వన్ కుప్పమ్" గ్రామము నుండి సుమారు 4 మై. దూరము వరకు వ్యాపించియున్నవి.



సముద్రతీరాలయము

ఈ గుహామందిరములందు గోవర్ధనధారియగు శ్రీకృష్ణుడు, విష్ణుమూర్తి, దుర్గ, ద్రౌపది, ధర్మరాజు, భీముడు, అర్జునుడు, వరాహావతారము, ఈశ్వరుడు మొదలగు విగ్రహములు చాల సుందరముగ మలుపబడియున్నవి. సముద్రతీరమున పర్వతములందు నిర్మింపబడిన ప్రాచీన శిల్పకళకు వన్నెతెచ్చు నీ గుహామందిరములు దాక్షిణాత్య శిల్పమునకు మచ్చుతునకలు.

## కాంచి (కంజీవరము)

చెంగల్పట్టునుండి కంజీవరముస్టేషను 22 మైళ్లు. కాంచీయందు రెండుపట్టణములు గలవు. శివకాంచి, విష్ణుకాంచి అవి ఈ రెండుపట్టణములు స్టేషనుకు షుమారు 2 మైళ్ళు. దీనికి స్వర్ణపురి యను నామాంతరము కలదు. ఈ రెండు నొకదాని కొకటి రెండుమైళ్లదూరము ఎడము కలిగియున్నవి. ఈ రెండు పట్టణముల మధ్య విశేషముగ కొబ్బరితోటలు, ఆశ్రమములు గలవు.



వరదరాజస్వామి మందిరము
విష్ణుకంచి

శివకంచియందు శైవులు, విష్ణుకంచి యందు శ్రీసంప్రదాయమునకు చెందిన వైష్ణవులును నివసించియుందురు. గజేంద్రమోక్షముజరిగినదిచ్చటనే యందురు. హ్యూనచ్వాంగ్ అను చైనా యాత్రికుడు దీనిని దర్శించి, ఇది బుద్ధుని కంటె ప్రాచీనమైనదనెను. ఇది బౌద్ధులకుకూడ పుణ్యస్థలము. అశోకుడు కట్టించిన స్తూపములు కలవు. వైష్ణవాళ్వారులలో పోగై ఆళ్వారును, చాణక్యుడును నిచ్చటనే జన్మించిరి. ఇచ్చట పూర్వము ప్రసిద్ధకథకు లుండెడివారు. వారు మెచ్చినదే కథ యని జనశ్రుతి. ఇచట 12వ శతాబ్దమున నిర్మించిన గొప్ప జైనదేవాలయముకూడ గలదు.

శివకంచి:— దీనిని దక్షిణకాశి యందురు. కాశీయందువలె నిచటగూడ ప్రాణత్యాగమునకయి శైవులనేకులు నివసించు

చుందురు. ఇచట 'ఏకామ్రేశ్వరమహాదేవ' మందిరము గలదు. దీనిని శ్రీకృష్ణదేవరాయలు కట్టించెను. శ్రీ కైలాసనాథాలయ మును రాజసింహ మహారాజు కట్టించెను. పల్లవుల నాటి శిల్ప మిచ్చట చూడ వచ్చును. ఈ మందిరము ద్రావిడదేశమందలి పంచ లింగములలో (1 చిదంబరము - ఆకాశలింగము, 2 కాళహస్తి-వాయులింగము, 3 అరుణాచలము - అగ్ని లింగము, 4 శ్రీరంగము - ఆపోలింగము, 5 పృథివీలింగము.) నిది. ఈ మహాదేవుని అమరనాథమహాదేవుడనియు పిలతురు.



ఏకామ్రేశ్వరస్వామి మందిరము _ శివకంచి.

ఇచట పార్వతి బాలుకా (ఇసుక) మయమగు శివలింగ మును పూజించుచు వేలకొలది సంవత్సరములు తపస్సు చేసెను. మందిర పరిక్రమణమునం దొక శివసభ కూడ కానవచ్చును. పూర్వ మిచ్చట సహస్ర శివలింగము లుండెడివని చెప్పుదురు. మందిరసమీపమున సహస్ర స్తంభ మండపము గలదు. ఇందు నవగ్రహములు మొదలగువాని విగ్రహములు గలవు. జ్యేష్ఠ మాసమున తెప్ప ఉత్సవము జరుగును. ఇచ్చట సర్వతీర్థమను నొక సరోవరము కలదు. శివకాంచీ గోపురము 188 అ. యెత్తు గలిగియున్నది. ఇందు పద్ధియంత్రములు కలవు.

విష్ణుకాంచీ:_ ఇది రామానుజ సంప్రదాయానుయాయులకు ప్రధానస్థానము. ఇచట మిక్కిలి విశాలము గలిగి సుందరమైన విష్ణుమందిరము కలదు. మందిర ప్రాకార మొక 1000 అ. పొడవును, 800 అ. వెడల్పును కలిగియున్నది. భగవద్విగ్రహము సుమారు 2 గ. పొడవు గలిగియున్నది. ఇచ్చట స్వామి బహుమూల్య వస్త్రాభరణధారియై యుండెను. స్వామికి లక్షలకొలది రూపాయల విలువజేయు నాభరణము లున్నవి. స్వామి కెదుట



వరదరాజస్వామి మందిరము - విష్ణుకంచి.

బంగారురంగుగల గరుడ స్తంభముకూడ గలదు. మందిర కుడ్యములమీద ననేక శిలాలేఖములు వ్రాయబడియున్నవి. యాత్రికులు కోటితీర్థమున స్నానముచేసి భగవంతుని దర్శింతురు. శివకాంచీయందువలె నీమందిర గోపురముకూడ నున్నతముగనున్నది. ఈకాంచీనగరములను జనమేజయమహారాజుకట్టించెనని చెప్పుదురు.

మాహాత్మ్యము:— కాంచీ మోక్షదాయక నగరములం దొకటి. శైవులు, వైష్ణవులు తమతమ యిష్టానుసారము శివ కాంచీ లేక విష్ణుకాంచీని సేవింతురు. ఇచట మరణించిన మోక్షము కలుగునని విశ్వసింతురు. గరుడపురాణమునం దీ క్షేత్ర మహాత్వ మధికముగ నభివర్ణింపబడెను. ఇచ్చట పట్టువ్యాపార మధికము.

## వేలూరు

కంచినుండి అరుకోణం, కాట్పాడి మీదుగ వేలూరు కానుస్టేషను 60 మైళ్లు. వేలూరుకు రేణిగుంట (జం) 77 మైళ్లు. మద్రాసు ప్రాంతములోని పాలార్ నదీతీరమున గల ఉత్తర ఆర్కాటు జిల్లాకు వేలూరు ప్రధాననగరము. ఇచ్చట నొక పెద్ద జలంధరేశ్వర మందిరము గలదు. ఈ మందిరగోపురము 7 అంతస్థులు గలిగి సుమారు 100 అ. యెత్తు గలిగియున్నది. మందిర ద్వారము చాల సుందరముగ నున్నది. ఇట నీలిరంగు రాతితో మలచబడిన ద్వారపాలకవిగ్రహములు గలవు. కల్యాణమంటప మందలి శిల్పసౌందర్యము దర్శనీయము. ఈ మండపమున కెదుట నొక కూపముకూడ గలదు. ఈమందిర ప్రాకారమును చేరి లోపల నలువైపుల మండపము కలదు. ఇందు 91 స్తంభములు గలవు. ప్రాకారమునకు నలువైపుల నాలుగు మండపములు కలవు. ఇది చాల ప్రసిద్ధమైన మందిరము. వేలూరునందు పూల తోట లధికము. కోట, సెంట్రల్ జైలు చూడతగినవి.

## తిరువణ్ణామలై

వేలూరునుండి తిరువణ్ణామలై స్టేషను చేరవలయును. ఇచట శివుని యష్టమూర్తులలో నొకటియగు (చూ. కాళహస్తి)

తేజోలింగము సీలేశ్వరమందిరమునగలదు. ఇది యాత్రాకేంద్రము. గోపురము 11 అంతస్థులు. ఇంకను ననేక గోపురములు కలవు. దీనిని శ్రీకృష్ణదేవరాయలు నిర్మించెను. సహస్ర స్తంభముల మంటపము, పెద్ద తటాకము కలవు అరుణగిరినాథర్ అను భక్తుడు 'తిరుపురఘా' అనుపదములను సుబ్రహ్మణ్యేశ్వరునిమీద పాడెను. ఈతడు తన పాపములు పోవుటకు యీపదములను పాడి, గోపురముమీదినుండి దుముకగా, సుబ్రహ్మణ్యేశ్వరుడు రక్షించినాడట. పూర్వమిచట సిద్ధపురుషు లుండెడివారట.

పూర్వము పార్వతి శివునికై ఘోరతప మాచరించగ, అరుణాచలమునుండి శివుడు జ్యోతిరూపమున వచ్చి కార్తీక శుద్ధ పూర్ణిమనాడు కలిసెనట. అదియే నేటి తేజోలింగము. ఈనాడు పార్వతి తపస్సును స్మరింపజేయుచు 10రోజులు గొప్ప ఉత్సవము జరుగును. పూర్ణిమనాడు పెద్ద దీపము వెలిగించెదరు. ఇది చాల మైళ్ళవరకు కనుపించును. పార్వతిని ప్రసన్నురాలినిగా జేసికొనుటకు పర్వత శిఖరాగ్రమున అగ్నివలె శివుడవతరించిన గాథను స్మరింపజేయుచు యాత్రికు లనేకు లీ జ్యోతిని దర్శించుట కేతెంచుచుందురు. ఈ సమయమున ఉత్సవ మూర్తులను ఊరేగింపుతో తీసికొనివచ్చి దేవాలయప్రాంగణమున విశేషముగ కర్పూరము వెలి



తిరువణ్ణామలై ఆలయము

తేజోలింగము సిలేశ్వరమందిరమునగలదు. ఇది యాత్రా కేంద్రము. గోపురము 11 అంతస్థులు. ఇంకను ననేక గోపురములు కలవు. దీనిని శ్రీకృష్ణదేవరాయలు నిర్మించెను. సహస్ర స్తంభముల మంటపము, పెద్ద తటాకము కలవు అరుణగిరినాథర్ అను భక్తుడు 'తిరుపురఘా' అనుపదములను సుబ్రహ్మణ్యేశ్వరునిమీాద పాడెను. ఈతడు తన పాపములు పోవుటకు యీపదములను పాడి, గోపురముమీాదినుండి దుముకగా, సుబ్రహ్మణ్యేశ్వరుడు రక్షించినాడట. పూర్వమిచట సిద్ధపురుషు లుండెడివారట.

పూర్వము పార్వతి శివునికై ఘోరతప మాచరించగ, అరుణాచలమునుండి శివుడు జ్యోతిరూపమున వచ్చి కార్తీక శుద్ధ పూర్ణిమనాడు కలిసెనట. అదియే నేటి తేజోలింగము. ఈనాడు పార్వతి తపస్సును స్మరింపజేయుచు 10రోజులు గొప్ప ఉత్సవము జరుగును. పూర్ణిమనాడు పెద్ద దీపము వెలిగించెదరు. ఇది చాల మైళ్ళవరకు కనుపించును. పార్వతిని ప్రసన్నురాలినిగా జేసికొనుటకు పర్వత శిఖరాగ్రమున అగ్నివలె శివుడవతరించిన గాథను స్మరింపజేయుచు యాత్రికు లనేకు లీజ్యోతిని దర్శించుట కేతెంచుచుందురు. ఈ సమయమున ఉత్సవ మూర్తులను ఊరేగింపుతో తీసికొనివచ్చి దేవాలయప్రాంగణమున విశేషముగ కర్పూరము వెలి


తిరువణ్ణామలై ఆలయము

గింతురు. ఈ కొండచుట్టూ అనేక గుహాలు కలవు. ఇది భారత దేశమందలి ప్రధానక్షేత్రములలో నొకటి.

రమణాశ్రమము:— స్టేషనుకు 2 మై. లో రమణమహర్షి ఆశ్రమము గలదు. ఇది రమణభగవానుని పుణ్యభూమి. ఇచట సత్రములు, అన్ని సౌకర్యములు గలవు. రమణమహర్షి గొప్ప సాధకులు, యోగి. వీరివలన సాధకులు, ఇతరులు ననేకలాభముల బడసెరి. భారతదేశవునలుమూలలనుండి పలువురే తెంచుచుందురు.

## పాండి చేరి (పుదుచ్చేరి)

తిరువణ్ణామలై నుండి విల్లుపురంస్టేషనులో దిగవలయును. సమీపమున సత్రము గలదు. పాండుచేరి ఫ్రెంచివారి పట్టణము. ఇది తూర్పుసముద్రతీరమున గలదు. ప్రభుత్వభవనములు, పూల తోటలు, చెర్చి చూడతగినవి.

అరవిందాశ్రమము:— శ్రీ అరవిందులు వంగదేశీయులు. గొప్ప తపస్సంపన్నులు. శ్రీమాత ఫ్రాన్సుదేశీయురాలు. ఈమె భక్తురాలు, సాధకురాలు. ఈ యాశ్రమమున నిత్యము సాధన కార్యక్రమము కాలానుసారముగ జరుగును. శ్రీ అరవిందుల సమాధి, ఆశ్రమము తప్పక చూడదగినవి.

## తిండివనము

విల్లుపురం నుండి తిండివనంస్టేషను 23 మైళ్ళు. అటనుండి బస్సుమీద 17 మై. ప్రయాణముచేసిన జింజి చేరుదురు.

జింజికోట:— ఇది యొక చరిత్రాత్మకమైన ప్రదేశము. విజయనగర రాజులచే నియమింపబడిన నాయకరాజు లిచ్చట

పాలకులుగ నుండెడివారు. కాని విజయనగరరాజగు రెండవ వెంకటపతిరాయల సమయమున జింజీనాయకుడు, మధురకు పాలకుడగు ముద్దువీరప్పనాయకునకు సహాయకుడై రాయల నెదిరించుటచే, రాయలకు బాసటగవచ్చిన తంజావూరు యువరాజు రఘునాథనాయకునిచే ఖైదీ గావింపబడినట్లు తెలియుచున్నది. విజయనగర పతనానంతర మిది కర్ణాటక సుల్తానులకును, మహారాష్ట్రులకును, తరువాత ఔరంగజేబునకును, 1750 లో ఫ్రెంచి వారికిని వశమై, 1761 లో ఆంగ్లేయులకు వశమయ్యెను.

ఇచ్చట ప్రాచీన శిథిలములు చాల గలవు అన్నియు పూర్వరాజన్యుల వైభవమును స్మృతికి దెచ్చుచుండును. జింజికి మూడువైపుల మూడుపర్వతములు కలవు. అందు రాజగిరిమీద జింజి కోట కలదు. ఇది సుమారు 600 అ. ఎత్తు కలిగియున్నది. ఇచ్చట కల్యాణమంటపము, పిశాచద్వారము మొదలగునవి చూడదగినవై యున్నవి. జింజిలో లోకల్ ఫండ్ వారి బంగళా యందు యాత్రికులు బసచేయవచ్చును.

# వృ ద్ధా చ ల ము

జింజినుండి తిండివనం 17 మైళ్లు, అటనుండి విల్లుపురం 23 మైళ్లు, విల్లుపురంనుండి వృద్ధాచలం స్టేషను 34 మై. లో దిగవలయును. ఇది మణిముక్తానదీ తీరమున గలదు. ఇచ్చట వృద్ధాంబా వృద్ధపురేశ్వరుల మందిర మతి ప్రాచీనమైనది కలదు. ఇది విదురప్రతిష్ఠితమని చెప్పుదురు. యాత్రికులు మొదట నది యందు స్నానముచేసి యచటనే గల బాలాంబా విఘ్నేశ్వరుల

దర్శించి వృద్ధపురేశ్వరమందిరమున కరుగుదురు. మహాజ్ఞానియని ప్రసిద్ధిగాంచిన శ్రీ రామలింగస్వామి మఠ మిచ్చట కలదు.

## చిదంబరము

వృద్ధాచలం స్టేషనునుండి కడలూరుమీదుగ చిదంబరము స్టేషను 23 మైళ్ళు. ఇది మద్రాసుప్రాంతమున దక్షిణఆర్కాటు జిల్లాలో సముద్రతీరమునకు 7 మై. దూరమున గలదు. స్టేషనుకు సమీపముననే చిదంబరము కలదు. ఈ నగరమునకు దక్షిణమున కావేరీనది ప్రవహించుచున్నది.

దక్షిణభారతమున సుప్రసిద్ధములగు పంచలింగములలో నాకాశలింగ మిచ్చట గలదు. స్వామి నటేశ్వరుడు. ఈ మందిర ప్రాకారమునకు నలువైపుల 9 అంతస్థులు గల 4 గోపురములు కలవు. ఈ గోపురముల మీద ననేకవిగ్రహములు, చిత్రములు చిత్రితములై యున్నవి. నటేశ మందిరము, శివగంగా సరోవరము, ఇంకను చాల మందిరములు, మండపములు గలవు. నటేశమందిరమునకు దక్షిణ పశ్చిమముగ పార్వతీమందిరము గలదు. నటేశ మందిర కుడ్యములమీద వెండియు, శిఖరమున బంగారమును పూయబడియుండెను. నటేశమందిరమున రెండు ద్వారములు దాటిన తరువాత నృత్యముగావించుచున్నట్లుండు నటరాజస్వామి



నటరాజ మందిరము

గానవచ్చును. ఈ విగ్రహమునకు వెనుక నాకాశలింగము అదృశ్య రూపమున గలదు. ఇచ్చట మణిలింగము, స్ఫటికలింగముకూడ గలవు. వీనికి ప్రతిదినము పూజ చేయుచుందురు. ఈ మణిలింగమునకు నెదుట కర్పూరమును వెలిగించి యొకవైపునుండి చూచిన శంకరునిమూర్తి కానవచ్చును. వేఱొకవైపునుండి చూచిన నామూర్తి మార్పుచెందును.

విష్ణుమందిరము:— నటేశమందిరమునకు జేరి యొక విష్ణుమందిరము కలదు. దీని శిఖరము రాగిరేకులతో కప్పబడియుండెను. మందిరమున మూడుద్వారములు దాటినమీదట స్వర్ణాలంకార భూషితుడై శేషశయనుడగు శ్రీమహావిష్ణు విగ్రహము కలదు. శ్రీమహావిష్ణువు పాదములచెంత లక్ష్మీదేవివిగ్రహము కలదు. ఈ మందిరమున కెదుట నొక స్వర్ణకుండము కలదు. దీనిని కనక సభ యని పిలతురు.

పార్వతి మందిరము:— నటేశమందిరమునకు నుత్తరమున గల పార్వతీమందిరము చాల సుందరమైనది. పార్వతీమందిరమునకు జేరి షణ్ముఖమందిరము గలదు. మందిర ప్రాంగణమున నొకవైపున నొక రాతినెమిలియు, రెండు రాతిఏనుగులు కలవు.

ఇచ్చట శివగంగాసరోవరము చాల పవిత్రమైన క్షేత్రము. ఈ క్షేత్ర మాహాత్మ్యము స్కందపురాణమునందును, సూత సంహితయందును, శివభక్తవిలాసమునందు నధికముగ నభివర్ణితము. ఇచ్చట చాల ధర్మశాలలు కలవు.

ఈ గ్రామమున 360 అర్చకులు గలరు. ఈ యాలయము 9, 10 శతాబ్దములలో నిర్మించబడినది. నిత్యము స్వామికి అన్నాభి


నటరాజస్వామి

షేకము జరుగును. ఇచటి శిల్పము, 108 ముద్రలు మిక్కిలి యందముగ మలపబడినవి.

ఇచట డిశంబరు, జనవరి నెలలలో ఆర్ద్రోత్సవము, జూన్ జులై నెలల్లో వచ్చు తిరుమంజనము తిరునాళ్లు ప్రసిద్ధమైనవి. దీనికి మైలుదూరమున అన్నామలై విశ్వవిద్యాలయము గలదు.

## షియాళి (బ్రహ్మపురము)

చిదంబరమునకు షియాళి స్టేషను 11 మైళ్ళు. ఇచ్చట ననేక శివాలయములు, విష్ణ్వాలయములు గలవు. అందు త్రిపుర సుందరీ బ్రహ్మపురీశ్వర మందిరములు చాల ప్రసిద్ధములైనవి. బ్రహ్మపురీశ్వరమందిరమునకు నుత్తరముగ రెండు ఉమామహేశ్వర విగ్రహములు గలవు. ఇవి చాల సుందరమైనవి. అటకు పశ్చిమముగా పోయిన శరనాథస్వామిని దర్శించవచ్చును. ఈ స్వామి నిచటివారు కాలభైరవస్వామి యనియు, శరభావతార మనియు పిలతురు.

## మాయవరము

షియాళినుండి మాయవరంస్టేషను 12 మైళ్ళు. స్టేషనుకు 3 మైళ్ళ దూరమున మాయవరము గ్రామము కలదు. ఇది కావేరీతీరము. ఇచట నొక సుప్రసిద్ధమగు శివమందిరము కలదు.

ఈ మందిరమున నొక పెద్దగోపురము, నొక చిన్నగోపురమును కలవు. పెద్దగోపురమునకు 10 అంతస్థులు కలవు. మందిరమునకు దక్షిణదిశయం దిది కలదు. దీనికి పశ్చిమముగ నొక సరస్సు కలదు మందిరమున కుత్తరదిశయందు 6 అంతస్థులు గల చిన్న గోపురము కలదు. ఇచ్చట కార్తీకమాసమునం దుత్సవము జరుగును. అక్టోబరు, నవంబరు నెలలలో కావేరీస్నానము చేయుటకు వేలకొలదిజనులు ఇచటికి రాగలరు. ఇక్కడికి 3 మైళ్ళలో శైవుల ధర్మపురము, మఠము కలవు.

## కుంభకోణము

మాయవరం (జం) కు కుంభకోణము స్టేషను 19 మైళ్లు. స్టేషనుకు కుంభకోణము 1 మైలుండును. దీనిని దేవాలయపట్టణ మందురు. ఈ నగరమున కుంభేశ్వరమహాదేవ మందిరము కలదు. ఈ మందిరమునకు 2 ఫర్లాంగుల దూరమున "మహామోహాన సరస్సు" కలదు. దీనిలో స్నానముచేయుటచే ఆధివ్యాధులు నివార్ణణయగును. ఈ సరస్తీరమున 16 మందిరములు గలవు. ప్రధానమందిరము సరస్సునకు నుత్తరమున గలదు. ఇచ్చట 12 సం॥ల కొక పర్యాయము మహామాఘోత్సవము జరుగును. ఆ సమయమునం దీ సరస్సులోనికి గంగానది వచ్చును. ఇందు స్నానముచేయుటకు దూరదూరములనుండి యాత్రికులు వచ్చుచుందురు. అన్యసమయములందు కూడ నుత్సవము లనేకము లీ నగరమున జరుగుచుండును. ఈ నగరము చాల ప్రాచీనమైనది. ఇది యొక ప్రసిద్ధ విద్యాకేంద్రము. ఇచ్చట పండితు లధికముగ గలరు. ఇది కంచి కామకోటిపీఠాధిపతులకు ముఖ్యస్థానము.

ఇది పట్టు, జరీ, వెండి, బంగారముల పనితనమునకు పేరుమోసిన వ్యాపారకేంద్రము. ఇక్కడికి 4 మై.లో స్వామిమలై లోని సుబ్రహ్మణ్యేశ్వరాలయము భక్తజన కల్పతరువు వంటిదని ప్రతీతి. ఇక్కడనే మార్కండేయుడు శివుని గురించి తపస్సుచేసి చిరంజీవియైనట్లు చెప్పుదురు.

## తంజావూరు

తంజావూరు కుంభకోణమునకు 24 మైళ్లు. ఇది కావేరీ తీరమున గలదు. ఇట రెండు కోటలు గలవు. ఒకటి చిన్నది, మఱియొకటి పెద్దది. ఇచట ననేక దివ్యదేవాలయములు గలవు. చిన్నకోటయందు సుప్రసిద్ధమగు బృహదీశ్వరాలయము కలదు.


బృహదీశ్వరాలయము

ఈ మందిరము రాజరాజచోళునిచే నిర్మించబడెను. దీనికి తూర్పున 90 అ. ఎత్తు గలది, పశ్చిమమున 60 అ. ఎత్తుగలదియు గోపురములు కలవు. పశ్చిమ గోపురమునకు నాలయము నకు మధ్య 4 స్తంభముల మంటపము గలదు. దీనియందు విశాలమయిన నందీశ్వరవిగ్రహము కలదు. ఇది 12 అ. ఎత్తు, 16 అ. పొడవు, 7 అ. వెడల్పు కలిగియున్నది. దీనిని 400 మైళ్ళ దూరమునుండి యిచ్చటకు దెచ్చిరి. ఈ నందీశ్వరునిపై సర్వదా నూనె నభిషేకించుచుందురు. ఈ నందీశ్వరునకు నుత్తరముగ పార్వతీమందిరము

కలదు. శివమందిరమునకు దక్షిణ పశ్చిమముగ శ్రీ గణేశ్వర మందిరము కలదు. బృహదీశ్వర మందిరమునకు పశ్చిమోత్తరముగ షణ్ముఖ కార్తికేయమందిరము గలదు. పూర్వోత్తరదిశ యందు చండీమందిరము గలదు. కార్తికేయమందిరము చాల నందమైనది. బృహదీశ్వరాలయమునకు నుత్తరముగ శివగంగ యను సరస్సు కలదు. ఇట సరస్వతీభవనమను నొక పెద్ద గ్రంథాలయము కలదు. ఇందు 8000 సంస్కృతగ్రంథములు కలవు. ఇవి యన్నియు తాళపత్రలిఖిత గ్రంథములు. భారతదేశమున గల పెద్దగ్రంథాలయములందు తంజావూరు సరస్వతీభవనము ప్రసిద్ధమైనది. తంజావూరు చాల సుందరమయిన నగరము. ఇచటకు 7 మై. దూరమున తిరువాడి లేక తిరువయ్యార్ అను స్థలము కలదు. ఇదియే శ్రీ త్యాగరాజస్వామివారి జన్మస్థలము. ఇచట యింకను అనేక దర్శనీయస్థానములు గలవు. అన్నివసతులు కలవు.

## తిరుచునాపల్లి

తంజావూరుకు పశ్చిమమునుగ తిరుచునాపల్లి (జం) 31 మైళ్లు. ఇది పూర్వచోళరాజులకు రాజధాని. అసలు దీనిపేరు తిరుశివపల్లి అనగా త్రిశిరుడనురాక్షసు డిచ్చట శివునిగూర్చి తపస్సుచేసి వరములను బొందినాడట. స్టేషనుకు 6 మై. దూరముననే తిరుచునాపల్లి యందొక కొండమీదగల శ్రీ గణేశమందిరము కానవచ్చును. ఈస్వామి నిట ఉచ్చిపిళ్లయార్ అందురు. ఇది చాల పెద్దనగరము. నగరమునకు సమీపమునందే 273 అ. ఎత్తుగ రాతిమిట్ట గలదు. ఈ మిట్టపైన చాల మందిరములు గలవు. మాతృభూతేశ్వర-తాయుమానవార్ (అనగా తల్లి కూడ అయినవాడు) అను

ప్రసిద్ధ ప్రధాన దేవాలయము గలదు. దీనిని పల్లవరాజులు నిర్మించిరని స్థలపురాణము. ఈ శివుడు మంత్రసానివలె, ఒక భక్తురాలికి సేవ చేసినాడట. ఈ మిట్టకు దక్షిణమున మెట్లు కలవు. ఇందు శివాలయము, గణేశమందిరము, పార్వతీమందిరములు చాల



తిరుచునాపల్లికోట

ప్రసిద్ధములైనవి. ఇచట వెండిరేకులతో కప్పబడిన నందీశ్వర విగ్రహము కలదు. గణేశమందిరమునకు నలువైపులగల దృశ్య మతి మనోహరము. భాద్రపదమాసమునం దిచ్చట పెద్ద యుత్సవము జరుగును. ఇట కావేరీనది ప్రసిద్ధము. ఈ నగరమునకు నుత్తరదిశయందు వేలార్ నదియున్నూ, కోయంబత్తూరుకు తిరుచునాపల్లికి మధ్య అమరావతీనదియు ప్రవహించుచున్నవి. ఇచటి కోటలు, రాక్ టెంపులు చూడతగినవి. తిరుచునాపల్లినుండియే శ్రీరంగము వెళ్లవలెను.

# శ్రీ రంగము

తిరుచునాపల్లికి షుమారు 3 మైళ్ళు. ఉత్తరముగా కావేరీ నది రెండు పాయలుగా చీలినందువలన, ఏర్పడిన ద్వీపముపై శ్రీరంగపట్టణము కలదు. ఇది దక్షిణదేశ దేవాలయములన్నిటి లోను ప్రసిద్ధమైనది. శ్రీరంగపట్టణమంతయు దేవాలయముచుట్టూ గల నలుచదరములో నిర్మితము. దీనిని భూలోకవైకుంఠ మందురు.

పూర్వచరిత్ర:— త్రేతాయుగమున శ్రీరంగవిమానము బ్రహ్మదగ్గరనుండి పూజకై ఇక్ష్వాకువంశజులచే తేబడినది. అశ్వమేధయాగమును చూచుటకు విభీషణుడు అయోధ్యకు వెడలగా శ్రీరాముడాతనికి బహుమానముగ నిచ్చెను. మార్గమున చోళరాజగు ధర్మవర్మచే ప్రార్థింపబడి విభీషణుడు బ్రహ్మోత్సవములో పాల్గొనెను. ఉత్సవానంతరము విభీషణుడు పయనమై విమానముకదలింప అది కదల లేదు. రంగనాథుడు ధ్యానమున గాన్పించి 'తన కచ్చట నుండుటయె యిష్ట' మన, విభీషణుడు లంకకు వెడలెను. ఇప్పటికిని అర్థరాత్రమున విభీషణుని అర్చన జరుగునందురు.



శ్రీరంగనాథాలయము

ముక్కోటికి లక్షలకొలది యాత్రికు లరుదెంతురు.

చోళరాజు ధర్మవర్మ దేవాలయ మొదటిప్రాకారమును కట్టించెను. కాలక్రమమున యిసుకలో కూరుకుపోగా, కిలిదండ

చోళుడు పునరుద్ధరించెను. నాటినుండియు తిరువరంగం తిరుపతి అని ప్రసిద్ధి చెందినది. రాజమహేంద్ర-చోళుడు 2వ ప్రాకారమును, కులశేఖరఆళ్వారులు 3వ దానిని, తిరుమంగిఆళ్వారు 4వ దానిని, 5, 6 ప్రాకారములను అకలంక-చోళుడు, త్రివిక్రముడు, 7వ ప్రాకారమును పాలికండ-చోళుడు వరుసగా కట్టించిరి. చోళరాజుల కాలములో చాల ప్రసిద్ధిచెందినది. మహమ్మదీయుల దండయాత్రతో దాని వైభవము నశించినది.



శ్రీరంగనాథాలయ గోపురము

విజయనగరసామ్రాజ్య స్థాపనతో తిరిగి దాని వైభవముపెరిగినది. వరుసగా నాయకమహారాష్ట్రులచేపోషింపబడి ఆంగ్లేయ రాజ్యమున వారిచే రు. 35,000 లు కానుకగ నివ్వబడి పోషింపబడినది. శ్రీరంగం వైష్ణవ దేవాలయములలో చాలప్రసిద్ధమైనది. ఇచటనే విశిష్టాద్వైతము వృద్ధిపొందినది. అండాళ్, తిరుపనిఆళ్వారు, బీబీనాంచారు మొదలగు మతకర్తలు యిచటనే తమ జీవితముల గడపిరి. ఆల్వార్ ఆచార్యులచే శ్రీరంగనాథునిపై 4000 కీర్తనలు వ్రాయబడెను.

ఇది చాల పెద్దమందిరము. దూరమున కిది యొక పెద్ద కోటవలె గోచరించును. ఏకకాలమున వేయిమంది మనుజులు ప్రదక్షిణము చేయవచ్చును. ప్రతి ప్రాకారమున బజారులు కలవు. దేవాలయమునకెదుట సుమారు 50 అ. ఎత్తుగల గరుడుని విగ్రహము కలదు. ఇంత పెద్దవిగ్రహము భారతదేశమునం దెచ్చటను గానరాదు. ఈ మందిరమున దాక్షిణాత్యశిల్పకళ లలితముగ పోషింపబడెను. ఇచట భగవంతుడు శేషాహిపై శయనించినట్లు కలదు. కంఠమున స్వర్ణయజ్ఞోపవీతము. శరీరము శ్యామలవర్ణ రంజితమై మనోహరముగ కానవచ్చును.

స్వామికి సమీపమున లక్ష్మి, విభీషణుడు మొదలగువారి విగ్రహములు కలవు. స్వామి శరీరమునకుపూసిన మంచిగంధమును ప్రసాదముగ నిత్తురు. రామానుజాచార్యులవా రీ మందిరమును పునరుద్ధరించిరి. బృందావనమునందలి శ్రీరంగమందిర మీ దేవాలయము ననుసరించియే కట్టబడినది.

## జంబుకేశ్వరము

తిరుచునాపల్లిజిల్లాలో శ్రీరంగమునకు మైలు దూరమున జంబుకేశ్వరలింగము కలదు. ఇది ఆపోలింగము. శివుని యష్టమూర్తులం దొకటి. (చూ. కాళహస్తి) ఇచట నీ శివలింగ మొక జలస్రోతముమీద కలదు. అందుచే శివలింగమువద్దనుండి జలము బయటకు వచ్చుచున్నట్లు కాన్పించును. జంబుకేశ్వరమందిరము 5 ప్రాకారములు కలిగి సుందర శిల్పకళాశోభితమై యున్నది. ఈ స్థానము చాల రమణీయము. స్వామి సేవా కైంకర్యములకు సంవత్సరమునకు కొన్నివేల రూపాయల యాదాయము వచ్చును.

ఇది చాల పెద్దమందిరము. దూరమున కిది యొక పెద్ద కోటవలె గోచరించును. ఏకకాలమున వేయిమంది మనుజులు ప్రదక్షిణము చేయవచ్చును. ప్రతి ప్రాకారమున బజారులు కలవు. దేవాలయమునకెదుట సుమారు 50 అ. ఎత్తుగల గరుడుని విగ్రహము కలదు. ఇంత పెద్దవిగ్రహము భారతదేశమునం దెచ్చటను గానరాదు. ఈ మందిరమున దాక్షిణాత్యశిల్పకళ లలితముగ పోషింపబడెను. ఇచట భగవంతుడు శేషాహిపై శయనించినట్లు కలదు. కంఠమున స్వర్ణయజ్ఞోపవీతము. శరీరము శ్యామలవర్ణ రంజితమై మనోహరముగ కానవచ్చును.

స్వామికి సమీపమున లక్ష్మి, విభీషణుడు మొదలగువారి విగ్రహములు కలవు. స్వామి శరీరమునకుపూసిన మంచిగంధమును ప్రసాదముగ నిత్తురు. రామానుజాచార్యులవారీ మందిరమును పునరుద్ధరించిరి. బృందావనమునందలి శ్రీరంగమందిర మీ దేవాలయము ననుసరించియే కట్టబడినది.

## జంబుకేశ్వరము

తిరుచునాపల్లిజిల్లాలో శ్రీరంగమునకు మైలు దూరమున జంబుకేశ్వరలింగము కలదు. ఇది ఆపోలింగము. శివుని యష్టమూర్తులం దొకటి. (చూ. కాళహస్తి) ఇచట నీ శివలింగ మొక జలస్రోతముమీద కలదు. అందుచే శివలింగమువద్దనుండి జలము బయటకు వచ్చుచున్నట్లు కాన్పించును. జంబుకేశ్వరమందిరము 5 ప్రాకారములు కలిగి సుందర శిల్పకళాశోభితమై యున్నది. ఈ స్థానము చాల రమణీయము. స్వామి సేవా కైంకర్యములకు సంవత్సరమునకు కొన్నివేల రూపాయల యాదాయము వచ్చును.



గుంబజ్ - శ్రీరంగము.
(చూడుడు 553 పేజి)

ఈమందిరము 17 వశతాబ్దమున గట్టబడెను. ఇచట నొక స్తంభముపై తమిళ భాషలో నొక శిలాశాసనముకూడ గలదు. ఇట అఖిలాండేశ్వరి యాలయము కూడ చూడతగినది. ఈ స్థానమును గురించి సూతసంహిత, శివ పురాణములలో మిక్కిలి యభివర్ణితము. ఇచటి దేవాలయ శిల్పవైభవము కొన్ని స్థలములలో శ్రీరంగ దేవాలయ వైభవమును మించియుండును.

## మన్నారుగుడి (రాజమన్నార్ మందిరము)

తిరుచునాపల్లినుండి తంజావూరు 31 మైళ్లు. తంజావూరుకు 28 మై. దూరమున మన్నార్‌గుడి కలదు. నీడామంగల్ (జం) మీదుగ నిచ్చటకు చేరవలయును. ఇది వెన్నార్ నదీతీరమున గలదు. దీనిని దక్షిణద్వారక యని పిలతురు. ఇచ్చట యాత్రికులు బసచేయుటకు చాల ధర్మశాలలు కలవు. భోజనసౌకర్యము కలదు. ఇది తాలూకా ముఖ్యనగరము.

ఇచట ప్రసిద్ధిచెందిన శివ, కేశవాలయములు చాల కలవు. అందు చంపకలక్ష్మి రాజగోపాలస్వామి మందిరము చాల ప్రసిద్ధమైనది. ఇట 'హరిద్రానాథసరము' అను గొప్ప సరస్సు కలదు.

యాత్రికు లిందు స్నానముచేసి స్వామిని దర్శింతురు. ఇది సిల్కు బట్టల నేతకు ప్రసిద్ధిచెందిన నగరము.

## తిరువారూరు

మన్నారుగుడి స్టేషనునుండి 'నిడామంగళం (జం) మీదుగ తిరువారూర్ 23 మై. ఇది యొక ప్రసిద్ధమైన శైవ క్షేత్రము. ఇందు మ్యునిసిపాలిటీ కలదు. ఇదియొక పెద్దనగరము. యాత్రికులు బసచేయుటకు చాల ధర్మశాలలు కలవు.

ఇచ్చట కమలాంబికా వల్మీకేశ్వరుల మందిరము, త్యాగ రాజస్వామి యాలయమును గలవు

వల్మీకేశ్వర మందిరము:— ఇది స్టేషనుకు 1½ మై. దూర మున గలదు. ఆలయమున కెదుట కమలాలయ మను నొక పెద్ద సరస్సు కలదు. ఇది సుమారు 32 ఎకరముల భూభాగమున వ్యాపించి యున్నది. ఈ సరోవర మధ్యమునం దొక మంటపము కలదు. యాత్రికు లిందు స్నానముచేసి వల్మీకేశ్వరస్వామిని దర్శింతురు. ఇచ్చట పుట్టనుండి ఈశ్వరు డుద్భవించి యుండుటచే నీస్వామికి వల్మీకేశ్వరుడని పేరు కలిగెను. నేటికిని ఆపుట్ట చిహ్నా ములు గానవచ్చును. ఈ ఆలయమంతము శిల్పకళాశోభితమై యున్నది. ఆలయమునకు ముందున్న మండప పైభాగమున 27 నక్షత్రముల అధిదైవముల యొక్కయు, అష్టదిక్పాలుర యొక్కయు విగ్రహములు కలవు. కమలాంబికాదేవి విగ్రహము తపమాచరించుచున్నటు లున్నది. ఇందు శంకరతీర్థమను కుండము కలదు. ఇందలి జలము సకలవ్యాధివినాశకరమని ప్రతీతి. వైశాఖ పూర్ణిమయం దధికముగా జను లిందు స్నానముచేయుదురు,

తెనుఁగునాటినుండి వలసపోయి కేవల ద్రావిడప్రాంతమునేగాక సమస్త దక్షిణభారతమును తన మధురకృతులచే గానముచే తన్మయులగావించి ఆబాలగోపాలమునకు చిరపరిచితుడైన శ్రీ త్యాగరాజస్వామి యీ తిరువారునందే జన్మించెను. వీరి తాతగారగు గిరిరాజ బ్రహ్మముగారు కర్నూలుజిల్లా కాకర్ల గ్రామమునుండి యిచటకు వలసవచ్చిరి. త్యాగరాజు బాల్యము నిచ్చటనే గడపెనుగాని తరువాత తిరువయ్యారునకు పోయి అచ్చటనే నివసించెను. త్యాగరాజస్వామి కేవల సంగీతశాస్త్రజ్ఞుడే గాక అతులిత శ్రీరామభక్తి ప్రపూరిత హృదయుడు కూడ. ఆయన జీవనమం దనేకపర్యాయములు శ్రీరామదర్శనము నొంది ధన్యత గాంచెను. నేటికిని యీ పరమభక్తుని జన్మనివాస చిహ్నములు చాల నిచ్చటను, తిరువయ్యారునందును కాననగును.

త్యాగరాజస్వామి మందిరము:— ముచికుందుఁడు దేవేంద్రుని ప్రార్థించి యీ స్వామి విగ్రహము నిటకు దెచ్చెనని చెప్పుదురు. ఈ యాలయమున కెదుట వేయి స్తంభములతో నొప్పు మంటపమొకటి కలదు. త్యాగరాజస్వామిని దర్శించి యాత్రికులు అందే యొక యంతరాలయమునన్న హాటకేశ్వరస్వామిని దర్శింతురు. ఈ యాలయమున నొక పాతాళమార్గము కలదనియు భక్తు లనేకు లందు ప్రవేశించి మరలిరాకుండుటచే దానిని మూసి వేసిరనియు చెప్పుదురు. ఇందు చాల శాసనములు కలవు.

అందలి యొక శాసనమందు — మనునీతి-చోళుఁడను రాజు యీనగరమును పాలించెననియు, నాతని ధర్మబుద్ధిని పరీక్షించుటకు, శివుడు ఆవుగను, యముడు ఆవుదూడగను వచ్చిరనియు

అవుదూడ యువరాజు రథముక్రింద బడి మరణించగా రాజు తన కుమారునికూడ రథముక్రింద బడవైచి చంపించెననియు, ప్రసన్నుడైన శివు డందఱ బ్రతికించెననియు తెలియుచున్నది. ఆలయమున కీశాన్యముగ నీకథను సూచించుచు నొక రాతిరథముకలదు. రాజకుమారుడు, చనిపోయినఅవుదూడ, ఆవువిగ్రహము కలవు. త్యాగరాజస్వామి రథము చాల పెద్దది. ఇంతటి పెద్దరథము మరెచ్చటను లేదని చెప్పుట యతిశయోక్తి కాదు. ఉత్సవ సమయము లందు స్వామినిందుంచి ఊరేగింతురు.



రాతిరథము

## నాగపట్నము

తంజావూరుజిల్లాలో తిరువారూరునగరమునకు తూర్పుగ 15 మై. దూరమున నాగపట్నము రైల్వేస్టేషను కలదు. ఇచ్చట నొక నగరము, ఓడరేవు కలవు. ఇటనుండి చాలమంది యాత్రికులు స్టీమర్లమీద రామేశ్వరము వెళ్ళుచుందురు. ఈ నగరమునకు బయట నొక శివాలయము కలదు. ఈ మందిర పూర్వోత్తర దిశయందు పార్వతీదేవిమందిరము కలదు. ఇవిగాక సుందరరాజస్వామి యాలయముకూడ నిచ్చట గలదు. ఈ ప్రదేశము చాల సుందరమైనది. శాసనములవలన నిచట కొన్ని బౌద్ధవిహారము లుండి యున్నట్లు తెలియుచున్నది. ఇచటకు సమీపమున గల నాగూరులో మీరాసాహెబు మసీదు కలదు. ఇతడు సిద్ధపురు

షుడు, 'త్వమసి పయసామర్ణవ ఇవ' అనునట్లు సముద్రమున కలసిన తరువాత నుదకభేదము కాన్పింపనట్లు ఆతనికి జాతి మత భేదములు లెవు. హిందువులుకూడ నీతనియెడ భక్తిశ్రద్ధలు చూపుదురు. ఇచట నింకను కొన్ని మందిరములు కలవు. ఇది సముద్రతీరమగుటచే నొక లైట్ హౌస్‌కూడ కలదు.

## వేదారణ్యము (నిగమవనము)

ఇది తిరువారూర్‌కు సుమారు 38 మైళ్లు. ఇది సముద్ర తీరమున నుండుటచే సముద్రస్నాన సౌకర్యము కలదు. ఇచ్చట నొక పురాతనదేవాలయమున వేదారణ్యస్వామిని దర్శించవలయును. వేదము లీ స్వామి నర్చించుటచేత నీనికి 'వేదారణ్య' డని పేరు కలిగెనని చెప్పుదురు. శ్రీరాముడు రావణ సంహారమునకు బోవుచు విజయ ప్రాప్తికై యీ స్వామి నర్చించెనని చెప్పుదురు. ఇచట ప్రతిసంవత్సరము అనేకఉత్సవములు జరుగుచుండును. ఇచటకు 7 మై. దూరమునందున్న 'కాలిమర్' అగ్రము నుండి శ్రీరాముడు సముద్రమును దాటి లంక ప్రవేశించుటకు ప్రయత్నించి విరమించినటుల చెప్పుదురు.



వేదారణ్యస్వామి ఆలయము

ఇచ్చటకు సమీపముననే అగస్త్యమహాముని నివసించిన అగస్త్యంపల్లి యను గ్రామమున అగస్త్యుని విగ్రహము కలదు.

అతడు వాతాపి యను రాక్షసుని అగస్త్యకొండలపైన జీర్ణము చేసికొనెనని చెప్పుదురు. ఆ కొండలు తిరునల్వేలియందు గలవు.

## పుదుకోట

వేదారణ్యమునుండి ఆరంతంగివరకు రైలు, అటనుండి బస్సుమీద పుదుకోట చేరవచ్చును. ఇది తిరుచునాపల్లికి ఆగ్నేయముగా కలదు. ఇచట 11, 12 శతాబ్దులందు జైనులు, బౌద్ధులు నివసించినట్లు కొన్ని చిహ్నములు కలవు. కొన్ని బౌద్ధ మతావశేషములు నేడును కానవచ్చును. ఇచటి పురాతనపుకోట, ఆసుపత్రులు, కళాశాలలు, ఉద్యానములు, రాజభవనమును చూడదగినవి. ఇచటకు 13 మై. దూరమున గల 'తిరుమాయి' యను చోట ఒక పాతకోట, శివ, విష్ణ్వాలయములు కలవు. పుదుకోటకు 9 మై. దూరమున గల 'సీతన్నావసల్' అనుచోట వృక్షవర్ణములతో చిత్రించబడిన జైన బౌద్ధ చిత్రములు కలవు. ఇచట తిరుగోకర్ణములోని ఆలయములు, శివగంగలోని ప్రాచీనభవనములు తప్పక చూడదగినవి. యాత్రికులకు ధర్మశాలలు, సౌకర్యములు గలవు.





తిరుచునాపల్లికోట

(మరియొకదృశ్యము) చూ. 551 పేజి

## రామనాదము

పుదుకోటనుండి మన్ మధురై (జం)మీదుగ రామనాద స్టేషన్ 98 మైళ్లు. మధురనుండి రామనాదము 67 మైళ్లు. రోడ్డు

కూడ కలదు. ఇది వైగైనదీతీరమున గలదు. ఇది తుపతిరాజులకు రాజధాని. తీరస్థానము కాదు. రామేశ్వరమునకుబోవు యాత్రికు లిట విశ్రాన్తితీసికొందురు. రామనదమున రాజభవనము, కొన్ని ధర్మశాలలు కలవు. యాత్రికులు బసచేయుట కిచ్చుట మంచి సౌకర్యములు కలవు. వివేకానందుడు అమెరికానుంచి వచ్చి నపుడు రామనాడు మహారాజుగారు, వివేకానందుని పాశ్చాత్య దేశ విజయచిహ్నముగ క్రీ. శ. 1_27_1897 న స్థాపించిన కీర్తిస్తంభము కాంచనగును.

## శ్రీరామేశ్వరము

లంకాం విజేతుం కపి భాలుముఖ్యై ర్నిబద్ధసేతుం సరితాం పతౌచ,
శ్రీరామచంద్రేణ సుపూజితం వై రామేశ్వరాఖ్యం సతతం నమామి.

రామనదమునకు రామేశ్వరము స్టేషను 33 మైళ్లు. ఇట నుండి మధురకు 138 మైళ్ళు. ఇది సుమారు 11 మై. పొడవు, 7 మై వెడల్పు గల ద్వీపము. రాముడు నిర్మించిన సేతువునందిది యొక ఖండమని భాసించును. రైలు 'పాంబన్' వంతెనమీద నుండి వెడలునపుడు యాత్రికులు సముద్రమున టెంకాయలు, పువ్వులు వైచి నమస్కరింతురు. ఇచట రాముడు నిర్మించిన సేతువు చిహ్నములు కానవచ్చును. సూర్యోదయసమయమునం దీ సేతువు విస్పష్టముగ నప్పుడప్పుడు గోచరించునని చెప్పుదురు. విభీషణుని ప్రార్థన ననుసరించి శ్రీరాముడే సేతువును ఖండించి వైచెను. అందువలన సేతువు ఖండఖండములుగ గోచరించును. క్రమముగ బండి రామేశ్వరము స్టేషనుకు చేరును.

రామేశ్వరముస్టేషనుకు చేరగనే యాత్రికులు శ్రీరామేశ్వరునకు జయజయకారములు గావించుచు నగరమున ప్రవేశింతురు. స్టేషనుకు సమీపమునందే యొక ధర్మశాల కలదు. శ్రీరామేశ్వరమందిరమునకు సమీపమున వంశీలాల్ ధర్మశాల కలదు. రాయబహాదుర్ భగవాన్‌దాసు ధర్మశాల యొకటి 'రామఝరోఖా'కు సమీపమున కలదు. యాత్రికు లిందు సుఖముగ బసచేయవచ్చును.



* రామేశ్వరాలయ అంతర్భాగములోని దృశ్యము

పూర్వ మీ రామేశ్వరప్రాంతమును గంధమాదనపర్వతమని పిలచెడివారు. రాముడు సేతువును నిర్మింపబూనినపు డీపర్వతము వారి కడ్డము వచ్చెను. అంత రాము డాజ్ఞాపింపగ హనుమంతు డీపర్వతము నణచివైచెను. అంత రాముడు సేతు నిర్మాణమునకు పూర్వ మిట నొక శివలింగమును ప్రతిష్ఠింప దలచి,

కైలాసమునుండి శివలింగమును గొనిరమ్మని యాంజనేయున కాజ్ఞాపించెను. కాని హనుమంతుడువచ్చుటకు నాలస్యముకాగా రాము డిట సైకతలింగమును (ఇసుకలింగము) బ్రతిష్ఠించి తన వింటి కొనవలన గంగ నుద్భవింపజేసి యీశ్వరున కభిషేకించెను. ఇంతలో ఆంజనేయుడు లింగమును తెచ్చెను. అంత రాముడు తాను ప్రతిష్ఠించిన లింగమునకు నెడమవైపున నా లింగమును ప్రతిష్ఠించెను. దీనిని హనుమదీశ్వరు డందురు.

తీర్థవిధి, గంగపూజ:— యాత్రికులు మొదట తీర్థవిధి నిర్వర్తించి, పిమ్మట గంగోత్రినుండి, ప్రయాగనుండియు గొని తెచ్చిన గంగను తీసికొని పండాలద్వారా దానిని పూజింతురు. గంగ లేకున్నవారి కిట ఖరీదుకు గంగ దొరకును. ఇచటి పండాలు విద్వాంసులు.

శ్రీరామేశ్వరమందిరము:— గంగాపూజనమైన తరువాత యాత్రికులు రామేశ్వరమందిరమునకు వెడలుదురు. ఈ మందిరము 1000 అ. పొడవు, 600 అ. వెడల్పు, 125 అ. ఎత్తు కలిగి దీర్ఘచతురస్రాకారముగ యున్నది. యావద్భారతదేశములోని ప్రజలకు అత్యంత గౌరవభాజనమైన రామలింగేశ్వరస్వామివారి ఆలయము — దక్షిణాది శిల్పుల నిర్మాణ కుశలత్వమునకు, మేధాసంపన్నతకు, భావుకతకు నిదర్శనము. ఇక్కడి శిల్పసంపద అపూర్వము. దీని ప్రాకారము 22 అడుగుల ఎత్తు. నలుదెసల నాల్గు ద్వారములు కలవు. ఈ ప్రాకారమునకు తూర్పున రెండు గోపురములు గలవు. పశ్చిమగోపురము 100 అ. ఎత్తు కలది. దక్షిణోత్తర గోపురములు ప్రాకారమునకన్న కొంచె మెత్తుగ నున్నవి.

ఈ గోపురములందు చూపబడిన శిల్పము, మూర్తినిర్మాణ కళ చూడతగినవి. ఈ యాలయము రామనాథ పరిపాలకులగు సేతుపతులచే కట్టబడినది. ఈ ప్రాకారాంతరమున బజారు కలదు. ఇట ముత్యపుచిప్పలు, శంఖములు, భస్మము, టెంకాయలు మొదలగు వివిధవస్తువులు విక్రయింపబడుచుండును. మందిరమునకు ప్రదక్షిణము చేయునపుడు శ్రీరామలక్ష్మణ భరతశత్రుఘ్నుల విగ్రహములు, విఘ్నేశ్వర, ఆంజనేయ విగ్రహములు కానవచ్చును. ప్రదక్షిణముచేయు మార్గము చాల విశాలముగ నున్నది. ప్రదక్షిణానంతరము యాత్రికులు ఆలయమున ప్రవేశించి తమవెంట తెచ్చిన గంగాజలము నర్చకున కొసంగిన యాతడా జలమును స్వామి కభిషేకించును.

రామేశ్వరునిట్లు దర్శించియాత్రికులు కీర్తిస్తంభ సమీపమున గల నందీశ్వరుని దర్శింతురు. ఈ విగ్రహము చాల పెద్దది. కటకటాలమధ్య గలదు. రామేశ్వర మందిరమునకు



పుష్కరిణి – తిరుపతి. (చూ. 529 పేజి)

కుడివైపున పార్వతీమందిరము కలదు. పార్వతీదేవి నిచ్చట అన్నపూర్ణాదేవి యని పిలతురు. రామేశ్వరునకు నెడమవైపున హనుమదీశ్వర మందిరము కలదు.

శ్రీరామేశ్వరమునం దుదయము మొదలు రాత్రి 10 గం. వరకు స్వామిని సందర్శింపవచ్చును.

సముద్రస్నానము:— రామేశ్వరమునకు తూర్పున సముద్రమున నొక ఘట్టము కలదు. ఇచటనే యాత్రికులు సముద్రస్నానము చేయుదురు. శ్రీరాముడు లంకనుండి వచ్చుచు నిచటనే పుష్పకమునుండి దిగెనట. దీనిని అగ్నితీర్థమందురు. ఇచట నన్నదానము చేసిన నధికఫలము లభించును.

## అన్య తీర్థములు

ఇచట ననేకతీర్థస్థానములు కలవు. అవన్నియు కుండరూపమున గలవు. ఈ కుండములుదక్క— నూతులలో నీరు ఉప్పగ సముద్రోదకమువలె నుండును.

శ్రీరామచరణ చిహ్నములు:— ఇది రామేశ్వర మందిరమున నొక మైలుదూరమున గలదు. యాత్రికులు నడచి ఇటకు జేరుదురు. ఇట రెండతస్థులుగల చిన్న మండపమున శ్రీరాముని చరణచిహ్నములు కలవు. యాత్రికులు వీనిని పూజింతురు.

సుగ్రీవతీర్థము:— రామేశ్వరమందిరమునకు శ్రీరామ చరణ చిహ్నములకు మధ్య నొక కుండము కలదు. దీనిని సుగ్రీవ కుండ మందురు. ఇచటనే యొక చిన్నమందిరమందు సుగ్రీవుని విగ్రహము కలదు. ఈ మందిరమునకు నర్చకులు లేరు.

లక్ష్మణసరోవరము:— ఇది రామేశ్వరమునకు 2 మై. లో గలదు. బండ్లు దొరకును. ఇట లక్ష్మణుడు స్థాపించిన లక్ష్మణేశ్వర మందిరము కలదు. ఇట స్నానము, పిండదానము చెప్పబడెను.

లక్ష్మణతీర్థము:— ధర్మరాజు వనవాసదుఃఖ దుఃఖితుడై యున్నపుడు కృష్ణు డాతనితో లక్ష్మణతీర్థమును సేవించిన రాజ్య ప్రాప్తి కలుగునని చెప్పెను. అప్పుడు ధర్మరాజు యీ తీర్థమును సేవించి రాజ్యమును బడసెనని చెప్పుదురు.

ధనుష్కోటితీర్థము:— నర్మదాతటమున తపస్సు, గంగా తీరమున మరణము, కురుక్షేత్రమున దానము వలన గలుగు ఫల మీ తీర్థ సేవనమాత్రమున గలుగును.

కోటితీర్థము:— లంకనుండి విజయియై వచ్చిన రాము డీశ్వరు నభిషేకించుటకు ధనుష్కోటితో నిట గంగను ప్రకటము గావించెను. గంగాజలమును గొనలేనివా రీ తీర్థముతో నీశ్వరు నభిషేకింతురు.

గాయత్రీ తీర్థము:— ఇట గాయత్రీ దేవినివసించు చుండును. పూర్వమునుం డియు నిటననేకులుగాయత్రి మంత్రమును జపించుచుం డిరి. ఇట గాయత్రీజపము నియమపూర్వకముగ చేసిన గాయత్రీ సాక్షాత్కారము కలుగును.



నటరాజస్వామిమందిరము - చిదంబరము

(చూడుడు 546 పేజి)

మరికొన్ని తీర్థములు:— తీరస్థ శ్రీరామమందిర విరాజి తము స్వచ్ఛజలపూరితము నగు శ్రీరామసరోవరము, గాలవముని భగవత్సాక్షాత్కారము నందిన చక్రతీర్థము, దారిద్ర్యవినాశక

మగు మంగళతీర్థము, జ్ఞానదాయకమగు అమృతవాపి, సర్వపాప నివారకమగు బ్రహ్మకుండము (బ్రహ్మహత్యావిమోచన తీర్థము), నియమితస్నానమున వికలాంగులకుగూడ దివ్యదేహము నొసంగు శుక్రతీర్థము, బ్రహ్మహత్యా నివారకమగు శివతీర్థము, శంఖమహా ముని తపము గావించిన శంఖతీర్థము, సర్వపాప నివారకమగు సాంధ్యామృతతీర్థము, యజ్ఞ దానాది సర్వకర్మఫలముల చేకూర్చు సర్వతీర్థము, విష్ణుభక్తి ప్రదాయకమగు పాపవినాశక తీర్థము, ఈశ్వర సాక్షాత్కారకమగు బేతాళవరదతీర్థము, పుణ్యదాయకమగు జటాతీర్థము, త్రివేణీసంగమ స్నాన ఫలము చేకూర్చు గంగాయమునా సరస్వతీ తీర్థము, చంద్రలోక ప్రాపకమగు చంద్రతీర్థము, సర్వవిద్యా ప్రదాయకమగు సరస్వతీతీర్థము



రామేశ్వరాలయము (మరియొక దృశ్యము)

యివా మొదలగు ననంఖ్యాకములగు తీర్థములు గలవు. వీని మాహాత్మ్యమును గూర్చి యనేక గాథలు కలవు. శక్తికొలది పై తీర్థములలో తీర్థవిధి చేయవలయును.

శ్రీరామ మండపము:— ఇది రామేశ్వరమునకు 2 మై. దూరమున గలదు. ఇసుకమార్గము కలదు. బండ్లు దొరకును. ఇది రెండంతస్థుల మండపము. పూర్వ మిట రాముఁడు లంకకు

వెడలుచు తన సైన్యమును నిరీక్షించెనని చెప్పుదురు. ఈ మార్గ మున సుగ్రీవకుండము కలదు. ఒకప్పుడు వానరసైన్యమున కధిక దాహము వేయగ సుగ్రీవుడు తన గదతో నిట భూమిమీద కొట్టెను. అంత నటనుండి నీరు వెలువడెను. ఈ కుండమునకు సమీపమునందే ఆంజనేయస్వామి కోవెల కలదు. ఇది చాల రమ్యమయిన ప్రదేశము.

## ధనుష్కోటి

ఇది స్టేషనుకు 2 మై. దూరమున గలదు. ఇట సముద్ర మును యాత్రికులు పూజింతురు. ఇచట సువర్ణధనువును దానము గావించిన నధికఫలము గలదు. యాత్రికులు వెవిపోగులను ధనురా కారముగ వంచి యిట దానముచేయుదురు. ఇది ప్రాక్పశ్చిమ సముద్రములు కలియుచోటు. సముద్రతీర దృశ్య మతి మనోహ రముగ నుండును.

పరిక్రమ:— శ్రీ రామేశ్వర క్షేత్రమునకు ప్రదక్షిణము చేయు విధానముకూడ గలదు. ఇందు బ్రహ్మకుండము గాన్పిం చును. ఇందు స్వాభావికముగనే భస్మము లభించును. యాత్రికు లీ భస్మము నిండ్లకు గొంపోదురు.

శ్రీ రామేశ్వరమునకు యాత్రికులవలన సుమారొక లక్ష రూపాయ లాదాయము వచ్చును. ఇచట తంతితపాలా సౌకర్య ములు, వేదశాస్త్ర పాఠశాల, హైస్కూలు, అన్నసత్రము, లైబ్రరీ కలవు. ఇచటి పండాలు హిందీకూడ చక్కగ మాటాడు దురు. భారతదేశమునకు దక్షిణమున గల నీ క్షేత్రము పరమ పునీతమైనది.

## పాంబన్

ధనుష్కోటినుండి పాంబన్ 16 మైళ్ళు. దీనినే సేతుబంధ ఖండమున 'పావనవన' మనిరి. ప్రస్తుత మిందు నావికు లధికముగ నివసించుచుందురు. ఇట యాత్రికుల కొక ధర్మశాల కలదు. ఇచట భైరవాలయము చూడదగినది. సమీపముననే ఆంజనేయ స్వామి కోవెల కలదు. పాంబన్ నుండి రామేశ్వరద్వీపమునకు గట్టిన రైల్వేవంతెన చాల చిత్రముగ నుండును. క్రిందనుండి


పాంబన్ బ్రిడ్జి

స్టీమర్లు పోవునపు డీ వంతెన మధ్యభాగము యంత్రముల ద్వారా పైకి లేచును. రైలు పోవునపుడిది మామూలుగ నుండును. ఇచట 100 అ. ఎత్తుగల లైటుహౌసుకూడ కలదు. సిలోను (లంక) కు పోవు యాత్రికు లిచ్చటనే స్టీమర్లపై నెక్కుదురు. పాంబనులో సముద్రమున దొరకు వస్తువులను అధికముగ విక్రయింతురు.

## దర్భశయనము

పాంబన్ స్టేషను నుండి రామనాడము 16 మైళ్లు. అచటకు 6 మై. దూరమున దర్భశయనము గలదు. రామనాదమునుండి బస్సులు కలవు. పూర్వము రాము డిచటనే సముద్రము దాటుటకు దర్భశయనుడై సముద్రుని ప్రార్థించెను. ఇచ్చటకు సముద్రము 3 మైళ్లు. యాత్రికు లందు స్నానముచేసి దర్భశయనమునకు వత్తురు. ఇచ్చట శ్రీరామాలయము, జగన్నాథాలయము

ఇక్కడ సామాన్యముగా నేదోయొక ఉత్సవము జరుగు చుండును. దీనిని ఉత్సవాల పట్టణ మందురు. పూర్వ మిచట నెక్కువగ రోము, గ్రీకు దేశములతో సముద్రవ్యాపారము జరుగుచుండెడిది. ఈ నగరపు ప్రస్తుత శిల్ప, వాస్తు వైభవమునకు క్రీ శ. 17 వ శతాబ్దిలో దీనిని పాలించిన నాయకరాజు లెక్కువ దోహద మిచ్చిరి.


మీనాక్షీ మందిరము

ఇచట మీనాక్షీ సుందరేశ్వరుల మందిరము కలదు. ఇది చాల పెద్ద మందిరము. 22 ఎకరముల భూమి యందు నిర్మింపబడినది. ఈ మంది రము పొడవు 850 అ. వెడల్పు 250 అడుగులు. చూడదగినది. ఈ మంది రము రెండు భాగములుగ గలదు. దక్షిణభాగమున మీ నా క్షీ దే వి, ఉత్తరభాగమున సుందరేశ్వరుని విగ్ర హములు కలవు. ఈ మందిరమున గల పాలరాతి పనితనము చాల సొంపుగా నుండును.

మీనాక్షీ మందిరమునకు అష్టలక్ష్మీ మండపము నుండి వెళ్ళవలయును. బహిర్ద్వారము నుండి మందిరమువరకు గల మండప స్తంభములందు లక్ష్మీవిగ్రహము మలపబడి యున్నది. ఇవి మొత్తము 8 స్తంభములు. ఇందువలననే దీనికి అష్టమండప మను పేరు వచ్చెను. మందిరము లోపలి ప్రాంగణమున స్వర్ణ పుష్కరిణి యను సరస్సు కలదు. ఇందుత్సవవిగ్రహములు తెప్ప

మీంద నుంచి త్రిప్పబడుచుండును. ఈ సరస్సునకు నలువైపుల నొక మండపము కలదు. ఉత్తర పశ్చిమ దిశలందు ఘంటాగృహములు కలవు. ఈ మండప స్తంభములందు మనోహరములగు విగ్రహములు చిత్రించబడియున్నవి. మీనాక్షీదేవిని దర్శించుట కనేకద్వారములు దాటవలయును. మీనాక్షీదేవి విగ్రహము నల్లనిరాతితో నిర్మింపబడి చాల సుందరముగ నుండును. ఈ విగ్రహము పూర్వాముఖమై యున్నది. ఈ మందిరమున చాల దేవతావిగ్రహములు గలవు. సర్వదా దీపములు వెలుగుచుండును. మీనాక్షీమందిరమున కెదుట స్వర్ణరంజితమగు నొక స్తంభము కలదు. ఈ స్వర్ణ స్తంభమున కుత్తరముగ సుందరేశ్వర మందిరము కలదు. ఇచటకూడ అనేక దీపములు రాత్రింబవళ్లు వెలుగుచుండును. అనేక దేవతా విగ్రహములు ఇచటకూడ కలవు. మందిర ద్వారమునం దొక స్వర్ణ స్తంభము కలదు. ఈ మందిరమునకు తూర్పున తిరుమలై నాయకుడు కట్టించిన విశాల మండపము కలదు. దీనిని కట్టించుటకు 1 కోటి షిల్లింగులు ఖర్చయినవని చెప్పుదురు. ఇచ్చటె వేయి స్తంభముల మంటపములో ఒక్కొక్క కంబము ఏకశిలానిర్మితమైన అపూర్వ కళాఖండము. ఇక్కడి తిరుమలనాయకుని భవనము, మదరాసురాష్ట్రములోని మహాసౌధములకు మకుటాయమానము. ఇది నేతచీరెలకు ప్రసిద్ధి.

తిరుపరకుంద్రము:— మధురకు 5 మై. లో సుబ్రహ్మణ్యేశ్వరగుహాలయము, 7 మై. లో అలగారుకోయల్ అను నొక వైష్ణవదేవాలయము కలవు. వీనిని అనేకమంది దర్శింతురు. భారత, రామాయణములలో నీ మధురాక్షేత్రము మిక్కిలి నభివర్ణితము.

## తేప్ప్యకులమ్ (తెప్పచెఱువు)

తమిళమున 'తేప్ప్యకులమ్' అనగా తెప్పచెఱువనియర్థము. మధురస్టేషనుకు తూర్పుగ 3 మై. దూరమున రామేశ్వర మార్గమున వైగైనది కుత్తరదిశయందు 1200 గ. పొడవు, అంతియ వెడల్పుగల చెఱువు కలదు. ఈ చెఱువునకు నలువైపుల రాతితో నిర్మింపబడిన రేవులు కలవు. చెఱువునకు మధ్య నొక ద్వీపమున నొక మందిరము కలదు. చెఱువునకు నలువైపుల 4 మందిరములు గలవు. మధ్యనున్న ద్వీపమున సుందరమైన పుష్పవాటిక కలదు. ఈ చెఱువునం దెల్లప్పుడు నీరుండును. ప్రతి సంవత్సరమును ఉత్సవసమయములం దీసరస్సీరమున 1 లక్ష దీపములు వెలిగింపబడును. ఆ సమయములందు మధురలోని మీనాక్షీ సుందరేశ్వరుల ఉత్సవవిగ్రహముల నిటకు తెచ్చి యీ చెఱువునందు తెప్పమీద విహారింపజేయుదురు.

## కొడైకెనాల్

మధురనుండి కొడైకెనాల్‌రోడ్డుస్టేషను వరకు రైలు, అటనుండి సుమారు 50 మైళ్లు బస్సుమీద ప్రయాణముచేసిన యీ సుందరపర్వత విశ్రాంతికేంద్రమును చేరవచ్చును. ఇది సముద్రమునకు 7000 అ. ఎత్తున గలదు. ఇది భూమధ్యరేఖకు సమీపమునం దుండుటచే నిచ్చట శీతోష్ణస్థితి సమధాతువుగా నుండును. ప్రతిదినము ఇచ్చట సూర్యరశ్మి 11 గంటలు పరివ్యాప్తమై యుండును. ఇట్చటగల భారతప్రభుత్వపు "సోలార్ ఫిజిక్సు అబ్సర్వేటర్" చూడదగినది. ఈ నగరమధ్యమునందు గల అరణ్యసౌందర్యము చూడదగినది. ఇచ్చట "కొకరుభాట" ఖ

3 మై. దూరమున 400 అ. ఎత్తుగల 'స్తంభపురాళ్ళు' అను పేరు గల 3 నల్లరాతి మిట్టలు గలవు. ఇచటకుపోవు మార్గము చాల మనోహరముగా నుండును. ఇట చాల గుహాలు, అగాధములు కలవు. అందు ప్రవేశించుట చాల కష్టము. గతశతాబ్దమునుండి యిచట క్రైస్తవు లధికముగా యుండిరి. ఇచటి సరస్సు 3 మై. వి స్తీర్ణము కలిగి అతిమనోహరముగా నుండును. ఇట మనోహర జలధారలు 3 కలవు. ఇచ్చట నక్షత్రవేధశాల చూడదగినది.

## శ్రీ విల్లిపుత్తూరు

మధురనుండి విరుధ్‌నగర్ (జం) మీదుగ నిచ్చటకు చేర వచ్చును. మధురకు శ్రీవిల్లిపుత్తూరు 26 మైళ్ళు. ఇది షుమారు 40 వేల జనాభాగల పెద్దపట్టణము. ఇచటనే వైష్ణవభక్తురాలగు 'ఆండాళమ్మగారు జన్మించిరి. ఈ నగర మొక శబరనాయకునిచే నిర్మింపబడినట్లు చెప్పుదురు. ఇచట శేషశయనుడగు శ్రీరంగనాథస్వామి యాలయము కలదు. ఆండాళ్ తిరునాళ్ళకు జులై లోను, వైకుంఠ ఏకాదశికి, డిశంబరులోని తైలకప్పు తిరునాళ్లకు అశేషజనమువచ్చుచుందురు. ఇచ్చట నొక గాలిగోపురము కలదు. ఇది చాల పెద్దది. ఇచ్చటనే యొక కోనేరు కూడ గలదు. శ్రీకృష్ణదేవరాయల ఆముక్తమాల్యదయం దీ నగర వర్ణనము కానవచ్చును.


శ్రీరంగనాథాలయము

## శంకరనారాయణ కోవెల

శ్రీ విల్లుపుత్తూరునుండి శంకరనారాయణకోవెల స్టేషను 27 మైళ్ళు. ఇచట ధర్మశాలలు గలవు. పూర్వమిది పాండ్యరాజులచే పాలింపబడుచుండెడిది. ఒకరాజు శివ కేశవులకు భేదము గల్పించి కేశవు నారాధించి శివుని ద్వేషించుటచే శంకరనారాయణ రూపమున భగవంతు డిచ్చట నావిర్భవించెను. ఈ స్వామి సగము శివుడుగను, సగము విష్ణువుగను నుండెను. స్వామికి సగము నిలువు, సగము అడ్డము బొట్లు పెట్టుదురు. ఆషాఢమాసమునం దిచ్చట పెద్ద యుత్సవము జరుగును. శివ కేశవులకు భేదములేదని సూచించు నిట్టి క్షేత్రములు భారతదేశమునందరుదుగా గలవు. కవితిక్కన కాలమున నెల్లూరునందిట్టిదే యొక 'హరిహరనాథాలయ' మ్ముండెడిదని తెలియుచున్నది. ఆలయము దర్శనీయమైనది. ముఖ్యముగ శివ కేశవులకు భేదము కలదని భావించువార లిచ్చట కేతెంచిన భేదభావన నశించును. ఇచట గల సరస్వతీరమందలి రాజభవనము తప్పక చూడతగినది.

## టెంకాసి

శంకరనారాయణకోవెల నుండి టెంకాసీస్టేషను 22 మైళ్లు. ఇది జంక్షను. ఇది యొక శివక్షేత్రము. స్టేషనుకు సమీపముననే శ్రీ కాశీ విశ్వనాథాలయము గలదు. ఇదికాక ఇచ్చట నింకను కొన్ని మందిరములు కలవు. కాశీవిశ్వనాథాలయ గోపురమును మహమ్మదీయులు సగమువరకు కాల్చివైచిరి. ఆ చిహ్నములు నేటికిని కానవచ్చును. భోజనాది సౌకర్యములకు వసతులు కలవు. ఇది చిత్రానదీతీరమున గలదు. దీనిని దక్షిణకాశి యందురు.

ఇందలి జలపాతము జులై, ఆగష్టునెలలయందు ముమ్మరముగా నుండును. ఇక్కడి దేవాలయశిల్పము అపూర్వము.

## కుర్తాళం

ఇది టెంకాసీకి సుమారు 3 మైళ్లు. ఇది యొక ఆరోగ్యకరమగు స్థానము దీనిని త్రికూటాచలమని ప్రాచీనులు వాకొనిరి.



వాటర్ ఫాల్స్ (జలపాతము)

ఇచ్చట చిత్రానది యొక్క కొండపై నుండి షుమారు 55 అ. ఎత్తునుండి పడుచుండును. ఈజలపాతము చాల రమణీయముగ నుండును. యాత్రికుల కిచట వసతిసౌకర్యములు కలవు. జలపాతమునకు సమీపముననే వేణునాద వాణీ అగస్త్యనాథ (కుత్తాళేశ్వర) మందిరము కలదు. ఆరోగ్యమునకై అనేకులు మేనెల నుండి కొంతకాలమిట నివసింతురు. చిత్రానది జలపాతము వనమూలికా సంయుతమగుటచే నియమపూర్వక స్నాన మాత్రమున సర్వవ్యాధులు నశించును. ఈ పరిసరమంతయు ప్రకృతిసంపదకు పుట్టినిల్లు. ఇది యొక యాహ్లాదకరమగు ప్రదేశము.

## అంబాసముద్రము

టెంకాసీనుండి అంబాసముద్రమువరకు రైలు. అచ్చట నుండి 5 మై. దూరము. రోడ్డుమీదుగ ప్రయాణించిన పాపనాశ

సము చేరుదురు. ఇచట తామ్రపర్ణినదీతీరమున శ్రీలోకేశ్వరీ పాపవినాశేశ్వరుల యాలయము కలదు. యాత్రికులుబస చేయు టకు ధర్మశాలకూడ గలదు. తామ్రపర్ణినదియందు స్నానము చేసి యాత్రికులు స్వామిని దర్శింతురు. ఈ నదియందు చేప లధి కము. ఇచట కోతులుకూడ మెండుగానున్నవి. కార్తీక, మాఘ మాసములందు యాత్రికులు విశేషముగా వత్తురు. ఇచట పాప నాశన జలపాతము, పాపనాశనం డాము, కల్యాణతీర్థము, విద్యు చ్ఛక్తి యంత్రాగారములు, నూలునేత యంత్రాలయములు మొదలైనవి ముఖ్యముగ చూడదగినవి. ఈ ప్రాంతమందలి ప్రకృతిదృశ్యము లతి మనోహరముగా నుండును. అన్ని వసతులు గలవు. ఇచటకు 2 మైళ్ళలో గల మన్నార్ కోవెలయందు ముక్కోటికి గొప్ప యుత్సవము జరుగును.

## తిరుకురుంగుడి (సెర్మాదేవి)

అంబాసముద్రముస్టేషనుకు సెర్మాదేవిస్టేషను 10 మైళ్లు. అచ్చటనుండి 17 మైళ్ళు మోటారుమీద ప్రయాణము చేసిన తిరుకురుంగుడి క్షేత్రమును చేరవచ్చును. ఇది యొక యరణ్య భాగము. మృగసంచారము కలదు. ఇచట శ్రీవామనాలయము కలదు. శ్రీకృష్ణదేవరాయలు తన 'విష్ణుచిత్తీయమునందు కురుం గడినంబి (వామనస్వామి) యారాధకుడగు మాలదాసరి చరిత్ర మును వర్ణించియుండెను. 'కురుంగడినంబి కృపావలంబి' యగు నా దాసరి కరుణచే కుంభజానుసంజ్ఞుడగు బ్రహ్మరాక్షసుడు దివ్యత్వమును బొందెను.

# తిరునల్వేలి

ఇది సెర్మాదేవిస్టేషనుకు సుమారు 12 మైె. దూరమున గలదు. ఇది చాల పెద్దపట్టణము. దీనికి రెండుస్టేషనులు గలవు. అందొకటి టౌనుస్టేషను. రెండవది జంక్షను. టౌనుస్టేషనుకు నగరము చాల దగ్గరగా కలదు. ఇది తామ్రపర్ణీనదికి పశ్చిమమున గలదు. జిల్లానగరము. ఈ జిల్లా జనాభా సుమారు 24,451,969. ఈ నదీతీరమున ఈస్టిండియా కంపెనీవారిచే నిర్మింపబడిన యొక స్తంభము కలదు. నగరమున ధర్మశాలలు గలవు.

ఇచ్చట తామ్రపర్ణీనది ప్రాగ్వాహినియై యున్నది. ఈ నదియం దిచ్చట 4, 5 మంటపములు కలవు. మృతులగువారల యస్థులను ఇందు కలిపిన గంగలో కలిపిన ఫలము కలుగును.

ఇచట ఆనందవల్లీ కైలాసనాథుల మందిరము, నటరాజాలయమును గలవు. యాత్రికులు తామ్రపర్ణియందు స్నానముచేసి స్వామిని దర్శింతురు. ఇందలి స్తంభములు రాగివలె మ్రోగుచుండును. సోమస్కంధమను స్తంభమున గల శిల్పకళ దర్శనీయము. అగస్త్యుని కోర్కెచే శివుడిందు సుందరరూపుడై యవతరించెనని చెప్పెదురు. పూర్వ మొకసారి ప్రళయకాలమందువలె వర్షము కురియగా ఒక భక్తుని పంటపొలము నాశనముకాకుండ భగవంతుడు పందిరిరూపముదాల్చి కాచినట్లు స్థలపురాణమునందున్నది.

నగరమునందలి నెల్లియప్పస్వామి మందిరముకూడ చాల ప్రసిద్ధమైనది. దీనియందు వేయి స్తంభముల మంటపము కలదు. ఇందు కొన్ని స్తంభములను తట్టిన 'స, రి, గ, మ, ప, ద, ని, స' స్వరములు ధ్వనించును. దీనిని విశ్వనాథనాయకుడు కట్టించెనని

చెప్పెదరు. తిరునల్వేలికి 'వేణువనము' అను పేరుకూడ గలదు. ఈ పరిసరములందు చెఱకు అధికముగా పండును.

## శ్రీ వైకుంఠము

ఇది తిరునల్వేలికి 18 మై. దూరమున గలదు. ఇచ్చట వైకుంఠవల్లీ వైకుంఠనాథుల మందిరము కలదు. ఇది తామ్రపర్ణీ నదీతీరమున గల పెద్దబస్తి. నదీతీరములందలి ప్రాకృతికదృశ్యము సహజముగ నుండును. ఈ మందిరము చాల పురాతనమైనది.

నగరమున అన్ని సౌకర్యములు కలవు. ఇట రెండు ధర్మశాలలు, ఏడు తిరుపతులు కలవు. ఇచట చంద్రవిమానము, పృథుతీర్థము చూడతగినవి. ఇవి వైష్ణవసంప్రదాయమువారికి చాల ముఖ్యమైనవి. తిరునల్వేలియందలి విష్ణుక్షేత్రములన్నియు తామ్రపర్ణీ నదీతీరముననే కలవు. వైకుంఠనాథాలయమున ప్రతి సంవత్సరము 10 రోజులు బ్రహ్మోత్సవము జరుగును.

## ఆళ్వార్ తిరునగరి

ఇది శ్రీవైకుంఠమునకు సుమారు 3 మై. దూరమున గలదు. ఇదికూడ తామ్రపర్ణీ నదీతీరముననే గలదు. ఇందు యాత్రికులు బసచేయుటకు ధర్మశాలలు కలవు.

ఆళ్వారులయందు ప్రసిద్ధిజెందిన నమ్మాళ్వారు యిచ్చట నొక చింతచెట్టుక్రింద తపస్సు చేసెను. ఆ మహాత్ముని మందిర మొకటి యిచ్చట గలదు. ఈ యాలయమునకు వెనుక నేటికిని ఒక పురాతనమగు తింత్రిణీవృక్షము కలదు. ఇది మహత్తుగలది. మరియు ఆదినాథస్వామి మందిరము కూడ నిందు చూడదగినది.

# తి రు చుం దూ రు

ఆళ్వారుతిరునగరికి తిరుచుందూరు 17 మైళ్లు. రైలుమీద నిచ్చటకు చేరవచ్చును. ఇది సముద్రతీరమున గలదు. ఇచ్చట యాత్రికులు బసచేయుటకు చాల ధర్మశాలలు కలవు. వస్తువు లన్నియు లభించును. ఇది పెద్దపట్టణము. ఇచట జగత్ప్రసిద్ధమైన సుబ్రహ్మణ్యేశ్వరస్వామి మందిర మొండు కలదు. ఇది సుమారు వేయి సంవత్సరములకు పూర్వము నిర్మింపబడినట్లు తెలియు చున్నది. ఆలయశిల్పము మనోహరము. ఇందు శ్రీ సుబ్రహ్మణ్య స్వామియొక్కయు, షణ్ముఖునియొక్కయు విగ్రహములు కలవు. ఈ క్షేత్రసమీపమున పూర్వము కుమారస్వామి సేనానమేతుడై విడిసియుండి యదిచాలనందున విశ్వకర్మచే దీనిని నిర్మింపజేయించె నని చెప్పుదురు. శ్రీసుబ్రహ్మణ్యస్వామి శూరపద్ముడను రాక్షసుని సంహారించుట కిచ్చటనుండి సేనతో తరలి జయముగాంచుటచే 'జయంతి, సంధి' యను నామములతో తమిళులు (ప్రాచీనులు) తమ గ్రంథములందు దీనిని పేర్కొనిరి. సుబ్రహ్మణ్యస్వామి మందిరముయొక్క తూర్పుప్రాకారమును సముద్రపుటలలు తాకుచు మనోహరముగ నుండును. ఈ యాలయమునకు సమీపమున చాల కొండగుహలు కలవు. వీనియన్నిటియందు శ్రీ సుబ్రహ్మణ్య స్వామి విగ్రహములు లలిత లలితముగా చెక్కబడినవి. ఇచ్చట నొక దత్తాత్రేయమందిరము కలదు.

దత్తాత్రేయుడు:— అనసూయకు నత్రివలన విష్ణ్వంశచే దత్తాత్రేయుడు జన్మించెను. ఈతడు త్రిశిరస్కుడు. షడ్భుజుడు. ఇతడు సన్యాసివలె ప్రపంచమునందంతటను పర్యటించెను. వేదముల

లాతనిని శునకరూపమున సేవించెను. సన్యాసులు, మునులు నెల్లప్పుడు నాతనిని వెంబడించియుండిరి. అందుచే నాతని శాంతికి భంగము కలుగుచుండెడిది. ఆతడు వారిని వీడుటకై యొక కొలనియందు ప్రవేశించెను. అయినను వా రాతని విడువలేదు. అంత నాత డొక దివ్యాంగనను వెంట గొనితెచ్చి వారి యెదుట నామెతో సంభోగించ మొదలిడెను. అంత వారాతని వీడిపోయిరి. కార్తవీర్యు డీస్వామి నుపాసించియే భుజసహస్రమును బడసెను.

తిరుచుందూరునందు పవిత్రములైన 24 కుండములు కలవు. వీనియందు స్నానముచేయుట పుణ్యప్రదమేకాక అనారోగ్య నివారకముకూడ. అందుచే యాత్రికు లిందు స్నానముచేయుదురు.

## తోతాద్రి

తిరునల్వేలిస్టేషనుకు 19 మై. దూరమున తోతాద్రి కలదు. మోటారుమీద వెళ్ళవలయును. ఇచట శ్రీ రామానుజ సంప్రదాయమునకుచెందిన ప్రధానపీఠము కలదు. ఇట తోతాద్రినాథుని మందిరము కలదు. క్షీరాబ్ధిపుష్కరిణియను సరస్సు, రామానుజ పీఠము చూడదగినవి. శ్రీరామానుజసంప్రదాయమునకు జెందిన అష్టపీఠములందు నిది ప్రధానమైనది. విరక్తులకు జెందిన పీఠము. మైలకోటా, వెంకటాచల పీఠములుకూడ విరక్తులకు జెందినవే. మిగిలిన 5 పీఠములందు గృహస్థులగు నాచార్యు లుందురు.

## నాగర్‌కోయిల

ఇది మళయాళదేశమున గలదు. తోతాద్రినుండి బస్సు మీద వెళ్ళవలయును. ఇది యొక పెద్దపట్టణము. శివక్షేత్రము. యాత్రికులు బసచేయుటకు ధర్మశాల యొకటి కలదు. ఇట కొబ్బరి

తోటలధికము. కొబ్బరినూనె నెక్కువగ నిచట వాడుదురు. ఇది మళయాళదేశము. ఇచటి స్త్రీలుకూడ పురుషులవలె విచ్చలవిడిగ సంచరింతురు. వారి కట్టు, బొట్టు తీరులే వేఱుగా నుండును.

ఇచట నాగరాజస్వామి మందిరము కలదు. దీని కెదుట నొక కుండము కలదు. యాత్రికు లిందు స్నానముచేసి స్వామిని దర్శింతురు. ఇచట నెల్లపుడు జల మూరుచుండును. దానితో బాటు కొంతకాలము నల్ల యిసుక, కొంతకాలము తెల్లయిసుక వచ్చుచుండును. ఈ యూటను, విభూతిని, యిసుకను కలిపి యాత్రికుల కిత్తురు. నాగర్కోయిల నగర పరిసరమునగల ప్రకృతి దృశ్యము మనోహరముగా నుండును.

## శ్రీ శుచీంద్రక్షేత్రము

నాగర్కోయిలనుండి బస్సుమీద శుచీంద్రక్షేత్రము చేర వలయును. ఇది తిరువాన్కూరురాజ్యమున గలదు. పరిసరము లందుగల పర్వతములచే నీపట్టణము మనోహరముగ నుండును. ఇచ్చట నొక శివాలయము కలదు. ఈ స్వామిని శుచీంద్రస్వామి యని పిలతురు. ఇంద్రునకు పూర్వము కుష్ఠురోగము సంభవించి నపు డాత డీ మహాదేవు నర్చించి రోగము కుదరయ్యెను. నాటి నుండియు ప్రతిదినము ఇంద్రు డీ మహాదేవుని పూజించుటకు వచ్చుచుండును. ఇంద్రుని పదచిహ్నములు కూడ గాన్పించును. ఒకప్పు డొక యర్చకుడు యింద్రు డిచ్చటకు వచ్చెనని యాతడు గావించిన పనుల నన్నిటిని ప్రజలకు వెల్లడిచేసెను. అందుచే నాతడు మూగవాడై కాళ్ళు పడిపోయినవాడయ్యెను. నాటి నుండియు నీమందిరమున ప్రాతఃసాయంసమయములందు వేర్వేరు

పూజారులను పూజలకై నియోగించిరి. సాయంసమయమునందు పూజారి యింద్రునకై పూజాద్రవ్యముల నచ్చటనుంచి వెడలును. ప్రాతఃకాలమునందలిపూజారి యా పూజాద్రవ్యములందు గల్గిన మార్పులను గమనింపజాలడు. ఈ క్షేత్రము కన్యాకుమారికి 8 మై. దూరమున గలదు.



శ్రీ శుచీంద్రస్వామి యాలయము

దత్తాత్రేయస్వామికూడ నిచటనే జన్మించెనని చెప్పుదురు. ఇదెంతవరకు సత్యమో తెలియదుగాని యిచ్చట నత్రిమహర్షి యాశ్రమము కలదు. ఇది చాల సుందరమైనది.

## కన్యకుమారి

తిరునల్వేలిస్టేషనుకు 60, 70 మైళ్లు దక్షిణముగ హిందూ దేశమునకు చివరకొనవద్ద సముద్రతీరమున కన్యకుమారి యను

నగరము కలదు. ఇది శుచీంద్రమునకు 9 మైళ్ళు. ఇచట కుమారీ మందిరము కలదు. చాల పెద్దది. ఈ దేవికి బహుమూల్యము



కన్యకుమారి యాలయము

లగు నాభరణములనేకము కలవు. యాత్రికు లనేకు లీ దేవిని సందర్శించుటకిటకు వచ్చుచుందురు. కుమారీ తీర్థమును సేవించిన మనుజుడు పార్వతీ లోకమున కేగునని మత్స్యపురాణము నందు వర్ణింపబడెను. ఇది గొప్ప విశ్రాంతి కేంద్రము. మూడుసముద్రము లిచట కలియును. ఈ దృశ్యము నయనానందకరము, వర్ణనాతీతము. ఇచట సూర్యోదయ, సూర్యాస్తమయదృశ్యములు చూచితీరవలెను. ఇటనుండి ఉత్తరమునకు చూచిన సముద్రుడు తన దీర్ఘములగు బాహువులతో భారతదేశమును లాలించి, జోకొట్టుచున్నట్లు తోచును.

పూర్వగాథ:— పూర్వము బాహుడు, ముఖుడు నను నిద్దరు రాక్షసులు లోకములను పీడింపగా దేవతలు విశ్వనాథుని ప్రార్థించిరి. అంత విశ్వనాథుడు కాళీదేవిని, కన్యాదేవిని సృజించెను. వారు రాక్షసులను సంహరించిరి. కాళి కలకత్తాయందును కన్యక కన్యకుమారి యందును నివసించసాగిరి. శుచీంద్రము నందలి త్రిమూర్తిస్వామి కన్యకను వివాహమాడ దలచెను. ముహూర్తము నిర్ణయింపఁబడెను. కాని దేవతల కది యిష్ట లేక నారదుని ప్రార్థింప, నారదుడు అర్ధరాత్రియందు కోడయై

కూసెను. ముహూర్తము దాటిపోయెనని త్రిమూర్తిస్వామి కన్యక వద్దకు వెళ్ళలేదు. చాలవరకు నిరీక్షించి కన్యకాదేవి యావజ్జీవము



కన్యకుమారి సముద్రతీరము

కన్యకగనే యుండునని నిశ్చయించుకొనెను. ఇచట 10 స్నాన ఘట్టములు కలవు. యాత్రికు లందు స్నానము చేయుదురు.

## తిరువంద్రం

కన్యాకుమారినుండి నాగర్‌కోయిలమీదుగ తిరువేంద్రం సుమారు 52 మైళ్ళు. బస్సుమార్గము కూడ గలదు

తిరువంద్రం సముద్రతీరమున గలదు. చూడదగిన ప్రదేశము. కొండలు, చిన్నచిన్ననదులు, చిట్టడవులు, కొబ్బరి, అరటి, తాటి, రబ్బరు, తేయాకు తోటలతో విలసిల్లుచుండును. దీనినే అనంతశయన మందురు. తిరువందనపురార్ అనికూడ పిలతురు. ఇచట ఎత్తైన ప్రాకారములుగల కోట కలదు. ఈ కోటలోపల చూడదగిన భవనము లనేకము లున్నవి. ఇట పద్మనాభ నారాయణ మందిరము గలదు. ఇది చాల పెద్దది. ఈ మందిర పార్శ్వములం దనేక గోపురములు కలవు. ఇచటి రాజు భక్తుడగుటచే రాజ్యమును పద్మనాభునకే సమర్పించి, వారు పద్మనాభదాసుల

మని పేరుపెట్టుకొనిరి. ఈ యాలయము 108 తిరుపతులలోనిది. పద్మనాభునిపై శ్రీరామానుజులు, యామునాచార్యులవారు స్తోత్రములను రచియించిరి. మందిరము లోపల సింహాసనమున శయనించియున్న శ్రీ పద్మనాభవిగ్రహము కలదు. ఈ విగ్రహము చాలపెద్దది. యాత్రికులొక ద్వారమునుండి భగవంతుని ముఖమును, వేఱొకద్వారమునుండినాభిని, మఱియొకద్వారమునుండి చరణములను సందర్శింతురు. ఇచట చక్కని భవనములు, ఉద్యానవనములు, విశాల మైదానములు కలవు. జంతుప్రదర్శనశాల, మ్యూజియము, గ్రంథాలయము, హైకోర్టు, మహారాజభవనము చూడతగినవి. ఇది విజ్ఞానసంస్కృతులకు నిలయము. తిరువాన్కూరు విశ్వవిద్యాలయమునకు స్థానము. ఇది తీర్చిదిద్ది కట్టబడిన పట్టణము. పద్మనాభాలయమునకు దూర్పున 10, 12 మైళ్ళ దూరమున కేశవమందిరము గలదు. చాల పెద్దది. ఇట కూడ భగవంతుని విగ్రహము శయనించియున్నట్లు కనబడును. స్వామిదర్శనము పద్మనాభాలయమునందువలెనే జరుగును.


పద్మనాభాలయము

## వర్కల

అనంతశయనము, తిరువాండ్రము నుండి వర్కలస్టేషను 26 మైళ్ళు. వర్కలస్టేషనుకు గ్రామము సుమారు 2 మై. దూర

మున గలదు. ఇచట శ్రీ జనార్దనమందిరము కలదు. ఇచట యొక ధర్మశాల కలదు. చక్రతీర్థముకూడ గలదు. యాత్రికు లిందు స్నానముచేసి స్వామిని దర్శింతురు.

## ఎర్నాకులం

ఇది యొక పెద్దనగరము. కొచ్చిన్‌కు 2 మైళ్ళు. ఇచ్చట కొచ్చిన్‌రాజావారి భవనములు, ఇర్విన్ పార్కు చూడదగినవి. యాత్రికుల కన్ని సౌకర్యములును గలవు.

## కాలడి

కొచ్చిన్ స్టేషన్ నుండి అంగమాలిస్టేషనులో దిగవలెను. స్టేషనుకు 6 మై.లో కొట్టయమ్ డివిజనులోనున్న కున్నట్‌నాడు తాలూకా లోనికుగ్రామము అద్వైత మతస్థాపకుడైన జగద్గురు శ్రీ శంకరాచార్యుల వారి జన్మస్థానము. ఇచటయాత్రికులకు చక్కని వసతులు కలవు. శ్రీఆచార్యులవారు కైపల్లిఇల్లింకు వద్ద తమ



శ్రీ శంకరాచార్యస్వామి

తల్లికి ఉత్తరక్రియలు చేసెను. శ్రీ శృంగేరి మఠమునకు క్రీ. శ. 1906 లో తిరువాన్కూరు ప్రభుత్వముచే నీ స్థల మివ్వబడినది.

ఇచట ఆదిశంకరుని మందిరము, పీఠాధిదేవత యగు శారదా మందిరము కలవు. ఇక్కడగల వేద, వేదాంగ, సంస్కృత పాఠశాలలు శృంగేరీమఠముచే పోషింపబడుచున్నవి. శంకరులచే స్థాపింపబడిన శ్రీకృష్ణమందిరముకూడ కలదు. వైశాఖ శు ౫ నాడు శంకరజయంతి యుత్సవము జరుగును.

## పళని

అంగమాలినుండి షోరనూర్ (జం), ఒల్వాకోట్ (జం), పొల్లాచి (జం) ల మీదుగ పళనిస్టేషనులో దిగవలయును.

ఇది సుబ్రహ్మణ్యక్షేత్రము. పెద్ద పట్టణము. స్టేషనుకు సమీపమున దేవస్థాన సత్రము కలదు ఇందు యాత్రికుల కన్ని సౌకర్యములు కలవు. సుబ్రహ్మణ్యేశ్వరాలయము ఒక కొండమీద గలదు. కొండకుదిగువ షణ్ముఖనది కలదు. యాత్రికులిందు స్నానము చేసి స్వామిని దర్శింతురు. కొండమీద కెక్కలేనివారికి డోలీలు కలవు ఇచ్చట స్వామిని దండాయుధపాణిస్వామి యని పిలతురు. ఈ స్వామికి ఒకొక్కప్పుడు భస్మాభిషేకము చేయుదురు.

జనవరి, ఫిబ్రవరి నెలలయందు జరుగు తెప్పతిరునాళ్ళకు వేలాదియాత్రికులు వచ్చెదరు. దక్షిణభారతమున నీ క్షేత్రము మిక్కిలి ప్రసిద్ధమైనది.

## కోయంబత్తూరు

పళనినుండి పొదనూరు (జం) మీదుగ కోయంబత్తూరు చేరవలయును. మార్గము ప్రకృతిసంపదతో మనోహరముగా నుండును. దీనికి Manchester of India అని పేరు గలదు.

ఇది సముద్రమట్టమునకు సుమారు 1000 అ. యెత్తున గలదు. స్టేషనుకు సమీపమున ధర్మశాల గలదు.

వస్త్రములుతయారుచేయు మిల్లు, వ్యవసాయ కళాశాల మొదలగునవి చూడదగినవి. నగర పరిసరము లతి మనోహరముగా నుండును.

## సేలం

కోయంబత్తూరునుండి ఈరోడ్ (జం) మీదుగ సేలం చేరవలయును. ఇచట పట్టుపరిశ్రమ జగత్ప్రసిద్ధమైనది. పట్టువస్త్రములు తయారుచేయు యంత్రాగారములు ముఖ్యముగా చూడదగినవి. యాత్రికులకు అన్ని సౌకర్యములు గలవు.

## మెట్టూరుడాం

సేలంనుండి మెట్టూరుడాం చేరవలయును. ఇది కావేరి నదిమీద కట్టబడినది. ఇచటి ప్రకృతి దృశ్యములు చూచుటకు చాల మనోహరముగను, యాహ్లాదకరముగ నుండును.

## నీలగిరి

ఇది చాల చల్లనైన ప్రదేశము. కోయంబత్తూరునుండి మెట్టుపాలియం మీదుగ నిచ్చటకు చేరవలయును. మెట్టుపాళియమునుండి రైలు కొండలమీదకు పోవుచుండును. ఆ సమయమున ననేక వృక్షలతా వితానములు, సెలయేళ్లు కానవచ్చును. నీలగిరికొండలు సుమారు 7000 అ. ఎత్తున గలవు. ఇచట భారత దేశమునందలి వివిధరాజన్యుల భవనములు, రామకృష్ణ ఆశ్రమము గలవు. వీటి పరిసరదృశ్యములు చూచితీరవలయును.

## కూనూరు

నీలగిరినుండి మెట్టుపాలియం వచ్చి వెళ్ళవలయును. ఇది యొక పట్టణము. ప్రకృతి సౌందర్యమును చూచుట కిచ్చటకు యనేకులు వెళ్ళుచుందురు. ఇది సముద్రతలమునకు 6000 అ. యెత్తున గలదు. ఇచ్చటి జలపాతములు, వృక్షలతా కుడుంగములు తప్పక చూడదగినవి. ఇది చక్కని విశ్రాంతికేంద్రము.

## ఉదకమండలము

మెట్టుపాలియమునుండి పోదనూరు (జం) లో దిగి ఇటకు వెళ్ళవలయును. దక్షిణదేశములో, ప్రధాన పర్వత విశ్రాంతి కేంద్రములలో నిది యొకటి. ఇది నీలగిరి నడిబొడ్డున కలదు. సముద్రమట్టమునకు 7500 అ. ఎత్తున గల యీ ఉదకమండలము పర్వత స్థవిరయైన వసుంధర కప్పుకొన్న పచ్చని మొఖమల్ కంబళము వలె విమానమునుంచిచూచువారికి కనబడుచుండును. భూమధ్య రేఖకు 11 డిగ్రీల దూరములో నున్నప్పటికి, ఇక్కడి శీతోష్ణస్థితి ఇంగ్లండునందువలె నుండును. ఇది పర్వతనిలయములకు రాణి యని ప్రతీతి. సుందరతరమైన చక్కని రాజమార్గములతో శోభిల్లు నీ ఉదకమండల శోభ చూడవలయునే కాని వ్రాయ నలవికాదు.

## కల్లికోట (కాలికట్)

మెట్టుపాలియమునుండి పోదనూరు (జం) మీదుగ కాలికట్ చేరవలయును. ఇది మలబారుప్రాంతమున గల యొక పెద్ద నగరము. సుమారు 1 లక్ష జనాభా గలదు. వాస్కోడిగామా (పోర్చుగీసునావికుడు) క్రీ.శ 1498 లో మొదట నిచ్చటనే సముద్రమునుండి తీరమును జేరెను. ఇచ్చట రాజభవనము, బట్టల

ఫ్యాక్టరీలు చూడదగినవి. ఇచ్చటినుండి కాఫీ, తేయాకు, రబ్బరు, మాంగుళూరు పెంకులు అన్యనగరములకు ఎగుమతి చేయబడు చుండును. యాత్రికులు బసచేయుటకు ధర్మశాలలు కలవు.

## టెలిచేరి

ఇది కాలికట్టుకు 44 మై. దూరమున గలదు. ఇచ్చట ఈస్టిండియాకంపెనీవారు కట్టిన ఫ్యాక్టరీయును, జగన్నాథాలయ మును చూడదగినవి. కూర్గుకొండలలో (సహ్యాపర్వతములు) జన్మించిన కావేరీ జన్మస్థానమును (తలకావేరి) దర్శించుటకు యాత్రికు లిచ్చటనుండియు పోవుచుందురు.

## ఆనందాశ్రమము

టెలిచేరినుండి కన్హాన్‌గాడ్ 52 మైళ్ళు. మంగుళూరు నుండియు వెళ్లవచ్చును. ఇచటనే ఆనందాశ్రమము గలదు. ఈ ఆశ్రమమును శ్రీ స్వామి రామదాస్‌గారు స్థాపించిరి. ఇందు నియమిత సమయములందు సంకీర్తనాదికము జరుగుచుండును. ఉత్సవసమయమున చాలమంది భక్తు లిచటకు వత్తురు.

## మంగుళూరు

కన్హాన్‌గాడ్‌నుండి మంగుళూరు 43 మైళ్లు. సముద్రతీరము నుండియు రావచ్చును. కాని యిది చుట్టుమార్గము.

మంగుళూరునందు ధర్మశాలలు గలవు. ఇది పెద్ద నగ రము. ఇందు మంగళాదేవి మందిరము గలదు. అందుచే దీని కీ పేరు వచ్చెను. ఇది సముద్రతీరమున గలదు. భవనసౌందర్యము ప్రకృతిసౌందర్యము చూడదగును.

## ఉడిపి

మంగుళూరునుండి బస్సుమీాద బయలుదేరి కర్కాల మీాదుగ ఉడిపి చేరవలయును. మార్గమున ప్రకృతిసౌందర్యము చూడదగినది. ఇచట యాత్రికులు బసచేయుటకు సౌకర్యములు కలవు. మధ్వాచార్య ప్రతిష్ఠితమగు కృష్ణాలయ మిచట కలదు. ఇచట మధ్వాచార్యునిచే స్థాపింపబడిన మఠములు 8 గలవు.

## కూర్గు – మెర్కారా

కూర్గు లేక కొడగు సంస్థానము ప్రకృతి సౌందర్యమున కాటపట్టగు పడమటికనుమలలో గలదు. కూర్గుప్రజలు తమ పూర్వాచారసంప్రదాయములు గలవారు. కూర్గురాజధానియగు



కావేరీ జన్మస్థానము (కూర్గు రాష్ట్రప్రభుత్వ సౌజన్యముతో)

మెర్కారాకు మంగుళూరునుండి మైసూరుపోవు బస్సులో వెళ్లవలయును. మైసూరునుండియు రావచ్చును. మార్గము పర్వతపంక్తులతోను, తోటలతోను, లోయలతోను, అడవులతోను కన్నులపండువుగా నుండును. ఇచటిప్రజలు దృఢకాయులు.

చరిత్ర, నాగరికత:— ప్రజలు వీరులైనను కూర్గు స్వతంత్ర సంస్థానముగ నెప్పుడు నుండలేదు. క్రీ. శ. 1800–1834 వరకు రెండవ వీరరాజుచే పాలింపబడి, పిమ్మట నాంగ్లేయుల స్వాధీనములోనికి వచ్చెను. దేశస్వాతంత్ర్యముతోపాటు యిచట రాష్ట్రపరిపాలన మేర్పడినది. మంత్రిమండలి, శాసనసభలు కలవు. ప్రజలు భిన్న భిన్న సంస్కృతులు కలవారు. స్త్రీలు విద్యావంతులు.

ఆర్థికపరిస్థితులు:— కూర్గు పర్వతప్రాంతమగుటచే వర్షము లెక్కువ. కాఫీ, నారింజతోటల పెంపకము, (ఇవి చూడతగినవి) అరణ్యములలో పదార్థ సేకరణ ముఖ్యవృత్తులు. పశుసంపద



ఓంకారేశ్వర మందిరము (కూర్గ రాష్ట్రప్రభుత్వ సౌజన్యముతో)

తక్కువ. ఈ రాష్ట్రములోకెల్ల మెర్కారా పెద్దపట్టణము. వీర రాజపేట, సోమవారిపేట వ్యాపారమునకు ప్రసిద్ధి. వీరి ప్రధాన భాష కన్నడము. రెండవది ఇంగ్లీషు.

కూర్గుకు 'మెర్కారా' రాజధాని. ఇక్కడ భోజనవసతి తక్కువ. విశ్రాంతిభవనములు కలవు. యాత్రికులు విశ్రాంతి

భవనములలో ముందుగా చెప్పిన భోజనము కుదురును. ఇచట కొండమీద పూర్వపురాజులచే నిర్మింపబడిన కోట గలదు. అట నుండి చూచిన ఊరంతయు కనుపించును. రాజప్రాసాదములో ప్రస్తుతము ప్రభుత్వకార్యాలయము లున్నవి. ఈ కోటకు సమీపమున ఓంకారేశ్వర దేవాలయము కలదు. ఇందలి శిల్పము హిందూ మహమ్మదీయ సాంప్రదాయముల మిశ్రమము. ఇంకను మరికొన్ని దేవాలయములు కలవు.

కూర్గులోని ప్రధాన యాత్రాస్థలము తలకావేరి. ఇదియె కావేరీ జన్మస్థానము. ఇది మెర్కారాకు 25 మైళ్ళు. బస్సుమీద వెళ్ళవలయును. తులాసంక్రమణమున యీ నదిలో స్నానార్థమై వేలకొలది యాత్రికులు వత్తురు.

## గోకర్ణక్షేత్రము

ఉడిపినుండి బస్సుమీద గోకర్ణము చేరవలయును. ఇది ప్రసిద్ధ శివక్షేత్రము. ఇచట మహాబలేశ్వరమందిరము గలదు. దీని యందు ద్రావిడ శిల్పకళాకౌశలము కానవచ్చును. ఈ మందిరమునకు సమీపమునం దనేకమందిరములు, గోపురములు కలవు. ప్రతి శివరాత్రి కిచట నుత్సవములు జరుగును. ఆ సమయమున భారత దేశమునందలి వివిధప్రాంతములనుండి వేలాది యాత్రికు లిచటకు వచ్చుచుందురు. మహాభారతమున, అధ్యాత్మరామాయణమున, లింగపురాణమున, పద్మపురాణమున, గరుడ వరాహ పురాణమున నీ క్షేత్ర మాహాత్మ్యము విపులముగ వర్ణింపబడెను.

శివుడు కైలాసమున, మందరపర్వతమున సర్వదా నివసించియుండున ట్లీ గోకర్ణక్షేత్రమునగూడ సర్వదా నివసించును.

ఇచట 'మహాబల' మను పేరుగల శివలింగము గలదు. ఈ లింగ మును, రావణుడు చాలకాలము తపస్సుచేసి యీ క్షేత్రమున బ్రతిష్ఠించెను. ఈ క్షేత్రమునం దగస్త్యుడు, సనత్కుమారుడు, అగ్ని, మన్మథుడు, భద్రకాళి, గరుడుడు, రావణుడు, విభీష ణుడు మొదలగువారు తప మాచరించి శివలింగములను బ్రతిష్ఠిం చిరి. ఇచట బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు, గణపతికి, పార్వతికి వేర్వేఱు స్థానములు గలవు. ఇది చాల పవిత్రమైనది. శివరాత్రికి మహాబలేశ్వరుని బిల్వపత్రములతో పూజించిన మనుజుని సర్వా భీష్టములు నెరవేరును. ఈక్షేత్రమును సేవించిన మానవుడు బ్రహ్మ హత్యాదిఘోరపాపములనుండివిముక్తుడగును. —స్కాందపురాణము

## గెర్‌సొప్పా జలపాతము

గోకర్ణమునుండి యిచటకు బస్సుమీద వెళ్లవలయును. ఇది చూడతగిన జలపాతము. షుమారు 800 అ. ఎత్తునుండి క్రిందికి ప్రవహించుచుండును ఇచట సహజప్రకృతి వర్ణనాతీతము.

## గోకాక్ జలపాతము

హుబ్లినుండి లోండామీదుగ గోకాక్‌రోడ్డుస్టేషను చేర వలయును. ఇది బెల్గాంస్టేషనుకు 36 మైళ్ల దూరమున గలదు. బెల్గాంజిల్లాలో గోకాక్ ఒక చిన్నగ్రామము. గోకాక్‌స్టేషనుకు 4 మై. దూరమునందు జలపాతము గలదు. ఈ జలపాతము 175 అ. ఎత్తునుండి క్రిందకు బడుచున్నది. క్రిందగల కుండము చాల లోతుగను, విశాలముగను నుండును. ఇచ్చటనుండియే గోకాక్ కాలువ త్రవ్వబడెను వర్షాకాలమునం దీ జలపాతము

చాల సుందరముగ నుండును. బొంబాయిప్రాంతమున చూడ దగినవానియం దిది చాల ముఖ్యమైనది.

## కోల్హాపూర్

ఇది బొంబాయిప్రాంతమున గలదు. గోకాక్ రోడ్డు స్టేషను నుండి కోల్హాపూర్ స్టేషను చేరవలయును. బొంబాయి నుండియు రావచ్చును. దీనిని 'కావేర్' అనికూడ పిలతురు. ఈ నగరము నకు నలువైపుల కొండలు గలవు. ఇట మహాలక్ష్మి మందిరము గలదు. ఇది ప్రధాన శక్తిపీఠములలో నొకటి. చాల ప్రసిద్ధమైనది.



♦ రాజభవనము – మైసూరు (చూడుడు మైసూరు)

మందిర నిర్మాణకౌశలము చూడదగినది. దీనికి సమీపమున పద్మసరోవరము, కాశీతీర్థము, మణికర్ణికాతీర్థము కలవు. దీనికి సమీపమున నింకను మందిరములు కలవు.

---

♦ ఈ గుర్తుగలవి పాలకొల్లు మునిసిపల్ హైస్కూలు వారి సౌజన్యముతో.

బనాలాకోటకు పోవు మార్గమున జ్యోతిబా యను కొండమీద చాల మందిరములు, గుహాలు కలవు. వీనిలో శివ మందిరములు మూడు చూడదగినవి. ఇవిగాక నిచ్చట నింకను మందిరము లనేకము కలవు. కోల్హాపూర్ సుందరమైన నగరము. ఇచట ననేక ఫిలిం స్టూడియోలు కలవు.

## రత్నగిరి

ఇది బొంబాయిప్రాంతమున గల యోడరేవు. కోల్హాపూరుకు ప్రాగుత్తరమున కలదు. ఇది యొక జిల్లా. పూర్వమిట రత్నాసురుడను రాక్షసుడు నివసించుచుండువాడనియు, ఆతడు లోకములను బీడించుచుండ, నీశ్వరుడు 'జ్యోతిబా' యను నవతారమెత్తి యాతనిని సంహరించెననియు చెప్పుదురు. ఈ జ్యోతిబా నామముగల నీశ్వరు నీ జిల్లాయందు కోల్హాపూరునందు జనులు పూజించుచుందురు.

## లకుండీ

కోల్హాపూర్, హుబ్లీ, గదగ్ (జం) మీదుగ షోలాపూర్ పోవుమార్గమున గదగ్‌కు 8 మైళ్ళ దూరమున లకుండీ యను గ్రామము కలదు. ఇచట ప్రాచీన మందిరము లనేకము గలవు. ఇచట కాశీవిశ్వనాథమందిరము కలదు. దీనియందు పాలరాతి శిల్పము చూడదగినది. ఇది ప్రస్తుతము శిథిలావస్థయందున్నది. ఈ నగరమున నందీశ్వరమహాదేవమందిరము, మల్లికార్జున మందిరము, 'మణికేశవస్వామి' మందిర మను నొక శ్రీకృష్ణమందిరమును గలవు. ఆ మందిరసమీపమున పాలరాతి కొలనున్నా గలవు. ఇది మిక్కిలి పవిత్రమైన ప్రాచీనస్థలము.

## బాదామీ

లకుండీనుండి షోలాపూర్‌కు పోవుమార్గమున బాదామీ స్టేషను కలదు. ఇచట క్రీ. శ. 6, 7 శతాబ్దములలో కట్టబడిన హిందూ జైన దేవాలయములు కలవు. ఇవి శిల్పమునకు ప్రసిద్ధి చెందినవి. బాదామీకి 6 మై. దూరములో 'పరేశగడ' మను చోట 'బాణశంకరిమందిరము' చూడదగినది. స్టేషనుకు దక్షిణముగ నొక పర్వతముమీద కోట గలదు.

## బీజపూర్

పై మార్గముననే బాదామీస్టేషను దాటిన తరువాత బీజపూరు కలదు. దీనికి విజయపురమని ప్రాచీన నామము. ఇది చరిత్రప్రసిద్ధమగు స్థలము.

## హరిహర

బీజపూరునుండి హుబ్లి రావలయును. హుబ్లీ (జం) కు దక్షిణపూర్వముగ హరిహరస్టేషను 81 మై. లో కలదు. ఇది తుంగభద్రానదీతీరమున గలదు. క్రీ.శ. 1867 లో నిట తుంగభద్రానది కొక పెద్దవంతెన కట్టిరి. ఈ గ్రామము చాల పురాతనమైనది. ఇచట గల మందిరము క్రీ. శ. 1223 లో కట్టబడెను. దక్షిణభారతమునం దీ ప్రదేశము చాల ప్రసిద్ధమైనది.

## శృంగేరీ మఠము

హుబ్లినుండి బిరూరు (జం) మీదుగ షిమోగా చేరవలయును. ఇటనుండి బస్సుమార్గము కలదు. మైసూరు రాజ్యమున కడూరుజిల్లాలో తుంగభద్రానదీతీరమున శృంగేరీయనుగ్రామము

కలదు. శృంగేరీకి పశ్చిమముగ 9 మై. దూరమున శృంగగిరి యను ఋషి జన్మించెను. అందుచే నీ గ్రామమునకు శృంగేరీ యను పేరు కలిగెను. ఇచట మల్లికార్జునమందిరము కలదు. ఈ గ్రామ సమీపమునం దొక మిట్టపైన శారదాదేవి మందిరము కలదు. శృంగేరీకి సమీపమున చందనవృక్షము లధికముగ గలవు. ఇచట లవంగమొగ్గలు, మిరియములు, పోకచెక్కలు అధికముగ పండును. ఇచ్చట నృసింహామందిరము కూడ కలదు. శంకరాచార్యుడు స్థాపించిన శృంగేరీమఠ మిచట గలదు. నవరాత్రి సమయములం దిచ్చటకు యాత్రికు లధికముగ వచ్చుచుందురు.

శృంగేరీ మఠశాఖలు:— శృంగేరీ మఠమునకు నాలుగు శాఖలు కలవు. మైసూరురాజ్యమున తుంగభద్రానదీ తీరమున 'కూడలి' గ్రామమునం దొకటియు, బెంగుళూరుజిల్లాలోని శివ గంగా గ్రామమునం దొకటియు, మద్రాసు ప్రాంతమున వల్లారీ జిల్లాలో కిష్కింధా, విరూపాక్ష మందిరమునకు సమీపమునం దొకటియు, పూనాలోని సంకేశ్వరగ్రామమునందొకటియు కలవు.

## బేలూరు

షిమోగానుండి బిరూరు(జం), అరిసికేరి(జం)ల మీదుగ హాసన్(జం) లో దిగవలయును. ఇక్కడనుండి బేలూరు(రోడ్) నకు 22 మైళ్ళు. ఇది 800 సం॥కు పూర్వము హోయిసలులకు రాజధానిగా నుండెడిది. ఇక్కడి చెన్నకేశవస్వామి యాలయము ముఖ్యముగా చూడతగినది. మధ్యకాలపు చిత్రకళకు ఆటపట్టగు స్మృతి చిహ్నములలో నెన్నదగియున్నది యిది యొక్కటియే. మహమ్మదీయ (ఇరాను) బాటసారి క్రీ. శ. 1433 లో ఈ దేవా

లయవర్ణనకు తగిన పదములు దొరకక, యతిశయోక్తి యను కొందురేమో అని యనుకొనెనట. ఈ యాలయము హోయిసల రాజగు విష్ణువర్ధనునిచే క్రీ.శ. 1117 లో కట్టించబడెను. ఈ యాలయమున గల శిల్పము వర్ణనాతీతము.

## హలేబీడ్

బేలూరునుండి బస్సుమీద హాలేబీడ్ చేరవలయును. ఇది మైసూరురాజ్యమున వేలూరుతాలూకాలో యొక ప్రాచీన స్థానము. ఇచట హొసలేశ్వర, కేదారేశ్వర మందిరములు కలవు. మఱియు ననేక ప్రాచీన మందిర చిహ్నము లిట కానవచ్చును. హొసలేశ్వరమందిరమున గల శివలింగము చాల పెద్దది. ఈ లింగమున కొక ప్రక్క పార్వతీదేవి విగ్రహము కలదు.



లింగరాజమందిరము - కూర్గు.
(కూర్గు రాష్ట్రప్రభుత్వసౌజన్యముతో. చూ. 593 పేజి)

ఈమందిరము 80 సం॥లపాటు నిర్మించినను పూర్తి కానందున విష్ణువర్ధనుడు అసంపూర్తిగానే యుంచెనట. ఇందలి శిల్పము చూడ దగినది. ఈమందిరమునకెదుట నొకమండపమందు 16 అ. పొడవు, 10 అ. వెడల్పు గల నందీశ్వర విగ్రహ మొకటి కలదు.

## ధర్మస్థలము

హాళేబీడ్ నుండి హాస్సన్ మీదుగ బస్సుమార్గమున ఇటకు చేరవలయును. ఇచట మహారుద్రుని యాలయము కలదు. ఈ స్వామి యెదుట నసత్యమాడిన నెత్తురు గ్రక్కుకొని మరణింతురని ప్రసిద్ధి. అందుచేతనే దీనికి ధర్మస్థలమని పేరు.

## శ్రావణబెళగోళా

ధర్మస్థలమునుండి హాస్సన్ మీదుగ రోడ్డు కలదు. ఇది జైనక్షేత్రము. రెండు కొండలమధ్య లోయలో కలదు. పరిసరమంతయు మనోహరముగ నుండును. ఇక్కడగల పెద్దకొండను వింధ్యగిరియందురు. ఇది 3,347 అ. ఎత్తుగలదు. కొండఎక్కుటకు 500 మెట్లు కలవు. ఇక్కడ గోమతేశ్వర విగ్రహము కలదు. (ఈతని పూర్వాశ్రమము పేరు బాహుబలీ) ఈవిగ్రహము 58అ. ఎత్తు గలదు. దీనిని చాముండరాయలు క్రీ. శ. 978 సం॥ న తయారు చేయించెను. ఇక్కడ జైనదేవాలయములు, విగ్రహములు యింకను కలవు. చిన్నకొండను చంద్రగిరి యందురు. ఇది 3052 అ. ఎత్తు. ఇక్కడ కూడ ననేకమందిరములు కలవు. శాంతినాథ, పార్శ్వనాథ మొద



గోమతేశ్వరస్వామి
(మైసూరుప్రభుత్వ సౌజన్యముతో)

-లగు విగ్రహములు కలవు. 7 సం॥ల కొకసారి మస్తకాభిషేక మను ఉత్సవము జరుగును. చాలమంది యాత్రికులు వత్తురు.

## కృష్ణరాజసాగరు

హాసన్ నుండి కృష్ణరాజసాగరము స్టేషనులో దిగవల యును. బృందావనము, ఉద్యానవనములు కృష్ణరాజసాగరు ఆన కట్టవద్ద కలవు. ఇది మేధావంతులగు కళాకారులచే తయారుచేయ బడుటచే నయనానందకరముగ నుండును.

కృష్ణరాజసాగరు ఆనకట్టను నిర్మించుటకు టిప్పుసుల్తాను ప్రయత్నించెను. కాని నిర్మాణముమాత్రము శతాబ్దము తరువాత నారంభింపబడినది. ఆనకట్ట 1¾ మై. పొడవు, 130 అ. ఎత్తున కట్టబడినది. 44,000 మిలియనుల ఘ. అ. నీరు 50 చ. మైళ్ళ వైశాల్యములో నిల్వచేయుదురు. ఒక రోజు (రాత్రి, పగలు) నిచటయుండి చూచి ఆనందించతగినది యీ ప్రదేశము.

ప్రభుత్వముచే నిర్మింపబడి, నడుపబడు చక్కని కృష్ణ రాజసాగర్ హోటల్ కలదు. ఇచట నన్ని సౌకర్యములు కలవు.

## మైసూరు

కృష్ణరాజసాగరునుండి మైసూరుస్టేషనుకు 10 మైళ్లు. ఈ పేరు మహిషాసురశబ్దమునుండి వచ్చినది. దేవి మహిషాసురుని జంపిన దిచ్చటనే. ఇచటకు బెంగుళూరు 86 మైళ్ళు. మైసూరు చాల నందమైన ప్రదేశము. ఇక్కడ సహజసుందరమైన ప్రకృతి అందానికే, మానవుడు తన మేధాసంపత్తిచే మెరుగులు దిద్దెను. ఇక్కడి శీతోష్ణస్థితి, సుందరదృశ్యములు, నిర్మాణములు ఎంతో

మనోహరముగా నుండును. సుందరమైన తూర్పు, పశ్చిమముల కౌగిలింతలలో నిమిడిన మనోజ్ఞ వసుమతి మైసూరు. ఇక్కడి ప్రజల భాష కన్నడము. ఇది నదులకు నిలయము. దక్షిణమున కావేరి — తూర్పున ఎగువపెన్నా, దిగువపెన్నా — ఉత్తరమున తుంగభద్రయు కలవు. ఇంకను చిన్ననదులు కలవు. మైసూరు అడవులు మిక్కిల యందమైనవి. వీటిలో చిరుతలు, పెద్దపులులు, సింహాలు, సివంగులు, దుప్పులు, ఏనుగులు విహరించుచుండును. జలపాతములవలన మైసూరుకు కలిగిన అందము, ఆర్థికలాభము యింతింతయని చెప్పుటకు వీలులేదు.



చెన్నకేశవస్వామి ఆలయము
(మైసూరుప్రభుత్వ సౌజన్యముతో)

ఇచట ముఖ్యముగ చూడతగినవి మంచిమంచి రాజభవనములు జగన్మోహనభవనము, చిత్రశాల, వ్యాపార ప్రదర్శనశాల, లలితామహల్, చెన్నకేశవస్వామి ఆలయము, కొండపైన చాముండీదేవాలయము, కోటలోని మనోహరమైన మహారాజభవనము, ఉద్యానవనములు చూడతగినవి. ఇచట దసరాకు పెద్ద యుత్సవములు మహావైభవముగా జరుగును ఈ ఉత్సవములు చూడవలయునేకాని వర్ణించ శక్యము

కాదు. ఆ సమయమున రాజుగారు సింహాసనమెక్కి దర్బారు చేయుదురు. దర్బారులోనికి ప్రజలందరకు ప్రవేశముండును. ఇప్పటి శ్రీరంగరాజు విజయనగరరాజుల వంశీకుడు. ఈ రాజ సింహాసనము పాండవులదను ప్రతీతి కలదు. ఇచట మంచిగంధము, పరిమళద్రవ్యములయొక్క పరిశ్రమలు యధికము.



(చూ.593 పే.) ప్రభుత్వకార్యాలయము-కూర్గు. (కూర్గుప్రభుత్వసౌజన్యముతో)

చాముండి:— మైసూరుకు 2 మైళ్ళలో కొండపైన చాముండీ ఆలయము కలదు. ఈ కొండ సముద్రమునకు 3,489 అడుగుల ఎత్తున కలదు. కొండమీదనుండి చూచిన మైసూరు పట్టణమంతయు కనుపించును. ఈ యాలయ గోపురము చాల పెద్దది. ఈ దేవి మైసూరు మహారాజావారి కులదేవత. క్రీ. శ. **17** వ శతాబ్దములో దొడ్డదేవరాజు యీ కొండకు మెట్లు కట్టించెను. మార్గమున 16 అ. ఎత్తుగల నందివిగ్రహము కలదు. ఈ యాలయము చాల పురాతనమైనది. దీనికి దక్షిణమున మహా

బళేశ్వరమందిరము గలదు. దీనికి క్రీ.శ. 1128 లో విష్ణువర్ధనుడు, 1620 లో చంద్రగిరిరాజులు యీనాము లిచ్చిరి.

## నంజన్ గుడి

మైసూరు స్టేషనుకు దక్షిణముగ 15 మై. దూరమున నంజన్‌గుడిస్టేషను కలదు. కన్నడభాషయందు 'నంజన్' అనగా విషముత్రాగువాడు అనియు, 'గుడి' యనగా పట్టణ మనియు నర్థము. ఇట 385 అ. పొడవు, 160 అ. వెడల్పు కలిగి 147 రాతి స్తంభములు గల నంజుడేశ్వర మహాదేవ మందిరము కలదు. ఈ మహాదేవుని నీలకంఠుడని కూడ పిలతురు. మైసూరు రాజ్యమునం దీమందిరము చాల ప్రసిద్ధమైనది. ప్రతి పూర్ణిమకు నిట రథోత్సవము జరుగును. చైత్రమాసమున, ఆషాఢమాసమున పెద్దయుత్సవముజరుగును.



శ్రీ మధ్వాచార్యులు

ఈ యాలయము ద్రావిడసాంప్రదాయముతో కట్టబడెను. ప్రాకారమున 63 శైవభక్తుల చిన్నమందిరములు గలవు. సమీపమున పూర్ణావతియను నది కలదు. మఱియు పరశురామాలయము,

మధ్వమఠము (శ్రీ రాఘవేంద్ర మఠము) కలవు. ఇది క్రీ.శ. 15వ శతాబ్దిలో స్థాపింపబడెను.

## సోమనాథపురము

ఇచటకు శ్రీరంగపట్నము నుండి రోడ్డు కలదు. బస్సు మీాద వెళ్లవలయును. మైసూరునుండియు బస్సుమార్గము కలదు. ఇచట వరదరాజస్వామి, నృసింహస్వామి మందిరములు గలవు. మద్దూరుకు 12 మై. దూరమున రామగిరి యను కొండమీాద కోదండరామస్వామి యాలయము కలదు. పూర్వ మిచ్చటనే సుగ్రీవుని మధువన ముండెడిదని చెప్పుదురు. ఇచట శ్రీ ప్రసన్న చెన్న కేశవస్వామి యాలయము కలదు. ఈ మందిరమున కుత్తర దక్షిణములందు గోపాల జనార్దన మూర్తులు కలవు ఈ మందిర ద్వారమునం దొక శిలాశాసనము కలదు. దీనినిబట్టి యీామందిరములను క్రీ.శ. 1270 లో హొసలాజల్లాల్ వంశీయుడగు సోమనాథుడను ఉన్నత రాజోద్యోగి కట్టించినట్లు తెలియుచున్నది. ఈ మందిరమందలి శిల్పము బేలూరు, హాలేబీడ్ మందిరముల శిల్పము కన్న మనోహరముగ నున్నది.

## మేలుకోట

శ్రీరంగపట్నమునుండి రోడ్డు కలదు. బస్సుమీాద చేరవలయును. ఇది వైష్ణవులకు ముఖ్యస్థలము. పూర్వము చోళరాజులచే వెడలగొట్టబడిన శ్రీ రామానుజులవారు యిచట 14 సం॥లు నివసించిరట. ఇచట చెల్లపిల్లరాయ లేక సంపత్కుమార యను ఆలయము కలదు. కొండమీాద నరసింహస్వామి యాలయము కలదు. ఇక్కడ వైష్ణవమఠము, అన్ని శాస్త్ర

గ్రంథములు గల గ్రంథాలయము కలవు. ఇచట తిరుచూర్ణము విశేషముగ లభించును.

## శ్రీరంగపట్టణము

మైసూరుకు పూర్వోత్తరముగ 9 మై. లో శ్రీరం పట్టణము రైల్వేస్టేషను కలదు. ఈ పట్నము కావేరీద్వీపము కలదు. శ్రీరంగనాథునిపేర దీని కీ పేరు వచ్చెను. కావేరీన పశ్చిమతీరమునం దొక కోట కలదు. ఇచట గల లాల్‌బాగ్‌లో టిప్పుసుల్తాను కట్టించిన 'హైదర్ ఆలీ' గోరీ కలదు. దీని తలుపు



♦ బెంగుళూరు లాల్ బాగ్ టవరు _ మైసూరు (చూ మైసూరు 603 పే)

ఏనుగుదంతముతో నిర్మింపబడెను. కోటలోపల శ్రీరంగనాథుని ప్రాచీనమందిరము కలదు. ఈ నగరమునకు తూర్పుగ కరిగట్ట యను పర్వతముపైన శ్రీనివాసమందిరము కలదు ఇచట కావే

కపిలా సంగమస్థానము కలదు. గౌతమఋషి యిచ్చట తపస్సు చేసెననియు, ఆయనయే యీ నగరమునకు శ్రీరంగపట్టణమని పేరు పెట్టెననియు చెప్పుదురు.

## శివసముద్రము

శ్రీరంగపట్టణమునుండి మద్దూరుస్టేషనులో దిగి పడవల్లి మీదుగ బస్సుమీద శివసముద్రజలపాతము చేరవలయును.

ఇచట కావేరీనది రెండుపాయలుగచీలి ఉత్తరముగ ప్రవహించుచున్నది. ఈ రెండుపాయలకు మధ్య 3 మై. పొడవుగల యొకద్వీపము గలదు. దీనికి శివసముద్రమని పేరు. శివసముద్ర పట్టణము 16 వ శతాబ్దమున గంగరాజుచే నిర్మింపబడెను. ఈ రెండుధారలు యీ ద్వీపమునకు నుత్తరదిశయందు సుమారు 200 అ. ఎత్తునుండి క్రిందబడి కలియుచున్నవి. ఇందొకదానిని గగన చ్యుత తీర్థమనియు, వేఱొకదానిని సప్తధార యనియు నందురు.

శ్రీరంగనాథమందిరము:— కావేరీ నదియందు శివసముద్ర ద్వీపముకాక రెండుద్వీపములు కలవు ఈ మూడు ద్వీపములకు శ్రీరంగమనియే పేరు. మైసూరువద్దగల శ్రీరంగపట్టణద్వీపమును 'ఆదిరంగ'మనియు, దీనిని 'మధ్యరంగ'మనియు, తిరుచునాపల్లి వద్ద గల ద్వీపమును 'అంతరంగ' మనియు పిలతురు. ఇచట శ్రీరంగనాథమందిరము గలదు. దీనికి దక్షిణముగ 'విడిగిరిరంగ' మను పర్వతమున చంపకారణ్యక్షేత్రము కలదు. ఇందు శ్రీనివాస మందిరము, భార్గవ నదియు కలవు. మాతృహత్యాదోష నివృత్తికై పరశురాము డిచ్చట తపస్సుచేసెనట. ఇచట ప్రాచీనమైన నొక చంపకవృక్షము కలదు.

## బెంగుళూరు

మద్రాసునుండి బెంగుళూరు (౫౦) చేరవలయును. ఇది మదరాసుకు **222** మైళ్లు. మైసూరుకు రాజధాని. మంచి ఆరోగ్య స్థలము. చల్లగ నుండును. ఇది సముద్రమునకు 3000 అ. ఎత్తున గలదు. **25** చ.మై. వైశాల్యము గలిగియున్నది. చాల యందమైన పట్టణము. సుమారు 8 లక్షల జనాభా కలదు. భారత దేశములో ఎన్నికులాలు, ఎన్నిమతాలు, ఎన్నిరాష్ట్రాలు కలవో వాటియన్నిటికి సంబంధించిన ప్రజలు ఇక్కడ గలరు. నందనవనమును తలపింపజేయు ఉద్యానములు, తీర్చిదిద్దినట్లు పెద్ద పెద్ద చెట్ల నీడలతో నిండియుండు అందమైన బాటలు, చూపరుల కింపు గొల్పు ప్రభుత్వ భవనములు, పారిశ్రామిక కేంద్రములు, చక్కనిభోజనశాలలు, లాల్‌బాగ్, ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్సు భవనము, మైసూరు ప్రభుత్వపు ప్రధాన కార్యాలయము, శ్రీజయచామరాజేంద్ర వృత్తివిద్యాభవనము, టెలిఫోను ఫ్యాక్టరీ, పట్టు, పింగాణి, సబ్బుపరిశ్రమలు, టిప్పు సుల్తాన్ భవనము, కబ్బన్‌పార్కు, మ్యూజియము, గ్రంథాలయము తప్పక చూడదగినవి.



లాల్‌బాగ్ సుందరదృశ్యము
(మైసూరు ప్రభుత్వ సౌజన్యముతో)

ఇచ్చట క్రీ. శ. 1537 లో కెంపగౌడ అను రాజు కట్టించిన మట్టికోట కలదు. క్రీ. శ. 1761 లో హైదరాలీ దీనికి రాతి కట్టడము కట్టెను. ఈ కోటకు నైరృతిగా మైలుదూరమున గవి గంగాధరేశ్వరాలయము కలదు. తప్పక చూడతగినది.

## బంగారుపేట

బెంగుళూరుకు 50 మై. దూరమున బంగారుపేట స్టేషను కలదు. ప్రపంచములోకెల్ల నూటికి 95 పాళ్లు బంగారమిచటనే తయారగుచున్నది. ఈ పరిశ్రమ చూడతగినది.

## నందిగిరి

బంగారుపేటనుండి కోలారుమీదుగ నందిగిరి స్టేషను చేరవలయును. ఇది సముద్రమునకు 4850 అ. ఎత్తున గలదు. వేసవి కాలములో చక్కని విశ్రాంతి కేంద్రము. ఇట చక్కని విశ్రాంతి భవనములు, మంచి భోజనశాలలు, నీటిసౌకర్యము కలదు.

## లేపాక్షి

నందిగిరి, బెంగుళూరు మీదుగ హిందూపురం స్టేషనులో దిగిన, 8 మై. దూరములో లేపాక్షి గలదు. బస్సుమార్గము.

ఇది యొక చిన్నగ్రామము. పూర్వము శ్రీరాముడు సీత నన్వేషించుచు నీ ప్రాంతమునకు వచ్చెను. ఇచ్చటనే రెక్కలు తెగి పడియున్న జటాయు వాతనికి కన్పించెను. అంత రాముడు "లే! పక్షీ" అని జటాయువును సంబోధించినాడట. అందుచేత నీగ్రామమునకు లేపాక్షి యను పేరు కలిగెను.

ఈ గ్రామములో 'కూర్మశైలము' అను నొక పెద్ద బండరాతిమీద నొక దేవాలయము కలదు. ఈ ఆలయమంతయు విగ్రహములు చెక్కబడిన శిలలతో నిర్మితమైయున్నది. దీనిని పౌరాణికంగా పాపనాశేశ్వరాలయమనీ, చారిత్రికంగా వీరభద్రేశ్వరాలయమనీ, ఆధునికంగా దుర్గాదేవి యాలయమనిన్నీ పిలతురు. దీనినే చిత్రకారులు లేపాక్షి దేవాలయమని పిలతురు.

లేపాక్షి ఆలయము చాల పురాతనమైనది. విజయనగర సామ్రాజ్య పతనదివసములందా సామ్రాజ్యపు సేనానాయకులిద్దరు 'విరుపణ్ణ, వీరణ్ణ' అను సోదరులు తమ యిష్టదైవమైనవీరభద్రుని నిందు ప్రతిష్ఠించిరి. విరుపణ్ణ, చిత్రకారుల చే నీయాలయమందు వీరభద్రుని గూర్చినగాథల నతిలలితముగ చిత్రింపజేసెను. ఇచటగల వర్ణచిత్రములు, అజంతాగుహలందువలె గాక హిందూమత పురాణగాథలను తెలుపును.



* బసవన్న

ఇచట అనేక వర్ణచిత్రములు కలవు. కిరాతార్జునీయము, మాధవవర్మకథ మొదలగునవి కలవు గర్భగుడిలోపలి కప్పుమీద విరుపణ్ణ, వీరపణ్ణలు తమ కుటుంబములతో సహా శ్రీ వీరభద్ర

స్వామికి జోహారు చేయుచున్నట్లు చిత్రించబడియుండెను. ఆంధ్ర చిత్రకారుల నైపుణ్యము నిది వేనోళ్ళ చాటుచున్నది.

ఆలయమున కనతిదూరమున 'బసవన్న' అను పేరుతో ఏకశిలానిర్మితమగు నందీశ్వరవిగ్రహము కలదు. దీని ఎత్తు 20 అ. పొడవు 30 అ. ఇది భారతదేశమునగల బృహత్కాయ నందీశ్వర విగ్రహములం దొకటి. ఈ విగ్రహమును నిర్మించిన శిల్పి పేరు బసవన్న అనియు, అందుచేత నందీశ్వరుడు కూడ బసవన్న యను పేరుతోనే పిలువబడుచుండెననియు చెప్పుదురు. ఆధునిక చిత్రకారులకు, శిల్పులకు లేపాక్షి యొక కళాక్షేత్రము వంటిది.

హిందూపురమునకు సమీపమునగల విదురాశ్వత్థ మను చోట విదుర ప్రతిష్ఠితమగు నశ్వత్థవృక్షము చూడనగును.

## కు మా ర స్వా మి

గుంటకల్ జంక్షనుకు 55 మై. దూరమున గాదిగ్నూర్ స్టేషను కలదు. ఈ స్టేషనుకు 16 మై. దూరమున నొక పర్వతము మీద కుమారస్వామి మందిరము గలదు. 5 గోపురములు గలవు. ఈ మందిర సమీపమున మరి 4 మందిరములు గలవు. ప్రతి సంవత్సరము కార్తీక పూర్ణిమకు నిచ్చటకు చాలమంది యాత్రికు లరుదెంతురు.

పూర్వము విఘ్నేశ్వరుడు, కుమారస్వామి తమవివాహములు ముందుజరుగవలెనని పరస్పరము పట్టుబట్టిరి. అందుచేత నీశ్వరుడు, మీలో నెవరు ముందుగ భూమికి ప్రదక్షిణముచేసి తిరిగివత్తురో వారికి ముందు వివాహము గావింతునని చెప్పెను.

కుమారస్వామి భూప్రదక్షిణమునకు వెడలెను. గణపతి తల్లి దండ్రులకు నేడు పర్యాయములు ప్రదక్షిణము గావించి భూ ప్రదక్షిణాధికఫలము నొందితినని నుడివెను. అందులకు నీశ్వరుడు సంతసించి విఘ్నేశ్వరునకు ముందు వివాహము గావించెను. కుమారస్వామి భూప్రదక్షిణముచేసి తిరిగి వచ్చుచుండగ నారదుడు, విఘ్నేశ్వరునకు వివాహము జరిగెనని చెప్పెను. అందులకు కుమారస్వామి తల్లిదండ్రులపై నలిగి యీ పర్వతమున వసించెనని చెప్పెదరు. ప్రతి అమావాస్యకు మల్లికార్జున రూపమున నీశ్వరుడును, ప్రతి పూర్ణిమకు పార్వతియు కుమారుని గాంచుటకిచ్చుటకు వచ్చుచుందురని చెప్పెదరు. కార్తిక పూర్ణిమనాడు కార్తికేయుని దర్శించిన మనుజుడు సర్వపాప విముక్తుడగును.

## హంపి (కిష్కింధ)

హిందూపురమునుండి గుంతకల్లుమీదుగ హోస్పేట స్టేషనులో దిగవలయును. అచటకు తూర్పుగ 7 మై. దూరమున హంపీగ్రామము కలదు. బస్సుమీద వెళ్ళవలయును.

క్రీ.శ. 1350 మొదలు 1565 వరకు పాలింపబడిన విజయనగర సామ్రాజ్యమునం దిది గలదు. దీనికి విద్యానగర మనియు నామము గలదు. ఇది కిష్కింధకు రాజధాని. ఇచటి విఠలాలయము మిక్కిలి యందమైనది. దీనిని 1513 లో కొంతవరకు కృష్ణదేవరాయలు కట్టించెను. తరువాత మరికొంత భాగమును అచ్యుతరాయలు కట్టించెను. ఇచట కల్యాణమంటము, రాణి జలక్రీడా సరస్సు, పద్మగృహము చూడదగినవి,

ఇచట ఆంజనేయ పర్వతముమీద విరూపాక్షాలయము కలదు. ఈ మందిర గోపురము బయటనుండిచూచిన 11 అంతస్థులు కలదిగను, లోపలనుండిచూచిన 4 అంతస్థులు గలదిగను గాన్పించును. ఈ యాలయమునకు స్వర్ణకలశ మమర్చబడియుండెను. ఈ మందిరమునకు తూర్పున బంగారుపూయబడిన యొక పెద్ద స్తంభము కలదు.



♦ విఠలాలయము ముందుభాగము

ఈ యాలయమునకు దక్షిణమున హేమకూటమను నొక పర్వతముగలదు. ఈ హేమకూటము బంగారుపర్వతమట. పుణ్య పురుషుల కది యిప్పటికిని యట్లే కానవచ్చునని ప్రతీతి. దీనిమీద 12 మందిరములు కలవు. ఇచ్చట తుంగభద్రానదిపై నొకఆనకట్ట కట్టబడెను. ఇచ్చట గజశాల, రాతిరథము, లంజదిబ్బ (బౌద్ధ భిక్షుకులు కాలక్రమమున వ్యభిచరించుటచే బౌద్ధవిహారములను జనులు లంజదిబ్బ లనెడివారు) తప్పక చూడదగినవి.

చక్రతీర్థము:— విరూపాక్షాలయమునకు ½ మైలు దూరమున కొంచె ముత్తరముగ కొండలమధ్య ఋష్యమూక పర్వతమును చుట్టి తుంగభద్రానది ప్రవహించుచున్నది. దీనినే చక్రతీర్థమందురు. దీనికి దక్షిణమున శ్రీరాముని దేవాలయము గలదు. వానర రాజగు సుగ్రీవుని కిష్కింధానగర మిదియే.

తుంగభద్రానది మైసూరురాజ్యమునందలి పర్వతముల నుండి పుట్టి 400 మై. ప్రవహించి కర్నూలువద్ద కృష్ణానదిలో కలియుచున్నది. ఇచటకు కొంతదూరమున వాలిని దహించిన కాష్ఠమున్నది. ఇటనుండి 2 మైళ్ళవరకు బూడిద కాన్పించును.



♦ విఠలాలయములోని ఏకశిలా రాతిరథము

స్ఫటికశిల:— విరూపాక్షమందిరమునకు పూర్వోత్తరముగ 4 మై. దూరమున 'మాల్యవంత' పర్వతము గలదు. దీనినే యొకవైపున ప్రవర్షణగిరి యని పిలతురు. ఈ మాల్యవంతము

మీాదనే శ్రీరామలక్ష్మణులు వనవాస సమయమున వర్షాకాల మును గడపిరి. దీనికి సమీాపమునందే స్ఫటికశిలయను ప్రదేశ మున నొక గుహాయందు శ్రీరామలక్ష్మణులు, ఆంజనేయుడు, సుగ్రీవుని విగ్రహములు గలవు. ఇచట శ్రీవిద్యారణ్యస్వామిమఠము గలదు. సత్రముకూడ గలదు.

తాటిపత్రికి సమీాపమున 'గండికోట'యను రెండు కొండ లున్నవి. వీనికిమధ్య పినాకినీనది ప్రవహించుచున్నది. ఈ రెండు కొండలకును ఒక బంగరు మకరతోరణ మున్నదనియు, నది పుణ్యపురుషులకే కన్పించుననియు, ఒక'మన్రో'కు కన్పించెననియు చెప్పుదురు. ఇచట అగస్త్యాశ్రమము కలదు.

శ్రీకృష్ణమందిరము:— శ్రీ విరూపాక్షాలయమునకు దక్షి ణముగ నొక కొండను దాటినతరువాత పెద్ద శ్రీకృష్ణమందిరము గలదు. ఇచట శ్రీరాముని వనవాసకాలమునందలి యనేక చిహ్న ములు కానవచ్చును.

హంపియందు ద్రావిడ శిల్పకళయందలి లాలిత్యము, విజయనగరముయొక్క గతించిన వైభవము ప్రతి యాంధ్రుని హృదయమును సంతోషముతో నింపివైచును.

## మంత్రాలయము

హోస్పేటనుండి గుంతకల్లు (జం), అటనుండి తుంగభద్ర స్టేషనులో దిగవలయును. ఇచటకు 9 మై. లో మంత్రాలయము గలదు. ఇచటకు బస్సుమీాద రావలయును. ఇచట రాఘవేంద్ర స్వామి మందిరము కలదు. ఈ స్వామి అనేక మహిమలు గల ప్రత్యక్షదైవము. తప్పక చూడతగినది.

## అలంపురం (దక్షిణ కాశి)

ద్రోణాచలం - సికింద్రాబాదు రైలుమార్గమున అలంపూరు రోడ్డు స్టేషను (కర్నూలు ప్రక్కన) లో దిగిన, 6 మై. లో నీ గ్రామము గలదు. బస్సులు, బండ్లు గలవు.

ఇది రాయచూరుజిల్లాలో నొకతాలూకా ముఖ్యస్థానము. తుంగభద్రాతీరము. ఇచట జోగుళాంబా బ్రహ్మేశ్వరు లుండు టచే దక్షిణకాశీక్షేత్రముగా ప్రసిద్ధికెక్కినది. ఇట నవబ్రహ్మలు గలరు. చారిత్రిక, ధార్మిక విశేషములు చూచుటకై వచ్చు యాత్రికులకు చక్కని సౌకర్యములు ఆలయమునందే కలవు. ప్రభుత్వపు బంగళాకూడ కలదు.

ఈ క్షేత్రముయొక్క ప్రాచీనత - స్థలమాహాత్మ్యమును, క్షేత్రమాహాత్మ్యమును బట్టి చూడ క్రీ. శ. 6 వ శతాబ్దము నుండియు ప్రసిద్ధిచెందినటుల గాన్పించును. ఇది దక్షిణకాశి యని నిశ్చయించుటకు చాల నాధారములు కలవు. ఈ క్షేత్రము భాస్కరక్షేత్ర మనియు, శ్రీశైలమునకు పశ్చిమద్వార మనియు వాసికెక్కినది. కాశి గంగాతీరమున నున్న, నిది తుంగభద్రాతీరమున నున్నది. గంగాతీరమున 64 ఘట్టములున్న, యిచటను నన్నియ కలవు. కాశియందు ప్రధాన దైవము విశ్వేశ్వరుడు. ఇచట బ్రహ్మేశ్వరుడు. అచట ముఖ్య దేవీపీఠము విశాలాక్షి. ఇచట జోగుళాంబ. అచట ఢుండిగణేశ కాలభైరవులున్న, నిచటను నున్నారు. అచట ప్రధానాలయము వరుణా, అసీ నదుల మధ్య నున్న, నిచట వేదవతీ నాదవతీ నదుల మధ్య గలదు. కాశికి సమీపమున గంగా, యమునా సంగమమున్న, నిచ్చట

కృష్ణా, తుంగభద్రల సంగమము కలదు. ఈ విధముగ నన్నివిధ
ముల కాశికి నెనయై యలరారిన యీ అలంపురము — నేడు ఆల



శ్రీ బ్రహ్మేశ్వరాలయము

యములు, దేవతామూర్తులు, రాజభవనములు, దుర్గములు

మొదలగునవన్నియు నష్టావశిష్టములై యుండియు ప్రాచీనౌన్నత్య మును వేవిధములచాటుచున్నది. ఈక్షేత్రమునందును, పరిసరము లందును లభించు అశోకాదుల, శాతవాహనుల, బాదామీ చాళుక్యుల, తైలపుల, బిజ్జలసోమదేవాదుల, కాకతీయుల, విజయనగరసార్వభౌముల, బహామనీప్రభుత్వముల పరిపాలనోప భోగచిహ్నములును; బౌద్ధ, జైన, వీరశైవ, వైదిక, మహమ్మ దీయ మతముల వివిధ విహార విక్రాన్తి చిహ్నములును వీర వ్రణాంకములవలె భూషణస్థానముల బొలిచిన మచ్చలవలె చెరిగి పోనివై దీని ప్రాచీనతను తెల్పుచున్నవి.

కర్నూలు:— ఇది అలంపురము ప్రక్కస్టేషను. చారిత్రిక ప్రదేశము. ఇది తుంగభద్రానదీతీరమున గలదు. హంద్రీనది పట్టణ మధ్యభాగమున గలదు. ఇది ప్రస్తుతము ఆంధ్రదేశమునకు రాజధానిగా విలసిల్లుచున్నది. ఇట చూడవలసినవి చాల గలవు.

## శ్రీశైలము

"శ్రీశైలం కాశీ కేదారం కాళహస్తించ పట్టిసం,
పంచక్షేత్రం పఠేన్నిత్యం మహాపాతక నాశనమ్."

అలంపురమునుండి నంద్యాలవరకు రైలు. అటనుండి రోడ్డు. ఇది యొక దివ్యక్షేత్రము. ఇది కర్నూలుజిల్లా నంది కొట్కూరు తాలూకాలో కర్నూలుకుతూర్పున 72 మై. దూర మున నల్లమలలో నున్నది. ఈ క్షేత్రమునకు చుట్టూ 30, 40 మైళ్ళవరకు ఊళ్లేలేవు. అక్కడక్కడ చెంచుపాలెములు, లంబాడీ గూడెములు మాత్రమున్నవి. మహారణ్య మధ్యముననున్న యీ

దివ్యక్షేత్రమునకు జేరుకొనుమార్గములు మూడు. పశ్చిమమున నంద్యాలనుండియు, కర్నూలునుండియు, ఆత్మకూరు, నాగలూటి, పెచ్చెఱువులమీదుగా చేరుమార్గ మొకటి. ఆత్మకూరు వరకు బస్సు కలదు. తరువాత పెచ్చెఱువువరకు 26 మై. రోడ్డు వున్నది. కాని ఎడ్లబండ్లేకాని బస్సులుండవు. పెచ్చెఱువునుండి శ్రీశైలము 10 మై. నడచియే వెళ్లవలెను. డోలీసౌకర్యముగలదు.

తూర్పున వినుకొండ, త్రిపురాంతకము, మార్కాపురములనుండి పెదదోరణాలమీదుగా బోవుమార్గ మొకటి. పెదదోరణాలవరకు మార్కాపురమునుండియు, వినుకొండనుండియు బస్‌సర్వీసు గలదు. పెదదోరణాల మార్కాపురము రైలుస్టేషనుకు 25 మై. దూరములో నున్నది. పెదదోరణాలనుండి 10 మై. దూరములో చింతల అను చోటికి ఫారెస్టురోడ్డు కలదు. అంతవరకే బండ్లు. ఆవల నడచిపోవలసినదే. చింతలకు 20 మైళ్ళలో దేవస్థానము. చింతల దాటినతర్వాత 6 మై. లో చిన్నారుట్ల, అక్కడికి 6 మై. లో పెద్దారుట్ల, ఆపై భాగమున హాటకేశ్వరము, శిఖరేశ్వరము అను మజిలీలు గలవు. డోలీలుండును.

ఉత్తరమున (నైజాము) నాగరకర్నూలు, అమరాబాద్, తెలకపల్లి, శ్రీశైలమున కుత్తరద్వారమగు నుమామహేశ్వరము, వటర్లపల్లి, కృష్ణానదులమీదుగా వచ్చు మార్గ మొకటి. ఇది ఇంచుమించు అంతా కాలిమార్గమే.

ఈ మార్గములలోను దారి పొడవునను అక్కడక్కడ అన్నసత్రములు, చలిపందిళ్ళు మొదలైన వసతులు శివరాత్రి తరుణములో కల్పింపబడుచుండును.

పశ్చిమమార్గమున పెచ్చెుబువున కాలు మైళ్ళదూరములో దేవస్థానమునకు నాల్గుమైళ్ళున్నదనగా భీముని కొలనను నొక కొలను గలదు. ఇది యొక అగాధమైన లోయ. ఇక్కడ రెండు కొండలమధ్య నొకయేఱు కలదు. ఈ కొలనుదగ్గఱికి దిగి యెక్క దారి యిరువైపుల కొండదరిని ప్రమాదకరముగా నుండును.

పూర్వము పాండవు లీ దారిని వచ్చుచుండగా భీముని కిక్కడికే వచ్చుసరికి దప్పికకాగా త్రాగ నీళ్లు లేకపోవుట జూచి భీముడు కోపించి తనగదతో నిప్పుడు కొల నేర్పడినచోట మోదె ననియు, ఆ దెబ్బ కక్కడి చట్రాయి బ్రద్దలై మడు గేర్పడె ననియు, అందుచేతనే దానికి భీమునికొలనను పేరు వచ్చినదనియు జెప్పుదురు. శివరాత్రి తరుణమున ఈ మార్గమునం దిక్కడతప్ప మఱి తగిన జలాధారము లేదు. ఈ కొలను రమారమి 20మూరల పొడుగు, 4, 5 మూరల వెడల్పు, 2, 3 మూరల లోతు గలదిగా నుండును. కనుక శివరాత్రి యాత్రికులకు నిందలి జలము చాలక పోవుటయు గలదు.

ఇక్కడ అన్నిమార్గములలోను చెంచువాండ్రకు చెల్లింప వలసిన కట్టడి యొకటి యున్నది. తల కొక్క 2 అణాలు వసూలు చేయుదురు. ఈ రుసుము చెల్లింపనిచో అక్కడనుండి మనలను బోనీయరు. సంవత్సరకాలము వాండ్రక్కడ కనిపెట్టుకొనియున్నం దుల కిది వాండ్రకు సంవత్సరవేతనము. ఈ కట్టడి వసూలు చేసి నందులకు వాండ్రది మొదలు దేవస్థానమువరకు వెంట నుండి చోరాద్యుపద్రవములు జరుగకుండ జాగ్రత్తగా యాత్రికులను దేవస్థానము చేర్పింతురు. ఇది వాండ్రుచేయు పని.

శివరాత్రి తరుణములోనే గాక, యితరకాలములోగూడ నీ క్షేత్రమును సేవింపవచ్చును. చెంచువాండ్ర సాహాయ్య మెప్పుడైనను, ఎంతైనను ఉండనేయుండును.

శ్రీశైల మొక ప్రసిద్ధమైన శివక్షేత్రము. ఇందు భ్రమరాంబా, మల్లికార్జును లున్నారు. ఇక్కడ అనేక పుష్కరిణులు గలవు. స్వామిసన్నిధికి 2 మై. దూరములో పాతాళగంగ గలదు. పాతాళగంగ అని యిట ప్రసిద్ధిగాంచినది కృష్ణానదియే. ఇక్కడ కృష్ణానది కొండలమీదినుండి చూడగా ఎక్కడనో పాతాళలోకములో నున్నట్లు కనబడును. అందుచేతనే దీని కిక్కడ పాతాళగంగ యని పేరు వచ్చినది.



* శ్రీ మల్లికార్జునాలయము

ఈ క్షేత్ర మాహాత్మ్యమును గూర్చి స్కాందపురాణమున ప్రత్యేక ఖండము గలదు. ఈక్షేత్రములో సమస్తపుణ్యనదులును జేరియున్న వనియు, బ్రహ్మాదిదేవత లందఱును సన్నిధిచేసియుందురనియు, సాక్షాత్పరమశివుడే ఇందు స్వయముద్భూతుఁడై యున్నాడనియు జెప్పబడినది. ఇందు కామరూపమునుగల్పించు నోషధులు గలవు. సంజీవనీప్రభృతి దివ్యౌషధులును, పరుసవేదియు గలవు.

సృష్ట్యాదిలో శిలాదుఁడను మహర్షి పెక్కువేల సంవత్సరములు తపస్సుచేయఁగా, పరమశివుడు మెచ్చి అతడు కోరినట్లు

పర్వతుడు, నందీశ్వరుడు అను నిరువురు కుమారుల నయోని సంభూతులనుగా ప్రసాదించెను.

అందు పర్వతుడు తపస్సుచేసి పరమేశ్వరుని ప్రసన్నుని జేసికొని లింగాకారముగా తనపేరిట తన శిరస్సుపై ప్రాదుర్భ వింపవలెననియు, ముల్లోకములలోగల పుణ్యపర్వతములు, పుణ్య తీర్థములు, పుణ్యనదులు, పుణ్యాశ్రమములు అన్నియు నాయన తోడనే యిక్కడ ఉండవలెననియు, తన శిఖర దర్శనము చేసిన వారికి పునర్జన్మ లేకుండ మోక్షము ప్రసాదింపవలెననియు వర ములు కోరి పరమేశ్వరుని యనుగ్రహముచే తాను పర్వతాకార మును ధరించెను. అదియే శ్రీశైలము. కనుకనే "శ్రీశైలే శిఖరం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే" అను ప్రతీతి గల్గెను.

నందీశ్వరుడు తపస్సుచేసి యా పరమేశ్వరుని నిత్యము మోయుచుండవలెనని వరము కోరుకొని తదనుగ్రహమున నంది వాహన మయి నిత్యసేవలు గావించుచుండెను. ఈ నందీశ్వరుడు తపస్సుచేసిన స్థలమే నందిమండల మను పేర ప్రసిద్ధి కెక్కెను. అదియే మహానందిక్షేత్రము మొదలైన వున్న ప్రదేశము. ఈ ప్రదేశము శ్రీశైలమునకు నైరృతిదిగ్భాగమున ఆ కొండలలోనే 50 మై. దూరములో, నంద్యాలకు తూర్పున 10 మై. దూర ములో నున్నది.

ఈ పర్వతమునకు శ్రీశైలమను పేరు పూర్వము కృత యుగమున వసుమతి యను మునికన్యవలన వచ్చినది. వసుమతి యీ పర్వతముమీద బ్రహ్మను గురించి తీవ్రమైన తపము గావింపగా బ్రహ్మ ప్రత్యక్షమై ఆమె కోరినట్టు లా పర్వతమున

కామె పేరు పెట్టుట కొప్పుకొనియు నామెకు శ్రీ యను పేరు పెట్టి ఆ పర్వతమునకు శ్రీశైల మను పేరు వచ్చున ట్లనుగ్రహించెను. అది మొదలు శ్రీశైల మను పేరు ప్రసిద్ధ మయ్యెను.

పర్వతుడు కోరినప్రకార మిందు వెలసిన లింగము పర్వత లింగ మను పేర ప్రసిద్ధి వహించియుండగా చంద్రవతి యను నొక రాజపుత్రికవలన మల్లికార్జునలింగ మను పేరు గాంచెను. చంద్రవతి తెల్లని మల్లికాకుసుమములతో నీ లింగమునకు పూజ చేయుచు, మల్లెపూలదండలను సమర్పించుచు నారాధించుచుండ నామెయెడ బ్రసన్నుడై పరమేశ్వరు డామె కోరిక ప్రకారము మల్లికా కుసుమమాలను నిరంతరము శిరమునఁ దాల్చుచు మల్లికార్జున నామమును ధరించెను.

శ్రీశైలము ముప్పదియామడల పొడవు, ముప్పది యామడల వెడల్పు గలిగి పెక్కుక్షేత్రములచే విరాజిల్లుచున్నది. ఈ క్షేత్రమునకు నాల్గుద్వారములు గలవు. ప్రాగ్ద్వారము త్రిపురాంతకము (మార్కాపురము తాలూకా), దక్షిణ ద్వారము సిద్ధవటము (కడపజిల్లా), పశ్చిమద్వారము అలంపూరు (కర్నూలు దగ్గర నైజాము), ఉత్తరద్వారము ఉమామహేశ్వరము (నైజాము). ఈ చతుర్ద్వారములును మహాస్థలములే, ప్రతి ద్వారములోను అనేక పుణ్యతీర్థములు, అనేక పుణ్య దేవాలయములును గలవు.

గంగాభవాని పాపాత్ముల స్పర్శ వలన తనకు గలిగిన పాపములను పరిహరించుకొనుటకు శ్రీశైలముదగ్గర కృష్ణానదిలో మునిగెనట. అందుచే నీ కృష్ణానదికి ప్రాశస్త్యము కలిగెను.

ఈ క్షేత్రమును ఓరుగంటి ప్రతాపరుద్రమహారాజు (క్రీ.శ. 1100), కృష్ణదేవరాయలు (క్రీ.శ. 1600) మొదలైన ప్రభువులు సోపానమార్గములు మొదలగు వసతులు కల్పించి, కొన్ని నిర్మాణములు గావించి శాసనములు వేయించియున్నారు. ప్రస్తుతము గూడ భక్తులును, ప్రభుత్వమువారును యాత్రికులకు వలసిన సౌకర్యములు చాలవరకు కల్పించుచున్నారు.

ఇక్కడ మల్లికార్జునస్వామికి లింగాయతులు, పూజారులు; అమ్మవారికి బ్రాహ్మణులు వీరు నిరంతర మిచ్చటనే యుండి నిత్యపూజలు నిర్వర్తించుచుందురు.

శివరాత్రి కీక్షేత్రమున కించుమించు 40వేలవరకు యాత్రికులు వత్తురు. సంవత్సరాదికిగూడ హుబ్లి, ధార్వాడ మున్నగు ప్రదేశములనుండి లింగాయతులు 4, 5 వేలమంది వత్తురు. హుబ్లి, ధార్వాడ ఆ ప్రాంతములు శ్రీశైలభ్రమరాంబకు పుట్టినిల్లనియు, ఆ ప్రాంతములవారు పుట్టింటి పసుపు, కుంకుమ చెల్లింపవలెననియు అప్పుడు వచ్చి చెల్లించిపోవుదురు.

చైత్రపూర్ణిమ కిక్కడ కుంభోత్సవము జరుగును. అమ్మవారి ముందర కుంభము. బలిహారణ మున్నగు పూజాకలాపము శాస్త్రీయముగా నడచును. ఆ తర్వాత నచట నెవరు నుండరు.

శివరాత్రికి కొన్ని దినముల ముందునుండి యిక్కడ అమ్మవారిదగ్గర మంగళపాగా సమర్పణమను సేవాకైంకర్య మొకటి జరుగును. 360 మూరల తలపాగా నేసికొనివచ్చి (దినమున కొక మూర వంతున సంవత్సరము లెక్కతో) శివరాత్రి నాడు రాత్రియెప్పుడో ఆ కైంకర్య సమర్పణము చేసెడివారు.

ఆ వస్త్రమును శివాలయ గోపురముపై నున్న కలశమునుండి దేవాలయమండపములపై నున్న నందులమెడకు పాగాచుట్టినట్లు చుట్టుదురు. శివరాత్ర్యుత్సవము జరిగిన తరువాత ఈ పాగాను విప్పి చించి భగవత్ప్రసాదముగా అక్కడివారి కిత్తురట.

ఇటీవల కొన్ని సంవత్సరములనుండి యీ క్షేత్రమున చైత్రశుక్ల పంచమి మొదలు నవమివరకు పాంచాహ్నికదీక్షతో చండీయాగము జరుపబడుచున్నది. ఈ యాగ కాలమునను యాత్రికులు వచ్చుట గలదు. శివరాత్రినాడు ధర్మదర్శనము గాక ఇతరసమయములందు ఒకరూపాయి టికెట్టని యేర్పాటు చేసియున్నారు. ఇందలి ధర్మకర్తృత్వ మిన్నాళ్ళవరకు జగద్గురు శ్రీ పుష్పగిరి పీఠాధిపతులదిగా నుండెడిది. ప్రకృతము దేవాలయము బోర్డువారిచే నడుపబడుచున్నది.

స్వామి సన్నిధిలో ప్రాకారమునకు లోపల అనేక పుష్కరిణులు కలవు. ఇవి ఒకటి, రెండు కోనేరులుగాను, తక్కినవి బావులుగాను నున్నవి. పూర్వము విష్ణ్వంశగల సూర్యకిరణములు సోకకుండగ వీరశైవులు ఈ బావులకు తాళములు వేసిరి. ఇందుచే నీ బావులకు తాళాలబావు లని పేరు వచ్చెను.

## అహోబిలము

ఈ క్షేత్రము అరణ్యమధ్యమున గలదు. శ్రీశైలమునుండి గాని, నంద్యాలనుండిగాని ఇచ్చటకు వెళ్లవచ్చును. చెంచువారి సాయములేక ప్రయాణముసాగదు. ఇది యొక నృసింహక్షేత్రము. ఇచట నవవిధ నృసింహమూర్తులు గ:వు. ఎగువఅహోబిల మను చోట హిరణ్యకశిపుని వధించుటకు నరసింహమూర్తి యావిర్భ

వించిన యుక్క స్తంభము కలదు. ఇది ఉగ్రనరసింహమూర్తి. ఇచటనే రక్తకుండము గలదు. శ్రీ నరసింహమూర్తి. హిరణ్యకశిపుని వధించి చేతుల నిందు కడిగికొనెనట.

దిగువ అహోబిలమున ప్రహ్లాదవరదుడగు ప్రసన్న నారసింహమూర్తి గలదు. ఈ మందిరమున కంచు స్తంభము చూడదగినది. ఇచటకు సుమారు 5 మై. దూరమున రామతీర్థ మను తీర్థమును, పుట్లలక్కయను నాలయమును గలవు.

14 వ శతాబ్దికి జెందిన ప్రతాపరుద్రుడు ఉత్సవ విగ్రహములను, కృష్ణదేవరాయలు కొన్నియలంకారములను నీ స్వామి కర్పించిరి. అవి నేటికిని కానవచ్చును.

## మహానంది



* నదింశ్వరుడు

శ్రీశైలమునుండి బండ్లమీద గాని, నంద్యాల స్టేషనునుండి గాజులపల్లి మీదుగాగాని యీ క్షేత్రమును చేరవచ్చును. ఇచట మహానందీశ్వరాలయము కలదు. ఇందు నందీశ్వరుని నోటినుండి సంతతధారగా జలమువచ్చి మందిరమునకుముందుగల తటాకమును చేరుచుండును. యాత్రికులిందు స్నానము చేయుదురు. ఈ ప్రదేశము చాల రమణీయముగా నుండును.

(ఈ నందీశ్వరుని పూర్వగాథ శ్రీశైలమున చూడనగును.)

## గర్తపురి (గుంటూరు)

గాజులపల్లినుండి నర్సరావుపేటమీదుగ గుంటూరు చేర వలెను. ఇది గుంటూరుజిల్లాకు ముఖ్యపట్టణము. కవిత్రయము లోని వాడగు తిక్కనసోమయాజి ఈ గ్రామవాస్తవ్యుడని జన శ్రుతి గలదు. ఇది చక్కని వ్యాపారకేంద్రము. ఇచట ఆంధ్ర హైకోర్టు, ఉన్నతపాఠశాలలు, చాల కాలేజీలు, మెడికల్ కాలేజి మొదలగునవి గలవు. ఇది రైల్వే జంక్షనుకూడ. ఇచట కొన్ని ప్రభుత్వకార్యాలయము లున్నవి. ఇవిగాక యింకా చూడదగిన ప్రదేశములు ఇచట చాల గలవు.

శ్రీరామనామక్షేత్రము:— ఇది కృష్ణతటాక తీరమును జేరియున్నది. ఇచట కోదండరామ, ఆంజనేయ ఆలయములు ప్రధానములు. ఇందలి మూర్తులు మనోహరమైన పాలరాతి విగ్రహములు. ఈ క్షేత్రములోని శ్రీ సీతారామ నామసంకీర్తన సంఘము సుమారు 30 సంవత్సరములనుండి ఆంధ్రదేశమున భగవన్నామప్రచారము, ఆధ్యాత్మికసాధన ప్రచారము అపార ముగ జేయుచున్నది. ఈ సంఘము 'మోక్షసాధని' యను మాస పత్రికను వెలువరించుచున్నది. ఈ సంఘమునకు సాధనశాఖ, ఆధ్యాత్మికగ్రంథ ప్రచురణశాఖ, నామప్రచారశాఖ మొదలగు వివిధశాఖలు గలవు. ప్రతిసంవత్సరము మార్గశిరమున 5రోజులు శ్రీరామకోటి ఉత్సవములు వైభవముగ జరుగును. వివిధప్రాంత ములనుండి వేలాదిజనులు వత్తురు. ఇచట చక్కని సౌకర్యములు కలవు. నిత్యము 24 గంటలు అఖండ హరినామసంకీర్తన జరుగు చుండును. తప్పక చూడతగినది,

ఇంకను ఆధ్యాత్మిక గ్రంథాలయము, ధ్యానకుటీరములు, సీతారామ పూలతోట, రామకోటిబ్యాంకు, మహాభక్తుల చిత్ర పటములు గల మందిరము, రామతీర్థము, శంభుతీర్థము గలవు.

## నాగార్జునకొండ

గుంటూరునుండి మాచర్ల సేషను చేరవలయును. అటకు 14 మై. దూరములో నీ కొండ గలదు.

ఇది పురాతన బౌద్ధశిథిలములకు నిలయము. క్రీ.పూ. 2వ శతాబ్దమున నిది మహోన్నతమై భవస్థితియందు ధరణికోటరాజుల పోషణమునం దుండెడిది. ఇచటకు సమీపమున కృష్ణానది కలదు. మహాయాన మతప్రవర్తయు, ప్రసిద్ధ రసాయనశాస్త్రజ్ఞుడు నగు నాగార్జునాచార్యు డిచ్చట గల విశ్వవిద్యాలయమున ప్రధానా చార్యుడుగా నుండెడివాడు. యోగియగుట నీతడు కొన్ని వందల సంవత్సరములు జీవించెను. ఈతడు రాళ్ళను బంగారుగా జేయు చుండువాడు. ప్రస్తుత మిచ్చట 1925 సం॥రము నుండి త్రవ్వబడి పురావస్తు పరిశోధనశాఖవారిచే వెలువరింపబడిన ప్రాచీన శిథిల ములు కలవు. అందు 110 అ. ఎత్తుగలిగి పాలరాతిచే నిర్మింప బడిన శిల్పకళాశోభితమగు బౌద్ధస్తూపము చూడదగినది. ఇందు బుద్ధుని దంతమును హేమపాత్రలోనుంచి నిర్మించిరి. ఇదికాక నింకను ప్రాచీనమై భవమును చాటు శిథిలములు చాల గలవు. ఇచట యాత్రికుల సౌకర్యమునకై ప్రభుత్వభవన మొకటి కలదు.

## నాగార్జునసాగర్

ఈ కొండకు సమీపముననే కృష్ణానదిమీద ప్రస్తుతము 'నాగార్జునసాగర్' అను బ్రహ్మాండమైన ఆనకట్ట కట్టుచున్నారు.

ఈ ఆనకట్ట ఎత్తు సుమారు 270 అ. ఎత్తు. ఇది ఆంధ్ర, హైదరా బాదు ప్రభుత్వముల సమిష్టియాజమాన్యమున కట్టబడుచున్నది. దీనివలన ఆంధ్రప్రాంతములోను, హైదరాబాదుప్రాంతములోను సుమారు 7 లక్షల ఎకరములు సస్యశ్యామలమై ధాన్యలక్ష్మితో అలరారును. ప్రపంచములోని పెద్ద ప్రాజెక్టులలో నిది యొకటి. ఈ ప్రాజెక్టువలన నాగార్జునశిల్పములు గల ప్రదేశముకూడ మునిగి పోవునని నిర్ణయించబడుటచే, ఈ శిల్పకళాఖండములను భారత ప్రభుత్వ పురావస్తు పరిశోధనశాఖవారు, త్రవ్వితీయించి ప్రత్యేక ప్రదేశములో భద్రపరచుచున్నారు.

## పా ల కొ ల్లు (క్షీరారామము)

గుంటూరునుండి బెజవాడ (జం) లేక నిడదవోలు (జం) స్టేషనుల మీదుగ పాలకొల్లు స్టేషను చేరవలయును. ఇచట యాత్రికులకు సర్వసౌకర్యములు కలవు. ఇది ప్రసిద్ధ శివక్షేత్రము. పంచారామములం దొకటి. పూర్వ మిచట క్షీరవృక్షము లని పిలువబడు 'మఱ్ఱి, మేడి, ఇప్ప' మొదలగు చెట్లధికముగనుండెడివి. అందుచే దీనికి క్షీరపురి లేక క్షీరారామమను పేరు కలిగెనందురు. మిగిలిన నాలుగు ఆరామములు గుంటూరుజిల్లాలోని అమరావతి (అమరారామ), పశ్చిమగోదావరిజిల్లాలోని గుణుపూడి (భీమారామ), తూర్పుగోదావరి జిల్లాలోని చామర్లకోట (కుమారారామ), ద్రాక్షారామము (ద్రాక్షారామ) లందు గలవు.

ఈ పంచారామము లందలి దేవాలయ నిర్మాణాదులు, లింగములు నించుమించు నొకేరీతిగా నున్నవి. ఈ ఆరామముల మాహాత్మ్యము స్కాందపురాణమునం దధికముగ వర్ణింపబడెను.

పూర్వము తారకునిచే పూజింపబడిన అమృతలింగమును ఖండములుగా చేసి దేవత లీ యారామములందు ప్రతిష్ఠించిరట.

దేవాలయములోని శాసనములనుబట్టి యీ స్థానములు కొంతకాలము బౌద్ధనివాసస్థలములై యుండెననియు, తరువాత చాళుక్యాదులచే నివి శైవక్షేత్రములుగా మార్చబడెననియు తెలియుచున్నది. (చూ.కుమారభీమేశ్వరము) అందుచేతనే వీనికి ఆరామమను పేర్లు కలిగెనందురు. ఆలయ గోపురము 10 అంతస్థులు కలిగి 130 అ. ఎత్తున శిల్పకళావిరాజితమై యున్నది. వివిధ దేవతల విగ్రహము లీయాలయమునందు, గోడలమీదను గానవచ్చును. ఇట పార్వతీమందిరమునగల యంత్రము శ్రీ కామకోటి పీఠాధిపతులచే నొసంగబడినదనియు, దాని మహత్త్వముననే ఈ నగరము సిరిసంపదలకు నిలయమై యున్నదనియు చెప్పుదురు.

ఇది బట్టలవర్తకమునకు చాల ప్రసిద్ధి. ఇచట 13 సత్రములు కలవు. అన్ని సౌకర్యములు గలవు.

పాలకొల్లునుండి నర్సాపురంస్టేషనులో దిగి, గోదావరి మీాద ప్రయాణముచేసిన అంతర్వేది వెళ్ళవచ్చును. (చూ. సప్తసాగర సంగమ యాత్ర)

## ద్రాక్షారామము

రాజమండ్రినుండియు, కాకినాడనుండియు నిటకు బస్సులు కలవు. ఇది పంచారామములయం దొకటి. ఇచట యాత్రికులకు భోజనసౌకర్యములు గల ఒక ధర్మశాల కలదు. ఆలయమున కెదురుగ "సప్తగోదావరము" కలదు. పూర్వము మహర్షులు భీమేశ్వరు నభిషేకించుటకు గోదావరీ నదియొక్క ఏడుపాయలను

ఇచటకు రప్పించిరట. అందుచే దీనికి సప్తగోదావరమను పేరు గలిగెను. ఇందొక మంటపము కలదు.

భీమేశ్వరస్వామి మందిరము:— ఈ ఆలయమునకు పెద్ద ప్రాకార మొకటి కలదు. నాలుగు దిశలయందు గోపురము లున్నవి. తూర్పుద్వారమును సూర్యద్వార మందురు. రెండవ ప్రాకారములో వివిధ దేవతావిగ్రహములు కలవు. భీమేశ్వర స్వామి లింగము సుమారు 15 అ. ఎత్తుగల శ్వేత స్ఫటికలింగము. అందుచేత స్వామి అభిషేకాదులు మేడమీదనుండి చేయుదురు. మూలవిరాడ్దర్శనము క్రిందనుండి చేయవలయును. భీమేశ్వరుడు



విఠలాలయ కళ్యాణమంటపము (చూడుడు హంపి 614 పేజి)

నిరంతరము పెరుగుచుండుట గని బంగారు మేకు కొట్టిరనియు నందువలన లింగము 5 శకలము లయ్యెననియు అవియే నేటి పంచారామములనియు చెప్పుదురు.

మాణిక్యాంబా మందిరము:— ఆలయాంతర మంటప మున ప్రాగుత్తరమున నీ మందిరము గలదు. ఈ ఆలయమున సత్రముకూడ గలదు. శివరాత్రి కిచట రథోత్సవము జరుగును.

భీమేశ్వరస్వామి మందిరమున శిల్పకళతో నొప్పు రెండు మంటపములు కలవు. ఆలయమునకు తూర్పున కాలభైరవస్వామి మందిరమును, స్వామి పూదోటయును కలవు. ఈ యాలయమున, నగరమునగూడ నచ్చటచ్చట చాల శివలింగములు గోచరించు చుండును. చాల శివాలయములుకూడ నిచ్చట గలవు. ఆలయ మున 3 బావులు కలవు. వ్యాసుఁడు కాశిపై కోపించి యీ భీమేశ్వరుని చాలాకాల మర్చించెను. భీమఖండమున నీ క్షేత్ర మహాత్వము విపులముగా వర్ణింపబడెను. వేములవాడ భీమకవి యీ స్వామియనుగ్రహముననే కలిగెను.

## కోటిపల్లి

ద్రాక్షారామమునకు 8 మై. దూరమున నీ శివక్షేత్రము కలదు. బస్సుమీాద వెళ్లవచ్చును. ఇచట నొక ధర్మశాల కలదు. ఇది గోదావరీ తీరము. ఈ స్వామి పేరు సోమేశ్వరస్వామి. ఈ క్షేత్రమహాత్వము భీమఖండమునను, గౌతమీ మాహాత్మ్యము నందు నధికముగా వర్ణింపబడెను. శివరాత్రి కిచ్చట రథోత్సవము జరుగును. వేనవేలు యాత్రికు లరుదెంతురు.

## ముక్తేశ్వరము

గోదావరి రెండవతీరమున నీ క్షేత్రము కలదు. గోదావరి దాటి బస్సు లేక బండ్లమీాద వెళ్ళవలయును. ఇట ముక్తికాంతా

ముక్తేశ్వరులయాలయము కలదు. ఇది శ్రీరాముని ప్రతిష్ఠితము. ఇచట మరి యొక శివాలయము, విష్ణ్వాలయము కలవు. శివరాత్రి కిచటయుత్సవముజరుగును. అన్ని వసతులు కలవు గౌతమీ మాహాత్మ్యమున యీ క్షేత్రమహిమ కలదు. ఇచటకు 2 మై. దూరమున అయినవిల్లి గ్రామములో స్వయంవ్యక్తమగు విఘ్నేశ్వరుడు కలడు.



శ్రీ రామానందతీర్థ (కబీరుయొక్క గురువు)

## మందపల్లి

రాజమండ్రినుండి గోదావరిలాంచిమీద బొబ్బర్లంక చేరి, అటనుండి కారుమీద మందపల్లి చేరనగును. ఇది గౌతమీ తీరమున గల శనిక్షేత్రము. మహత్తుగల దైవము. ప్రతిశనిత్రయోదశికి దూరప్రాంతములనుండి యాత్రికులు వచ్చి నీ స్వామికి తైలాభిషేకము చేయుదురు. తప్పక ఫలితము కలుగును.

## సప్తసాగరసంగమయాత్ర

పూర్వము గౌతమమహర్షిచే తీసికొనిరాబడిన గోదావరీ నది విఘ్నేశ్వరమువరకునురాగా గౌతము నాశ్రయించి సప్తర్షులు

గోదావరిని సప్తభాగములు గావించుకొని తీసికొని వెడలిరి. ఆ భాగము లేడును సముద్రమున కలియు ప్రదేశములను సప్త సాగరము లందురు. ఒక్కొక్క భాగ మొక్కొక చో సముద్ర మున గలసినది. ఈ యాత్ర కాకినాడకు సమీపమున గల 'చొల్లంగి' నుండి ప్రారంభించవలయును. పుష్య బ 30 న ప్రారం భించి మాఘ శు ౧౦ కి పూర్తిచేయుదురు.

తుల్యాసాగర సంగమము:— చొల్లంగికి సమీపముననే గోదావరీనదియొక్క 7 భాగములం దొకటియగు తుల్యానది సాగరమున గలియుచున్నది. పుష్య బ 30 కి ఇచ్చటకు చాలమంది యాత్రికులు వచ్చి యీ సంగమమున స్నానము చేయుదురు.

ఆత్రేయాసంగమము:— ఇది చొల్లంగికి 6 మై. దూర మున కోరంగి యను గ్రామసమీపమున సముద్రమున గలియు చున్నది. ఇచ్చట కురంగేశ్వరాలయము కలదు. శ్రీరాముడు మాయలేడిని వధించగా, మారీచుడు శివభక్తుడగుటచే నతని శిరము శివలింగముగ నాయెనని చెప్పుదురు. ఈ స్వామిని మారీ చేశ్వరుడని కూడ పిలతురు.

భారద్వాజాసంగమము:— కోరంగినుండి పడవమీద వాసానుతిప్ప యను గ్రామము చేరవలయును. అచట కీ సంగ మము 6 మై. దూరమున గలదు. వాసానుతిప్పయందు శ్రీ భైర వాలయము చూడదగినది. ఈ భైరవేశ్వరుని, సంతానము లేని వారు పూజించి, సంతానమును బడయుచుందురు.

గౌతమీ, వృద్ధగౌతమీ:— ఇది భారద్వాజా సంగమ మునకు సమీపముననే కలదు. వృద్ధగౌతమీ సంగమముకూడ

నిచ్చటనే కలదు. ఇచ్చటనే అహల్యాసంగమము కూడ గలదు. యాత్రికు లిందుకూడ స్నానము చేయుచుందురు.

కౌశికసంగమము:— వానానుతిప్పనుండి పడవమీద వెళ్ళవలయును. మార్గమున బ్రహ్మేశ్వరాలయము గోచరించును. యాత్రికు లిచ్చట స్నాన భోజనాదులను నిర్వర్తించుకొందురు. ఇచటకు 12 మై. దూరమున ఈ సంగమము గలదు.

వాసిష్ఠీ సంగమము:— కౌశిక సంగమమునుండి బెండ మూర్లంక 3 మైళ్లు. అచట నుండి 20 మై. దూరమున అంతర్వేదీక్షేత్రమున నీ సంగమము కలదు. మార్గమున కడలి యను చోట కపోతేశ్వరాలయము కలదు. యాత్రికు లీ స్వామిని సేవించియే ముందున కేగుదురు. వైనతేయా నదీ సంగమము కూడ మధ్యమార్గమున వచ్చును. అంతర్వేదియందలి వాసిష్ఠీసంగమ స్నానముతో సప్తసాగరయాత్ర పూర్తియగును.



మహానంది చూ. (రామేశ్వరం 562 పేజి)

## అంతర్వేది

వాసిష్ఠీ సాగరసంగమస్థానమునం దీ దివ్యక్షేత్రము కలదు. నవనారసింహ క్షేత్రములలో నిది యొకటి. పూర్వము వసిష్ఠ

ప్రార్థితుడై స్వామి లక్ష్మీసమేతుడై యిచ్చట వెలసెను. పల్లవ రాజగు రంగనాథుడు ప్రథమమున దేవాలయ మంటపాదులను నిర్మించెను. కాని యవి సను క్రమమున లీనముకాఁగా రెడ్డి రాజులు మఱల నొకవిధముగ నీయాలయమును నిర్మించిరి. తరువాత ఫ్రెంచివారీప్రాంత మునకు పాలకులైరి. ఆ సమ యమునందు కొందరుబ్రాహ్మ ణులు వారి నాశ్రయించి యాలయ మండపాదులను చక్కఁగ నిర్మింపజేయించిరి. ఇచ్చట నింకను గౌరీనీలకంఠే శ్వర, హాయారూఢాంబికా దేవతలు కలరు. మాఘ శు ౧౧ కి ఇచట పెద్ద రథోత్సవము జరుగును. ఆసమయమునందు అష్టాదశవర్ణములవారు వేలాదిగా నిచ్చట కరుదెంతురు. ఉదారులగువారలు చందాలు చేసియు, చందాలనిచ్చియు పెద్దపెట్టున అన్నదానము గావింతురు.



శ్రీ లక్ష్మీనృసింహస్వామి

## తిరువాన్కూరు - కొచ్చిన్

మదరాసు నుండి షెంకోట్టమార్గమున, తిరువేంద్రము స్టేషనులోగాని, షోరనూరుమార్గమున కొచ్చిన్ స్టేషనులోగాని దిగవలయును. విమానమార్గమున త్రివేంద్రము లేక కొచ్చిన్ విమానాశ్రయమున దిగవలయును. సముద్రయానమున కొచ్చిన్

రేవులో దిగవలయును. (ఈ రాష్ట్రము కన్యాకుమారి మొదలు మలబారు వరకు గలదు.)

దీని వైశాల్యము 9,155 మైళ్లు. 1951 సం॥లో జనాభా 92,64,943. ప్రధానభాష మళయాళము, తమిళము. ఇతర భాషలుకూడ కలవు. ఇచట వివిధజాతులవారు కలరు. ఎక్కువ భాగము హిందువులు. వీరి జనాభా 44,39,300. ఇచట వివిధ వ్యవసాయపరిశ్రమలు గలవు.

కన్యాకుమారి శీర్షముగాగలిగి విషమత్రిభుజమువలెనుండి, పూర్వోత్తరముల మద్రాసు రాష్ట్రము, దక్షిణ పశ్చిమముల హిందూమహాసముద్రము బంగాళాఖాతముల సంబంధము కలిగి యున్నది. ఇచట పర్వతములమీఁది నిబిడారణ్యములు, అందమైన లోయలు చూడ సొంపగుచుండును. పావురములు, జింకలు, పులులు, చిరుతలు, ఏనుగలు, దున్నలు, అడవిపందులు మొదలైన యడవిజంతువులు విశేషముగా గలవు. కలప, టేకు, నల్ల చెక్క, చందనవృక్షములకు ప్రసిద్ధి. పర్వతములమీఁద సుగంధ ద్రవ్యములు, రబ్బరు, తేయాకు, పసుపు మొదలగు పంటలకు ఆలవాలము. ఇచటి నీటికాలువలు, సముద్రతీరమందలి కొబ్బరి తోటలు నయనానందముగ నుండును. మఱియు చింత, మామిడి, జీడి మొదలైన వృక్షములుకూడ నధికముగా గలవు.

తిరువాన్కూరు - కొచ్చిన్ రాష్ట్రములోని విశేషములు చూడగోరువారు (Travancore-Cochin Travel Bureau Ltd, Trivendram; Touriest Agency) ని కలియవలెను.

## దర్శనీయములు

తిరువేంద్రమము:— ఇది రాజధాని నగరము. ఇచట శ్రీ పద్మనాభయాలయము చూడతగినది. రాజప్రముఖులు వసించు రాజభవనములు, శాసనసభాభవనములు, సెక్రటరీయేటు, పబ్లికు ఆఫీసులు, వైద్యాలయములు, విశ్వవిద్యాలయము, కళాశాలలు, మ్యూజియము, పబ్లికుపార్కు, జంతుప్రదర్శనశాల మొదలైనవి అవశ్యము చూడనగును. ఇచట ప్రభుత్వ విశ్రాంతిభవనములు, ధర్మశాలలు, చక్కని భోజన వసతిగృహములు గలవు.

ఎంక్వారియములోని ప్రభుత్వ మత్స్యపరిశ్రమ, సముద్ర వృక్ష జంతు పరిశ్రమలు; కోవలములోని స్నాన ఘట్టములు, గ్రంథాలయము; పూనలూరులోని క్రీ.శ. 1871 లో నిర్మించిన ఊగుచున్న వంతెన, కాగితము కొయ్యపరిశ్రమలు; వర్కలలో సుప్రసిద్ధమయిన జనార్దనస్వామి యాలయము, చక్రతీర్థము; తిరువేంద్రము — క్విలన్‌ల మార్గములోని కొండపైనుండి ప్రవహించు లోహసంబంధమైన నీటిబుగ్గలు. సారంగములు, మత సంస్కర్తయగు శ్రీనారాయణగురు సమాధి, శివగిరి; ఇచటకు దక్షిణమున ఆనేజుంజోలోని క్రీ.శ. 1690లో ఇంగ్లీషువారు నిర్మించిన కోట; క్విలన్‌లోని అష్టమూర్తి సరస్సు యొక్క సుందర దృశ్యము; కుండారాలోని పింగాణి, అల్యూమినియం, ఎలక్ట్రిక్ పరిశ్రమలు; ఎలిప్పిలోని కొబ్బరినార పరిశ్రమలు; కొచ్చిన్‌లోని



సేతుపార్వతీపురం డామ్ - మున్నార్.
(రాయల్ స్టూడియో, ఎర్నాకులం వారి సౌజన్యముతో)



శ్రీ భగవతీ ఆలయము - క్రాంగనూరు.
(రాయల్ స్టూడియో, ఎర్నాకులం వారి సౌజన్యముతో)



వడకుమ్ నాథాలయము - తిరుచూరు

( రాయల్ స్టూడియో, ఎర్నాకులం వారి సౌజన్యముతో )



సముద్రపు కాల్వ - ఎర్నాకులం.

( రాయల్ స్టూడియో, ఎర్నాకులం వారి సౌజన్యముతో )

హార్బరు, అరేబియాసముద్రవంతెన; క్రందనూరులోని చారిత్రక ప్రదేశములు; ఆల్వాయిలోని నయనపర్వ మొనర్చు సరస్సులు, గ్లాసు ఫ్యాక్టరీ, రసాయన పదార్థ పరిశ్రమల యంత్రములు; చాలకుడిలోని వ్యవసాయ నీటిపారుదల పరిశ్రమ; అన్నామలై రోడ్డు మార్గములో పొరింగల్‌కుత్తు జల విద్యుత్కేంద్రము, పింగాణి, కలపపరిశ్రమ, ప్లైవుడ్ యంత్రములు; ట్రిచ్చూరులోని పరశురామ ప్రతిష్ఠిత దీపక్కురినాథాలయము, మ్యూజియము జ్యూబిలీటౌనుహాలు, పురాతనరాజభవనము; ట్రిచ్చూరికి ఈశాన్యమున 14 మైళ్ళలో పీచ్చిలోని పీచ్చి యిరిగేషన్ ప్రాజెక్టు తప్పక చూడదగినవి.



# సుందరభారతయాత్ర

## పరిశిష్టఖండము

బదరీ కేదారములు, సిమ్లా, కాశ్మీర్, నైనిటాల్, నేపాల్, డార్జిలింగ్, అస్సామ్, సిలోన్ (లంక) — ఈ ప్రాంతము లన్నియు పరిశిష్టఖండముగా గ్రహింపబడెను.

## ముస్సోరి


సూరదాసు

ఢిల్లీనుండి హరిద్వారమువీదుగ డేరా డూన్ వరకు రైలు. ఈ ప్రయాణము సుందర పర్వతముల మీదను, సాంద్రారణ్యముల లోను చేయవలెను. డేరాడూను ఎయిర్ మెయిల్ సర్వీసుకు ప్రధానస్థానము. మిలిటరీ శిక్షణాకార్యాలయముకూడ ఇచట కలదు.

ముస్సోరి:— డేరాడూనునుండి చక్కని రోడ్డుమార్గము కలదు. 2 గంటల ప్రయాణము. ఇది సముద్రమట్టమునకు 7 వేల అడుగుల ఎత్తున గలదు. ఉత్తరహిందూస్థానమున చల్లని పర్వత విశ్రాంతి కేంద్రములలో నిది ప్రధానమైనది.

## బదరీ-కేదారములు

"సంసారచక్రే భ్రమతాం నరాణాం శివప్రదం శాంతి సమాధినిష్ఠమ్,
దేవర్షి జా పూజితపాదపద్మం బదరీ విశాలం సతతం నమామి||"

హరిద్వారమునుండి హృషీకేశము చేరవలయును. ఇట నుండి కాలిమార్గము, కారుమార్గము కలదు. ప్రస్తుతము పీపల్

క్షోటి వరకు బస్సు కలదు. ప్రస్తుతము యీ యాత్ర చేయుట చాల సుకరము. ఈ యాత్రలు హిమాలయ పర్వతములలో గలవు. మార్గమున పంచప్రయాగలు, పంచకేదారములు, పంచ బదరీలు, గుప్తకాశి మొదలైన తీర్థములు గలవు. అన్నియు సేవించుటకు 45 దినములు పట్టును. హృషీకేశమునుండి కేదారనాథ్ 134 మైళ్ళు. కేదారమునుండి బదరి 101 మైళ్ళు. బదరి నుండి హృషీకేశము 168 మైళ్లు. కేదారము వెళ్లి బదరీ వెళ్లుట ముఖ్యము. సముద్రమునకు కేదారము 11760 అ.లు, బదరీ 12244 అ.లు ఎత్తున గలవు ప్రారంభమున నడక శ్రమమైనను 1, 2 రోజులుదాటిన రోజు 1 కి 15 మైళ్లు నడువవచ్చును. ప్రతి 4, 5 మైళ్ళకు మకాములు గలవు. నడచి వెళ్లుట్రయే ఉత్తమమని మా సలహా. ఇచట చలి, మంచు యధికమగుటచే ఉన్నిదుస్తు లుండవలయును. ప్రకృతి సౌందర్యముచే నలరారు హిమాలయపర్వత దర్శనము ఇహపర సాధనము.



బదరీనాథ మందిరము

☞ బదరీ, కేదారము, గంగోత్తరి, యమునోత్తరి, ఉత్తరకాశి యాత్రలు చేయదలచినవారు వివరములకు మా "బదరీ యాత్ర" (సచిత్రము) గ్రంథమును చూడుడు.

## యమునోత్తరి

బదరీయాత్రలో మధ్యవచ్చు దేవప్రయాగనుండి యమునోత్తరి (యమున పుట్టినచోటు) 108 మైళ్ళు. మార్గమున ననేక తీర్థములుగలవు. మార్గము మిక్కిలికష్టతరము. యమునోత్తరిలో యమునాలయము, సూర్య, తప్త, వహ్ని కుండములు ప్రధానములు. కుండములలోని నీరు చన్నీట కలిపినగాని స్నానము చేయలేరు. ఇంకను అనేకకుండములు గలవు. బియ్యము గుడ్డన మూటగట్టి కుండమున వేసిన పక్వమగునంతటి ఉష్ణత్వము కలదు. కాలీకమలీవాలావారి ధర్మశాల కలదు.



కేదారనాథ మందిరము

### ఉత్తరకాశీ

యమునోత్తరినుండి సిమ్లీ 25 మై. వెనుకకు రావలెను. ఇచటకు ఉత్తరకాశి షుమారు 21 మైలు. మార్గమున ననేక తీర్థములు గలవు. ఇదిమిక్కిలి ప్రాచీనమగుపవిత్రక్షేత్రము. ఇట అనేక దేవమందిరములు గలవు. అందు విశ్వనాథ, ఏకాదశరుద్రులమందిరములు ప్రధానములు. చక్కని స్నానఘట్టములు కలవు. ఇక్కడ మంచి ఉన్నిదుస్తులు లభించును. సర్వ సౌకర్యములు గలవు. పోస్టు, తంతికార్యాలయము, హాస్పటల్ కలవు.

## గంగోత్తరి

ఉత్తరకాశీనుండి భైరాఘాటువరకు షుమారు 69 మైళ్లు. ఇచటకు 18 మై. లో గోముఖమునుండి వెడలు ప్రధానగంగోత్రి స్థానము గలదు. ఇచటకు వెడలుటకష్టము. కొందరు వెళ్ళుచుందురు. ఇచ్చట కేదార - భాగీరథీ సంగమము, గంగాలయము కలవు. ఒకఫర్లాంగు ఎత్తునుండి శివునిశిరమున గంగ దుముకుచుండు దృశ్యము చూడతగినది. భగీరథుడు తపస్సుచేసి గంగను భూలోకమునకు తెచ్చినది ఇచటనె. బదరి, కేదారము, గంగోత్తరి, యమునోత్తరి, ఉత్తరకాశి - ఈ స్థానములందు శ్రాద్ధ, తర్పణ భగవదారాధనలు ప్రధానములు. ఈ స్థానములు టెహరి, గఢ్‌వాలా ప్రాంతములలో గలవు.



రేపలేశ్వరాలయము - సిమ్లా.
(హిమాచలప్రదేశ్ ప్రభుత్వ సౌజన్యముతో)

## సిమ్లా

హిమాలయపర్వతములు 2000 మై. పొడవున హిందూదేశపు టుత్తర యెల్లలుగా వెలసియున్నవి. కవికుల తిలకుడగు

కాళిదాసు వర్ణించినటుల దేవతల కివి యాటపట్టు. పూర్వము హిమాలయప్రాంతమును 5 భాగములుగా వర్ణించిరి. 1 నేపాలు, 2 కూర్మాచల్ (కుమాను), 3 కేదారు (గడ్వాలు), 4 జలంధరు, 5 కాశ్మీరు. వీనిలో నీ సిమ్లా ఒకభాగముగా నున్నది. సిమ్లా హిమాచలప్రదేశ్ కు, పంజాబుకు రాజధాని నగరము. ఇది సముద్రమునకు 7000 అ. ఎత్తున గలదు. మిక్కిలి యందమైన పట్టణము. పురభవనము, గ్రంథాలయము, ప్రభుత్వకార్యాలయములు చూడదగినవి. ఇచ్చట వనభోజనమున కనువగు స్థానములనేకములు గలవు.

1903 సంllలో సిమ్లా-కాల్కా రైలుమార్గమును, 1865 సంllలో 'ది గ్రాండ్ హిందూస్థా అండ్ టిబెట్'రోడ్డును సిమ్లాను కాల్కాతో కలుపుచూ వేయబడినవి. ఈ రైలుమార్గమున కొండలు, లోయలు, సొరంగములు, వంతెనలు తారసిల్లుచు ఇంజనీర్ల నైపుణ్యమును చాటుచుండును. కొండ-రైలుమార్గము 60 మైళ్లు. ఈ మార్గమున రైలు 5 మైళ్ళలో 102 సొరంగముల గుండా పోవును. హౌరా, ఢిల్లీలనుండి కాల్కాకు మెయిల్ కలదు.

కాల్కా:— ఇది సముద్రమునకు 2100 అ. ఎత్తున ఉన్నది. ఇచ్చట విశ్రాంతిగృహము కలదు. సిమ్లానుండి కాల్కా మార్గములో ధారంపూర్, బరాగ్ సోలాన్, కొండగాడ్, తారాదేవి మొదలైనవి ముఖ్యమైన ప్రదేశములు.

ధారంపూర్:— రోడ్డు మార్గములకు కూడలి. ఇచట నుండి సుబాట్, తసోలి, సానవార్ పోవుటకు రస్తాలు కలవు. సుబాటు:- ఇది సైనిక కేంద్రము. తసోలి:- సుందరమైన పర్వత

ప్రదేశము. బరాగ్:- ఇది యాత్రికులకు రాకపోకల సమయమున భోజన కేంద్రముగా నున్నది. సోలాన్:- పంజాబు విశ్వవిద్యాలయపు కేంద్రము. తారాదేవి:- విహారయాత్రలకు, వనభోజనములకు అనువగు ప్రదేశము.

మహాసుజిల్లా:— సిమ్లాకు ౩౪ మైళ్లు. బస్సు కలదు. సముద్రమట్టమునకు 9000 అ. ఎత్తుగల నార్కండ, 10,300 అ. ఎత్తుగల హాట్టుశిఖరము చూడతగినవి. బాలురు, వృద్ధులు కూడ నీశిఖరమును సుఖముగనెక్కుదురు. ఇచట యాపిలుపళ్ళతోటలు యధికము. మాపురలో పురాతనశివాలయ మొకటి కలదు.



లక్ష్మీనారాయణాలయము (హిమాచలప్రదేశ్ ప్రభుత్వ సౌజన్యముతో)

చినీ:— ఇది కిన్నెరదేశము. 9232 అ. ఎత్తున గలదు. మార్గము సరిగ లేకున్నను లామాలు ప్రార్థనకు బుద్ధాలయమునకు వెళ్ళుచుందురు. ఇచటి కైలాసము, కమరూకోట హిందూ యాత్రికులకు పవిత్రస్థానములు.

మండిజిల్లా:— మండి జిల్లాముఖ్యపట్టణము. బియాసు నదిపై 2400 అ. ఎత్తున గల పురాతనదేవాలయము, అందలి శిల్పమును, రివాయిసర్ నదిపై తేలియాడు అందమైన ఒక ద్వీపమును చూడదగినవి. ఇది హిందూ, బౌద్ధ, శిక్కులకు పుణ్యక్షేత్రము. ప్రకృతిసంపద సుమనోహరము.

రేణికాజీ సరస్సు:— ఇది చాల యందమైనది. ఇచట పరశురామతటాకము గలదు. కార్తీక శు ౧౧ కు నలువైపుల నుండియు యాత్రికులు విశేషముగా వత్తురు.



రేణికా సరస్తీరమందలి పరశురామాలయము
— హిమాచలప్రదేశ్ ప్రభుత్వ సౌజన్యముతో

చాంబాలోయ:— పఠాన్‌కోట్ నుండి బస్సు మార్గము కలదు. 75 మైళ్ళు. ఇది జిల్లా ముఖ్యపట్టణము. రాజభవనము, ఇచటకు వాయవ్యముగ క్రీ. శ. 920 లో నిర్మించిన దేవాలయములు, అందలిశిల్పము చూడనగును. ప్రజల నీటిసౌకర్యమునకై

రాణీ నైనాదేవి జీవసమాధి చేసెనని ఇచటివారు చెప్పుదురు. ఇటకు 9 మై. లో 6300 అ. ఎత్తున ఖాజీయరువద్ద ఖాజీనాగు దేవాలయము గలదు. ఇది వేసవి విశ్రాంతి కేంద్రము.

మణిహేమసరస్సు:— చాంబాలోయకు 33 మై. లో భర్మనూరుపట్టణము గలదు. ఇచటకు 18 మై. లో సర స్తీరమున ఒక శివవిగ్రహము (సముద్రతలమునకు 13,000 అ. ఎత్తున) కలదు. కాశ్మీరులోని అమరనాథ యాత్రవలె యిదికూడ ప్రాముఖ్యమైన యాత్రాస్థలము. ఇచటనుండియె 18,564 అడుగుల ఎత్తుగల కైలాసపర్వతము ప్రారంభమగును.

త్రిలోకనాథ్:— చాంబాకు 90 మై. లో తుండి యను గ్రామమున త్రిలోకనాథాలయము (బౌద్ధక్షేత్రము) గలదు. మార్గము కష్టదాయకము. ఇటకు హిందువులుకూడ వెడలుదురు. ఇక్కడ 3 అ. ఎత్తు, 6 భుజములు గల బుద్ధవిగ్రహము కలదు.

## జలంధర్

ఢిల్లీనుండి అంబాలా (జం) మీదుగ జలంధరు (జం) స్టేషను చేరవలయును. అంబాలాకు 106 మై. దూరమునందు యీ నగరము కలదు. ఇది పూర్వము జలంధరునిచే నిర్మింపబడెను. జలంధరుని శివుడు సంహరించెను. ఆతని భార్యయగు 'బృంద' పతి వియోగముచే బృందావనమున తపస్వినియై జీవితమును గడపెను. అందువలననే ఆ స్థానమునకు బృందావన మని పేరు వచ్చెను. జలంధరులో ప్రాచీనచిహ్నములు గల 2 చెరువులు, కొన్ని శిథిలస్థానములును నేడు కానవచ్చును ఇటనుండి

హోషియార్ పూర్ లో దిగి జ్వాలాముఖి కూడ పోవచ్చును. అంబాల్ కాంట్ నుండి సిమ్లాకూడ వెళ్ళవచ్చును.

## రోబాల్ సర్



ఆనందపూర్ సాహెబ్ గురుద్వార్-హోశియార్పూర్
(పంజాబ్ ప్రభుత్వ సౌజన్యముతో)

జలంధర్ నుండి హోశియార్ పూర్, ఊనా, బడ్ సర్ ల మీదుగ రోబాల్ చేరవలయును. ఇది యొక పెద్ద నదము. దీనిమధ్య కొన్ని ద్వీపములు గలవు. ఇచట నొకకృత్రిమద్వీపము అందు దేవ మందిరములు గలవు. యాత్రికు లీ ద్వీపమును చేరగనే పండాలు దీనిని కదుపుదురు. ద్వీపము కదలుట యాశ్చర్యముగ నుండును. యాత్రికులు దేవతలను పూజింతురు. మేషసంక్రాంతి కిచట నుత్సవము జరుగును. ఇది చాల రమణీయమైన ప్రదేశము.

## అమృతసర్

జలంధర్ (జం) నుండి అమృతసర్ స్టేషను 46 మైళ్లు. ఈ మార్గమున వ్యాసనదీతీరమున వ్యాసస్టేషను కలదు.

ఈ నది హిమాలయమునం దుద్భవించి దక్షిణకాంగడా జిల్లానుండి సతెలజ్ నదియందు కలియుచున్నది. పూర్వము

వసిష్ఠుడు పుత్రశోకాకులుడై యీ వ్యాసనదియందు పడెనని మహాభారత యరణ్యపర్వమున కలదు. ఈ నదిలో స్నానము చేసిన మనుజుడు జన్మాంతర పాపవిముక్తుడగునని మహాభారత అనుశాశినపర్వమున కలదు. ఇట ధర్మశాలలు, వసతులు కలవు.

అమృతసర్ వ్యాసనదీ, రావీనదుల మధ్య గలదు. ఇది సిక్కుల ప్రధాన పవిత్ర క్షేత్రము. ఇచ్చట 'అమృతసర్' అను నొక ప్రాచీనసరోవరము కలదు. అందుచేత నీ నగరమునకు గూడ అమృతసర్ అను పేరు కలిగెను. ఈ సరోవర మధ్యభాగమున



* స్వర్ణమందిరము

సిక్కుల గురుద్వారా (స్వర్ణమందిరము) కలదు. దీనిని 'దరబార్ సాహెబ్' అని కూడ పిలతురు. దీనిని గురుఅర్జునదేవుడు నిర్మించెను. రంజిత్‌సింగ్ మహారాజు యీ దేవాలయమునకు బంగారము పూయబడిన రాగిరేకు కప్పించెను. సిక్కులకు నాలుగవ గురువైన రామదాసు యీసరస్సును త్రవ్వించి ఈ పట్టణమును నిర్మించెను. సరస్సునకు నలువైపుల పాలరాతి కట్టడము కలదు.

ఈ యాలయమున శిక్కుల పవిత్ర వేదమైన గ్రంథము కలదు. ఇది అమృతసర్‌లో 65 అ. పొడవు, అంతియ వెడల్పు కలిగిన యరుగుపై నిర్మింపబడెను. ఇచట నింకను అనేక సరోవరములు,



గోల్డెన్ టెంపుల్

దేవాలయములు గలవు. ఇవి గాక శివాలయము, సత్యనారాయణ యాలయము దర్శనీయములు. నానక్ మతానుయాయుల శాఖలిట 13 గలవు. ఇట అటల్ మీనార్ అను నొక స్తంభము కలదు. ఇక్కడ గురునానక్‌కు సంబంధించిన యనేక కుడ్య చిత్రములు చూడనగును. ఇది చాల సుందరమైన నగరము.

## తరణతారణ

అమృతసర్‌కు దక్షిణముగ 12 మై. లో వ్యాసనదీ, సతలజ్ నదీ సంగమస్థానమునకు నుత్తరముగ సిక్కుల పరమపవిత్ర క్షేత్రమగు 'తర్ణ-తారణ' కలదు. అమృతసర్ నుండి యిచటకు చక్కని రోడ్డు కలదు. ఇచటకూడ నొక సరస్సు, దీనిలో నొక

సుందరమందిరము కలవు. కుష్ఠురోగి ఎవరైనా యీ సరస్సు నీది, దాటిన యాతని కుష్ఠురోగము నశించునని కింవదంతి కలదు. అందుచే దీనికి 'తరణతారణ' యను పేరు కలిగెను. అమృతసర్ కంటె యిది ప్రాచీనమైనది. వైశాఖ బ 30 కు నిచ్చట పెద్ద యుత్సవము జరుగును. యాత్రికు లనేకులు వత్తురు.

## లాహారు

అమృతసర్ కు పశ్చిమముగ 32 మై. లో లాహోరు స్టేషను కలదు. తరణతారణనుండి కూడ నిచటకు చేరవచ్చును. ఈ నగరము చాల సుందరముగ విశాలముగ నుండును. ఇచ్చట చాల దేవాలయములు, సిక్కుల మందిరములు, ధర్మశాలలు కలవు. శ్రీరామచంద్రుని కుమారుడగు లవుడు 'లాహోర్' నగరమును, కుశుడు 'కసూర్' (లాహోరు జిల్లాలోని) నగరమును నిర్మించిరట. ఇచట ధర్మశాలలు, అన్నిసౌకర్యములు కలవు.

అనార్కలీ సమాధి:— ఇది యీ నగరమున అనార్కలీ బజారునందు గలదు. పూర్వము అక్బరుకుమారుడగు జహాంగీరు 'నదీరా' యను సామాన్యకన్యను ప్రేమించెను. ఆమె కూడ జహాంగీరు నధికముగ ప్రేమించెను. అక్బరు యీ విషయము నెఱింగి యామెను 'అనార్కలీ' యని గర్హింపదొడంగెను. అక్బరు వీరి ప్రేమను చూడలేక అనార్కలీని జీవించియుండగనే లాహోరునం దొక గోడలో పాతిపెట్టించెను. అందువలననే నీ బజారునకు అనార్కలీబజారు అను పేరు వచ్చెను.

లాహోరునుండి ఛాక్ ఝుమ్రా(జం) హుండేవాలీ(జం) మీాదుగ పిండదాన్ ఖాన్ లో దిగిన, ఇటకు 16 మైళ్ళదూరమున

అమరకుండమను తీర్థస్థానము కలదు. ఇచటకు సమీపమునందే లవతీస్టేషనుకు 2 మై. దూరమున బౌద్ధస్థూప మొకటి కలదు.

## జ్వాలాముఖి

లాహోరునుండి పఠాన్‌కోట్(జం) మీదుగ జ్వాలాముఖి రోడ్డు స్టేషను చేరవలయును. ఇచటకు జ్వాలాముఖి 15 మైళ్లు. హోశియార్‌పూర్ నుండి కూడ బస్సుమీద వెళ్ళవచ్చును.

ఇటు జ్వాలాముఖీ దేవిమందిరముకలదు ఇది 15, 16 మైళ్ళ పొడవు గల పర్వతముల లోయలో గలదు. దీనిని 'కాళీధర' పర్వతమని పిలుతురు. జలంధర నగరమునుండి 'జ్వాలాముఖి'కి యొక్క పురాతనమార్గము కలదు.



జ్వాలాముఖీ దేవి ఆలయము
(పంజాబ్ ప్రభుత్వ సౌజన్యముతో).

ఆమార్గమునుండిచూచిన యీపర్వత మతి మనోహరముగ కన్పించును. దూరమునకు విశాల దుర్గద్వారమువలె కాన్పించును.

జ్వాలాముఖీదేవి:— ఇది భారతదేశమందలి సుప్రసిద్ధ శక్తిపీఠములం దొకటి. ఇచ్చట సతీదేవియొక్క జిహ్వ (నాలుక) పడెను (చూడుడు మణికర్ణిక). కొండమీదకు షుమారు 50, 40

మెళ్లిక్కిన మందిరము కానవచ్చును. దీనికి సమీపమున 30, 40 అడుగులు పొడవైన స్వర్ణత్రిశూలము గలదు. ఈ మందిరమును సుమారు 1200 సం॥కు పూర్వము కాంగడా మహారాజు సంసార చంద్రుడు కట్టించెను. రణజిత్ సింహమహారాజు మందిరశిఖరమును స్వర్ణమండిత మొనర్చెను. ఇచట 2 సువర్ణసింహములు గలవు.

జ్వాలాముఖి స్వరూపము:— ఈ మందిరమున ప్రవేశించగనే ఒకవైపున చెరువు కానవచ్చును. ఇందు కాళ్ళు చేతులు కడుగుకొని గర్భాలయమునకు వెళ్ళవలయును. ఇచ్చట నొకకుండము వంటిది కలదు. దీనికి ఎదురుగనే గోడ రంధ్రము గుండా నొక ప్రచండమగు 'అగ్ని జ్వాల' బయటకు వచ్చుచున్నది. ఈ జ్వాల సుమారొక పిడికెడు లావు, మూరెడు పొడవు గలిగి యున్నది. ఈ జ్వాల యొక్క క్రిందిభాగము కర్పూరమువలె తెల్లగను, ఉపరిభాగము క్రమక్రమముగ నీలవర్ణముగను కలదు. ఈ జ్వాలయే 'జ్వాలాదేవి' (జ్వాలాముఖి). ఈ దేవికి పాలు, మిఠాయిలను నివేదింతురు. నివేదనసమయమున నీ పదార్థములు కొంచెము తగ్గును. జ్వాలను స్పృశించిన చేయి



దుర్గియ ఆలయము (చాముడు కులూ–కాంగ్రా.)
(పంజాబ్ ప్రభుత్వ సౌజన్యముతో)

కాలను. ఈ మందిరమునందింకను 4, 5 ప్రదేశములందిట్ట జ్వాలలు కలవు. ఇచ్చట పాలవలె తెల్లని నీరముతో నిండిన కుండ మొకటి కలదు.

జ్వాలాముఖి మహిమ:— ఒకప్పు డీ దేవీపీఠమును పరీక్షించదలచి అక్బరు యీ జ్వాలను యినుపరేకులతో మూయించియు, ఒక జలప్రవాహము నటకు దెచ్చియు నార్ప ప్రయత్నించి విఫలుడాయెను. ఇట్లు చేయుటవలన అక్బరు నేత్రములందు జ్యోతి నశించెను. వెంటనే ఆతడు భగవతిసన్నిధానమునకు పాదచారియై వచ్చి యనేక విధముల స్తుతించి రజతఛత్రము నీ దేవికి అర్పించెను. ఆ ఛత్రము నేటికిని కలదు. ఇచ్చట నివసించుటకు సౌకర్యము లధికముగ గలవు.



కాంగ్రా దేవాలయము
(పంజాబ్ ప్రభుత్వ సౌజన్యముతో)

## కాంగ్రా

జ్వాలాముఖిరోడ్డు స్టేషనుకుతరువాత రెండవస్టేషను కాంగ్రా. ఇది పంజాబుప్రాంతమున సిమ్లా జమ్మూలకు మధ్యభాగమున కలదు. ఇది రమ్యమగుప్రదేశము. మహాభారత మీ ప్రదేశమును 'తిగర్తమనియు, కులూత' మనియు పేర్కొనెను. కులూత శబ్దము యొక్క అపభ్రంశరూపము 'కులూ'. ఇది

మిక్కిలి ప్రశాంతమైన స్థానము. నేత్రపర్వ మొనర్చు పూల తోటలు, రాజపుత్రులు నిర్మించిన దుర్గములు, విశ్రాంతి కేంద్రములు, యోగీంద్రనగర్‌లోని విద్యుచ్ఛక్తియంత్రము మొదలగునవి చూడతగినవి. కాంగడా సముద్రతలమునకు 2500 అ. ఎత్తున వనగంగ సెలయేటియొడ్డున గలదు. కాంగ్రాలోయకు వాయవ్యముగ 6766 అ. ఎత్తున గల డల్‌హౌసీ నగరము చూడతగినది. డల్‌హౌసీకిపోవు మార్గము ప్రకృతి సౌందర్యమునకు పుట్టినిల్లు. ఈ నగరమున ప్రాచీన, ఆధునికచిహ్నము లనేకము గలవు. ఇట పంజాబ్ ప్రాంతమునకు సంబంధించిన నదులు చాల యుద్భవించినవి. ఈ ప్రాంతమున విశేషముగ సీమరేగు, దానిమ్మ మొదలగు సుమధుర ఫలవృక్షములు గలవు. జ్వాలాజీ, నగరకోట్, చింతాపూర్ణీ, వైద్యనాథము మొదలగు తీర్థస్థానము లీ జిల్లాలోనివే.

## విద్యేశ్వ(రి)ర్

జ్వాలాముఖికి 18 మై. లో విద్యేశ్వరీమందిరము కలదు. ఈమెను 'నగరకోట్ దేవి' 'కోటకాంగడా దేవి' అనియు పిలుతురు. కాంగడా స్టేషనులో దిగి యచ్చటకు చేరవలయును. ఈ దేవీమందిరము క్రీ. శ. 1905 లో వచ్చిన భూకంపమునకు పడిపోయెను. మరల నూతనమందిరమును నిర్మించిరి. ఇచట సతీదేవి యొక్క 'శిరస్సు' పడెను. అందుచేత నిచ్చటి మూర్తి కూడ ఖండితమస్తకరూపముననే కలదు. ఈ దేవికి స్వర్ణఛత్రము కలదు. దేవి కెదుట 'వాగ్యంత్రము' కలదు. ఇది భారతదేశ మందలి ప్రసిద్ధ దేవీపీఠములం దొకటి. ప్రతి సంవత్సరము లక్షలకొలది యాత్రికులు వత్తురు. పంజాబ్ మరియు యుక్తప్రాంతములందీ

మిక్కిలి ప్రశాంతమైన స్థానము. నేత్రపర్వ మొనర్చు పూల తోటలు, రాజపుత్రులు నిర్మించిన దుర్గములు, విశ్రాంతి కేంద్రములు, యోగీంద్రనగర్ లోని విద్యుచ్ఛక్తియంత్రము మొదలగునవి చూడతగినవి. కాంగడా సముద్రతలమునకు 2500 అ. ఎత్తున వనగంగ సెలయేటియొడ్డున గలదు. కాంగ్రాలోయకు వాయవ్యముగ 6766 అ. ఎత్తున గల డల్ హౌసీ నగరము చూడతగినది. డల్ హౌసీకిపోవు మార్గము ప్రకృతి సౌందర్యమునకు పుట్టినిల్లు. ఈ నగరమున ప్రాచీన, ఆధునికచిహ్నము లనేకము గలవు. ఇట పంజాబ్ ప్రాంతమునకు సంబంధించిన నదులు చాల యుద్భవించినవి. ఈ ప్రాంతమున విశేషముగ సీమ రేగు, దానిమ్మ మొదలగు సుమధుర ఫలవృక్షములు గలవు. జ్వాలాజీ, నగరకోట్, చింతాపూర్ణీ, వైద్యనాథము మొదలగు తీర్థస్థానము లీ జిల్లాలోనివే.

## విద్యేశ్వ(రి)ర్

జ్వాలాముఖికి 18 మై. లో విద్యేశ్వరీమందిరము కలదు. ఈమెను 'నగరకోట్ దేవి' 'కోటకాంగడాదేవి' అనియు పిలుతురు. కాంగడాస్టేషనులో దిగి యిచ్చటకు చేరవలయును. ఈ దేవీమందిరము క్రీ. శ. 1905 లో వచ్చిన భూకంపమునకు పడిపోయెను. మరల నూతనమందిరమును నిర్మించిరి. ఇచట సతీదేవి యొక్క 'శిరస్సు' పడెను. అందుచేత నిచ్చటి మూర్తి కూడ ఖండితమస్తకరూపముననే కలదు. ఈ దేవికి స్వర్ణఛత్రము కలదు. దేవి కెదుట 'వాగ్యంత్రము' కలదు. ఇది భారతదేశ మందలి ప్రసిద్ధ దేవీపీఠములం దొకటి. ప్రతి సంవత్సరము లక్షలకొలది యాత్రికులు వత్తురు. పంజాబ్ మరియు యుక్తప్రాంతములందీ

దేవి నధికముగ పూజించుచుందురు. మందిరావరణయం దొక కుండమున పురాతనమైన యూప స్తంభము లనేకము గలవు.

## చింతాపూర్ణి

కాంగ్రానుండి చింతాపూర్ణి మందిరమునకు వెళ్ళవల యును. హోశియార్‌పురమున కిది 30 మైళ్ళు.

ఈ మందిరము మెయిన్ రోడ్డుకు సుమారు 1½ మైలు దూరమున గలదు. ఇచ్చటకు 'జ్వాలాముఖి' 28 మైళ్లు. ఇది యంతయు పర్వతప్రదేశము. "శ్రీ జ్వాలాదేవి, విద్యేశ్వరీ, చింతాపూర్ణి" యీ 3 దేవీపీఠములు కాంగడాలో మూడు కోణములందు గలవు. ఈ దేవీమందిరములను గాంచుటకు ప్రతి సంవత్సరము లక్షలాదియాత్రికు లిచటకు వచ్చుచుందురు.

## వైద్యనాథము

కాంగ్రా నుండి కీర గ్రామము చేరవలయును. ఇచట వైద్యనాథ మహాదేవుని యాలయముకలదు. ఈమందిరము సుమారొక వేయి సంవత్సరములకు పూర్వము నిర్మింపబడెను. ఈ మందిరమున చక్కని శిల్పము గలదు. పంజాబ్ ప్రాంతమున గల శివాలయము లన్నిటియందు నీ



వైద్యనాథాలయము
(పంజాబ్ ప్రభుత్వ సౌజన్యముతో)

యాలయము సుందరమైనది. ఈ మందిరమునకు సమీపమున శ్రీ సిద్ధినాథమహాదేవుని యాలయము కలదు. ఇది వైద్యనాథాలయముకంటె పురాతనమైనది. ఇందు ఈశ్వరలింగము నిరాకృతిగ (పట్టె రాతివలె) నున్నది.

## తక్షశిల

ఈ ప్రఖ్యాత ప్రాచీన విద్యాసంస్థ పంజాబు ప్రాంతము నందలి 'రావల్‌పిండీ'కి 18 మై. దూరమున, ప్రస్తుతము శిథిలావశిష్టమై పాడువడియున్న తక్షశిలానగరమునందు గలదు. ఒకప్పుడిచ్చటి సభ్యతయే ప్రపంచమున కాదర్శముగా నుండెడిది. చాణక్యునివంటి రాజనీతిజ్ఞులు, కౌమార జీవభృత్యునివంటి శల్య చికిత్సకులు నిచ్చటనే యధ్యాపకులుగా నుండియుండిరి. వివిధ దేశములనుండి మనీషు లిచ్చట కరుదెంచి వేదాద్యష్టాదశ విద్యలను, అందును విశేషముగా 'అర్థశాస్త్రము, రాజనీతి, ఆయుర్వేదమును' జదివి పాండిత్యపూర్ణు లగుచుండువారు.

ఈ విద్యాలయమును తక్ష, పుష్కర యనువార లిద్దరును తక్షశిలా, పుష్కరావర్తములను నిర్మించిరని చెప్పుదురు. క్రీ. పూ. 500 సం॥ మొదలుకొని క్రీ. శ. 6వ శతాబ్దమువరకును తక్షశిల చాల నున్నతియందుండెను. పిమ్మట హూణులు దీనిని నాశనము గావించిరి. తరువాత సుమారు 1500 సం॥లకు పరిశోధకు లీ ప్రాంతమును పరిశోధించి భూగర్భమునందుగల ప్రాచీన సభ్యతా చిహ్నములగు వివిధవస్తునిచయముతో బాటు 'బ్రాహ్మీ' ఖరోష్ఠీ లిపులందుగల శిలాశాసనములను వెలికిదీసిరి. వీని నచ్చటి మ్యూజియములో చూడవచ్చును.

భిడ్‌మూఉండ్, శిర్‌కప్, మోరామోరాదు, జౌలియా, పిపజా, జాండియాల్, రిచ్‌స్తూప్ మొదలగు జనపదము లీప్రాంత మందు గలవు. వానియందును తక్షశిలా ప్రాచీన సభ్యతా చిహ్నము లనేకము గోచరించును. భిడ్‌మూఉండ్ దేశద్రోహి యగు నాంభీకుని రాజధాని. ఇచట బౌద్ధభిక్షువుల స్నానాగార, భాండాగార, విహార శిథిలములు, గాంధార శిల్పమూర్తులుకాన్పించును. రిచ్‌స్తూపమున కనిష్కుడు క్రీస్తు కు పూర్వ ము స్తూపము నొకదానిని కట్టించెను. ఈ తక్షశిలా విద్యాలయమున బ్రాహ్మణ-బౌద్ధదర్శనములు, అర్థశాస్త్రము మొదలగు ననేక గ్రంథములు రచింపబడెను.



కులూ-కాంగ్రాలోని బజౌరా దేవాలయము చూడుడు. 656 పేజి.

## విక్రమశిల

ఇది భారతదేశ ప్రాచీనవిద్యాలయములందు మూడవది. దీని యునికిని గూర్చి భిన్నాభిప్రాయము లున్నను 'భాగల్పూరు' జిల్లా 'సుల్తానగంజియే' విక్రమశిల యని టిబెట్టు గ్రంథముల

యనువాదములవలన నిర్ణయింపబడెను. (చూడుడు. 382 పేజి) ఈ విద్యాలయమునకు నలువైపుల నాల్గు తోరణద్వారము లుండెడివి. అందు ప్రవేశింపగోరు విద్యార్థులను పరీక్షించు పండితులా తోరణములం దుండెడివారు.

రత్నవజ్ర, లీలావజ్ర, కృష్ణసమరవజ్ర, తథాగతరక్షిత, దీపంకర, శ్రీజ్ఞాన, బోధిభద్ర, కమలరక్షితాదు లిందధ్యాపకులుగ నుండెడివారు. భారతీయులేగాక అన్యదేశీయులు గూడ నిచటకువిద్యాభ్యాసమునకరుదెంచుచుండెడివారు. వీరందఱకును భోజనాది సౌకర్యములు విద్యాలయమునందుండెడివి. ఇచ్చట తాంత్రిక దేవాలయములు వందలకొలది యుండెడివి. క్రీ.శ. 1193లో మహమ్మద్ బిన్ అఖ్తియార్ క్రౌర్యమునకు గురియై యీవిద్యాలయము నశించెను. ఆ భగ్నావశేషములు కొన్ని నేడుకూడా కానవచ్చును.



కులూ దేవతలు - కాంగ్రా. (చూ. ౬56 పేజి)
(పంజాబ్ ప్రభుత్వ సౌజన్యముతో)

## కాశ్మీర్

కాశ్మీరు భూలోకనందనవనము. దీనివైశాల్యము 92,780 చ. మైళ్లు. జనాభా షుమారు 4,41,000. కాశ్మీరుసంస్థానము

భారతదేశములోని సంస్థానములన్నిటికన్న పెద్దది. - కాశ్మీరు వెళ్లుటకు భారతదేశీయులు తమ రాష్ట్రప్రభుత్వపు హోంశాఖ సెక్రటరీనుండిగాని, భారతప్రభుత్వపు 'రక్షామంత్రాలయము' నుండిగాని, జిల్లా మేజస్ట్రేటునుండిగాని, కలకత్తా పోలీసుకమీషనరు నుండిగాని అనుమతి పొందవలయును. విదేశీయులు 'భారతప్రభుత్వము-న్యూఢిల్లీ' నుండి యనుమతి పొందవలయును. సంఘముగ వెళ్ళదలచిన, 20 రోజులు ముందుగా వారి సంఖ్య తెలుపుచూ 'కాశ్మీరు గవర్నమెంటు టూరిస్టు ఆఫీసరు పఠాన్‌కోట'కు, చేరు సమయమును తెలిపిన, తగిన సౌకర్యము లన్నియు పొందవచ్చును. వసంత గ్రీష్మములందు పలుచనివి, తదితర సమయములందు దట్టమైనవి ఉన్నివస్త్రము లవసరము.



వైద్యనాథాలయము (పరియొకదృశ్యము) చూడుడు. వైద్యనాథము 658 పేజి

ఢిల్లీనుండి శ్రీనగరుకు విమానమున రాకపోకలకు చార్జి రు 209/-, కలకత్తానుండి రు 485/-, బొంబాయి నుండి రు 455/-, మదరాసునుండి రు 548/-, బెంగుళూరు నుండి రు 565/-, హైదరాబాదునుండి రు 470/-, పఠాన్‌కోటనుండి రు 40/- లు. పై నగరములనుండి పఠాన్‌కోటవరకు రైలు

మార్గము కలదు. పఠాన్కోటనుండి బస్సు రు 20/-. మరియు లాహోరునుండి లాలామూసామీదుగ రావల్పిండి స్టేషనులో దిగియు వెళ్ళవచ్చును. ఈ మార్గమున ప్రయాణసౌకర్యములు, టాంగాలు, గుఱ్ఱములు కలవు.

## కాశ్మీర్ లోయ

అనాదికాలమునుండియు కాశ్మీర్లోయ సౌందర్యము జగత్ప్రసిద్ధము. ప్రకృతిసంపదలకు పుట్టినిల్లు. హిమాలయ వలయితమైన యీ సుందరసీమ ప్రపంచములో అందమైన తావులన్నిటిలోను అందమైనది. నేల నాలుగుచెరగులనుండి యాత్రికులు వచ్చి, కాశ్మీర్ రామణీయకతను చూచి ఆనందముగ్ధులగు



పాప్లారుచెట్ల దృశ్యము (కాశ్మీరుప్రభుత్వ సౌజన్యముతో)

చుందురు. ఏటేటా అనేకవేలమంది ప్రజలు ఈ సుందరసీమను సందర్శించుచుండిరి. ఇందులో ఒకగొప్పవిశేషమున్నది. కాశ్మీర్ను

సందర్శించి ముగ్ధులైన ప్రతివారు తమ ఆనందవివేచనలో ఎవరికి వారు క్రొత్తక్రొత్త ప్రత్యేక కారణములను పేర్కొనుచుందురు. కొందరు అక్కడి నిసర్గ మనోహరదృశ్యములను, నందనవనమును మరపింపజేయు సుందరోద్యానములను, స్వచ్ఛజలపూరితములై చూపరులకు తన్మయతను గలిగించు సరస్సులను, మంచుచే కప్పబడి, సౌందర్య గంభీరములై మరులుకొల్పు మహోన్నత పర్వత శ్రేణులను, పచ్చని రత్నకంబళము పరచినట్లుండు పచ్చిక బయళ్ళను, నీహారసాంద్రములైన నిబిడారణ్యములను చూచి తన్మయులగుదురు. మరికొందరు అతిపురాతనములైన అక్కడి శిథిలశిల్పాలను చూచి వాటి వైభవాన్ని మెచ్చుకొనకుండగ నుండలేరు. ఇంతియ కాదు. కాశ్మీర్ ప్రజల యపూర్వ కళలను, సౌందర్యోజ్జ్వలమైన వారిసృష్టిని చూచి ఎంతో యాహ్లాదమును పొందుదురు. ఈ విధముగా ఆయా వ్యక్తుల అనుభూతులు వారి వారి సంస్కారమునుబట్టి మారుచున్నను కాశ్మీర్‌లోని నిసర్గ రామణీయక రహస్యము ఇప్పటికిని ఎవ్వరికిని పట్టుబడనేలేదు. అందుచేతనే దీనిని ఆసియాఖండపు క్రీడావిహారమని, ప్రకృతి స్థగితమైన మరకతమని మహాకవులు ముక్తకంఠముతో మధుర ముగా గానము చేసిరి.

ఈ ప్రపంచపు చీకాకులు మఱచిపోవాలనిన, చల్లగా మెల్లగా హాయిగా పరిమళభరితమైన పవనాంకురముల మధ్య సుందర స్వప్న కాలములలో తేలియాడిపోవాలనిన, కమనీయ కాంతారసీమలో విహరించవలెనన్నా, చదలేటి బంగారు నీట స్నానసుఖాన్ని అనుభవములోకి తెచ్చుకోవలెననిన అది అందాల పాలవెల్లియైన కాశ్మీరులోనే సాధ్యము. కాశ్మీరు కళలకు నెలవు.

అక్కడి ప్రతిరాయి, ప్రతిమొక్క, ప్రతిఅణువు మానవనాగరికతకు చిహ్నము. ఆటవికులకు, అధునికులకు ఏకకాలములో అమేయమైన, అపూర్వమైన ఆనందానుభూతిని సంతరించగల యద్భుతదేశము కాశ్మీరు. వానకు తడవనివారు, ఆ దేశపుటందము చూచి ఆనందతన్మయులు కానివారు ఇంతవరకు పుట్టలేదు. ఆహా! ఎంత అందమైనది కాశ్మీరు! ఇక్కడి స్వాదుఫలాలు, ఇక్కడి అందాల భరిణలయిన అతివలు — శాంతినిలయమై, సుభిక్షానికాటపట్టై, అడుగడుగున నందనోద్యానాన్ని తలపింపచేయు పర్వతసానువుల సహజ సౌందర్యము, అవ్యక్త మధురాలాపాలతో అందరి మనస్సులను ఆకట్టే సెలయేళ్ళ సంగీతము — నవనాడులు కృంగిపోయిన నిర్భాగ్యులకు సయితము నిత్యోత్తేజమును, నవనవోన్మేషమునుకల్పించగల — సముద్రమట్టానికి 52 వేల అడుగుల ఎత్తునగల ఈ సుందర సీమకు మధ్య ఇంద్రనీలము వలె నిగనిగలాడేనీలాల సరస్సులు కల్పిస్తున్న శోభ నిరుపమానము. డాల్ సరస్సు యొడ్డున అన్వర్థమైనది శ్రీనగరము. అందు మొగలాయికోటలు వల్ నార్ సరస్సు, దాని యొడ్డున అసంఖ్యా



శేషనాగు సరస్సు (కాశ్మీర్ ప్రభుత్వ సౌజన్యముతో)

కముగా యున్న ఆటస్థలాలు, స్వచ్ఛమై గభీరమైన బాలసరస్సు నయనపర్వ మొనర్చును. పర్వతరాజైన హిమవంతుని మకుట మణివలె భాసిల్లుచున్నదనిన కేవలము స్వభావోక్తి.

కాశ్మీరుయాత్రికులు ముఖ్యముగా చూడదగినవి జీలం నది గుండా కొంతదూరము ప్రయాణముచేసి అనంతనాగ్ పట్టణము చేరుకొనవలయును. దీనినే "ఇస్లామాబాగ్" అని యందురు. మరియు అడుగడుగున అంద మొలికించు "అచ్చాబల్ జల", వెరినాన్ పాతాళగంగ, మార్తాండ శిథిలములు, పహాల్ గామ్ ఆటస్థలాలు, సోనామార్గ్ పచ్చికబయళ్ళు, అమరనాథ్ గుహాలు ముఖ్యముగ చూడదగినవి.

కేవలము విలాసయాత్రలకే కాకుండ మృగయా వినోదులకును కాశ్మీర్ కొంగుబంగారము. ఇక్కడ ఉన్ని శాలువలు, జరీబుటేదారీపని, కొయ్యచెక్కడము, తివాచీలు, వెండిసామాగ్రి ఎంతో అందముగా నుండును, కంటబడిన కొనకుండ నుండలేము.

## మార్గదృశ్యములు

పఠాన్‌కోటనుండి శ్రీనగరు 267 మైళ్లు. కారు ప్రయాణమే ఉత్తమము. ఈ ప్రయాణము దూరమైనను భార మనిపించదు. ప్రయాణముచేయునంతకాలము అక్కడి కమనీయ ప్రకృతి సందర్శనములో తన్మయులైన ప్రయాణీకుల కేమియు కష్టమనిపించదు. మండుటెండలో మైదానములలోని ప్రయాణమువలెగాక కొంచెము దూరము సాగునప్పటికి అందమైన మజిలీలు, నగరములు, గ్రామములు తారసిల్లును. మిట్ట లెక్కుచూ, దిగుచూ ప్రయాణము చేయుటచే, శరీరమునకు నూతనసుఖము, ఆనం

సందర్శించి ముగ్ధులైన ప్రతివారు తమ ఆనందవివేచనలో ఎవరికి వారు క్రొత్తక్రొత్త ప్రత్యేక కారణములను పేర్కొనుచుందురు. కొందరు అక్కడి నిసర్గ మనోహరదృశ్యములను, నందనవనమును మరపింపజేయు సుందరోద్యానములను, స్వచ్ఛజలపూరితములై చూపరులకు తన్మయతను గలిగించు సరస్సులను, మంచుచే కప్పబడి, సౌందర్య గంభీరములై మరులుగొల్పు మహోన్నత పర్వత శ్రేణులను, పచ్చని రత్నకంబళము పరచినట్లుండు పచ్చిక బయళ్ళను, నీహారసాంద్రములైన నిబిడారణ్యములను చూచి తన్మయులగుదురు. మరికొందరు అతిపురాతనములైన అక్కడి శిథిలశిల్పాలను చూచి వాటి వైభవాన్ని మెచ్చుకొనకుండగ నుండలేరు. ఇంతియ కాదు. కాశ్మీర్ ప్రజల యపూర్వ కళలను, సౌందర్యోజ్జ్వలమైన వారిసృష్టిని చూచి ఎంతో యాహ్లాదమును పొందుదురు. ఈ విధముగా ఆయా వ్యక్తుల అనుభూతులు వారి వారి సంస్కారమునుబట్టి మారుచున్నను కాశ్మీర్‌లోయ నిసర్గ రామణీయక రహస్యము ఇప్పటికిని ఎవ్వరికిని పట్టుబడనేలేదు. అందుచేతనే దీనిని ఆసియాఖండపు క్రీడావిహారమని, మహాకీర్తి స్థగితమైన మరకతమని మహాకవులు ముక్తకంఠముతో మధుర ముగా గానము చేసిరి.

ఈ ప్రపంచపు చీకాకులు మఱచిపోవాలనిన, చల్లగా మెల్లగా హాయిగా పరిమళభరితమైన పవనాంకురముల మధ్య సుందర స్వప్న కాలములలో తేలియాడిపోవాలనిన, కమనీయ కాంతారసీమలో విహరించవలెనన్నా, చదలేటి బంగారు నీట స్నానసుఖాన్ని అనుభవములోకి తెచ్చుకోవలెననిన అది అందాల పాలవెల్లియైన కాశ్మీరులోనే సాధ్యము. కాశ్మీరు కళలకు నెలవు.

అక్కడి ప్రతిరాయి, ప్రతిమొక్క, ప్రతిఅణువు మానవనాగరికతకు చిహ్నము. ఆటవికులకు, అధునికులకు ఏకకాలములో అమేయమైన, అపూర్వమైన ఆనందానుభూతిని సంతరించగల యద్భుతదేశము కాశ్మీరు. వానకు తడవనివారు, ఆదేశపుటందము చూచి ఆనందతన్మయులు కానివారు ఇంతవరకు పుట్టలేదు. ఆహా! ఎంత అందమైనది కాశ్మీరు! ఇక్కడి స్వాదుఫలాలు, ఇక్కడి అందాల భరిణలయిన అతివలు — శాంతినిలయమై, సుభిక్షానికాటపట్టై, అడుగడుగున నందనోద్యానాన్ని తలపింపచేయు పర్వతసానువుల సహజ సౌందర్యము, అవ్యక్త మధురాలాపాలతో అందరి మనస్సులను ఆకట్టే సెలయేళ్ళ సంగీతము — నవనాడులు కృంగిపోయిన నిర్భాగ్యులకు సయితము నిత్యోత్తేజమును, నవనవోన్మేషమునుకల్పించగల — సముద్రమట్టానికి 52 వేల అడుగుల ఎత్తునగల ఈ సుందర సీమకు మధ్య ఇంద్రనీలము వలె నిగనిగలాడేనీలాల సరస్సులు కల్పిస్తున్నశోభ నిరుపమానము. డాల్ సరస్సు యొడ్డున అన్వర్థమైనది శ్రీనగరము. అందు



శేషనాగు సరస్సు (కాశ్మీర్ ప్రభుత్వ సౌజన్యముతో)

మొగలాయితోటలు వల్ నార్ సరస్సు, దాని యొడ్డున అసంఖ్యా

కముగా యున్న ఆటస్థలాలు, స్వచ్ఛమై గభీరమైన వాలసరస్సు నయనపర్వమొనర్చును. పర్వతరాజైన హిమవంతుని మకుట మణివలె భాసిల్లుచున్నదనిన కేవలము స్వభావోక్తి.

కాశ్మీరుయాత్రికులు ముఖ్యముగా చూడదగినవి జీలం నది గుండా కొంతదూరము ప్రయాణముచేసి అనంతనాగ్ పట్టణము చేరుకొనవలయును. దీనినే "ఇస్లామాబాగ్" అని యందురు. మరియు అడుగడుగున అంద మొలికించు "అచ్చాబల్ జల", వెరినాన్ పాతాళగంగ, మార్తాండ శిథిలములు, పహల్గామ్ ఆటస్థలాలు, సోనామార్గ్ పచ్చికబయళ్ళు, అమరనాథ్ గుహాలు ముఖ్యముగ చూడదగినవి.

కేవలము విలాసయాత్రలకే కాకుండ మృగయా వినోదులకును కాశ్మీర్ కొంగుబంగారము. ఇక్కడ ఉన్ని శాలువలు, జరీబుటేదారీపని, కొయ్యచెక్కడము, తివాచీలు, వెండిసామాగ్రి ఎంతో అందముగా నుండును, కంటబడిన కొనకుండ నుండలేము.

## మార్గదృశ్యములు

పఠాన్‌కోటనుండి శ్రీనగరు 267 మైళ్లు. కారు ప్రయాణమే ఉత్తమము. ఈ ప్రయాణము దూరమైనను భార మనిపించదు. ప్రయాణముచేయునంతకాలము అక్కడి కమనీయ ప్రకృతి సందర్శనములో తన్మయులైన ప్రయాణీకుల కేమియు కష్టమనిపించదు. మండుటెండలో మైదానములలోని ప్రయాణమువలెగాక కొంచెము దూరము సాగునప్పటికి అందమైన మజిలీలు, నగరములు, గ్రామములు తారసిల్లును. మిట్ట లెక్కుచూ, దిగుచూ ప్రయాణము చేయుటచే, శరీరమునకు నూతనసుఖము, ఆనం

దము కలుగును. మార్గముపొడవున ప్రధానస్థానములలో తంతి, తపాలా, వైద్యసౌకర్యములు; విశ్రాంతి భోజనవసతులు కలవు.

లఖాన్‌పూర్:— ఇది పఠాన్‌కోటకు 11 మైళ్లు. ఇచట నొక విశ్రాంతిభవనము కలదు. ప్రకృతి మనోజ్ఞముగా నుండును.

సాంబా:— లఖాన్‌పూర్ నుండి కథు, హీరానగర్ ల మీాదుగ నిచ్చటకు చేరవలయును. ఇచట ఒక కోట కలదు.

జమ్మూ:— లఖాన్‌పూర్‌కు 56 మైళ్ళు. ఇది సముద్ర తలమునకు 1000 అ. ఎత్తున, స్వర్ణశిఖరములతో శోభిల్లు నసంఖ్యాక మందిరములతో నలరారుచుండును. ఇచట ప్రసిద్ధమగు వైష్ణవీమందిరము కలదు. (చూ. వైష్ణవీక్షేత్రము)

౯



త్రిమూర్తి శిఖరములు (కాశ్మీర్ ప్రభుత్వ సౌజన్యముతో)

ఉదాంపూర్:— జమ్మూనుండి యిచటకు 41 మైళ్ళు. ఇది 2248 అ. ఎత్తున గలదు.

కుడ్:— ఉదాంపూర్ నుండి ఇచటకు 24 మైళ్ళు. ఎత్తు 5700 అడుగుల్లు. ఇచట కుడ్ నీటిబుగ్గ చూడదగినది.

పత్నితాప్:— కుడ్‌నుండి 4 మైళ్ళు. ఇది సముద్రతలమునకు 6447 అ. ఎత్తున గలదు. సమీపములో ప్రయాణీకులకు పర్ణశాల కలదు. అందు సౌకర్యములు కలవు.

బటోడ్:— పత్నితాప్‌నుండి ఇచటకు 8 మైళ్ళు. ఎత్తు 5170 అడుగులు. ఇచట అందమైన చీనాబ్‌లోయ, పెట్రోలు పంపు చూడదగినవి.

రాంబన్:— బటోట్‌నుండి 17 మైళ్లు. ఇటనుండి ముందునకు పోవుమార్గమున చీనాబ్‌నదిమీదగల వంతెన చూడదగినది.

బనిహాల్:— ఇది ఉన్నతమైన పర్వతప్రదేశమున కలదు. దీని ఎత్తు 5650 అ. ఇక్కడ "చెక్‌పోస్టు" గలదు. అందుచే బండ్లు, బాటసారులు ఇక్కడ ఆగవలసియుండును. ఇచట ధర్మశాలలు, ఒక బంగళా కలవు. ముందుమార్గమున ఒకసొరంగము నుండి ప్రయాణముచేయవలయును. ఆ దృశ్యము వర్ణనాతీతము.

అప్పర్‌ముండా:— ఇది సముద్రతలమునకు 7287 అ. ఎత్తున గలదు. ఇచటి సుందరదృశ్యములుకూడ చూడగగినవి.

లోయర్‌ముండా:— ఇది అప్పర్‌ముండాకు 5 మైళ్ళు. ఇచటకు 1 మైలు దూరమున ఝీలంనది పుట్టిన 'వెరినాగ్' అను ప్రదేశమున్నది. జహాంగీరునిర్మించిన ఉద్యానముకూడా కలదు.

గజ్‌గుండ్:— లోయర్‌ముండానుండి ఇటకు 4 మైళ్ళు. ఇది సముద్రతలమునకు 5667 అ. ఎత్తున కలదు.

ఖానాబల్:— గజ్‌గుండ్ నుండి ఇచటకు 11 మైళ్ళు. ఇటనుండి పహాల్‌గామ్‌కు కూడా వెళ్ళవచ్చును.

అవంతిపూర్:— పూర్వము అవంతివర్మ యను రాజు దీనిని పాలించెను, కాని నేడిది యొక చిన్నగ్రామము. ప్రాచీన

శిథిలములతో బాటు అవంతివర్మ నిర్మితములగు రెండు శివమందిరములు కలవు. చూడదగినవి.

పాంపూర్:— ఇది యొక చిన్నపట్టణము. ఇచ్చట ఒక మసీదు కలదు సమీపములో అచబాల్ జలపాతము, కౌంసర్ నాగ్ సరస్సు కలవు. ఇచటకు శ్రీనగరము 9 మైళ్ళు.

## శ్రీనగర్

శ్రీనగరు చేరుకొనగానే కాశ్మీరుయాత్రికులు ముందుగ కాశ్మీరుప్రభుత్వము ఏర్పరచిన యాత్రిక సమాచారకార్యాలయ



ఝీలంనది సుందరదృశ్యము (కాశ్మీర్ ప్రభుత్వ సౌజన్యముతో)

మునకు వెళ్లవలయును. ఇచట కాశ్మీరుయాత్ర సార్థకమగుటకు తగినసలహా ఉచితముగ లభించును. అక్కడి హోటళ్లలో, పడవ గృహములలో ఎన్నిరోజు లుండినను, షార్ మార్, నిషాల్,

చస్మాషాహి, నందనోద్యానముల సందర్శించినను "సుందరమైన శ్రీనగరులో మరికొంతకాలము గడపకపోతిమె" అని యనిపించుట ప్రతి యాత్రీకునకు సహజము.

కాశ్మీరునకు పశ్చిమభాగమునందు మకటాయమానమై ఈ నగరము విలసిల్లుచున్నది. ఇది సముద్రతలమునకు 5250 అ. ఎత్తున 11 చ. మై. విస్తీర్ణము గలిగి జీలంనది కిరువైపులను హృదయరంజకమై, మనోహరమై, అపూర్వమై, అనన్యసాధ్య దుర్లభమైన ప్రకృతిసంపదతో నలరారుచుండెను. ఝీలంనదిమీద నీనగరమున, నదికిరువంకల నుండు నగర ఖండములను గలుపుచు 7 వంతెనలు కలవు. ఇది కాశ్మీర్ ప్రభుత్వమునకు వేసవిరాజధాని. ఇక్కడకొండమీద క్రీస్తుకు పూర్వము 220 సంll కు పూర్వము కట్టబడిన శ్రీశంకరాచార్యుల మందిరము కలదు. అశోక చక్రవర్తి నిర్మించిన అసలు శ్రీనగరము ఇచటకు 3 మై. లో గలదు.



శ్రీ శంకరాచార్యమందిరము

శ్రీనగరులో చిన్నచిన్నపడవలు, హిందూ, పాశ్చాత్య పద్ధతులతోనుండు హోటళ్లు, బజారులోని చక్కనివస్తునిచయము

హృదయమునకు నుత్సాహము కలిగించును. నావ నివాసము:— ప్రపంచములో ఈ పద్ధతి నెచ్చటను లేదు. నావ 1 కి 6 గదులు, చన్నీరు, వేడినీరుగల కుళాయిలు గలవు. జనసంఖ్య 1941 సంll పు లెక్కలప్రకారము 2,07,787. స్వర్గసౌఖ్యమును మరపించు ఈ నగరసౌందర్యము దర్శనీయమెగాని వర్ణనీయముకాదు. ఇచ్చట ప్రతి పదమున సరస్సులు, నుద్యానములు తారసిల్లగలవు.

కాశ్మీరుయాత్రికులు సందర్శించదగినవానిలో — ఉన్నత పర్వతములమధ్య మిక్కిలి చల్లగానుండు గుల్మార్గ్, పహాల్‌గాం పట్టణములు ముఖ్యములు.

పహాల్‌గాం:— గుల్‌మార్గ్ నుండి ఇచటకు వచ్చు రోడ్డు పొడుగునా ఎన్నో గ్రామములు, సీమరేగు తోటలు, సెలయేళ్లు, వరిపొలాలు, సుందరదృశ్యములు, అంబరచుంబితము లైన మహావృక్షములతో మనోహరముగా నలరారుచుండును. ఇది సముద్రమట్టమునకు 7000 అడుగుల యెత్తున నున్నది. లిద్దార్‌లోయలోవున్న ఈ ప్రాంతము విశ్రాంతికి, పర్వతారోహణకు, చేపలవేటకు, గుఱ్ఱపుస్వారికి — పర్వతావృతమైన ఇచటి ప్రశాంతవాతావరణములో ఎన్నో అవకాశము లున్నవి ఇచట నుండి బయలుదేరి యీ క్రింది ప్రాంతములను దర్శించవచ్చును. బహార్, మార్తాండ్, అనంత్‌నాగ్, అచ్ఛాబల్, కొకర్‌నాగ్, చందన్‌వారీ, శేషనాగ్‌సరస్సు, అమర్‌నాథ్‌గుహ, తార్సార్ సరస్సు, ఆరూలిదార్‌వత్, బొమాజో మొదలగునవి మనోహర ప్రాంతములు. యాత్రికులు వీటికిసంబంధించిన సర్వసమాచారము లను, అచటి స్థానికమార్గదర్శులతో సంప్రతించి, తమ యాత్రను నిర్ణయించుకొనవలెను. ఇవిగాక కాశ్మీరులోయలో సోనామార్గ్,

గందేర్‌బాల్, లోలబ్‌లోయ, గురైస్ కూడా యాత్రికులు తప్పక సందర్శించతగిన సుందరప్రాంతములు.

గుల్మార్గ్:— దీనిని పూలమైదాన మందురు ఇది కొంత వరకు స్కాట్లాండును పోలియుండును. సముద్రమట్టానికి 8750 అ. ఎత్తున గలదు. ప్రపంచము మొత్తముమీద అత్యంత సుందరము లైనతావులలో నిదియొకటి. గుల్మార్గ్ చుట్టూ 7 మై. పొడుగున రోడ్డు గలదు. ఈ మార్గమున అడుగడుగునా దేవదారు అరణ్యములు ఎంతో గంభీరముగానుండి చూపరులను ఉత్తేజితులను చేయుచుండును. గుల్మార్గ్ నుండి ముక్కోణాకారముగా నున్న అల్ఫతార్ సరస్సుకు వెళ్ళవచ్చును. వేసవికిముందు తేలియాడు హిమానీనదములలో నిది ఎంతో చూడ ముచ్చటగానుండును. గుల్మార్గ్‌కు సమీపములో ఖలీన్‌మార్గ్ కలదు.

ఖలీన్‌మార్గ్:— గుల్మార్గ్ నుండి ఇటకు 40 నిమిషములు ప్రయాణము. ఇది రకరకముల మొక్కలతోను, పూలతోను నేలంతయుతివాచీపరచినట్లుండును. ఇటనుండి నంగాపర్వతసుందర దృశ్యమును, హరిముఖ్ శిఖరములును కానవచ్చును. ఇచట గల ఉలార్, అంబార్, డాల్ సరస్సులు కూడా నయనపర్వ మొనర్చుచుండును. శ్రీనగరునుండి కనబడు సుప్రసిద్ధమైన శంకరగిరికూడా ఇక్కడకు కనుపించును. తరువాత అపహార్‌వాట్ సరస్సును సందర్శించవలయును.

నింగిల్‌నాలా:— ఇది గుల్మార్గ్‌కు నైఋతిదిశగా 5 మై. దూరములో గలదు.

టియర్ణ మార్గ్;— సుందరమైన అరణ్యముల నుండి మార్గము సాగును. ఈ పచ్చికబయళ్లు శిబిరములకు అనుకూలము.

ఫిరోజ్‌పూర్‌నాలా:— గోగల్‌దారా రస్తానుండి బాట గలదు. ఇది చేపలవేటకు అనుకూలమైన ప్రదేశము. వనభోజనములకు ఆకర్షణీయమై ప్రాంతము.న ఇచటనుండి బయలుదేరి బాబాఋషి, కాంతారనాగ్ ప్రదేశములు దర్శించవలెను.



త్రిమూర్తిశిఖరములు (కాశ్మీర్ ప్రభుత్వసౌజన్యము)

తోష్ మైదానము:— గుల్మార్గ్‌నుండి ఫిరోజ్‌పూర్‌నాలా మీదుగ నిచటకు చేరవచ్చును. దారి నిట్రముగా నుండును. కానీ, చిన్నగుట్టములమీద అరణ్యముగుండా ప్రయాణము చేయువచ్చును. మార్గములో క్రమముగా డాక్‌వాన్సీ, టెజ్జా సందర్శించవలయును.

## ప్రధాన సరస్సులు

డాల్‌సరస్సు:— ఇది శ్రీనగరమునకు సుమారు 6 మైళ్లు. ఈ సరస్సు పద్మములతోనిండి 5 మై. పొడవు, 2 మై. వెడల్పు గలిగి నేత్రానందకరముగా నుండును.

ఊలర్‌సరస్సు:— ఇది కాశ్మీరములోని సరస్సులలో పెద్దది. దీని విస్తీర్ణము 14 చ. మైళ్ళు. దీని పశ్చిమతీరమున సరస్సులో సీటబుగ్గ కలదు.

సూచన:— 667 వ పేజీలోని చిత్రము - బదరీ పోవు మార్గములోని చమోలీగా భావించవలెను.

మానస్‌బల్‌సరస్సు:— కొండలచే నావరింపబడి స్వచ్ఛ జలపూరితమై యుండును. దీనికి బశ్చిమదిశయందు శిథిలమైన మొగల్‌తోట కలదు. నాటి శిథిలములు చూడనగును.

అఫర్వత్:— గుల్‌మార్గకు 4000 అ. ఎత్తున విస్సీల సీరముతో నిండి మనోహరముగా నుండును.

గంగాబల్:—సముద్రమునకు 12000 అ. ఎత్తున గలదు. ఆగస్టులో హిందువులు యాత్రకై యిచటికి వచ్చుచుందురు.

కౌన్సర్‌నాగ్:— సముద్రమునకు 12000అ. ఎత్తున గల యీ సరస్సు చాల పెద్దది. జూన్‌లో మంచు గడ్డ లిందు తేలుచుండును. సెప్టెంబరు, అక్టోబరులందు చాల మనోహరముగా నుండును.



హిమాచ్ఛాదిత మైన పర్వతదృశ్యము

## ప్రధాన ఉద్యానములు

చశ్మాషాహీ:— ఇది శ్రీనగరమునకు 5 మైళ్ళు. ఇచట రాయల్ నీటిబుగ్గ కలదు.

నిశాత్:— చశ్మాషాహీనుండి ఇచటకు 2 మైళ్లు. ఇది పది అంతస్థులుగా నిర్మింపబడి వివిధపుష్ప శోభితమై యుండును.

షాలిమార్:— నిశాత్ నుండి ఇటకు 2 మైళ్లు. జహాంగీరు నూర్జహానుతో విహరించుటకు దీనిని నిర్మించెను.

నసీం:— శ్రీనగరమునకు 6 మైళ్ళు ఇది పుష్పశయ్యలకు ప్రసిద్ధిచెందినది. జలపాతములు పూలమడుగులు కలవు.

అచ్ఛాబల్:— ఇది శ్రీనగరుకు 30 మైళ్ళు. జహాంగీరు దీనిని నిర్మించెను. ఇచ్ఛఖ నీటిబుగ్గనీరు ఆరోగ్యదాయకము.

చీనార్ బాగ్:— ఇందు బాగుగా త్రవ్వబడిన కాలువల నుండి ఇండ్లవలె నిర్మింపబడిన పడవలలో హాయిగా పయనించి ఆనందించుటకు వీలుగానుండును.



మార్తాండమందిరము
(కాశ్మీరుప్రభుత్వ సౌజన్యముతో)

## సూర్యమందిరము

ఈమందిరము కాశ్మీరు లోయకు తూర్పువైపున కలదు. శ్రీనగరము నుండి నావమీద ఇస్లామాబాద్ 60 మై. వరకు ప్రయాణము చేయవలయును. ఇస్లామాబాద్ కు పూర్వోత్తరముగ 4½ మైళ్ళలో ఉన్నతస్థానమున మార్తాండమందిరం కలదు. కాశ్మీరుప్రభువగు లలితాదిత్యుడు 8వ శతాబ్దమున దీనిని నిర్మించెను. ఒక వారము నిరశనుడై చంద్రభాగా, వితస్తానదులయందు స్నానముచేయుచు సూర్యుని దర్శించిన మహాఫలముకలుగునని భారతమున కలదు.

## వైష్ణవీ క్షేత్రము

పఠాన్‌కోట, జమ్మూలనుండి కత్రాకు బస్సులు కలవు. పఠాన్‌కోటనుండి కత్రాకు బస్సు 2-0-0 లు. జమ్మూనుం: 1-4-0. కత్రానుండి గుహాలయానికి పోను రాను రు 7-0-0 లు చార్జి అగును. ఈ యాత్ర సుఖముగ చేయుటకు పఠాన్‌కోట, జమ్మూ పట్టణములలో గల కాశ్మీరుప్రభుత్వ యాత్రిక శాఖాధి కారులను దర్శించుట మంచిదని మా సలహా.

పర్వతమునకు దిగువగల కత్రబస్తినుండి గుహాలయము నకు రెండు మార్గములు కలవు. కత్ర సుందరమైన చిన్న బస్తి. యాత్రికులు పండాలగృహములలో నివసించుదురు. ఇచట ధర్మ శాలలు, పోస్టాఫీసు, వైద్యాలయము కలవు. కత్రా నుండి చాండియార్ మీదుగ వెళ్ళుమార్గమున తొలుత 6 మై. కారు, పిమ్మట కాలిమార్గము. గుఱ్ఱములు, పల్లకీలు దొరకును. కత్రా నుండి అన్‌కన్‌వారిమీదుగ గుహాలయము 6 మైళ్లు. ఇది నడచి వెళ్ళతగిన మార్గము. ప్రతి అరమైలుకు ధర్మశాలలు, టీ దుకా ణములు కలవు. అన్‌కన్‌వారీలో కూడ దేవి ఆలయము ధర్మ శాల కలవు. పిమ్మట ఖాంజిఖాట్ దర్శించవలయును.

ఖాంజిఖాట్:— ఇది సముద్రమట్టమునకు 7800 అ. ఎత్తున గలదు. అన్‌కన్‌వారినుండి ఇచటకు క్రమముగా నిలువుగ ప్రయాణము చేయవలయును. ఈ మధ్యలో భైరోఘాట్ మకా ములో గల భైరోదేవాలయమును యాత్రికులు తప్పక దర్శించ వలయునని స్థలపురాణమున కలదు. పిమ్మట దట్టమైన వైష్ణవీ వనములో ప్రయాణించి గుహాలయమును చేరవలయును. మార్గ

మధ్యమున 'జై మాతాజీ' అను నినాదములతో, దేవీస్తోత్ర గానములతో, యాత్రికుల ప్రత్యభినందనములతో, భక్తి పారవశ్యముతో యాత్రచేయుచుందురు. ఈయాత్ర సామాన్యముగ సెప్టెంబరులో నవరాత్రులకుముందు 4 మాసములు జరుగును,



కాశ్మీరులోని శేషనాగసరస్సు (మరియొక దృశ్యము)

శ్రీ త్రికూట భగవతీ గుహాలయము పర్వతమున గలదు. ఇది సముద్రమట్టమునకు 5000 అ. ఎత్తున గలదు. దేశము నలుమూలలనుండియు వేలకొలది యాత్రికులు వత్తురు. ఇట ప్రధాన దేవత శ్రీవైష్ణవీదేవి. గుహా ముఖద్వారము 100 అ. పొడవు. మార్గము యిరుకుగ నుండును. గుహనుండి ప్రవహించు సెలయేటిలో మోకాలుబంటి లోతున కొంతదూరము నడువవలెను. గుహా చివరిభాగమున కాళీ, వైష్ణవి, సరస్వతి అను దేవతా విగ్రములు గలవు. ఆలయమున ఏకకాలమున 15 మంది పూజ చేయు నావకాశము కలదు. ముఖద్వారమునకు వెలుపల గల

వేదికపై యాత్రికులు హోమాదులు నిర్వర్తింతురు. ఈ పరిసర రామణీయకము నిరుపమానము. ఇట 3 అంతస్తులుగల సత్రము కలదు. ఇందు వేయిమంది బసచేయవచ్చును. వంటసామాగ్రి, తేయీరు మొదలగు పదార్థములు ప్రభుత్వపు రేషన్ దుకాణములో లభించును. ఇచట వైద్యాలయము కూడ గలదు. ఈ దేవిని గుఱించి యనేకగాథలు ప్రచారములో నున్నవి.

## అమరనాథ్

కాశ్మీరుకు తూర్పున, సముద్రమునకు 15000 అ. ఎత్తుగల పర్వతముమీద శ్రీఅమరనాథమహాదేవుని గుహామందిరము కలదు. ఇదియే అమరేశ్వర జ్యోతిర్లింగమని కొందరు చెప్పుదురు. ఇచ్చటి శివలింగము, గుహయు కూడ మనుష్య నిర్మితములు కావు. ప్రకృతిసిద్ధమైనవి. శ్రావణ శు ౧౫ న మాత్రమీ క్షేత్రయాత్ర చేయుదురు.

ప్రయాణ వివరము:— ఈ స్థానము కాశ్మీరు రాజధానియగు శ్రీనగరుకు 86 మై. లో గలదు. శ్రీనగర్‌నుండి పలగామ్ వరకు (59 మై.) బస్సు కలదు. ఇది సముద్రతలమునకు 7000 అ. ఎత్తున ప్రకృతిసంపదతో నలరారుచుండును. ఇచటకు 2 మైళ్ళ దూరమున సముద్రతలమునకు 13000 అ. ఎత్తున, 1 మై. పొడవు, ½ మై. వెడల్పు గలిగి సుందరదృశ్యములతో నలరారు తరపాల సరస్సు కలదు. పలగామ్‌నుండి మార్గము దుర్గమముగ నుండును. కాలినడకనే వెళ్ళవలసియుండును. ఇందు "చందన్ బాడీ, శేషనాగము, పంచతరణీ" యను 3 మకాములు గలవు. పలగామ్‌కు చందన్ బాడీ 8 మైళ్లు. ఇటనుండి శేషనాగము 7 మైళ్లు. ఇటనుండి

అమరనాథము 5 మైళ్ళు. దీని ఎత్తు 9500 అడుగులు. యాత్రికు లీస్థలములందు మకాములుచేసి, శ్రావణ శు ౧౪కి 'పంచతరణీ' మకామునకు చేరుదురు. ఇది అమరనాథ పర్వతో పాంతమున గలదు. శ్రావణపూర్ణిమా దివసమున ఉదయము ఇచ్చటనుండి పర్వతము నెక్కి అమరనాథమహాదేవుని దర్శించి యాత్రికులు సాయంకాలమునకు మరల పంచతరణి చేరుదురు. పర్వతము మీదకు ఎక్కునపుడు సుమారొక మైలుదూరము మంచుమీద నడువవలసియుండును.



హిమలింగము _ అమరనాథము

సరస్సు:—— గుహాసమీపమునందొక ఏరు కలదు. ఇందు యాత్రికులు కౌపీనమునుమాత్రము ధరించి స్నానము చేయవల యును. ఇతరవస్త్రములను ధరించరాదు. ఇది ఇచ్చటి నియమము.

స్నానము చేసి శరీరమును తుడుచుకొనకయే భగవద్దర్శనము చేయవలెను. పిమ్మట వస్త్రములను ధరించవలయును. ఇట్లు చేయుటచే నచ్చట చలి వేయదు. ఈ నీటిలో ఏమి పదార్థమున్నదో కాని స్నానానంతరము శరీరమునగల నీరు యినుకటతోనే శరీరమునకు భస్మము పూసుకొన్నటుల తెల్లగ నుండును.

అమరనాథుని స్వరూపము:— అమరనాథమహాదేవుని గుహామందిరమున 3 హిమలింగము లున్నవి. ఇవి మూడును పార్వతీ పరమేశ్వరులు, విఘ్నేశ్వరునియొక్క మూర్తులని చెప్పుదురు. ఇవి స్వయముద్భూతములు. గుహాలో పై నుండి తుంపర తుంపరలుగ జల మీా లింగములమీాద పడుచుండును. ఈ లింగములు చంద్రు ననుసరించి వృద్ధి క్షయములు నొందుచుండును. పూర్ణిమకు ఈ లింగములు పూర్ణాకృతినొంది, అమావాస్యనాడీ లింగముల స్వరూపమే కానరాకుండును. ఈ క్రమమున ప్రతి మాసమున జరుగుచుండును. అమావాస్యనాడీ గుహానుండి రెండు తెల్లనిపావురములు ఎగురుచు బయటకు వచ్చును. ఇచటివారు ఈ పావురములను పార్వతీపరమేశ్వరులని చెప్పుదురు.

యాత్రాసమమునం దొక బ్రాహ్మణు డిచ్చట నర్చకుడుగ నుండి పూజాద్రవ్యములను గ్రహించును. ఈ బ్రాహ్మణుడు యాత్రికులతో కలిసియే శ్రీనగరునుండి వచ్చును. యాత్రికులతో కలిసి మరల శ్రీనగరు వెళ్ళును. ఈ అర్చకుని చేతియందొక వెండిబెత్తముండును. దాని నాతడు శ్రీనగరునగల ఈశ్వరాలయమునుండి ఇచ్చటకు తెచ్చును. మరల శ్రీనగరు జేరగనే యా బెత్తమును యథాపూర్వముగ మందిరమునం దుంచును.

# పాటియాల

(పాటియాలా - తూర్పుపంజాబ్)

ఢిల్లీనుండి భటిండా (జం) లో దిగవలయును. ఈ పరిసర మంతయు పాటియాల - తూర్పుపంజాబ్ రాష్ట్రములోనిది. దీని వైశాల్యము 10,079 చ. మైళ్లు. ఇాదు సుమారు 600 మై. వరకు పాటియాల సంస్థానమునకు చెందినది. పూర్వము కంటె ప్రస్తుతము వ్యవసాయపరిశ్రమలు ఇచట యధికముగా గలవు.



మోతీబాగ్ ప్యాలెస్ ముందరిదృశ్యము

(పాటియాల - తూర్పుపంజాబ్ ప్రభుత్వ సౌజన్యముతో)

ఈ సంస్థానమున మాధ్యమిక పాఠశాలలు, ఉన్నత పాఠశాలలు, కళాశాలలు కలవు. వివిధపరిశ్రమలు ప్రస్తుతము దినదినాభివృద్ధి గాంచుచున్నవి. ఇట మోతీబాగ్ ప్యాలెస్, మొహీందార్ కాలేజి ముఖ్యముగా చూడదగినవి.

# నైనీతాల్

## మురాదాబాద్

ఢిల్లీనుండి మురదాబాదు స్టేషనులో దిగవలయును. ఇచ్చట రామగంగాతీరమున జుమ్మామసీదు చూడతగినది. షాజహాను మూడవకుమారుడగు 'మురాద్' పేర నీపట్టణము 'మురాదాబాద్' అని పిలువబడుచుండెను.

## నైనీతాల్

మురాదాబాద్‌నుండి ఖట్‌గోదామ్ స్టేషను చేరవలయును. ఇటనుండి చక్కని బస్సుమార్గము కలదు. నైనీతాల్ సముద్రమునకు 6400 అ. ఎత్తున నున్నది. ఇది గొప్ప విశ్రాంతి కేంద్రము. ఇట వేసవిలో ప్రభుత్వకార్యాలయములు తెరువబడును. పూర్వము ఉత్తరప్రదేశ్ ప్రభుత్వమునకు వేసవికేంద్రముగా నుండెడిది.



నైనీతాల్ సుందరదృశ్యము
(ఉత్తరప్రదేశ్ ప్రభుత్వ సౌజన్యముతో)

ఇచ్చటి దేవత నైనీదేవి. ఇది యొక ప్రసిద్ధ శక్తిపీఠము. ఆమె పేరటను, ఇచ్చటగల మనోహరమైన సరస్సువలనను దీనికి 'నైనీతాల్' (తాల్ అనగా సరస్సు) అని పేరు వచ్చెను. ఈ సరస్సునందు నౌకావిహారమునకు చక్కని సౌకర్యములు కలవు.

పరిసరమందలి పర్వతపంక్తులవలన నీ ప్రాంతము సుమనోహరముగా నుండును. ఇచట 'అత్రి, పులస్త్య, పులహా' ఋషులపేర బరగు చిన్న సరస్సులు గలవు. వీరు ముువ్వురు నిచ్చట చిరకాలము తపము గావించినటుల స్కాందపురాణమున గలదు.

## భీమతాల్



నైనీ సరస్సు
(ఉత్తరప్రదేశ్ ప్రభుత్వ సౌజన్యముతో)

నైనీతాల్‌కు 12 మైళ్ళ దూరమునం దీ సరస్సు కలదు. ఇది ఈ ప్రాంతమునందలి సరస్సులన్నిటికంటె పెద్దది. ఇందొక ఆనకట్ట కూడ గలదు.

**ముక్తేశ్వరము:—** ఇది నైనీతాల్‌కు 23 మైళ్లు. ఇందు ప్రభుత్వమునకుజెందిన లేబరేటరీస్ చూడదగినవి.

## అల్ మోడా

నైనీతాల్‌కు 60 మై. దూరమునం దీ నగరము కలదు. ఇచటకు బస్సులు వెళ్ళుచుండును. మార్గమంతయు మనోహర పర్వతపంక్తులతో శోభించుచుండును. (కొన్నిచోట్ల పర్వతముల నెక్కుచు, కొన్నిచోట్ల క్రిందకు దిగుచు బస్సు పోవుచుండును.) ఈ మార్గమున 'భవానీ, రానీఖేత్' అను రెండు ప్రసిద్ధ స్థానములు వచ్చును. ఇచటకు 8 మై. దూరమునందు 'కౌశికీ' యను నొక శక్తిపీఠము కలదు. దూరప్రాంతములనుండి వచ్చి యుషా

సకు లిచ్చట మంత్ర పురశ్చరణ చేయుచుందురు. ఇచ్చట గల శ్రీరామకృష్ణ వివేకానంద మిషనుకూడ చూడతగినది.

## భీమశంకరము (ఉజ్జనకము)

వైద్యనాథమునకు వలెనె భీమశంకర జ్యోతిర్లింగమును గురించియు భేదాభిప్రాయములు కలవు. శివపురాణమునుబట్టి చూడ అస్సాం ప్రాంతమందలి కామరూపజిల్లాలో గోహాటీవద్ద



మొహింద్రా కాలేజి - పాటియాల. (చూ. 681 పేజి)
(పాటియాల - తూర్పుపంజాబ్ ప్రభుత్వ సౌజన్యముతో)

గల (చూ. గోహాటీ) భీమశంకరమే జ్యోతిర్లింగమని కొందరును, నైనీతాల్‌వద్ద ఈ ఉజ్జనకమందలి భీమశంకరమే జ్యోతిర్లింగమని కొందరు, భీమానదివద్దగల (చూ. భీమశంకరము 106 పే) భీమశంకరమే జ్యోతిర్లింగమని కొందరు చెప్పుదురు. ఈ మూటికిని ప్రాచీన ప్రమాణములు గాన్పించుచున్నవి. అన్నియు సేవ్యములే.

'డాకిన్యాం భీమశంకరం' అను వాక్యమునుబట్టి ఉజ్జనకమునందలి శివలింగమె జ్యోతిర్లింగమని తోచుచున్నది. ఈ స్థానమునకు 'డాకినీ' యను పేరు గలదు.

> "యండాకినీ శాకినికా సమాజే నిషేవ్యమాణం పిశితాశనైశ్చ,
> సదైవ భీమాది పదప్రసిద్ధం తం శంకరం భక్తహితం నమామి॥"

పూర్వ మీ ప్రదేశము కామరూపదేశమని పిలుపబడు చుండెడిది. మహాభారత కాలమునుండియు, దీనికి డాకినీదేశమని పేరు వచ్చినది. భీమునిచే పరిగ్రహింపబడిన, డాకినీయోనికి సంబంధించిన హిడింబి యను రాక్షసి యిచటనే నివసించెడిది. హిడింబా వాసస్థానమగుటచే నిదియే వాస్తవ జ్యోతిర్లింగమని తెలియుచున్నది.

ఇట మందిరమునగల మూర్తి చాల పొడవుగను, లావుగను గలదు. మేడమీఁదకెక్కి స్వామిని యభిషేకించి పూజింతురు. ఈ మందిరములో పశ్చిమభాగమున రెండు శిలాశాసనములు గలవు. వీనినిబట్టి చూచిన యీదేవాలయము, క్రీ.శ. 302 లో కట్టబడినట్లు తోచుచున్నది. మందరమునకు తూర్పున కాలభైరవ మందిరము, ఎదుట శివగంగయను కుండమును గలవు. పశ్చిమమున బాలాసుందరీమందిరము గలదు. ఇచ్చట చైత్ర శు ౧ కి పెద్ద యుత్సవము జరుగును. దీనికి పశ్చిమమున కోట యను అతి ప్రాచీనస్థానము కలదు. ఇచ్చటనే ద్రోణుడు కౌరవులకు, పాండవులకు విలువిద్య నేర్పెను. 'భీము'డను రాక్షసుని శంకరుడు సంహారించిన పిమ్మట, 'ఇక్కడనే నివసించుమని' శంకరుని దేవతలు ప్రార్థింపగా శివుడు 'భీమశంకరు'డను పేరుతో ఇట నివసించెను. పాండవవిద్యాభ్యాసకాలమున కిది శిథిలావస్థయందుండగ,

ద్రోణుడు భీమునిచే నీ లింగమును పునః ప్రతిష్ఠింపజేసెను. ఈ కోటకు దక్షిణమున, పితృభక్తితత్పరుడగు శ్రవణుని స్థానము గలదు. శ్రవణుడు తన తల్లిదండ్రులను కావడియందుంచి మోసికొనుచు, తీర్థయాత్రలు చేయుతటి కొంతకాల మిచట నివసించెను. ఇచట ద్రోణసరోవరము గలదు. దీనిని పాండవులు తమ గురువుపేర త్రవ్విరి. ఈ మందిర పరిసరప్రాంతములను ద్రవ్వగా, ఒక గుడి, కొన్ని శివమూర్తులు లభించినవి. ఈ విధముగా భారతావని గర్భమున ఎన్ని మందిరములు, ఎన్ని దేవతామూర్తులు దాగియున్నవో కదా! ఇందు ఆగ్నేయభాగమున గల హరిశంకర స్వామి, దక్షిణదిశయందుగల జాగేశ్వరస్వామి చాల ప్రసిద్ధమైన శివలింగములు. భీమశంకర లింగము మోటుగా నున్నందున కొందరు మోటేశ్వరనాథ్ అనికూడ పిలుతురు. శివరాత్రి కిచట పెద్ద యుత్సవము జరుగును.

## మానస సరోవరము - కైలాసము

"మానస సరోవరము, కైలాసము" అను నీ నామముల నెఱుంగని భారతీయు లుండరు. ఈ రెంటిని దర్శించినవారు చాల తక్కువగ నుందురు. చాలమందికి వీని యునికియే తెలియదు. ఈ రెండు తీర్థస్థానములును భారతదేశపు సరిహద్దులకు బయట 'టిబెట్' దేశమున గలవు. అచ్చటకు సుమారు 300 మైళ్లు దుర్గమ పర్వత మార్గములందు నడచి వెళ్ళవలయును. ఈ యాత్ర చేయుటకు 2 నెలలు పట్టును. మార్గమునందలి యమిత కష్టమును సహించి తరించవలయును. మార్గమున విశ్రాంతి స్థానములు తక్కువ. యాత్రికులు తమ కావశ్యకములగు వస్తునిచ

యముతోపాటు ఒక డేరా, కిరసనాయలు, స్టౌవ్ తీసుకు వెళ్ళ వలసియుండును. టిబెట్టు దేశమున ప్రవేశించగనే వంటచెరకుగాని, బొగ్గుకాని లభించుట కష్టమగును.

మానససరోవర, కైలాసములకు నాల్గు మార్గములు కలవు. 'సతలజ్' నదీతీరమునుండి యొకటి, గంగోత్తరికి మైలు న్నరదూరమునుండి యొకటి, బదరీనారాయణమునుండి వేఱొకటి, అల్మోడానుండి ఇంకొకటి కలవు. ఇందు మొదటిమార్గ మన్నిటి కంటె పెద్దది, కష్టదాయకమైనది. నాల్గవమార్గ మన్నిటికంటెను సుఖకరమైనది. యాత్రికు లధికముగ నీమార్గమున వెళ్లుచుందురు.



మానస సరోవరము

అల్మోడా నుండి మానస సరోవరము వరకు మార్గము మూడు భాగములుగ కలదు. ఈభాగము లందును వేర్వేరుగ కూలీలనుకుదుర్చు కొనవలెను. అల్మోడానుండి 'ధార్చూలా' 90 మై. వరకు మొదట కూలీలను కుదుర్చుకొనవలయును. పై రెండు స్థానములందు గల శ్రీరామకృష్ణమిషనుద్వారా యీ యాత్రకు సంబంధించిన సర్వ విషయములను తెలిసికొని, తగిన సహాయమును పొందవచ్చును.

ఇంతవరకు గుఱ్ఱము, *డాండీమీాద ప్రయాణముచేయవచ్చును. మార్గమున కొండలెక్కుచు దిగుచు ప్రయాణము చేయవలెను. మధ్యలో మకాములు కలవు. 'అక్లకోట్' నందు జమీాందారు యాత్రికులకు తగు సౌకర్యములు కలుగజేయును.

ధార్ చూలాయందుకూడ శ్రీరామకృష్ణ వివేకానందాశ్రమము గలదు. దీనిని తపోవనమని పిలతురు. ఇట యాత్రికులు కూలీలను మార్చుకొనవలయును. ఇచటనుండి 'గర్వియా' వరకు ప్రయాణముచేయుట చాల కష్టము. ఈ దుర్గమమార్గమునకూడ గుఱ్ఱముమీాద, డాండీమీాద ప్రయాణము చేయవచ్చును. స్త్రీలు వృద్ధులు మొదలగు నడువలేనివారి నిచ్చటనుండి వెదురుకు గుడ్డ జోలీలు కట్టి తీసికొనివెళ్ళుదురు. మార్గమున 'సీరపాసీ' యను ప్రదేశమున దుర్గమమగు ఎత్తైన ప్రదేశమును, లిపులేకపాస్ యను ప్రదేశమునందు హిమాచ్ఛాదిత ఘట్టమును దాటవలయును. ఈ లిపులేకపాస్‌నందు ఆషాఢమాసము తరువాత మంచు కరుగుచుండుటచే కొన్నిప్రదేశములందు క్రింది లోయలలోనికి పడిపోవచ్చును. అందుచేత నీ యాత్ర జ్యేష్ఠమాసారంభమున జేయవలెను. దీనితరువాత గుఱ్ఱముమీాద, లేక 'ఝుబ్బూ' యను పర్వతపశువు (గాడిదవలె నుండును) మీాద ప్రయాణము చేయవచ్చును. దీని శరీరముమీాద చాల పొడవైన వెంట్రుకలుండును. సామానులను కూడ నీ మృగములచేతనే మోయింతురు. 'గర్వియా' దాటిన, తరువాతప్రాంతమంతయు టిబెట్టుకు చెందినప్రదేశము. అందుచేత నచ్చట భారతీయభాష నెఱింగినవారుండరు. ఈ కారణమున యాత్రికులొక దుభాషియాను (రెండు

* మనుజుని మోయుటకుపయోగించు ఊయలవంటి సాధనము.

భాషలు తెలిసినవారు) వెంటనుంచుకొనవలయును. ఇటుమీదట నున్న మార్గము వృక్షములులేని సమతలప్రదేశము. వాయువు కూడ చాల చల్లగ తీక్ష్ణముగ నుండును. మార్గమున బందిపోటు దొంగల భయముకూడ గలదు. టిబెట్టులో ప్రవేశించుటకు అనుజ్ఞనుపొంది, మన రూపాయలనుకూడా వారి డబ్బులోనికి మార్చుకొనవలయును. ఈ రెండుపనులు 'తకలాకోట్' చేరిన



గంగాఘాటు - హరిద్వారము. (చూ. హరిద్వార్ 226 పేజి)
(ఉత్తరప్రదేశ్ ప్రభుత్వ సౌజన్యముతో)

మీదట చేయవచ్చును. తకలాకోట్ నుండి మానస సరోవరము చేరుటకు 4 దినములు పట్టును. మానససరోవరమునకు పశ్చిమ మున 4 మై. లో రావణసరస్సు కలదు. దీని కుత్తరభాగమునం

దోశ కాలువ గలదు. అది ఈ రెండు హ్రదములను గలుపు చున్నది. ఈ రెండుహ్రదముల వైశాల్యము 60 మైళ్లుండును. ఈ ప్రశాంత గంభీర సరోవరములు హృదయమున నూతనభావముల నుదయింపజేయును. యాత్ర భయంకరముగా నున్నను, సరోవర సందర్శనమున హృదయమునకు శాంతి గల్గును. ఈ సరస్సులకు తూర్పున బ్రహ్మపుత్ర, దక్షిణమున కర్ణాలీ, ఉత్తరమున సింధు, పశ్చిమమున సతలజ్ అను నదులు పుట్టుచున్నవి. ఈసరస్సులు సముద్రమునకు సుమారు 15000 అ. ఎత్తున గలవు.

మానససరోవరమునకు, రావణహ్రదమునకు నుత్తరమున 10 మై. దూరమున కైలాసపర్వతము గలదు. ఇది శంకరుని నివాసస్థానము. ఇది యొక పెద్ద శివలింగమువలెనే యుండును. ఇది సముద్రతలమునకు 21000 అ. ఎత్తున గలదు. ఈ పర్వతశిఖర మెల్లప్పుడు మంచుచే కప్పబడియుండును. యాత్రికులు దీనికి ప్రదక్షిణముచేసి పూజచేయుదురు. ఈ ప్రదక్షిణమునకు 4, 5 రోజులు పట్టును. ఇచట చలి యధికము. ప్రదక్షిణమున కొన్ని గుహలు, కుండములు గానవచ్చును. కొన్నిచోట్ల మంచుమీద నుండియే నడువవలసియుండును. ఇందు గౌరీకుండము చాల ప్రసిద్ధమైనది. ఇది సముద్రతలమునకు 18000 అ. ఎత్తున గలదు. ఇది ½ మైలు వైశాల్యము కలిగియున్నది. ఇందలి జలోపరి భాగ మెల్లప్పుడు మంచువలె ఘనీభవించియుండును. కైలాస పర్వతమునుండి యిచ్చటివరకు ధనురాకారముగనుండు హిమాచ్ఛాదితసానువు గలదు. దీనిని 'పినాక'మని చెప్పుదురు. శంకరుని ధనస్సు పినాకము, ఈ సానువాధనస్సునకు ప్రతీకమువలెనున్నది.

హిందువుల తీర్థస్థానములందింత దుర్గమస్థానము వేరొండు లేదు. అందుచేత నిచ్చటికి వెళ్ళువారుకూడ చాల యరుదుగా నుందురు. వృద్ధులు, దుర్బలులు, సుకుమారులు యీ యాత్ర చేయుటకు సాహసించరాదు. ఇచ్చట మందిరములుగాని, మహాత్ములుగాని కాన్పించరు. కొంతమంది బౌద్ధులగు ♦ లామాలు కాన్పింతురు. కాని వీరియందు సాధుత్వమునకు బదులు ధూర్తత్వమే యధికము. అదృష్టవంతులుగాని యీ పవిత్రస్థానములను దర్శింపజాలరు. పృథివీ హృదయ రూపమగు నీ సరోవరము నవశ్యము దర్శింపవలెను.

## ముర్దాబాద్ గోరఖ్‌పూర్ మధ్యగత క్షేత్రములు

పిలిభిట్:— ముర్దాబాద్‌నుండి బరైలీ (జం) మీదుగ పిలిభిట్ స్టేషను చేరవలెను. ఇట జుమ్మామసీదు చూడదగినది.

తనక్‌పూర్:— పిలిభిట్‌నుండి తనక్‌పూర్ స్టేషనులో దిగవలెను. ఇచటనుండి టిబెట్ దేశముతో వ్యాపారము జరుగుచుండును. ఇచటకు 8 మై. లో 3000 అ. ఎత్తునగల పూర్ణియాగిరి దేవాలయ సౌందర్యము చూడదగినది.

బిశాల్‌పూర్:— పిలిభిట్‌కు 23 మై.లో బిశాల్‌పూర్ స్టేషను కలదు. ఇందు ప్రాచీన బౌద్ధశిథిలములు చాల గలవు. ఇచట క్రీ. శ. 7వ శతాబ్దికి చెందిన వరాహమందిరము కలదు.

హరగోయిాం:— బిశాల్‌పూర్‌నుండి శాహాజహాంపూర్, సీతాపూర్ మీదుగ హరగోయిాం స్టేషను చేరవలెను. ఇచట హరిశ్చంద్రుని కాలమునాటి వని చెప్పబడు శిథిలములు కలవు.

---

♦ టిబెట్టునందుగల బౌద్ధులను లామా లందురు.

ఒక దేవాలయమును తురకలు ధ్వంసముచేసి, దానిపై నొక మసీదును నిర్మించిరి. దీని తరువాతనే గోలాగోకర్ణము కలదు.

బలరామ్‌పూర్:— సీతాపూర్ (జం) నుండి భూరావల్, గోండాల మీదుగ నిచటకు చేరవలయును. ఇచటకు 7 మైళ్ళలో బుద్ధుని కాలమున ప్రసిద్ధిచెందిన శ్రావస్తీ (షహేడ్) నగర శిథిలము లున్నవి. ఇచటనే బుద్ధుడు 5 గురు అంధులకు చూపును ప్రసాదించెనని చైనావారి వ్రాతలవలన దెలియుచున్నది.



గంగాతీరదృశ్యము - గంగాఘట్టము. (చూ. కాశీ 330 పేజి)
(ఉత్తరప్రదేశ్ ప్రభుత్వ సౌజన్యముతో)

ఇచటకు నుత్తరముగ పాటణానగరము కలదు. కర్ణునకు జరాసంధుడిచ్చిన మాలినీ నగర మిదియే. ఇచ్చట పటేశ్వరీ మందిరము కలదు. ఇచట పురాతన దుర్గశిథిలము లనేకములు కలవు. పటేశ్వరీమందిరమును క్రీ.శ. 2వ శతాబ్దియందు విక్రమా

దిత్యుడు కట్టించెను. దీనిని క్రీ.శ. 14 లో రత్ననాథుడు బాగు చేయించెను. క్రీ.శ. 17లో ఔరంగజేబు దీనిని ధ్వంసముచేయగా మరల పునరుద్ధరింపబడెను.

తులసిపూర్:— బలరామ్‌పూరునుండి ఇచటకు చేరవలయును. భారత కర్ణునివలెనే మహాదాత యని ప్రసిద్ధిగాంచిన కర్ణమహారాజు యిచ్చటివాడేనని ప్రసిద్ధి.

షహార్‌ఘుర్:—తులసిపూర్‌నుండి షహార్‌ఘుర్ స్టేషను చేరవలెను. ఇట 'ఖేఁ'చక్రవర్తిచే నిర్మింపబడిన కోట చూడదగినది.

నౌఘుర్:— షహార్‌ఘుర్‌నుండి నౌఘుర్‌స్టేషను చేరవలయును. ఇచటకు 13 మైళ్ళలో 'పిపర్వా' యను చోట బుద్ధస్తూపము కలదు. ఇచటకు పశ్చిమోత్తరముగా 9 మైళ్ళలో గల ప్రదేశమును బుద్ధుని జన్మస్థలమగు కపిలవస్తు నగరముగా భావింతురు.

నౌత్‌తన్వా:— నౌఘుర్‌నుండి నౌత్‌తన్వాస్టేషను చేరవలెను. ఇది నేపాలుదేశప్రాంతమున గలదు. ఇది యొక ప్రసిద్ధ బౌద్ధక్షేత్రము. బుద్ధుడు జన్మించిన లుంబినీవన మీ ప్రాంతమునసే గలదు. పురాతత్వపరిశోధనశాఖవారు ఇచ్చట భూగర్భమునుండి 12 చైత్యములను వెలికిదీసిరి. ఇవి చూడదగినవి.

## గోరఖ్‌పూరులోని శివమందిరములు

నౌత్‌తన్వానుండి గోరఖ్‌పూరు (జం) లో దిగవలెను. ఈ జిల్లాలో ప్రసిద్ధములగు దేవాలయములు గలవు.

దుగ్ధేశ్వర మహాదేవమందిరము:— ఇది గోరఖపూర్ జిల్లాలో గౌరీబాజారుస్టేషనుకు దక్షిణముగ 10 మై. లో రుద్ర

పుర మను గ్రామమున కుత్తరముగ మైలుదూరమున గలదు. శివపురాణమును బట్టి యిది మహాకాళ జ్యోతిర్లింగమున కుప లింగము. ఇచట ననేక తీర్థచిహ్నములు గానవచ్చును.

"మహాకాల స్వయల్లింగం దుగ్ధేశ మితి విశ్రుతం" —శివపురాణము

ఈ మందిరమునకు పశ్చిమముగ 'సహాకోట్' అను 30 అ. ఎత్తుగల మెట్ట కలదు. ఇచట శివరాత్రికి, అధికమాసము వచ్చునప్పుడు పెద్దయుత్సవములు జరుగును. ఈ మందిర సమీపమున ననేకమందిరములు గలవు.

ఒకప్పు డీ దుగ్ధేశ్వర లింగమును త్రవ్వుటకు కొందరు యత్నించిరి, కాని యెంత త్రవ్వినను యీ లింగ మంతు దొరక లేదు. వర్తమానమునగూడ నొకానొక సమయమునం దీ లింగము 24 గంటలకాలము కదలుచునే యుండును. కాని తరువాత నెంత పట్టి కదల్చినను కదులదు.

## శ్రీ మానస సరోవరేశ్వరుడు

గోరఖ్‌పూరునగరమున, శ్రీ గోరఖ్‌నాథజీకి దక్షిణముగ మానససరోవరమను చెఱువుయొడ్డున ఈ మందిరముగలదు. ఇట కొన్ని దేవమందిరములు, యాత్రికుల బస కొక భవనము కలవు.

పూర్వ మీ చెఱువును మహారాజు మాన్‌సింగ్ త్రవ్వించెను. ఇచటనే మానసింహుని కోట యుండెడిది. మహారాజునకు శంకరుడు స్వప్నమున గాన్పించి, తన కాలయమును నిర్మించు మని చెప్పగా, మహారాజు ఈ లింగమును భూమినుండి తీయించి ఈ యాలయమున బ్రతిష్ఠించెను. శివరాత్రిసమయమునం దిచ్చట పెద్ద యుత్సవము జరుగును.

## శ్రీ ముక్తేశ్వరనాథ మందిరము

ఇది గోరఖ్‌పూరుకు దక్షిణమున, రాప్తీ నదీతీరమున కలదు. శ్రీ కృష్ణానందస్వామియను మహాత్ముడీ శివాలయమును గట్టించెను. ఈ ముక్తేశ్వరనాథుని సేవించిన, యపుత్రకులు పుత్రవంతులగుదురట. గొప్ప మహిమగల దైవము.

గోరఖ్‌పూర్‌నందు గల కల్యాణపత్రికా కార్యాలయము (గీతాప్రెస్), గీతాభవనము చూడదగినవి.



కబీరుదాసు

మగహార్:— గోరఖ్‌పూరు నుండి గోండా (జం) కు పోవుమార్గమున యిది కలదు. ఇచట కబీరు సమాధులు రెండు కలవు. కబీరుదాసు హిందూ మహమ్మదీయులకు సమానప్రియుడు. అందువలన వారిచ్చట వేర్వేరు సమాధులను గట్టిరి.

కహాలిలాబాద్:— మగహార్ నుండి కహాలిలాబాద్ స్టేషను చేరవలెను. ఇచటకు 5 మై. లో నొక మిట్టమీద థానేశ్వరనాథమందిరము కలదు. ఇచటకు 1 మైలు దూరమున 'కూద్వా' యను నది కలదు. సిద్ధార్థుడు విరక్తుడై కపిలవస్తు నగరమునుండి గుఱ్ఱముమీద నిచటకు వచ్చి, యీ నదియందు దుమికె నందురు. ఇచ్చటకు సమీపమున 3 బౌద్ధస్తూపములు కలవు.

ముండేర్వా:— కహాలిలాబాద్‌నుండి ముండేర్వా చేరవలెను. ఇచటకు 2 మై. దూరమున శిథిలావస్థలోనున్న బౌద్ధస్తూపము కలదు. ఇందు బుద్ధుని 8 అస్థులు కలవు. ఇటనుండియే

బుద్ధునిదంతములను తీసుకొనివెళ్ళి 'సిలోను'లోని 'కాండియా' యనుచోట నుంచిరని చెప్పుదురు. (చూ. సిలోను)

బస్తీ:— ముండేర్వానుండి బస్తీస్టేషను చేరవలయును. ఇచటకు 9 మై. లో గల చందోతాల్ నదీతీరమున రెండు బౌద్ధ స్తూప శిథిలములు కలవు. ఇది కపిలవస్తునగరమని కొందరిభ్రమ.

## నేపాల్

ఇది స్వతంత్ర దేశము. హిమాలయపర్వతపు లోయలందు వాగ్మతీ విష్ణుమతీ నదీతీరముల, సముద్రమునకు 4500 అ. ఎత్తున ఈ దేశము సుమనోజ్ఞప్రకృతి సౌందర్యముతో విలసిల్లు చున్నది. దీనికి రాజధాని ఖాట్మాండూనగరము. ఇచ్చటనే పశుపతినాథమందిరము మున్నగు తీర్థస్థానములు కలవు. అన్యదేశమగుటచే నిందుప్రవేశించుటకు నేపాల్ ప్రభుత్వముయొక్క అనుమతి పొందవలయును. కాని శివరాత్రికిమాత్రము 7 రోజులు యెట్టి యనుమతియు



శిల్ప కళా వైభవము

నవసరముండదు. అప్పుడు వివిధప్రాంతములనుండి యాత్రికులు వచ్చుచుందురు. ఇచ్చట చలి యధికమగుటచే ఉన్నివస్త్రము లవసరము. మార్గమంతయు అరణ్యములు, మంచుకొండలతో

నిండియుండును. ఆరోగ్యమును జాగ్రత్తగ కాపాడుకొనవలెను. మార్గములో క్రింది తీర్థస్థానములు అవశ్యము చూడదగినవి.

# జనకపురము

కాశీనుండి చుప్రా, హాజిపూరుమీదుగ దర్భాంగ (జం) చేరవలయును. ఇచ్చటకు పశ్చిమోత్తరముగ 26 మైళ్ళలో 'జనకపుర్ రోడ్' (ప్రస్తుతము పుపుడి) స్టేషను కలదు. స్టేషనుకు పూర్వోత్తరముగ 24 మై. లో జనకపురము కలదు. ఇదియే ప్రాచీనమగు మిథిల. ఇచట భరత, లక్ష్మణ, శత్రుఘ్న సమేతుడగు శ్రీరాముని మందిరము కలదు. ఇచటకు తూర్పుగ 'గంగా సాగరము, ధనుస్సాగరము' నను రెండు సరస్సులు కలవు. వీనికి సమీపమున శివాలయమును, సీతారామాలయమును గలవు. దక్షిణముగ 'రామసాగరసరోవరము' కలదు. ఇచ్చట 'రత్న సాగరము, దశరథసరోవరము, అగ్నికుండము' మొదలగు సరస్సులు కూడ గలవు. ఇచ్చట మొత్తము 72 కుండములు గలవని చెప్పుదురు. యాత్రికులు ముఖ్యముగ గంగాసాగరమున స్నానమాచరించి, మిగిలిన కుండములందలి జలమును శిరమున ప్రోక్షించుకొని స్వామిని యర్చింతురు.

ప్రతి చైత్ర ౯౫ కు జనకపురమున ఉత్సవములు జరుగును. ఆ సమయమున నేపాల్ నుండియు, భారతదేశమునుండియు వేలకొలదియాత్రికులు వత్తురు. మార్గశిర శు ౫ కి సీతారాముల కల్యాణము ఏనుగులు, గుఱ్ఱములపై నూరేగింపుతో జరుగును.

జనకపురమునకు 6 మై. లో నొక చెఱువువద్ద 'విశ్వామిత్ర' మందిరమును, 14 మై. లో నరణ్యమున 'ధనుషాబస్తీ'

యను గ్రామమున నొక పెద్ద రాతిధనువును కలవు. యాత్రికు లీ ధనువునుకూడ దర్శింతురు.

## గౌతమకుండము

పుపుడినుండి 'సీతామహి' పోవు లైనుమీద 'కమతౌల్' స్టేషను కలదు. ఇచ్చటకు 2 మై. దూరమున నొక చిన్న నదీతీరమున అహల్యామందిరము కలదు. ఇచట ప్రతి చైత్ర శు ౯ కి ఉత్సవము జరుగును. వేలకొలది యాత్రికులు వత్తురు.



బోధనాథమందిరము – నేపాల్.

**గౌతమ కుండము:—** కమతౌల్ కు పశ్చిమముగ 10 మై. లో గౌతమ కుండము కలదు. ఇందు 5 చిన్నకుండములు కలవు. వీనికి సమీపమున చిన్న నదియు, నృసింహస్వామి విగ్రహము కలవు.

**అహల్యా కుండము:—** గౌతమకుండమునకు ౩ మై లో అహల్యా కుండము గలదు. ఇచ్చట వటవృక్షము క్రింద అహల్యాదేవి చౌరాయు, సమీపమున దర్భాంగమహారాజు కట్టించిన శ్రీరామమందిరమును కలవు. గౌతమకుండమున, అహల్యాకుండమున స్నాన మాత్రముననే ముక్తి లభించును. ఇచట 'జనకకూపము' కలదు. ఇందు స్నానముచేసిన మనుజులు,

దేహావసానమున వైకుంఠమును బొందుదురు. శ్రీరాము డిచ్చటనే అహల్య నుద్ధరించెనని చరిత్ర కలదు.

## సీతామహి (ఢీ)

కమతౌల్‌నుండి సీతామహీస్టేషను చేరవలెను. స్టేషనుకు 1 మైలు దూరమున 'లషక్‌దేయీ' నదీతీరమున సీతామఢీ గ్రామము కలదు. ఈ నదియందు యాత్రికులు స్నానముచేయుదురు. ఇచట సీతాదేవిమందిరము, మరికొన్ని చిన్నమందిరములును గలవు. వీనియందు హనుమత్సీతాలక్ష్మణులే గాక, శివవిఘ్నేశ్వరులతోకూడిన శ్రీరామవిగ్రహము కలదు. ఈగ్రామమునకు 1 మైలుదూరమున 'పృక్‌ఉడా' గ్రామములో నొక సరోవరము కలదు. అయోనిజ యగు సీత యిందే యుద్భవించెనని చెప్పుదురు. ఇది చాల పవిత్రమైన స్థానము. యాత్రికు లిందు స్నానము చేయుదురు.

## పశుపతినాథము

ఈ దివ్యక్షేత్రము నేపాల్ దేశమునకు రాజధానియైన ఖాట్మాండూనగరమున గలదు.

**మార్గము:—** సీతామహీ స్టేషనునుండి రక్సౌల్ (జం) 51 మై లో దిగవలయును. దీనికి 30 మై. లో 'సిమరాచాసా', ఇచటకు 40 మై. దూరమున 'విచకీ', ఇటనుండి 46 మై. లో 'చుడియాఘాట్', దీనికి 52 మై. లో 'హిటాయీ', ఇచటకు 66 మై. లో 'భీమపదీ', దీనికి 71 మై. లో 'తాంబాఖీసీ', ఇక్కడకు 79 మై. దూరములో 'చిటంగ్', దీనికి 81 మై. లో 'ధాక్‌కోట', దీనికి 90 మై. లో ఖాట్మాండూనగరము కలదు.

ఈ పై ప్రదేశములందంతట నివసించుటకు తగు సౌకర్యములు, భోజనాది వసతులు గలవు. చాలమంది గోరఖ్‌పూర్ నుండి వెళ్లుచుందురు. మిక్కుటమగు చలిప్రదేశమగుటచే ఉన్ని వస్త్రములు, ఆరోగ్యముచేకూర్చు మందులు అవసరము.

ఖాట్మండూ నగరమునకు పూర్వోత్తరములందు గల ద్వారమునకు దక్షిణముగ - ప్రతాపమాలీమహారాజు, ఆయన భార్యయు నిర్మింపజేసిన 'రానీపోఖరీ' (చెరువు) గలదు. ఈ చెరువుకు మధ్య నొక మందిరము కలదు. రాజభవనమునకు సమీపమున 'తాలీజూ' మందిరము కలదు. ఇందు కేవలము రాజవంశీయులే పూజ చేయుచుందురు. వాగ్మతీనదీతీరమున 'ముకుందనాథాలయము' కలదు. ముకుందనాథస్వామిని నేపాల దేశీయులు తమ దేశ సంరక్షకుడుగ భావింతురు. మేషసంక్రాంతి సమయమునందు ముకుందనాథస్వామికి రథోత్సవము జరుగును.



పశుపతినాథ్ దేవాలయము

పశుపతినాథమందిరము:— మహారాజభవనమున కుత్తరముగ 2 మై. లో పశుపతినాథమందిరము గలదు. ఇందు పశుపతినాథమహాదేవుని స్వర్ణవిగ్రహము కలదు. శివుని యష్టమూర్తులలో నిది యొకటి, ఇది యజమానలింగము. శివుని 108 దివ్యదేశములలో కూడ నిది యొకటి. ఈ విగ్రహము కటిప్రదేశము వరకు (ఉపరిభాగము) కలదు. ఇందర్చకుడు తప్ప యితరులు (నేపాలదేశాధీశుడుకూడ) ప్రవేశించుట కనుమతిలేదు. పశుపతి

నాథమహాదేవుడే నేపాలదేశమునకు వాస్తవిక చక్రవర్తియనియు, నేపాల్ నరేశు డీతని మంత్రియనియు ఈ దేశీయులు భావింతురు.



భవానీమందిరము

శివరాత్రిసమయమున, వచ్చిన యాత్రికులకు తమ కోరికకొలది వస్త్రములు, కంబళ్లు, పాన పాత్రలు నేపాలనరేశులు వితరణము చేయు దురు. పశుపతినాథుని సమీపమున పరశువేది (లోహమును బంగారు చేయు శక్తి) కలదని యాత్రికులు చెప్పుకొందురు. పశుపతినాథ మహాదేవుని మహాత్మ్యము శివ, లింగ, వరాహ పురాణములం దధికముగ వర్ణింపబడినది.

## గుహ్యేశ్వరి

శ్రీ పశుపతినాథ్‌కు రెండుఫర్లాంగుల దూరమున నేపాల్ దేశమున కధిష్టానదేవతయగు 'గుహ్యేశ్వరి' మందిరము వాగ్మతీ నదీతీరమున గలదు, నేపాల్ దేశీయులందరు ఈదేవియెడల మిగుల భక్తిశ్రద్ధలు చూపుచుందురు. దేవీనవరాత్రములకు మహారాజు నిత్యము స్వయముగ పరివారసహితుడై ఈ దేవిని దర్శించును. భారతదేశమందలి ప్రధాన శక్తిపీఠములం దిది యొకటి.

## ముక్తినాథము

ఖాట్మండూ కుత్తరమున గండకీ నదీతీరమున ముక్తినాథ క్షేత్రము గలదు. ఈ నదినుండి యాత్రికులు సాలగ్రామముల తీయుదురు. దీనిని 'నారాయణీనది' యనికూడ పిలతురు. ముక్తి నాథాలయమువద్ద చిన్నచిన్న దేవమందిరములు చాల గలవు.

ఇచ్చట వేడినీటిధారలు గండకీనదిలో పడుచుండును. అందు 'అగ్నికుండ' మను ధార యొక్క మందిరాంతరమునుండి వెలువడు చున్నది. ముక్తినాథమును సాలగ్రామక్షేత్రమనికూడ పిలతురు.



ప్రధాన జైనమందిరము – పాపురా.

(వింధ్యప్రదేశములోని టీకమ్‌ఘడ్ జిల్లాలో "పాపురా" అను గ్రామమునందు క్రీ. శ. 13, 16 శతాబ్దములలో నిర్మింపబడిన 30 జైనదేవాలయములు కలవు. ఇచ్చటకు లలితపురమునుండి టీకమ్‌ఘడ్ మీదుగ వెళ్ళవలెను. చూ. 495 పేజి)

ఇచట శ్రీ మహావిష్ణువునకు శంకరుడు ప్రసన్నుడయ్యెను. గండకీ నదియందు స్నాన తర్పణములు చేసిన నధికపుణ్యము కలదు. ఇచ్చట మృతి నందిన విష్ణుసాయుజ్యము లభించును. గరుడ, కూర్మ, వరాహ, పద్మ పురాణములం దీ క్షేత్రమహాత్మ్య మధిక ముగ వర్ణింపబడిన యనేకగాథలు కలవు.

## వరాహక్షేత్రము

నేపాల్ దేశమున 'కోశీ' నదీతీరమున 'ధవళగిరిశిఖరము'న వరాహక్షేత్రము కలదు. దీనిని 'కోకాముఖమని'కూడ పిలతురు. ఇచట నొక మందిరమున 'చతుర్భుజ వరాహ' మూర్తి కలదు. మందిరమున కుత్తరమున 'కోబరా' నది ప్రవహించుచున్నది. యాత్రికు లిందు స్నానముచేసి వరాహమూర్తికి అభిషేకము గావింతురు. ఇచ్చట కార్తిక శు ౧౫ కు నాలుగురోజులు ముందు నుండి ఒక వారమురోజులు ఉత్సవము జరుగును. ఇచటకు 3 మై. దూరమున 'సూర్యకుండ' మను సరస్సు కలదు. ఇచట కోశీనది షుమారు 225 మై. దూరము ప్రవహించి భాగల్‌పూరుజిల్లాలో గంగానదిలో కలియుచున్నది. ఇది చాల పవిత్రమైనది.

వరాహక్షేత్రమున 'వరాహరూపమున' శ్రీమహావిష్ణువు నివసించుచుండెను. ఇట స్నానము, వరాహమూర్తి పూజయు చేసినమనుజునకు 'అగ్నిష్టోమ' యజ్ఞఫలము కలుగును. 12 దినములు వరాహమూర్తిని ఆరాధించినమనుజుడు విష్ణుసాన్నిధ్యము పొందునని మత్స్యపురాణమున గలదు.

## డార్జిలింగ్

కలకత్తానుండి డార్జిలింగ్ 369 మైళ్లు. విమాన ప్రయాణము 2 గంటలు. రైలుమార్గముకూడ కలదు. ఈ మార్గమున మధ్య సిలిగురిలో బండి మారవలయును. రైలు 40 మైళ్ళు ప్రయాణములో 7000 అ. ఎత్తుకు చేరును.

ఇది సముద్రమట్టమునకు 7000 అ. ఎత్తున హిమాలయ పర్వతప్రదేశములలో గల ఉత్తమవిశ్రాంతి కేంద్రము. ఇటనుండి

140 మై. దూరములోనున్న 28168 అ. ఎత్తుగల కాంచనగంగ, ఎవరెస్టు శిఖరములను చూడవచ్చును. ఈ శిఖరములు సూర్య కాంతిలో, చంద్రకాంతిలో వివిధరంగులతో నాకర్షణీయముగ నుండును. డార్జిలింగ్ పరిసరముల ప్రకృతి రమణీయమైనది. ఒక సారి చూచిన జీవితమంతయు స్మరణీయము. అల్ప్సు పర్వత సౌందర్యముకంటె ఇవి సౌందర్యవంతములు. సుందరదృశ్యముల మధ్య ప్రయాణీకులకు స్వాగతమిచ్చు డార్జిలింగ్ — పూలమైదానములతో, జలపాతములతో, సరస్సులతో, ఉన్నతపర్వత శిఖరములతో యాత్రికులకు నూతనోత్తేజమును కలుగజేయును.

ఇచటి ప్రజలు కొండజాతివారు. వివిధరంగుల దుస్తులు ధరింతురు. చెప్పాజాతివారు, టిబెట్టు దేశీయులు, భూటియాలు యిట కనుపింతురు. ఇచట వీరు బరువైన యాభరణముల ధరింతురు. ఇట్లు వివిధజాతులతో డార్జిలింగ్ విలసిల్లుచుండును. అనేకములైన వేటలు, కొండజాతివారి నృత్యములు యాత్రికులకు ఉత్సాహమును, ఉల్లాసమును కలుగజేయును. డార్జిలింగ్ విస్తీర్ణము 4 చ. మైళ్లు. జనసంఖ్య సుమారు 34 వేలు. శీతాకాలములో చలి విపరీతముగా నుండును. ఏప్రియల్, మేనెలలు లేక అక్టోబరు, నవంబరునెలలలో నీప్రదేశము చూచుటకు యోగ్యముగా నుండును. ఇచ్చట చక్కని భోజనవసతులు గలవు.

## చూడదగిన దృశ్యములు

మహాకాల్:— డార్జిలింగ్, స్టేషనుకు 361 అ. ఎత్తున గలదు. దీనినే 'మహాకాల్' అందురు. క్రీ.శ. 1835 లో నిచ్చట 20 గుడిసెలు, 100 మంది ప్రజలు గలరు. క్రమముగ నభివృద్ధి

చెందెను. ఇచటి మహాకాల్‌గుహ చూడతగినది. ఇచ్చటనుండి 'కాంచనగంగ' మనోహరదృశ్యము కాంచనగును.

లాయడ్స్ బొటానికల్ గార్డెన్సు:— ఇది 14 ఎకరముల విస్తీర్ణముగలది. ఇక్కడ హిమాలయపు వృక్ష జాతులన్నియు కలవు. పై భాగమున స్వదేశపుమొక్కలు, చెట్లు, క్రిందిభాగమున వివిధదేశపు వృక్షములు గలవు.



కాంచనగంగ సుందరదృశ్యము

ప్రకృతివిచిత్ర వస్తుప్రదర్శనశాల:— ఇచ్చట సిక్కిం ప్రాంతమున గల చారిత్రక నమూనాలు, హిమాలయములందు సంచరించు పక్షిసముదాయములు గలవు. చూడదగినవి.

టైగర్‌పర్వతము:— ఇచట సూర్యోదయ సూర్యాస్తమయ దృశ్యములు మనోహరముగా కానవచ్చును.

బౌద్ధసన్యాసాశ్రమము:— ఇచట 11 శిరములు, వేయి బాహువులు గల బెంగాలీదేవుని విగ్రహము గలదు.

ఘూమ్ అను సన్యాసాశ్రమము:— ఇచ్చట మైత్రేయ, బుద్ధుని విగ్రహములు, 16 సంపుటములు గల బౌద్ధశ్రుతులు, అమూల్యమైన శిలాఖండములు సందర్శనీయములు.

చౌరస్తా:— దీనికి దిగువభాగమున దేశబంధు చిత్తరంజన దాసు గృహము కలదు. (ప్రస్తుతము దీనిని జాతీయ వస్త్రప్రదర్శనశాలగా మార్చిరి.) తప్పక చూడతగినది.

విక్టోరియా జలపాతము, విక్టోరియా వంతెన, ప్రభుత్వ మందిరములు, కొండమీదగల విశ్రాంతిస్థలములు, అనేకరకము లైన యితర ఆకర్షణీయప్రదేశములు చూడతగినవి.

## అస్సాం

ఇది హిందూదేశమునకు పూర్వోత్తరమున గలదు. ఈ దేశము బ్రహ్మపుత్రానదీపరిసరములందు వ్యాపించి 50048 చ. మైళ్ళ విస్తీర్ణము, 1 కోటి 10 లక్షల జనాభా కలిగియున్నది. మొన్నమొన్నటివరకు వెనుకబడియున్నందున నీ ప్రాంత పురోభివృద్ధికై ప్రభుత్వము వారు పలురకముల యత్నించుచుండిరి.

గౌహతి, టెచ్‌పూర్, బాక్‌పేట, జోర్‌హాట్, శివసాగరము, నూనెగనులకు నిలయమైన డిబ్రునగర్ మొదలగునవి ఈ దేశమునందలి ప్రధాననగరములు. షిల్లాంగ్ దీనికి రాజధాని. నాట్య సంగీతములకు పేరెన్నికగన్న 'మణిపురము' కూడ నీ ప్రాంతమునందలిదే. వర్షాధిక్యమునకు ప్రసిద్ధిగాంచిన 'చిరపుంజి' (ఇచట సం॥నకు 426 అం. వర్షము కురియును) షిల్లాంగ్‌లోనిదే. ఈ దేశమున కామాఖ్య మొదలగుక్షేత్రములు, ప్రాచీన శిథిలములు, ఆటస్థలములు, ప్రకృతిదృశ్యములు మొదలగునవి పుణ్యా




ఆసియాయందలి రైలుపెట్టెలనిర్మాణ కర్మాగారములలో కెల్ల పెద్దదగు "పెరంబూరు" (మదరాసు) కర్మాగారమున ప్రప్రథమమున తయారైన రైలుపెట్టెను ఇండియా ప్రధానమంత్రి గా॥ శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ విద్యుత్ బొత్తాము నొక్కి ఆవిష్కరించినప్పటి దృశ్యము.

దాయకములు, ఆనందదాయకములు ననుట యతిశయోక్తి కాదు. అస్సాములో బహుశః ఆఫ్రికా, బర్మాలలో తప్ప ప్రపంచములో కెల్ల మిన్నయైన అనేక రకముల క్రూర మృగములు కలవు. ఇచట జంతుప్రదర్శనశాల చూడదగినది. కాని ఏప్రియల్ నెల మొదలు ఆగష్టునెల వరకు వర్షాధిక్యమున మార్గములు బాగుగ నుండవు. అందుచే తదితరసమయములందే యాత్రికు లీ దేశమును చూచుట మంచిది. రైలుమార్గమున్నను బస్సుమీద ప్రయాణించిన వివిధగ్రామములను, నగరములను, వాటి రామణీయకతను దర్శించవచ్చును. అస్సాములో 64 భాషలవారున్నారు. ఉష్ణదేశీయుల కీ దేశము మనోహరముగ నుండును.

## గోహటీ

ఈ నగరము అస్సామునకు సింహద్వారమువంటిది. భారత యుద్ధ ప్రసిద్ధుడగు భగదత్తుడు పాలించిన ప్రాగ్జ్యోతిష నగర మిదియే. భూరుహ, భూధర సమూహముచే నీ పరిసరము మిక్కిలి మనోహరముగ నుండును. ఇచ్చటికి 2 మై. లో పశ్చిమమున నీలగిరి లేక నీలకూటమను పర్వతమునందొక ప్రసిద్ధ దేవీ పీఠము గలదు. ఇది భగవతి 'కామాఖ్యా' లేక 'కామాఖ్యా' యను పేర ప్రసిద్ధమైనది. కాళికాపురాణము ననుసరించి ఇచ్చట సతీదేవియొక్క 'యోని' పడెను. (చూ. మణికర్ణిక) ఇది భారత దేశమునంగల శక్తిక్షేత్రములలో 51 వది. ఇచట శక్తి సంబంధములగు ననుష్ఠానములు సిద్ధిపొందినటు లన్యత్ర సిద్ధించవు. ఇట ప్రధానతీర్థ మొక చీకటిగుహయందు కలదు. యాత్రికు లిచ్చట పండాలగృహమందు నివసింతురు.

కామాఖ్యాలయము శిల్పసంపదచేనలరారుచున్నది. మధ్య కాలమున తురకలచే నాశనముచేయబడినది. శిల్పశిలాఖండములు కానవగును. ఈ ప్రాంతమందింకను కొన్ని మందిరములు కలవు.

పూర్వగాథ:—ఈ యాలయము నరకాసురునిచే నిర్మితమని ప్రసిద్ధి. పూర్వము నరకాసురుడు వరబలముచే రాజ్యము నేలుచు పరమేశ్వరిని తన్ను వివాహమాడుమని కోరగ, దేవి "ఈ సరస్సుమధ్య సర్వసౌఖ్యములుగల నాకొక యాలయ మొక రాత్రిలో నిర్మించిన, నీకోరిక తీర్తు"నని చెప్ప, వాడందుల కియ్యకొని ఆలయనిర్మాణము ప్రారంభించగ అమ్మవారు అర్థరాత్రి సమయమున కోడిని కూయించెను. అందుచే నరకుడు పరాజితుడాయెను. ఇచట భాద్రపద, ఆశ్వయుజ, మాఘమాసములలో నుత్సవములు జరుగును. ఈ క్షేత్రమహిమ దేవీభాగవత, పద్మ, శివపురాణములలో వర్ణింపబడెను.

అన్యములు:— హైకోర్టున కెదుట బ్రహ్మపుత్రానది యందు నెమళ్ళద్వీపమునగల ఉమానందదేవాలయము, భువనేశ్వరమందిరము, డిప్యూటీకమీషనర్ బంగళావద్ద గల నదీదృశ్యము, శుక్రేశ్వరనదీతీరమున గల బుద్ధజనార్దన విగ్రహము, పాండూవద్దగల రైల్వేకర్మాగారము, ఓడకర్మాగారము, నదీదృశ్యములు, కృత్రిమసరస్సులు, ఉన్నతన్యాయస్థానము, వస్తుప్రదర్శనశాల, చారిత్రకపరిశోధన కేంద్రము, గంభీరమైన జలపాతములు, లోయలు, ఉన్నతపర్వతాగ్రములు, ప్రభుత్వ భవనములు, భీకరమృగముల కాటపట్టయిన సాంద్రారణ్యములు అవశ్యము దర్శనీయములు.

ప్రక్క చిత్రము:— 1955 సెప్టెంబరులో ఇండియా ప్రెసిడెంటు డాక్టరు. రాజేంద్రప్రసాదు జమ్మూ - కాశ్మీర్ పర్యటన సందర్భమున, శ్రీనగరులో వారిని ఝీలంనదిపై నౌకలో ఊరేగింపు జరిపినప్పటి దృశ్యము.

---

## షిల్లాంగ్

ఇది గౌహాతికి 63 మైళ్ళు. బస్సుమీద 3 గం. ప్రయాణము. షిల్లాంగ్ 5000 అ. ఎత్తుగల పీఠభూమిపై నిర్మింపబడెను. ఇది అస్సాముకు రాజధాని. కలకత్తానుండి గౌహతి 310 మైళ్ళు. విమానమునకు రు 72/–, రైలుకు రు 22/– చార్జి అగును. గౌహతి నుండి షిల్లాంగ్ 63 మైళ్ళు. బస్సు కలదు. కలకత్తా నుండియు బస్సులు కలవు. బస్సుమార్గము ఆనందదాయకము.

ఇచ్చటి జలపాతములు, స్త్రీలుమాత్రమువర్తకముచేయు 'బుర్రాబజారు', ఆటస్థలములు, సెక్రటరీయేట్ భవనములు, మిషను ఆసుపత్రులు, రేస్‌కోర్సులు మొదలైనవి చూడతగినవి. ఇందు సర్వసౌకర్యములుగల హోటళ్ళు గలవు. 1897 సం॥మున వచ్చిన భూకంపమువలన నీ నగరమంతయు నాశనమయ్యెను. అందుచే నిచ్చటియిండ్లను ఉక్కుతోను, కొయ్యతోను నిర్మించుకొనిరి. నాగులు, కాశీలు, లుషీలు అనబడువా రిచ్చట నివసించుచుందురు. ఇచట స్త్రీలకు స్వాతంత్ర్య మెక్కువ.

## మణిపురము

గౌహాతినుండి 'మణిపురంరోడ్డు' స్టేషను వరకు రైలు. అటనుండి బస్సులు కలవు. బస్సు నాగపర్వతములగుండా పోవును.

ఈ పర్వతములందు నాగజాతివారుందురు. అస్సాములో యిది సి. తరగతి రాష్ట్రము. మణిపురనాట్యమునకు ప్రత్యేకత కలదు. నేతపనియం దీ ప్రాంతము మిగుల నున్నతిగాంచినది. ఇచ్చటిదే యగు 'క్షోహిమా'యను నగరమున ద్వితీయ ప్రపంచసంగ్రామ సమయమున జపానువారు ప్రవేశించిరి. ఇచ్చట నొక రాతిపై రణనిహతులగు వీరుల స్మృతిచిహ్నముగ "వారి రేపటికొరకు మా నేటిని త్యాగముచేసితిమని నీవు ఇంటికి వెడలినపుడు వారితో జెప్పుము" అని వ్రాయబడియుండెను.

## బ్రహ్మపుత్రాక్షేత్రము

గోహాటీనుండి రంగపురముస్టేషను చేరవలయును. దీనికి పూర్వోత్తరముగ 11 మై. లో 'తిస్తా' నదీతీరమున 'కానియా' యను స్థానమునకు 6 మై. దూరమున 'తిస్తా' యను గ్రామము కలదు. ఈ గ్రామమునకు 16 మై. లో 'కురీ' గ్రామము, దీనికి దక్షిణ పశ్చిమమునందు బ్రహ్మపుత్రానదియొక్క 'చిలమారీ ఘాటు' కలదు. ఇదియే బ్రహ్మపుత్రాక్షేత్రము. ఈ ఘట్టమున ప్రతి చైత్ర శు ౮ కి చాలమంది యాత్రికు లరుదెంచి స్నాన తర్పణములు గావింతురు. స్నానముచేసి మరల వెనుకకు తిరిగి చూడరాదు. జమదగ్నికుమారుడగు పరశురాము డీ స్థానమును ప్రవేశించగనే మాతృహత్యాదోషమునుండి విముక్తి నొందెనట. ఇది మిక్కిలి పవిత్రమగు ప్రదేశము.

## శివసాగరము

రంగపురమునుండి శిల్ ఘాట్ బోను మీదుగ నిచ్చటకు చేరవలయును. ఇది జిల్లాకు ముఖ్యపట్టణము. జనాకర్షకములైన

ఆటస్థలములు, ప్రపంచములో మిక్కిలి పెద్దదైన 'మజులి' నదీ ద్వీపము, వ్యవసాయకళాశాల, యంత్రాగారములు యిచ్చట ముఖ్యముగా చూడదగినవి.

బ్రహ్మపుత్రానదీ దక్షిణకూలమునుండి 8 మై. లో ఒక చిన్న నదీతీరమున 'శివసాగర' మను పేరుగల నగరము గలదు. ఇచట నొక పెద్దచెరువు కలదు. రుద్రసింహమహారాజు కుమారుడగు 'శివసింహుడు' 114 ఎకరముల భూమిని త్రవ్వించి, యీ చెరువును నిర్మించెనని చెప్పుదురు. అందుచే దీనికీ పేరు వచ్చెను.

శివభక్తుడగు శివసింహుడు భగవదాదేశానుసార మీ సరోవరతీరమున యష్టదళకమలాకారముగ నొక శివాలయమును క్రీ.శ. 1720 లో కట్టించెను. ఈ స్వామిపేరు ముక్తినాథుడు. శివసింహుడీ మందిరశిఖరమున 1 మణుగు బంగారముతో స్వర్ణ కలశమును జేయించి యలంకరించెను. పిమ్మట యవనులీ కలశము నపహరించుటకై ఆలయమును సమీపించగనే వారికనేక సర్పములు గానవచ్చెను. అందుచే వారు భీతిచెంది వెనుదిరిగి పోవుచు ఫిరంగులచేత నీ శిఖరమును గాల్చిరి. నాటి ఫిరంగిదెబ్బ లీ మందిర స్వర్ణకలశమున నేటికిని కానవచ్చును.

ఇచ్చట నొక విష్ణుమందిరమును, దేవీమందిరమునుగూడ శివసింహుడు కట్టించెను. క్రీ.శ. 1904 లో శివరాత్రి ప్రాతఃకాలమునం దీ శివసాగర జలమంతయు ముక్తినాథ మహాదేవుని మహిమవలన పాలుగ మారిపోయెనని చెప్పుదురు. ఈ ప్రదేశము చాల రమణీయముగా నుండును.

## పరశురామకుండము

గౌహతికి 9 మై. లో యీ పరశురామకుండము గలదు. పూర్వము దీనిని 'బ్రహ్మ'కుండమని పిలచెడివారు. ఈ కుండమునకు నలుదెసల పర్వతములు కలవు.

పూర్వము పరశురాముడు ఇరువదియొక్క పర్యాయములు క్షత్రియులను నాశనముచేసి యీ బ్రహ్మకుండమున తన యాయుధమగు 'పరశువును' (గండ్రగొడ్డలి) విసర్జించి, తపమాచరించి, తానుచేసిన క్షత్రియహత్యాపాపమునుండి విముక్తుడయ్యెనని చెప్పుదురు. నాటినుండియే యిది పరశురామకుండమయ్యెను. ఇది చాల పవిత్రమగు ప్రదేశము.

## సీతాకుండము

శివసాగరమునుండి లుమ్డింగ్ (జం), లక్సమ్ (జం) మీాదుగ చటగాంగ్ పోవు మార్గమునందు సీతాకుండ్ స్టేషను కలదు.

ఇచ్చట నొక పర్వతశిఖరమున సీతాకుండము కలదు. ఈ కుండము సముద్రతలమునకు 1155 అ. ఎత్తున గలదు. ఇందలి జల మెల్లపుడు నుష్ణముగ నుండును. ఈ జల సమీాపమునకు వెలుగుచున్న దీపమును తీసికొనివెళ్ళిన, జలమునుండివచ్చు ఆవిరి మందుసామానువలె మండును. భారతదేశముయొక్క నలుమూలలనుండి యాత్రికులు ఇచ్చటకు వచ్చుచుందురు.

## బలవాకుండము

సీతాకుండ్ స్టేషనుకు 4 మై. దూరమున 'బలవాకుండ్' స్టేషను కలదు. దానికి సమీాపముననే 'బలవాకుండ్' అను ఒక

ప్రసిద్ధ తీర్థస్థానము కలదు. ఈ కుండమున జలోపరిభాగమున జ్వాలాముఖివలె అగ్ని ప్రజ్వరిల్లుచుండును. ఇచ్చట కనేకులు యాత్రికు లరుదెంచుచుందురు.

## కచ్

అహమ్మదాబాదు నుండి నాంక్ నేరు (జం) మీదుగ కాండ్లా(జం) చేరవలయును. కచ్ తొలుత స్వతంత్రసంస్థానము. 1948 సం॥న ఇండియాలో ఒకరాష్ట్రముగా నేర్పడెను. ఇది ఇండియాకు పశ్చిమోత్తరమున సింధునదికి దిగువ కలదు. దీని వైశాల్యము సుమారు 16726 చ. మై. జనాభా 567610. ఈ రాష్ట్రమున ఖనిజములు పుష్కలముగా గలవు.

### దర్శనీయములు

భుజ్:- ఇది రైల్వేస్టేషను. ఇంతటితో రైలు సమాప్తము. ఇది కచ్‌కు రాజధాని. ఇచ్చట ప్రభుత్వ కార్యాలయములు, పురాతనవస్తువులు, చారిత్రకమైన కచ్‌రాజుల స్మారకచిహ్నములు, క్రీ.శ. 1718 లో నిర్మించిన కోటయు; కేరాలోని లక్ష్మీశ్వరమందిరము, క్రీ.శ. 1346 నాటి శాసనములు; కోటీశ్వరములోని రామాయణ కాలమునాటిదని చెప్పబడు కోటేశ్వర మహాదేవమందిరము; మంజల్‌లోని 1000 సం॥లకు పూర్వము హాక్ పులానీసోదరుడగు పునవర్ణునిచే నిర్మింపబడిన పునవరునోగడ; నారాయణసరములోని హిందువుల పవిత్రక్షేత్రమగు నారాయణ సరోవరము; మణియర్ గ్రామములోని రాజపుత్రులచే మణి

యర్ అను పర్వతమున కట్టబడిన కోట; రామ్‌పురు వేలలోని గుతుముఖకుండము (ఇచట కార్తీక శు ౧౫ కి ఉత్సవము జరుగును); దేవీపుర్‌లోని చూపరుల కు తేజము కలిగించు ప్రకృతి దృశ్యములు; మాతోనామద్‌లోని ఆశాపుర దేవాలయము; భద్రేశ్వరులోని జైనపుణ్యక్షేత్రమగు భద్రేశ్వరము; హాజీపీరు గ్రామములోని హాజీపీరు సంత (ఇది మహమ్మదీయ పుణ్యక్షేత్రము) మొదలైనవి ముఖ్యముగ చూడతగినవి.

## నారాయణ సరస్సు

'భుజ్' రాజధానికి పశ్చిమోత్తరముగా 'కచ్' రాజ్యమున సింధునదికి తూర్పుగ నారాయణసరమను నొక గ్రామమున నారాయణ సరస్సు గలదు. ఇచ్చట 'ఆదినారాయణ, గోవర్ధననాథ, లక్ష్మీనారాయణ' మందిరములు కలవు. ఇచ్చట చాలమంది యాత్రికులు తమ గుండెలపై ముద్రవేయించుకొందురు. ఇటకు 1 మైలు దూరమున 'కోటేశ్వర, నీలకంఠేశ్వర' మందిరములు గలవు. అచ్చట యాత్రికులు తమ కుడిభుజముపై ముద్ర వేయించుకొందురు.

శ్రీమద్భాగవతమునం దీ క్షేత్ర మాహాత్మ్యము ఇట్లు వర్ణింపబడెను. దక్షప్రజాపతికి 10 మంది కుమారులు జన్మించిరి. వారి నాతడు సృష్టికార్యమున నియోగించెను. వారందరు నారాయణ తీర్థమునకు వచ్చి సృష్టికాముకులై తపము చేయుచుండ, నారదుడు వారివద్దకు వచ్చి ప్రవృత్తిమార్గము కంటె నివృత్తిమార్గము శ్రేష్ఠమైనదని ముక్తిమార్గమునుపదేశించి సృష్టికార్య

విరతులం గావించెను. మరల దక్షునకు 1000 కుమారు లుద్భవించిరి. వారినికూడ నాతడు సృష్టికార్యమునకు నియోగించెను. వారును నారాయణతీర్థమునందే తపము చేయుచుండిరి. నారదుడు మఱల వారికిని ముక్తిమార్గము నుపదేశించెను. ముక్తి నొందగోరువారికి నారాయణతీర్థ మవశ్యము సేవించదగినది.



మేజర్ జనరల్. R. E అశరప్పగారు

వీరు మేజర్ జనరల్ H. విలియమ్స్గారి పదవీ విరమణానంతరము వారి పదవి నలంకరించిన ప్రథమభారతీయులు. వీరు గత మహాసంగ్రామమున ఇరాక్, పర్షియా, ఇటలీ, బర్మా, మలయా మున్నగు ప్రదేశములలో ప్రదర్శించిన వీరోచిత కృత్యములు చిరస్మరణీయములు.

బ్రహ్మవైవర్తమునందీ క్షేత్రమహాత్మ్య మధికముగ నిట్లభివర్ణింపబడెను. పూర్వము చంద్రుడు దేవగురువగు బృహస్పతిభార్య తారను భాద్రపదశుద్ధ చతుర్థినాడు హరించి భాద్రపద బహుళ చతుర్థినాడువదలివైచెను. అప్పుడు తార, నీవు సదా కళంకివై యుందువనియు, నీ ముఖము చూచినవారికి పాపము వచ్చుననియు చంద్రుని శపించెను. అంత చంద్రుడు నారాయణతీర్థమున నారాయణునిగూర్చి తపము గావించెను. నారాయణు డాతనికిప్రత్యక్షమై 'నిన్ను భాద్రపద శుద్ధచవితి

నాడు చూచిన పాపము కలుగునుగాని యితర దినములందా దోష ముండ'దని వరమిచ్చెను. ఈ సరమున స్నానము గావించి నారాయణుని పూజించిన మనుజుడు సర్వపాప విముక్తుడగును.

## సింహళము (సిలోన్)

(లంకలోని తీర్థవివరములు యాత్రచేసిన ఒక మహాత్మునివలన సంగృహీతము. ఇందలి చిత్రములు, మరికొన్ని విశేషములు ఇటీవల సింహళయాత్ర చేసి వచ్చిన మా మిత్రులు శ్రీ సంకా వెంకటసుబ్బారావుగారివలన లభ్యములు. వీరల కెంతయు కృతజ్ఞతలు.)

ఇది భారతదేశమునకు దక్షిణమున సముద్రమున గలదు. ఈ లంక రావణుని లంక కాదనియు, నది యింకను దూరమున గలదనియు నటకు మనము వెళ్ళలేమనియు భ్రమించుచుందురు. ఈ వివాదాస్పదవిషయ మిట చర్చనీయముకాదు. ప్రస్తుతము సిలోన్ లేక సింహళమని పిలువబడు ద్వీపమునగల క్షేత్రములను గురించియే యిట ప్రస్తావింపబడుచున్నది.

రామేశ్వరమునకు దక్షిణోత్తరమున 'మండపమ్' అను స్టేషను కలదు. ఇచట సింహళప్రభుత్వ కార్యాలయము కలదు. సింహళమునకు వెళ్ళగోరువారు ప్రథమమునం దిచ్చట అనుమతి పత్రమును (Pass-Port) పొందవలయును. వారు టీకాలువేసి 2 దినములు పరీక్షింతురు. తరువాత యాత్రికునివద్ద రు 50/– జామీనుక్రిందతీసుకొని అనుమతిపత్రము నొసంగుదురు. పిమ్మట మండపమ్‌నుండి ధనుష్కోటివరకు రైలు, అచ్చటనుండి స్టీమరు మీద ౩ గంటలు ప్రయాణము చేసి సింహళములో 'తలై

మీనార్' ఓడరేవులో దిగవలయును. సింహళ రాజధానియగు కొలంబోలో దిగవలయునన్న 18 గంటలు ప్రయాణము.

మదరాసునుండి కొలంబోకు విమానమార్గము, సముద్ర మార్గము కలదు. మదరాసు నుండి జాఫనా పట్టణము చేరవలయును. జాఫనాలో తమిళులు లెక్కువగ కలరు. విమానపు చార్జి రు 55/- లు. సింహళమున తరచు రాత్రిళ్లు భోజనముచేయరు. నెయ్యి, మజ్జిగ తక్కువ. ఇచ్చట స్వర్గసౌఖ్యమును మరపించు సర్వసౌఖ్యములు గలిగి జగత్ప్రసిద్ధములైన 3 హోటళ్లు గలవు. రోజు 1కి రు 300/- వరకు తీసికొనునవికూడ కలవు.

లంకలోని వాతావరణము సమశీతోష్ణముగ నుండును. ఇచ్చటి జనులందరు సుఖజీవనులై యుండిరి. ఇట బౌద్ధు లధికముగ గలరు. హిందువులుకూడ గలరు. ఇచ్చట సింహళము, ఇంగ్లీషు, సంస్కృతము వ్యావహారికభాషలు.

## సింహళ పరిచయము

తొలుత సింహళదేశపు ప్రయాణ కేంద్ర శాఖయందు యాత్రాసమాచారమంతయు తెలుసుకొనవలయును. పిమ్మట సింహళదేశపు రాజకీయ, వాణిజ్య కేంద్రమగు కోట, ఈ దేశపు ఉత్పత్తి వస్తుశాలలు, యాత్రికులను ఆకర్షించు ఇందలి వివిధ చేతిపనులు, సామానులు, చర్చివీధిలోని సెంట్ పీటర్సు చర్చి (దీనిని డచ్చివారు ఒకానొకప్పుడు సభామందిరముగ నుపయోగించిరి), దీనివెనుక రమణీయమైన కోట, దానివెనుక రాణీవీధి, రాణిగృహము, దానివెంబడి గార్డెన్ తోటలు, దీని కెదురుగా పార్లమెంటులోని శాసనసభ, దానికి సమీపమున క్రీ. శ. 1857

లో కట్టబడిన గడియారపు స్తంభము, తరువాత కొంచెము ముందుకునడిచి వంతెనదాటిన, సమీపమునగల లవంగవనములు, వీనిమధ్య గల విక్టోరియాపార్కు, ఈ తోటలోని మదారాచెట్టు (దీనిబెరడు విషపూరితముగానుండును. ఇది మచ్చికకాని గజము లపై తనశక్తిని చూపును), బాల్సాచెట్టు (ప్రపంచములో కెల్ల మిక్కిలి తేలికైనచెక్క. దీనిని విమాననిర్మాణమునకు ఉపయోగింతురు. ఇది ఇచట లభించును.) ఈరీతిగ వివిధ తరు లతా వస్తు వితానములతో సింహళము నలరారుచున్నది.



కొలంబో బజారుదృశ్యము

ఇంకను చూడతగినవి టౌనుహాలు, దీనికి సమీపములో సింహళదేశపు కళాకారుల నిపుణత్వమును చాటు కళాచక్రము, పిమ్మట వస్తుప్రదర్శనశాల, కాండాదేశ మహారాజ సుందర సింహాసనము, ఈ మార్గమునందే సింహళదేశపు వార్తాప్రసార భవనము, పొగాలాక్ రోడ్డుమార్గమున గల బుద్ధదేవాలయము,

పెట్టాలోని హిందూదేశ ప్రాచీనకళాసౌందర్యమును వ్యక్తపరచు హిందూ దైవ పీఠములు, పెట్టాకు ఉత్తరముగా సెంటులూసికా కెత్ డ్రైక్ (దీని క్రింద ఏకకాలమున 6 వేలమంది కూర్చొనుటకు వసతి కలదు), గ్రాండ్‌పాస్‌మీదుగా వెళ్ళిన కెలానీనది (ఇది ఈ దేశమున మిక్కిలి పొడుగైన నది), ఇటకు 2 మై. లో కెలానియా బుద్ధదేవాలయము (ఇటకు వేలాదియాత్రికులు వచ్చుచుందురు), కొలంబోకు 8 మై.లో సముద్రమునుఆనుకొనియున్న లావినియా పర్వతము, ఇచటి ప్రభుత్వజంతుశాలయు చూడదగినవి. సాయం సమయమున యాత్రికులు ఉన్నతప్రదేశమున ఉపవిష్టులై సముద్రుని తరంగగీతములను ఆలాపించుచు విశ్రాంతి గైకొందురు. అశోకుడు ఈ దేశమున చేసిన బౌద్ధమతవ్యాప్తి నిరుపమానము. అందుకు చిహ్నముగా నిచట చక్కని అశోకారామము గలదు.

కాండే:— ఈ పట్టణము కొండలమధ్య కలదు. ఇది సింహళదేశపు రాజుల నివాసస్థానము. ఇచ్చట బుద్ధమందిరములనేకము కలవు. ఆగష్టులో పూర్ణిమరాత్రి జరుగు 'పెరహీరా' అను ఉత్సవము చూడదగినది. ఇట ప్రధానాలయము టూత్ టెంపుల్. (బుద్ధుని దంత మిచట స్థాపింపబడినది.) దీని సింహద్వారమునకు కుడిప్రక్కన 'పట్టరిప్పూణ' భవనము కలదు. ఇందు పురాతన తాళపత్రగ్రంథములు కలవు. ఈ భవనమునకు ప్రక్కనే కాండ్యా రాజులు సమావేశమగు సభాస్థలి (ప్రేక్షక భవనము), వస్తుప్రదర్శన కళాశాల (ఇది ప్రతిశుక్రవారము మూయబడును) కలవు. ఇందు చిత్రాతిచిత్రితములైన శిల్పము, 17వ శతాబ్దపు కాండ్య దేశరాజ సువర్ణకిరీటము సందర్శనీయములు. ఇచ్చటగల

పరిశ్రమలు, లోహవస్తువుల కళాసంపద, లక్కతో చేయబడిన శిల్పములు, దీనికి సంబంధించిన పాఠశాల, విక్రమరాజసింహుని కాలమున నిర్మించిన పెద్దసరస్సు అవశ్యము చూడతగియున్నవి.

కాండేకు వెలుపల ప్రభుత్వ వృక్షశాస్త్రపరిశోధన ఉద్యానవనము కలదు. ఇది 150 ఎకరముల విస్తీర్ణము కలిగియున్నది. ఇది వివిధ వృక్షములతో, సింహళదేశపు ఓషధులతో నలరారుచుండును. ఈ తోట సముద్రమునకు 1570 అ. ఎత్తున గలదు. ఈ తోటకు మూడువైపుల గల సరస్సు, రెండుబాగులు తీర్చి యాత్రికులకు స్వాగతమిచ్చు తాళవృక్షముల పంక్తులు, పెరడేనియాలోని సింహళదేశపు విశ్వవిద్యాలయ కట్టడములు, దీని ప్రక్కనగల మహావేలానది, ఇటకు తూర్పుగా 7 మై. లో గల వ్యవసాయపాఠశాల చూడనగును. ఇచ్చట ఆగస్టునెలలో 12 రోజులు పెద్ద యుత్సవము జరుగును. ఆ సమయమున ఏనుగులను చక్కగా అలంకరించిన ఊరేగింపు జరుగును.

డచ్చివారికోట:—— ఈ ప్రాంతము చల్లగా నుండును.

నువారాయులియ:—— ఇది 7000 అ. ఎత్తునగల మిక్కిలి శీతలప్రదేశము. దీనినే రావణుని పట్టణ మందురు. ఈ ప్రాంతీయులు విశేషముగ సురాపానము చేయుదురు. పెరిడెనియాలో రామకృష్ణమిషను కలదు. ఇచ్చటకు 2 మై. లో కొండమీద సుబ్రహ్మణ్య, శ్రీవల్లీ దేవాలయములు కలవు. ఇచట వనమృగములు అధికము. మార్గమున యాత్రికులకు తారసిల్లుచుండును. కాని వాటివలన యాత్రికుల కెట్టి బాధయు కలుగదు. ఇందులకు సుబ్రహ్మణ్య, శ్రీవల్లీశ్వరుల మహాత్వమే కారణమందురు.

## ప్రధాన స్థానముల వివరము

అనూరాధపురము:— 'తలై మినార్' నుండి రైలు, మోటారు కలవు. ఇచ్చట గణపతిమందిరము కలదు. 'లక్ష్మణ ఝూలా' నిచట కూడా కలదు. ఇది చాల సుందరముగ నుండి నేత్రపర్వ మొనర్చుచుందును. బౌద్ధుల తీర్థస్థానము లనేకము లిచ్చట గలవు. ఈ పట్టణము పాండూకభాయీ అను రాజుచే క్రీ.పూ.437లో నిర్మింపబడినది. ఇచ్చట గల కట్టడములు 2 వేల సంIIలనాటి నాగరికతా చిహ్నములను తెలుపుచున్నవి. ఈ శిథిలములలో; పెద్దపెద్ద 'డగాబా' లు ముఖ్యములు. మొదటి డగాబా అశోకుడు హిందూ దేశమును పాలించుసమయమున నిర్మించబడినది. ఇవి ఈజిప్టు దేశములోని పిరమిడ్లను కొంతవరకుపోలియున్నవి. దేవనాంపియతిస్స కాలములో 'తుపారామ' అను డగాబా నిర్మించబడినది. ఇందు బుద్ధుని 'గళబంధాస్తిక' స్థాపింపబడినది. (డగాబాలనగా బౌద్ధస్తూపము)



బౌద్ధస్తూపము

అనూరాధపురమునకు ఉత్తరముగా 'అభయగిరిడగాబా' నిర్మింప బడినది. దీనినే 'ఉత్తసిటియా' అందురు. ఈ అభయగిరియే పూర్వపు జేతవనము.

మైన్ పెడ్రో:— అనిరుద్ధపురమునుండి మోటారుమీద నిచ్చటకు చేరవలయును. ఇచ్చట నొక సుందరమగు కుండమునకు సమీపమున గణేశాలయము కలదు. దీనికి సమీపమున చింత చెట్టు కలదు. ఇది క్రీ.శ. 1658 నుండి నిట కలదని చెప్పుదురు.

రత్నగిరి:— అనిరుద్ధపురమునుండి రత్నగిరినగరమువరకు రైలు కలదు. ఇది చాల సుందరమైన నగరము. ఇచ్చటి బజారు లందు రత్నము లధికముగ విక్రయించబడును. ఇచ్చట నొక నదీ తీరమున 5000 సం॥లకు పూర్వము నిర్మించిన నగలేశ్వరీ, నగ లేశ్వర మందిరములు కలవు. ఈ నదిలోని నీర మొక యొడ్డున మధురముగనుండి ఆవలియొడ్డున సముద్రోదకమువలె నుప్పగ నుండును. ఇచటకు సమీపమున 'జాఫనా'యను చోట కైలాస నాథ, శివ, వీరభద్ర మందిరములు గలవు. సింహాళము రత్నము లకు ప్రసిద్ధిగాంచిన దేశము.

త్రింకోమల్లీ:— లంక త్రికోణాకృతి కలిగియున్నది. అందొక కోణమున గల నగరమును త్రింకోమల్లీ (త్రికూట) యని పిలతురు. ఇచ్చట నొక పర్వతముమీద కోణేశ్వర మహా దేవ మందిరము కలదు. పూర్వము రావణుని తల్లియగు కైకసి యీ కోణేశ్వరుని నిత్య మారాధించుచుండెడిది. వార్ధక్యమునం దామె నిత్యము నిచటికి రాజాలకపోవుటచే రావణు డీ మందిర మును పర్వతసహితముగ పెకలించి రాజధానికి గొంపోవ యత్నిం

చెను. ఇంతలో రావణునితల్లి చనిపోగా నాత డీకార్యమును విర మించెను. ఆ చిహ్నము నేటికి నిచ్చట గానవచ్చును. ఈ మంది రము దైవనిర్మితమని చెప్పుదురు. దీనికెదుట నొక కోట కలదు. ఈ మందిరములోనికి శుక్రవారము, సోమవారము తప్ప తదితర రోజులందు పోనీయరు. మందిరములోనికి వెళ్ళునప్పుడు కోట లోని సర్వము కాన్పించును.

సప్తకుండములు:— ఇచట 7 కుండములు కలవు. రావణు ఓ పర్వతమును పెకలించుట విరమించి వెడలుచు నీ కుండములను ర్మించెను. తల్లికి ఉత్తరక్రియ లిట చేసెనట. ఇందు 6 కుండము ందలి నీ రొకదానికంటె నొకటి యుష్ణాధిక్యము కలిగియుండును. 'వ దానియందలి నీరు మిక్కిలి చల్లగ నుండును. భారతదేశమున యలో పితృకర్మలను చేయునటు లీ కుండములవద్ద సింహళ ప్రజలు పితృకర్మల నాచరింతురు.

వాక్గంగాకుండము:— త్రింకోమల్లీనుండి న్యూరేలియా స్టేషనులో దిగి సీయపలియాకు చేరవలయును. ఇట చలి యధి ము. వాక్గంగాకుండ మిచట గలదు. పూర్వము లంకానగ రము దగ్ధమగుచుండగ సీతాదేవికి దాహమువేసెను. ఆ సమయ మునం దామె తన కాలితో భూమిని తన్నగా నందుండి జలము పయల్వెడలెను. అదియే యీ వాక్గంగాకుండమని చెప్పుదురు. ఇచ్చటగల వనమునే అశోకవనమని చెప్పుదురు.

సీతారాముల మందిరము:— వాక్గంగాకుండము వద్ద శ్రీ సీతారాముల మందిరము కలదు. పూర్వము అశోకవాటియం దున్న సీతను కలిసికొనుటకు శ్రీరాముడు గుప్తముగ వచ్చెననియు

ఆ విషయము రావణునకు తెలిసి సేనాసహితుడై ఇచటకు వచ్చె ననియు, వెంటనే సీతారాము లీకుండమున ప్రవేశించి యదృశ్యులై రనియు, సీతను గానక రావణుడు కుండమున వెదకి, పరిసర ప్రాంతమునంతయు ఏనుగులచే త్రొక్కించెననియు చెప్పుదురు. సీత కుండమునుండి తరువాత నొక రంధ్రముగుండా బయటకు వచ్చెను. ఆ రంధ్రము నేటికిని గానవచ్చును. అందుచేత నిచ్చట సీతారాములమందిరము కట్టబడెను. ఏనుగుల కాలిచిహ్నములు నేటికిని కానవచ్చును. అశోకవనికాదృశ్య మతి మనోహారముగ నున్నది. ఇటనుండి 50 మైళ్ళ వరకు భూభాగమంతయు నల్లని బూడిదతో నిండియుండును. ఒక్కొకచో మోకాలిబంటిబూడిద కూడ గలదు. సీతారామమందిరము, వాక్గంగాకుండము తప్ప నిచటగల సమస్తవస్తువులు, వృక్షములు, భూమి సర్వము నల్లగ నుండును. ఇవి హనుమంతుడు లంకను కాల్చిన చిహ్నములట.

శివచరణచిహ్నము:— దీనిని 'ఏడమ్స్ పీక్' అందురు. ఇది సుమారు 9000 అ. ఎత్తున గలదు. ఇచ్చటకు పోవుటకు యాత్రికులు రాత్రి 2 గం.లకు బయలుదేరి ఉదయము 6 గం. లకు చేరుదురు. మార్గమంతయు విపరీతముగా మంచుచే నిండి యుండును. ఒక్కొకతఱి శరీరములు కొయ్యబారిపోవును. అట్టి తఱి శరీరమునకు ఉష్ణతకలిగించుటకు మార్గమున ఉష్ణపుగదులు (ఎలక్ట్రిక్ కరెంటుద్వారా దేహమునకు వేడినికలిగించునవి) కలవు. ఇట నొకపర్వతముపై నొక చరణచిహ్నము కలదు. హిందువులు దీని నీశ్వర చరణచిహ్న మని పూజింతురు. మహమ్మదీయులు ఈశ్వరుడు ప్రథమమానవుని సృజించినపుడా మనుజుడీ పర్వతమున నొంటికాలిపై నిలువబడి తన పాపప్రాయశ్చిత్తముగ తప

మాచరించెనని యీ చరణచిహ్నమును పూజింతురు. క్రైస్తవులుకూడ మహమ్మదీయులవలెనే భావించి దీనిని పూజింతురు. బౌద్ధులిది బుద్ధుని చరణచిహ్నమని దీనిని పూజింతురు. మంచు యెక్కువగనున్న ఒక్కొకతతి యీ చరణ చిహ్నములు కాన్పించవు. ప్రపంచమునందీ యొక్క ప్రదేశమునందే సర్వమతస్థులు నొకే వస్తువును పూజించుటచే సర్వమతసామరస్య మిచట కానరగును. మతములు భిన్నములుగాని భగవంతుడొక్కడే.



టూత్ టెంపుల్ (బుద్ధుని దంతము ఇచ్చట స్థాపించబడినది)

ఆదిశేషమందిరము:— అశోకవనమునుండి ఆహారపదార్థములను వెంటగొని అరణ్యమార్గమున 'కాటర్ గామా' యను ప్రదేశమునకు చేరవలెను. ఇచ్చట ఆదిశేషమందిరము కలదు.

రామాయణవర్ణితములగు మనోహర లతావితానములు, సుందరవృక్ష పంక్తులు, ధనధాన్యాధిక్యత సింహాళమున గానవచ్చును. లంకాద్వీపము చాల మనోహరమైనది.

# నా తీర్థయాత్రానుభవములు

1929 సంవత్సరమున రామేశ్వరయాత్రచేయు భాగ్యము లభించినది. మద్రాసులో మైలాపూరునందున్న శ్రీ రామకృష్ణ మఠమునకు వెళ్ళి, శ్రీ పరమహంసను దర్శించితిని. భగవదను గ్రహమున నా యాత్ర సక్రమముగ ముగిసెను.

1930 జనవరిలో శ్రీ రామకృష్ణమఠ ముఖ్యస్థానమగు బేలూరుమఠమునకు వెళ్లి, శ్రీరామకృష్ణమఠ యావత్ ప్రపంచా ధ్యక్షులగు శ్రీశ్రీ శివానందస్వాములవారిని సందర్శించితిని. మహనీయుల సాంగత్యమాహాత్మ్యము నాకప్పుడు విదితమాయెను. శ్రీ స్వామీజీ యాజ్ఞానుసారము కలకత్తానగరమునగల శ్రీఅభేదానందస్వామివారిని దర్శించగా, వారు ఆధ్యాత్మికశక్తిబీజమును తీర్థయాత్రలవలన బలపరచుకొమ్మని సలహానిచ్చిరి. మహాభాగ్యమని నేను గుంటూరు తిరిగివచ్చితిని.

1931 లో నేను తీర్థయాత్రకై ఒంటరిగ బయలుదేరితిని. ముఖ్యస్థలములను సందర్శించి, ఆయా స్థలములయందు కలుగు అనుభవములను పరిశీలించి, అవి జీవితనిర్మాణమున కెట్లు సాయపడునో తెలిసికొనగోరితిని. మున్ముందు విజయవాడపట్టణమున దిగితిని. కృష్ణానదీస్నానము గావించుకొని, దుర్గాలయమునకు వెళ్ళి జగన్మాతయగు శ్రీకనకదుర్గను సేవించుకొంటిని. విజయవాడ నుండి దాదాపు 225 మై. దూరముననున్న సికింద్రాబాద్ చేరితిని. హైదరాబాద్ - సికింద్రాబాద్ నగరములలో గల విశేషములను గ్రహించితిని. అచటికి 300 మై. దూరముననున్న పండరి క్షేత్రమును చేరితిని. మహారాష్ట్రభక్తి సాంప్రదాయ పరిచయము

గొంటిని. భారతజాతీయనిర్మాణమునకు మహారాష్ట్రభక్తి సాంప్ర దాయ మొనరించిన సేవ అపారము. శ్రీసమర్థరామదాసస్వామి, తుకారాం, తులశీదాసు, ఏకనాథస్వామి, నామదేవ్ మొదలగు మహనీయు లవతరించి, సనాతనధర్మమునకు మూలమగు శ్రీహరి నామమును ప్రచారము గావించిరి. పండరి భక్తి సాంప్రదాయ మునకు యావద్భారతము ఋణపడియున్నది. పండరికి దాదాపు 200 మై. లో నున్న బొంబాయినగరమును జేరితిని. మహానగ రములయందు పరిచయస్థలము లేనిచో అనేకకష్టముల నెదుర్కొన వలసియుండును. 'మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ' అను సూత్రము స్ఫురించెను. తోడనే 'సర్వముకా ఆతని దివ్య ధామయమంచు' అని తలచి, బొంబాయినుండి 150 మైళ్ళ దూరమున నున్న నాసిక్ వెళ్లితిని. గోదావరి జన్మస్థాన మది. పవిత్ర గోదావరీ తోయములలో ప్రుంకులిడి స్వామిని సేవించి, అటనుండి దాదాపు 250 మై. దూరముననున్న ద్వారకానగరము జేరితిని. 'అహం సర్వస్య ప్రభవః' అను గీతాశ్లోకము మనస్సునకు వచ్చెను. ద్వారకాధిపతి శ్రీకృష్ణు డతి చాకచక్యముతో సమన్వ యించిన యావద్వైదికసాంప్రదాయములు పొడగట్టెను.

అచ్చటికి దాదాపు 200 మై. దూరముననున్న మాత్ర యు చేరితిని. విజయవాడ మొదలు ద్వారకవరకు పయనించు టలో నాయం దుదయించిన అభిప్రాయములనన్నిటిని సింహావ లోకన మొనరించుకొనుచు అచట వారమురోజు లుంటిని. పర వశుడై గాయత్రీ మహామంత్రోచ్చారణ చేయుచున్న సాధు

---

☞ 670, 679, 702, 707, 710, 717 — ఈ పేజీల లోని చిత్రములు "ప్రెస్ ఇన్ఫర్మేషన్ బ్యూరో" వారి సౌజన్యముతో ప్రకటితములు.

పుంగవునొకనిని అచటచూచితిని. 'సంధ్యావందనమునకు ప్రాణము గాయత్రీమంత్రము. ఆ మంత్రమునకు ప్రాణము ప్రణవము. అట్టి ప్రణవమును చతుర్దశభువనవ్యాప్తమైన దైవశక్తిగా' ఆ మహనీయుని యనుగ్రహమున తెలిసికొంటిని.

మాతృగయనుండి దాదాపు 300 మై. దూరమున నున్న హరిద్వారము చేరితిని. హరిద్వారముయొక్క ప్రకృతివైభవము వర్ణనాతీతము. మహనీయుల యనుగ్రహము భగవద్భక్తిని బలపరచును గదా! అచ్చట నాకొక మహనీయుని దర్శనభాగ్యం లభించెను. ఆయన ఆజ్ఞానుసారము పిమ్మట 14 మై. దూరమున నున్న హృషీకేశము చేరితిని.


జగన్నాథాలయము – ఔంధా.
(బొంబాయి ప్రాంతమందలి సతారాజిల్లా)

హృషీకేశుడు అనగా యావదింద్రియములను నియమించు ప్రభువని భావము. హృషీకేశమునందు వేలకొలది సన్యాసులు తపోనిష్ఠయందు కాలమును గడుపుచుందురు. గంగాస్నానము, ఏకభుక్తము, సత్సంగము, భగవన్నామ స్మరణము, ఆత్మతత్త్వ విచారము హృషీకేశమున నున్నవారికి సహజముగా లభించును.

హృషీకేశమునుండి సుమారు 200 మై. దూరముననున్న మధురానగరమున కరిగితిని. మధురాష్టకమునందు అభివర్ణన గావింపబడిన మధురమూర్తి నివాస మది. మధురమూర్తిని

గురించి చింతించుచు అటకు 14 మై. దూరమునను్న బృందా వనమును చేరితిని. పరిశుద్ధ హృదయమును బృందావనముతో పోల్చెదరు. నా భావములన్నియు సబర్మతి మహాఋషియగు గాంధీమహాత్మునివైపునకు పయనించెను.

పిమ్మట బృందావనమునకు 6 మై. దూరముననున్న గోకులమున కేగితిని. గోపికలయందు మూర్తీభవించిన అనన్య భక్తి తత్త్వము, పరీక్షిన్మహారాజునకు శ్రీ శుకుడు బోధించిన భక్తివిధానము జ్ఞప్తికి వచ్చెను. గోపికల భక్తి అత్యంత నిర్మలము, త్యాగసమ్మిళితము, బహుభావ సంభరితము. గోకులమునకు సుమారు 50 మై. దూరమున నున్న ప్రయాగ క్షేత్రమునకు పయనించితిని. ప్రయాగ గంగా, యమునా, సరస్వతి నదుల సంగమస్థానము. ఆధ్యాత్మిక వికాసమునకు భక్తి, కర్మ, జ్ఞాన మార్గము లత్యవసరమను విషయము ప్రయాగక్షేత్రము జ్ఞప్తికి దెచ్చెను. ప్రయాగకు 3 మై దూరముననున్న ఝూసీగ్రామమున శ్రీ శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారిగారిచే నడుపబడుచున్న సంకీర్తన మందిరము అత్యంతము ప్రశంసనీయమైనది. త్రివేణీ సంగమ స్నానము, సంకీర్తనభవనమందు నిత్యసంకీర్తనము, అచట నిత్యము జరుగు పురాణశ్రవణము మొదలగు నిర్విరామ కార్యక్రమము నా కెంతో ఆనందమును కలిగించెను.

అటనుండి సుమారు 100 మై. లో నున్న కాశీక్షేత్ర మున కరిగితిని. కాశీక్షేత్రము భారతీయుల హృదయక్షేత్రమున ఆధ్యాత్మికతరంగములను రేకెత్తించును. అది భారతీయసంస్కృతీ నిలయము. ఆధ్యాత్మికవిజ్ఞానమున కాలవాలము. అచట జరుగు నిరంతర అన్నదానము, సద్గోష్ఠి, బహుసాంప్రదాయప్రచారము

వేరెచ్చటను కానరాదు. గంగాస్నానము, అన్నపూర్ణా విశ్వేశ్వరుల దర్శనము చేసికొని, అటనుండి గయాక్షేత్రము చేరితిని. గయాక్షేత్రము నాయందనేక మధురస్మృతులను కలిగించెను. మున్ముందచట పితృదేవతలకు తిలోదక పిండప్రదానములను గావించితిని. పితృఋణము తీరిననేకాని భగవదనుగ్రహము కలుగదని ప్రమాణము. అచటికి 200 మై. దూరముననున్న కలకత్తా నగరమునుచేరి, అచట నెలదినము లుంటిని. నా తీర్థయాత్రానుభవములను మననము గావించుకొంటిని. తీర్థయాత్రలు సర్వతోముఖ జీవితవికాసమున కత్యవసరమను విషయము గుర్తించినవారు ధన్యులు.

అత్యున్నత ధర్మమార్గములను నిర్మించు రాజబాటలు మతములు. మతముల నన్నిటిని సాధనగావించి, మతధర్మముల నన్నింటిని అనుభవములోనికి తెచ్చుకొమ్మని సనాతనధర్మము చేయు హెచ్చరిక.

క్రమశిక్షణ మానవుని దైవసమునిగ జేయును. దివ్యదృష్టిగల భారతీయ మహాఋషులు తదుపాయముగ షోడశ సంస్కారములను విధించిరి. ఆ సంస్కారములతో తుల్యమగు అనుభవము తీర్థయాత్రల వలన సమకూరును. తీర్థయాత్రల పరమావధి ఆత్మసాక్షాత్కారము. ఆత్మసాక్షాత్కారమున కవసరమగు ఇంద్రియనిగ్రహము, ఆహారనియమాదులు, శ్రవణ - మనన - నిధిధ్యాసలు, సత్సంగము, మహనీయుల సేవాభాగ్యము, కష్టసహన శక్తి, వివేక - వైరాగ్యములు, ధైర్యోత్సాహములు తీర్థయాత్రానుభవమువలన బడయుట కవకాశము కలదు. వ్యక్తి వికాసమును, సామాజికదృష్టిని, జాతీయవికాసమును, అంతర్జా

తీయ సమైక్యతను కలిగించి విశ్వకల్యాణమునకు వెలుగుబాటలను జూపును. విలాసార్థము కాక, విజ్ఞానదృష్టితో చేయు తీర్థయాత్రలు జాతీయ పునరుద్ధారణకు సర్వతోముఖ సాధనములు.

— అవ్వారి హనుమయ్య



# అనుబంధము

## మండూ

ఇది మహోబాకు 55 మై. దూరమున గలదు. (చూ. మధ్యభారతము - 503 పేజి) దీనినిఆ నందనగర మనెదరు. వింధ్య పర్వతశ్రేణిలో నొక దానిపై ఇది నిర్మించబడెను. ఇచటి శీతోష్ణస్థితి సుఖమైనది. శిథిలమైయున్న 'హోషాంగ్ షా' చలువరాతి సమాధి, శిల్పచాతుర్యానికి నిదర్శనమైన జుమ్మామశీదు, 1200 అ. ఎత్తున కట్టిన రూపమాలిభవనము చూడతగినవి.



## బాగ్

ఇది మండూకు పశ్చిమముగా 30 మై. లో గలదు. ఇక్కడ క్రీ. శ. 5 – 7 శతాబ్దిమధ్యలో నిర్మించిన గుహాలయములు చరిత్రప్రసిద్ధములైనవి. కొండలను దొలిచి బండరాలపై మలచి రంగులద్దిన ఇక్కడి చిత్రముల యందు మీానాడు శిథిలావస్థలో నైతము కళాపిపాసువులకు కన్నులపండువు జేయుచున్నవి.

# సీతాధామము

ఇది రాజపుత్రస్థానమున ప్రతాపగఢ్ రాజ్యమున గల పవిత్రతీర్థము. ఇది 'బడీసాదడీ' కి సమీపమున గలదు. ఇచటకు వెడలుమార్గము చాల దుర్గమముగ నుండును. భయంకర పర్వత మధ్యమునం దీ తీర్థము గలదు. కొంతదూరము వెడలిన పిదప సుందరమైన లతావితానములు, ఉన్నత వృక్ష సందోహములు గానవచ్చును. ఇచ్చట నొక నది రెండుపాయలుగ బ్రవహించు చుండెను. ఇందొకటి యుష్ణోదక ధార, రెండవది శీతలజలధార. ఇచ్చట సీతాదేవి యగ్నిప్రవేశము గావించెనని చెప్పుదురు. ఇట నుండి కొంచెము క్రిందకు దిగవలయును. ఈ మార్గము కూడ చాల సుందరముగ నుండును. ఇచ్చట నొక కొండమీద నొక గుహయందు జగజ్జననియగు సీతాదేవి విగ్రహ మతి మనోహర ముగ నున్నది. ఈ దేవీవిగ్రహ సౌందర్యము వర్ణనాతీతము. ఇచ్చట పాపీకుండము, ధర్మకుండము, లవకుశకుండము గలవు

పాపీకుండము:— ఈ కుండమున స్నానము చేసిన మనుజుడు సర్వపాప విముక్తుడగునని చెప్పుదురు.

ధర్మకుండము:— ఈ కుండమున స్నానముచేసిన మనుజుని హృదయము పవిత్రభావ పూరిత మగును. ఈ కుండము చాల లోతుగ నున్నది. ఇచ్చట సీతాదేవి పృథ్వీగర్భమున బ్రవేశించెనని చెప్పుదురు,

లవకుశకుండము:— ఈ కుండమొక గజములోతు కలిగి యున్నది. అటులయ్యు నిందు జల మధికముగనే యున్నది. ఈ స్థాన మవశ్యము చూడతగినది.

# ఏకశిలానగరక్షేత్రము (ఒంటిమిట్ట)

గుంటూరు - కడప రైల్వేలైనులో 'ఒంటిమిట్ట' స్టేషను గలదు. పూర్వ మొకప్పుడు మునులు కుమారస్వామిని గూర్చి యిట్లు ప్రశ్నించిరి. 'కుమారా! ప్రణవబ్రహ్మముల కభేదమును నిరూపించు క్షేత్ర మెందైన కలదేని మాకనుగ్రహింపు' మన, స్కందు డిట్లు చెప్పెను. ఓ ఋషులారా! వినుడు. మీరు కోరిన క్షేత్రము భూలోకమున దండకారణ్యములో కృష్ణా కావేరీనదుల మధ్య ఏకశిలానగరమున కలదు. ఇందు శ్రీ సీతారామలక్ష్మణుల యాలయము, వారు నిర్మించిన తీర్థములు కలవు.

దేవతలు బుసుపోకకై వాయువుకు, ఆదిశేషునకు కయ్యమును కల్పింప, ఆదిశేషుడు తన వేయిపడగలతో మేరుపర్వత వేయి శిఖరములను గట్టిగ పట్టియుండ, వాయువు సప్తమరుత్తు లొక్కటియై భీకరముగ వీవ, లోకములన్నియు గజగజలాడినవి. అదిగాంచి, దేవతలు ఎట్లో ఆదిశేషునికి నచ్చచెప్పగ ఒకశిఖరము సడలించె. అంత వాయు వా శిఖరమును ఎగజిమ్మ, అది ప్రస్తుతము 'ఏకశిలానగర' మనుచోట పడెను. పిమ్మట నదియే ఏకశిలా నగరముగా మారినది. దీని కనతిదూరమున మృకండు మొదలగు మునుల యాశ్రమములు కలవు.

తండ్రి యాజ్ఞచొప్పున శ్రీరాముడు సీతాలక్ష్మణులతో నరణ్యవాససమయమున ఏకశిలానగర ప్రాంతమున సంచరించుతతి సీతాదేవికి దాహము వేయ, రాముడు బాణమును సంధించి భూమిని భేదింప, పాతాళమునుండి గంగ యావిర్భవించె. సీతారాములు దప్పిక దీర్చుకొనిరి. ఇదియే నేటికిని శ్రీరామతీర్థము.

దీని ప్రక్కనే లక్ష్మణుడు కూడ నట్లే లక్ష్మణతీర్థము సృష్టించెను. ఇది గాంచి సీతాదేవి భూమిని గోర గిరి ప్రార్థించగ, గంగ యావిర్భవించెను. అదియే సీతాతీర్థము. సమీపమునగల మును లీ విషయమును విని, తాము భార్యలతో సహా ఈ తీర్థమున కరుదెంచి, అందు స్నానముచేసి, సీతా రామ లక్ష్మణుల దర్శించి యిట్లు ప్రార్థించిరి. మహానుభావా! తామిందే కొంతకాలము వసింపు డన, సీతా రామ లక్ష్మణులు, మునులారా! నేను కార్యార్థినై వెడలుచుంటిని. ఇందుండుటకు వీలుకాదు. మా ప్రతినిధిరూపములు ఈ ఏకశిలానగరమున గలవు. వానిని సేవింపు డనగ, ఋషులు అట్లు సీతా రామ లక్ష్మణ మూర్తుల గాంచి, వారిని సేవించుచుండిరి. కొన్ని సంవత్సరములు గడువ, హనుమంతుడు సపరివారముతో సీతాన్వేషణచేయుచు నచటకు రాగా, నాటిరాత్రి జాంబవంతునికి స్వప్నంబున సీతా రామ లక్ష్మణుల ప్రతిమ లచట నున్నటుల గాంచి, మునుల వలన తెలుసుకొని, జాంబవంతుడు స్వామికి చిన్న మంటపమును నిర్మించెను.

కలియుగ యాదిమకాలమున వసుమంతు డను రాజు వేటకై వచ్చి, దప్పికచే ఏకశిలాపర్వత పరిసరముల తిరుగుచుండ రామలక్ష్మణులు, 'ఒంటడు - మిట్టడు' అను పేర్లతో రాజునకు దర్శనమిచ్చి, రామతీర్థము చూప, రాజు దాహము తీర్చికొని ప్రత్యుపకృతి చేయగోరగ, రామలక్ష్మణులు జాంబవంతునిచే నిర్మితమైన మంటపము, యొక నిధి చూపి ఆలయమును కట్టింపు మని యాదేశించి యంతర్హితులైరి. రాజు మిక్కిలి యాశ్చర్య పడి, వెంటనే ఆలయమును నిర్మింపజేసెను. ఎన్నివేల సంవత్స

రములైనదో ఈ రాజు కట్టించిన ఈ యాలయము! క్రమముగ
నోళరాజులు, కర్ణాటప్రభువులుకూడ పోషించిరి. ఇది మహిమ
ల క్షేత్రము. మహాభక్తుడగు మాల యోబడు, భక్తులుగా
వులుగా వాసిగాంచిన పోతనామాత్యుడు, అయ్యలరాజు రామ
ద్రుడు యిచ్చటివారలే.

## వేణుగోపాలస్వామి (మొవ్వ)

కృష్ణాజిల్లాలోని దివితాలూకాలో కూచిపూడిగ్రామము
కు 1½ మైలుదూరమున 'మొవ్వ' గ్రామము కలదు. బందరు
నుండి ఇచ్చటకు బస్సుమార్గము కలదు. దీనికి సమీపముననే
రిత్రకప్రసిద్ధమైన ఘంటశాల కలదు. మొవ్వలో అనాదిసిద్ధ
మైన వేణుగోపాలస్వామిమందిరము కలదు. ఈ స్వామిని మువ్వల
వేణుగోపాలస్వామి యనియు నందురు.

క్షేత్రయ్య;— ఇతడు తైలింగ్య బ్రాహ్మణుడు.
ఇతని తొలినామము వరదయ్య. ఇతడు వేణుగోపాలస్వామి
యంకితముగ వేలకొలది పదములు వ్రాసెను. అన్నియు ప్రస్తు
తము లభ్యమగుటలేదు. క్షేత్రయ్య జీవిత నిర్ణయమునకు సరి
యగు నాధారములు కానరావు. పలువురు పలువిధములుగ
ర్ణయించుచుండిరి. శ్రీకృష్ణానుగ్రహమును బడసిన భక్తుడు.
గవదనుగ్రహము బడసినవారికి కొరత యేమి? ఇతని పదము
న్నియు ఉత్తమ సాహిత్యముతో నలరారుచున్నవి. ఇతడు
జావూరు, గోలకొండ సంస్థానములందు సమ్మానింపబడెను.
వేణుగోపాలస్వామిపై పదములు చెప్పుచు, నానాక్షేత్రములలో
ర్యటించిన కారణమున క్షేత్రయ్య అను సార్థకనామముగయ్యెను.

ఇతని పదములు 'క్షేత్రయ్యపదములు'. పురందరదాసు, తాళ్ళపాక అన్నమాచార్యులు, త్యాగరాజు మొదలైన గాయకభక్తుల వరుసలో క్షేత్రయ్యకూడ చేరును.

## ఘంటశాల

ఇది బందరుకు 16 మై. లో గలదు. సుప్రసిద్ధ ఐతిహాసిక పట్టణము వ్యాపార కేంద్రము. పూర్వ మీది ఏఖ్యాతిపు సముద్ర రేవు. బౌద్ధయుగమున, చాళుక్యులనాడు మంచి పేర్వడసిన నగరము. బౌద్ధచిహ్నము లనేకము కలవు. ఇచ్చట జలంధరేశ్వరాలయము మిక్కిలి పురాతనము, ప్రసిద్ధము. ఇచట శతాధిక దేవాలయములు గలవని చరిత్రవలన తెలియుచున్నది.

## తప్తపాణి

బరంపురం నుండి ఇచ్చటకు బస్సుమార్గము (30 మై) కలదు. ఇచ్చట ఉష్ణోదక నీటిబుగ్గ కలదు. దీనినే 'తప్తపాణి' యందురు. ఆహారపదార్థము వెంట నుంచుకొని వెళ్ళవలయును. ఈ ఉష్ణోదకము సర్వరోగ నివారణమని ప్రసిద్ధి.





## నీరాజనం

అమ్మయ్య! ఇప్పటికి శాస్త్రిగారి పుణ్యమా అంటూ కాశ్మీరునుంచి కన్యాకుమారి వరకు, కచ్ నుంచి కలకత్తావరకు గల యావత్ భారతదేశ పర్యటన మనకందరికి ఒక్క ఆరురూపాయల ఖర్చుతో లభించింది. కాశ్మీర్ కమనీయ సౌందర్యాన్ని, ఉత్తరప్రదేశ్ మనోజ్ఞ దృశ్యాలను, అనేక సామ్రాజ్యములకు జన్మభూమిఅయిన ఢిల్లీనగర వైభవాన్ని, దాని చారిత్రకప్రశస్తిని, ప్రకృతిమాత వంగదేశంలో తీర్చిదిద్దిన రంగవల్లులను, మహాభక్తులకు నిలయములైన గుజరాత్, మహారాష్ట్ర దేశములను, హిందూ మహమ్మదీయ సంస్కృతుల మేలుకలయికకు మంచి నిదర్శనమైన హైదరాబాదును, అక్కడి శిల్పసంపదను, ఆవేశానికి, ఆత్మార్పణకు ఆటపట్టయిన ఆంధ్రావనిని, వ్యాపారదక్షతను, దేవాలయనిర్మాణ శిల్పచాతురికి నిలయమైన తమిళనాడును, పాండ్య, చేర సంస్కృతులకు కాణాచియైన కేరళదేశాన్ని, అక్కడి వింతలను యీయాత్రాక్రమంలో మన కళ్ళకి కట్టినట్లు చూపించారు. అతివృద్ధ, అయినప్పటికి నిత్యనూతన అయిన భారతమాత సహజ సుందరస్వరూపాన్ని యాత్రికుల చర్మచక్షువులకేకాక చదువరుల మనోనేత్రాలకుకూడా సాక్షాత్కరింపచేశారు.

## భారతావని విరాట్స్వరూపం

ఉత్తరాన హిమాలయాలనుంచి, దక్షిణాన రత్నాకర మహోదధి సంగమస్థానం వరకు గల ఈ మహాదేశం వైశాల్యం పన్నెండులక్షల ఇరవై వేల చదరపుమైళ్లు. ఇంక నదులు, నదాలు, పర్వతాలు, పీఠభూములు, అడవులు ఎన్నెన్నిరకాలో ఉన్నాయి. ఈ ప్రపంచంలో ఎన్నిరకాల నైసర్గికవిశేషాలున్నాయో, శీతోష్ణస్థితులున్నాయో అవి అన్నీకూడా ఈ దేశంలో ప్రత్యక్షమవుతాయి. ఇందులో అతిసారవంతమైన గంగా, యమునా మైదానం ఆర్య నాగరికతకు ఆలవాలం. ఈశాన్యసీమలో అస్సాంగుండా బ్రహ్మపుత్రానది ప్రవహిస్తున్నది. నర్మదా, తపతి, మహానది, గోదావరి, కృష్ణా, కావేరినదులు యుగయుగాలుగా భారతీయ సంస్కృతికి సజీవచిహ్నాలుగా ప్రవర్తిల్లుతున్నవి.

భారతీయ నాగరికత, ప్రపంచంలో అతి ప్రాచీనమైన నాగరికతలలోకల్లా ప్రాచీనతమమైనది. ఆర్యులు ఈ దేశమునకు మొదట క్రీస్తుకుపూర్వం పదిహేనువందల సంవత్సరంలో వచ్చారు. అప్పటికే ఈ దేశంలో తమ నాగరికతకంటే ఉత్కృష్టమైన గానపద నాగరికత వర్ధిల్లినట్లు కనుగొన్నారు. ఆనాటి బస్తీలు, విశాలమయిన వీధులతో, ఆరోగ్యప్రదమయిన మురుగునీటి కాలువలతో, స్నాన మందిరాలతో, వందుయిటికల యిళ్ళతో, ధాన్యాగారాలతో విలసిల్లెడివి. ఆనాటి ప్రజలకు లిపి తెలుసు లోహవిజ్ఞానం తెలుసు. ఆర్య, ఆర్యేతర సంస్కృతుల సమ్మేళనం వల్ల మూడు మహామతములు ఇక్కడ ప్రభవించాయి. వేద ప్రతిపాదితమైన హిందూమతం, బౌద్ధమతం, జైనమతం. వాటికి

అనుబంధంగా తత్వశాస్త్రాలు ప్రోక్తమయ్యాయి. ఇక భౌతికంగా చూస్తే బ్రహ్మాండమయిన దేవాలయములు, మఠములు, శిల్పములకు కాణాచులయిన మందిరములు, కుడ్యచిత్రములు ఎన్నో మనకు యావత్తు దేశంలోనూ అడుగడుగునా కనపడుతూనే యున్నాయి. ఈ నాటికీ దేశదేశాలనుంచి వచ్చే యాత్రికులకు ఇవి అవశ్య దర్శనీయములుగా భాసిల్లుతున్నాయి.

అతి ప్రాచీన కాలంలోనే "బాబిలోనియా" వంటి దేశాలతో ఇండియాకు వాణిజ్య సంబంధా లుండేవి. ఆ తరువాత ఇండియాలో పండే ముడిసరుకు, తయారుచేయబడిన రకరకాల వస్తువులకోసం ఈజిప్టునుంచి, రోమక సామ్రాజ్య దేశాలనుంచి, చైనానుంచి వ్యాపారు లెగబడుతూ వుండేవారు. భారతీయ సంస్కృతీ వైభవదీప్తులు మధ్యాసియా, ఆఫ్గనిస్థాన్, పర్షియా, లంక, ఇండోనీషియా, బర్మా, చైనా వగైరా పరిసర దేశాలకు వ్యాపించి వాటిని జ్యోతిర్మయం చేశాయి. మహమ్మదీయ మతం — అరబ్బు వ్యాపారులద్వారా, దండయాత్రలు చేసిన సాహసికుల ద్వారా ఎనిమిదవ శతాబ్దిలో ఈ దేశానికి వచ్చి ఇక్కడ పాతుకొనిపోయింది. ఈ దేశాన్ని పరిపాలించిన ముస్లింరాజులు ముఖ్యంగా మొగలాయీలు, భారత దేశ సాంస్కృతీశబలతను వికసింపచేయడానికి చేకూర్చిన దోహదం, యింతింతనరానిది. పదిహేడవ శతాబ్ది ప్రారంభములో కలిగిన పాశ్చాత్యసంపర్కంవల్ల ఆధునికవిజ్ఞానదృష్టి, సాంకేతిక పరిజ్ఞానం, ఈనాటి ప్రజాస్వామ్యవ్యవస్థలు భారతీయులకు లభించాయి.

జనాభాలో ప్రపంచం మొత్తమీద చైనా తరువాత ఎక్కువమంది యిక్కడే వున్నారు. ప్రపంచ జనాభాలో ఏడవ

వంతు అనగా ముప్పదిఐదు కోట్లమంది ఇక్కడున్నారు. వీరు అంతా ఏక భారతజాతి. అయినప్పటికీ వీరిలో ఎన్నెన్ని ఆచారములు, ఎన్నెన్ని మతాలు, ఎన్నెన్ని భాషలు, ఎన్నెన్ని వేషాలు, ఇన్నిరకాల ప్రస్ఫుటంగా కనిపించే వైవిధ్యంలోనూ, మనకు అనుస్యూతమై, అంతర్గతముగా ఒక ఏకత్వం ఎప్పుడూ కనబడుతూనే ఉంటుంది. మొత్తంమీద ఇక్కడ ప్రజలు అందరూ కష్టజీవులు పౌరుషరులు. అతిథిమర్యాదలు చక్కగా తెలిసినవారు. ఏతరణ శీలులు.

## ప్రభుత్వ వ్యవస్థ

భారత రిపబ్లిక్‌లో ఆంధ్రతోసహా ఇరువై ఎనిమిది రాష్ట్రలున్నాయి. అన్నింటిలోనూ ప్రజాస్వామ్యప్రభుత్వా లున్నాయి. ఇందులో కొన్ని రాష్ట్రాలు గ్రేట్‌బ్రిటన్, ఇటలీల కంటె పెద్దవి. యూనియన్ ప్రభుత్వానికి అధిపతి రాష్ట్రపతి. కార్యనిర్వాహక అధికారం అంతాకూడా పార్లమెంటుకు బాధ్యులయిన యూనియన్ ప్రభుత్వ మంత్రిమండలిది. ఇంక సార్వభౌమ అధికారం నవభారత రాజ్యాంగంప్రకారం ప్రజలది. అనగా ప్రజాప్రతినిధులతో రెండు శాసనసభలతో కూడిన భారత పార్లమెంటుకు. ఇందులో దిగువ సభను ప్రజాప్రతినిధి సభ అంటారు. ఎగువ సభను రాజ్యసభ అంటారు. ఈ ప్రజాప్రతినిధులందరూ వయోజన, నియోజకాధికారం ప్రాతిపదికగా యెన్నుకోబడినవారు. అలాగే ప్రతి రాష్ట్రానికిగూడా శాసనసభలు, మంత్రిమండలి, గవర్నరు ఉంటారు.

## ప్రజల వేష భాషలు

హిందీ ప్రభుత్వభాష. కానీ విద్యావంతులందరికీ ఇంగ్లీషుతో పరిచయముంది. ఇవి గాక పద్ధెనిమిది ప్రాంతీయ భాషలున్నాయి. ప్రపంచంలో ఎన్నిమతాలున్నాయో వాటన్నింటికి ఈ దేశ ప్రజలలో ప్రాతినిధ్యం ఉంది. అన్నిటిలోకి హిందూమత ప్రాబల్యం చాలా ఎక్కువ. దాదాపు ఇరువదినాలుగుకోట్లమంది హిందువులు. మిగతావారిలో నాలుగుకోట్లమంది ముస్లిములు. వీరు కాకుండా క్రైస్తవులు, శిక్కులు, బౌద్ధులు, పారశీలు, యూదులు, ఇతరమతాలవారు అనేకమంది ఉన్నారు. కన్యాకుమారినుంచి కాంచనగంగవరకూ ఉన్న రెండువేలమైళ్ళ దూరం వరకూ వ్యాపించియున్న యీ మహాదేశంలో మండుటెండలు లగాయతు మంచుపడేవరకు యుండే అన్నిరకాల శీతోష్ణస్థితులు తారసిల్లుతాయి. ప్రాంతాలనుబట్టి, ఋతువులనుబట్టి శీతోష్ణస్థితి మారుతుంటుంది. దేశం మొత్తంమీద నవంబరునుంచి మార్చి వరకు శీతాకాలమని చెప్పాలి. ఈ సమయంలో శీతోష్ణస్థితి చాలా సుఖప్రదంగా ఉంటుంది. ఉత్తరదేశంలో అప్పుడప్పుడు చలిగా ఉంటుంది. కొండలమీద మంచు దట్టంగా పడుతుంటుంది. ప్రాచ్యభారతంలో చలికాలం చాలాకాలం ఉండదు. బొంబాయి లోనూ, దక్షిణాదిని శీతగాలియంటూ ఏమీయుండదు. సముద్ర మట్టానికి ఐదు, ఆరువేల అడుగుల ఎత్తున శీతోష్ణస్థితి ఎంతో హాయిగా ఉంటుంది. ఇంక వేసవికాలం వచ్చిందంటే - ఏప్రిల్, జూన్ నెలలు – ఇండియా మొత్తంమీద ఎండలు మండిపోతూ యుంటవి. అయితే ఈలాంటి మండువేసవిలోకూడా యాత్రికులు

కాశ్మీర్, కులు లోయ, సిమ్లా, ముస్సోరీ, నైనిటాలు, డార్జిలింగ్, కొడైకెనాల్ వగైరా పర్వతకేంద్రాలకు వెళ్ళి సుఖంగా కాలక్షేపం చెయ్యవచ్చు. అక్కడ ఎప్పుడుకూడా వాతావరణంలో వేడి అరవై, డెబ్భై డిగ్రీలకు మించదు. సాధారణంగా జులైలో వర్షాలు మొదలౌతాయి. సెప్టెంబరు నెలాఖరు వరకు జడివానలు పడుతూనేయుంటవి. మొత్తంమీద ఇండియాలో ఏదోమూల ఎవరికి అనువైన శీతోష్ణస్థితి వారికి అందుబాటులోనే యుంటుంది.

ఇండియాలో ముఖ్యమయిన పట్టణాలన్నిటికి రైలు, రోడ్డు, విమాన మార్గాలున్నాయి. ఈదేశానికి ఒక ప్రత్యేకమయిన కాలమానం వుంది. దీనిప్రకారమే రైళ్లు నడుస్తాయి.

## ఇక్కడి ఆకర్షణ

ఇది అంతా చూస్తే ఈదేశం అంత అందమైనది, ఆనందకరమైంది ప్రపంచంలో మరొకటి లేదని చెప్పాలి. ఇక్కడిప్రాచీన కట్టడాలు, భవనాలు ఈ దేశపు విజ్ఞానానికి, పురావైభవానికి, నిదర్శనానికి నిలచి ఉన్నాయి. ఇక్కడి ఆచారవ్యవహారాలు, పండుగలు, మతాలు, సంస్కృతి అన్నీ గరీయసమైన ప్రాచీన భారతీయసంస్కృతికి ప్రతిరూపములుగా పరిఢవిల్లుతున్నవి. సృష్టిసౌందర్య సందర్శనోత్సుకులయినవారికి, భృత శాస్త్రవేత్తలకు, ప్రకృతి పరిశీలకులకు ఇక్కడి అడవులు, పర్వతాలు, లోయలు, మైదానాలు, ఎడారులు అపూర్వ విజ్ఞానభాండాగారాలు.

అలాగే మృగయా వినోదులకు, మత్స్యగ్రహణ వినోదులకు, కులాయగ్రసన వినోదులకుకూడా ఇక్కడి అరణ్యములు,

నదులు, సరస్సులు మొదలగు బంగారములు. ఒళ్లు గగురు పొడిచే గుఱ్ఱపు పందెములకు, సాహసానికి, స్థైర్యానికీ నిదర్శనమైన పోలో, గోల్ఫు, క్రికెట్టు, టెన్నిసు వగైరా పాశ్చాత్య క్రీడలను, శీతాకాలపు క్రీడలను చూడాలంటే అందుకు ఈ దేశంలోగల అవకాశాలు కొల్లలు. సముద్రస్నాన సుఖం పొందదలచిన వారికి యీ దేశంలో ఉన్నన్ని సౌకర్యాలు, తావులు, మరెక్కడా లేవు. పర్వతారోహణ దక్షులయిన వారికి అత్యున్నతమయిన మన హిమాలయాలకన్న ఆకర్షణీయమైంది యింకొకటి ఏమున్నది?

అలాగే అపూర్వ కళాఖండాలను మనసార స్మృతి చిహ్నలను సేకరించడములో ఆసక్తి గలవారికి సయితం తృప్తి యిక్కడ వెక్కసంగా లభిస్తాయి. భారతదేశపు కళాకారులు సృష్టించి అపూర్వవస్తు విశేషాలకు విదేశాలలో ఏనాడయిన బోలెడంత గిరాకీయుంది. స్వయం భువమైన సౌందర్యోత్కృష్టి, అపారమై ఓర్మి, శతాబ్దులుగా సంక్రమించిన విజ్ఞానము యివియన్నీ కల భారతీయ కర్మకారులకు అపూర్వ శిల్పరచనా కౌశలమును సం రించి పెట్టినవి. ఆ కారణంచేతనే జరీ, బుటేదారీ పనులతో నే పర్వంగా సుఖ స్పర్శదమైన కాశ్మీర్ దుశ్శాలువలు, కాశీ, మూ దాబాదు జరీచీరలు, ఢిల్లీ, జయపురం నగలు, మైసూరు, తి వాన్కూరులలోని దంతపు బొమ్మలు, మూర్షిదాబాదులో లోహపాత్రలు, ఫెరోజిదాబాదులోని గాజులు యిలా ఎన్నని చెప్పడం. ఈ దేశంలో అనుపదంగా ఎదురుపడే అనేకరకములై వస్తుసంచయం మాన్యులకే కాక సామాన్యులకు సైతం నే మనోల్లాసకరంగా యుంటాయని చెప్పడానికి ఆశ్చర్య మేముం

## మన కర్తవ్యం

మనం భారతీయులుగా పుట్టడమే గొప్ప గౌరవం ప్రపంచంలో. యుగయుగాలుగా కర్మభూమిగా వాసికెక్కిన ఈ పవిత్రదేశంలో, అందునా ఈ సమయంలో అన్యదుర్లభమైన భారతీయ జన్మ పొందగలగడం పూర్వపుణ్య విశేషం. ఇది సార్థకం కావడం స్వామికార్యము పేరుతోనైనా, స్వకార్యము పేరుతోనైనా దేశం నలుమూలలు పూర్తిగా తిరిగి ఏకరూపమయ్యూ, అడుగడుగునా వైవిధ్యశోభను వెలార్చుతుండే భారతమాత సురుచిర సౌందర్యోజ్జ్వల దివ్యరూప దీధితులను రేఖామాత్రంగా అయినా దృగ్గోచరం చేసుకోగలిగిననాడే. ఇందుకు మొదటిమార్గం ఆంధ్ర కవితా పితామహుడయిన అల్లసాని పెద్దన మహాకవి సృష్టించిన ప్రవరుని పాదలేపం మనకు లభించకపోయినా, ఆయన మన స్తత్త్వముమాత్రము మనదేశంలో అందరికి ఆదర్శం కావాలి. "పోయి సేవింపలేకున్నఁ బుణ్యతీర్థమహిమ వినుటయు నఖిలకల్మష హరంబు" అన్నమాట మన దేశంలో ఆబాల గోపాలానికీ తారకమంత్రం కావాలి. తీర్థయాత్రాచరణ శీలత్వం ప్రతివారికి రెండవ స్వభావం కావాలి. ఎవరైనా ఎదురుపడి 'ఏయే దేశములఁ జరించితిరి, మీ రేయే గిరుల్ చూచినా రేయే తీర్థములందు గ్రుంకిడితి రేయే ద్వీపముల్ మెట్టినా రేయే పుణ్యవనాళి గ్రుమ్మరితి రేయే తోయధుల్ డాసినా రాయా చోటులఁ గల్గు వింతలు మహాత్మా నాకెరింగింపరే.' అని అడిగినప్పుడు 'జనపదంబులుఁ బుణ్యనదీనదంబులుం జూచితి నందు నందుఁ గల చోద్యములుం గనుగొంటి నా

పటీరాచల పశ్చిమాచల హిమాచల పూర్వదిశాచలంబులన్’ అని ‘కేదారేశు భజించితిన్, శిరమునం గీలించితిన్ హింగుళాపాదాంభో రుహముల్ ప్రయాగనిలయుం బద్మాక్షు సేవించితిన్ యాదోనాథ సుతాకళత్రు బదరీనారాయణుం గంటి, నీ యాదేశం బననేల ? చూచితి సమస్తాశావకాశంబులన్.’ అని చెప్పగలిగి యుండాలి. ఆనాడే జన్మకు సిద్ధి. ఈ సాధనకు ‘సుందరభారతయాత్ర’ గ్రంథము ఒక మణిముకురము. దీనిని ఈ విధముగా సర్వాంగసుందరంగా, విజ్ఞానదాయకముగా, సరళ మనోహరమయిన శైలిలో వెలువరించి తెలుగుభాషకు, తెలుగువారికి ఎనలేని మేలును సమకూర్చిన శ్రీ సూర్యప్రకాశశాస్త్రిగారు, ఆయన సాధన గ్రంథ మండలి ధన్యములు. యాత్రాచణశీలురకు ఆయన, ఆయన గ్రంథములు దుర్గమ జ్ఞానమార్గ కరదీపికలు. మాతరం వందే.

— వేమరాజు భానుమూర్తి

Asst. Information Officer, Govt. of India.

“సుజలాం సుఫలాం మలయజశీతలాం
శుభ్రజ్యోత్స్నా పులకిత యామినీం
ఫుల్ల కుసుమిత ద్రుమదళ శోభినీం
మాతరం వందే...............”

# సాధన గ్రంథ మండలి ప్రచురణలు

| | |
|---|---|
| అష్టాదశ శ్లోకగీత | 0_12_0 |
| అర్థపంచకము | 0_12_0 |
| ♦ ఆశ్విన మాహాత్మ్యము | 2_ 0_0 |
| ఈశ్వర సాక్షాత్కారము | 0_ 3_0 |
| ఉపాసనీబాబా జీవితము | 1_ 8_0 |
| కల్యాణకుంజము | 1_ 4_0 |
| గురుశిష్యులు (శ్రీరామకృష్ణ, వివేకానందులు) | 1_ 0_0 |
| గీతాప్రతిభ (రెండవ కూర్పు) | 0.12_0 |
| గీతాకదంబము ౧ వ_ దళము | 1_ 4_0 |
| ,, ౨ వ_ దళము | 1_ 4_0 |
| గోవిందదామోదరస్తోత్రము | 0_ 8_0 |
| జడభరతుఁడు | 0 12_0 |
| * నరసదాసు కీర్తనలు | 0_10_0 |
| పరమసాధన (2 వ_ కూర్పు) | 0_12_0 |
| పరమార్థ తత్త్వము | 0_12_0 |
| పద్మపురాణము (ఆదిమఖండము) | 1_ 8_0 |
| ,, (భూమిఖండము) | 2_ 0_0 |
| ,, (బ్రహ్మఖండము) | 1_ 0_0 |
| బదరీయాత్ర (3 వ_ కూర్పు) | 1_ 0_0 |
| భగవత్ప్రాప్తి-ఉపాయములు | 0_ 4_0 |
| భక్తితత్త్వము | 0_12_0 |
| భక్తిరసాయనము | 2_ 0_0 |
| భారతీయ తత్త్వశాస్త్రము | 2_ 0_0 |
| ♦ భాగవతకథ | 2_ 0_0 |
| భారతీయ దర్శనము (ప్ర.ఖం) | 1_ 8_0 |
| * మానవ ధర్మము | 1_ 0_0 |
| * ముక్తిగీత | 0_ 6_0 |
| రాధారహస్యము (40 గ్రంథముల సారము) | 1_ 4_0 |
| * శ్రీరామపూజా విధానము | 0_ 4_0 |
| శ్రీకాళహస్తీశ్వరశతకము | 0_ 8_0 |
| * శ్రీసీతారామ శతకము | 0_ 2_0 |
| * శ్రీ త్యాగరాజ చరిత్ర | 0_ 4_0 |
| * శ్రీరామనామ ప్రభావము | 0_ 6_0 |
| శ్రీశుకుఁడు | 0_12_0 |
| శ్రీత్రిపురాంతకేశ్వరశతకము | 0_ 4_0 |
| * సప్తమహావ్రతములు | 0_ 6_0 |
| సిద్ధాంత కల్పవల్లి | 1_ 0_0 |
| సంకీర్తన మీమాంస | 1_ 0_0 |
| హరినామ మహిమ శతకము | 0_ 4_0 |
| * హిందూకోడ్ బిల్ సమీక్ష | 1_ 0_0 |

షరా:_ రు 1 కు లోపు వి. పి. లేదు. రు 5/_ లకు మించిన ఆర్డరుకు రు 1 కి 0_3_0, రు 25/_ లకు రు 1 కి 0_4_0 లు, రు 100/_ లకు రు 33_0_0 లు, కమీషను యివ్వఁబడును. సమర్థులగు ప్రచారకులు కావలయును.

* ఈ గుర్తుగలవి కొలదిప్రతులే గలవు. ♦ వీటికి కమీషను యివ్వబడదు.

☞ పై గ్రంథములన్నియు ఒకసెట్టు తీసుకొనిన సగముధరకే యివ్వబడును. ముందుగ రు 4/- లు అడ్వాన్సు పంపాలి. ఈ అవకాశము కొలదిరోజులు మాత్రమే.

మా ఆర్డరు ఇచ్చునప్పటికి ఉన్న గ్రంథములే పంపబడును. వి.పి. తీసికొన ప్రార్థన.

## యథార్థ భారతి

ఇది 27 ఏండ్లనుండి ఆబాలగోపాలమునకు వేదాంతతత్త్వము అర్థమగునట్లు ప్రచారము చేయుచున్న మాసపత్రిక. సంవత్సర చందా రు. 4-0-0. అడ్రసు:- వ్యాసాశ్రమము, ఏర్పేడు.

## యోగవాసిష్ఠము

32 వేల శ్లోకములు, శ్లోక తాత్పర్య సహితముగా నాలుగు సంపుటములుగ వెలువరింపబడినది. ఆధ్యాత్మికాసక్తిగల ప్రతి యాంధ్రుడు చదువతగినది. అనువాదకులు : శ్రీ నిర్వికల్పానంద స్వామివారు. వెల రు 50-0-0. —వ్యాసాశ్రమము, ఏర్పేడు.

## రామదర్శనం

గుంటూరుజిల్లా, పిడుగురాళ్ళ రామతీర్థ సేవాశ్రమమునుండి శ్రీ కేశవతీర్థస్వామివారిచే, రామతీర్థ భావ ప్రచారార్థము 6 సం॥ నుండి ప్రకటింపబడు మాసపత్రిక. సంవత్సరచందా రు 3-0-0.

## గీతావాణి

కర్నూలుజిల్లా, ఆళ్ళగెడ్డ, గీతాసాహిత్య సేవాసమితి పక్షమున స్వామి రామకృష్ణగారిచే 5 ఏండ్లనుండి కేవల భగవద్గీతా ప్రచారార్థము ప్రకటింపబడుచున్నది. సంవత్సరచందా రు 4-0-0.

## శ్రీమద్భగవద్గీత

తాత్పర్య దీపికా సహితము, తాత్పర్య విశేషార్థములతో ఇంత అందముగ నింతవర కెవరు ప్రచురించలేదు. గ్లేజు పేపరు. ముచ్చటైన కూర్పు. క్యాలికో బైండు. 600 పైగా పేజీలు. వెల రు 0-12-0. వలయువారు:- శ్రీ సీతారామనామ సంకీర్తన సంఘము, మార్కెటు వీధి — సికింద్రాబాదు.

# సాధన గ్రంథమండలి, తెనాలి. స్థాపితము : 1945

## మహారాజపోషకులు (శాశ్వతము రు. 116 లు)

| | |
|---|---|
| శ్రీ జిడ్డు లింగయ్యగారు | బందరు |
| ,, ఈదర వేంకట్రావు పంతులుగారు | ఏలూరు |
| ,, దరిశి జానకిరామయ్యగారు | కొత్తపాలెం (దరిశి తా॥) |
| ,, బొంగరాల వీరాస్వామినాయుడుగారు | కాకినాడ |
| ,, దుగ్గిరాల సూర్యనారాయణమూర్తిగారు | తెనాలి |
| ,, యేజండ్ల శ్రీరాములుచౌదరిగారు | |
| ,, వి. పి. చౌదరిగారు | మదరాసు |
| శ్రీ జిల్లెళ్ల వేంకటభానోజీరామయ్య జమీందారువారు | పేరూరు |

## రాజపోషకులు (శాశ్వతము రు. 58 లు)

| | |
|---|---|
| శ్రీ రూపాకుల శివరాంగారు | హత్రాస్ |
| ,, పాలుట్ల పాలంకయ్యగారు | గుంటూరు |
| ,, దోనేపూడి వేంకటరమణమూర్తిగారు | కంభం |
| ,, వేజెళ్ళ రాఘవయ్యచౌదరిగారు | జూపూడి |
| ,, కలగర నాగభూషణచౌదరిగారు | ఏలూరు |
| ,, జంధ్యాల వేంకటనరసింహశాస్త్రిగారు | గొడవర్రుఅగ్రహారం |
| ,, జంధ్యాల నరసింహశాస్త్రిగారు | గుంటూరు |
| ,, యస్. కె. ప్రకాశరావుగారు | తెనాలి |
| ,, పులిపాటి వేంకటేశ్వర్లుగారు | తెనాలి |

| | |
|---|---|
| శ్రీ బొంతా సత్యనారాయణ సోదరులు | తెనాలి |
| ,, జొన్నాదుల రామస్వామిగారు | |
| ,, చదలవాడ నాగేశ్వరరావుగారు | |
| ,, సంకా వీరభద్రయ్యగారు | |
| ,, నిడుమోలు శ్రీరామమూర్తిగారు | ఢిల్లీ |
| ,, పుచ్చా వెంకట్రామయ్యగారు | దంతలూరు |
| శ్రీమతి నిమ్మగడ్డ అన్నపూర్ణమ్మగారు | దుగ్గిరాల |
| శ్రీ కె. నరసింహారావుగారు | విజయనగరం |
| ,, తూములూరు వెంకట శివరామకృష్ణయ్యగారు | నెల్లూరు |
| ,, కోట శ్రీనివాసరావుగారు | |
| ,, జంధ్యాల వెంకట సోమయాజులుగారు | మదరాసు |
| ,, ముదిగొండ లింగమూర్తిగారు | |
| ,, కె. వి. రెడ్డిగారు | |
| ,, ఆర్. సాంబశివరావుగారు | |
| ,, పులిపాక చినపున్నయ్యగారు | నిడుబ్రోలు |
| ,, చెన్నుభొట్ల భానుమూర్తిగారు | కాకినాడ |
| ,, బులుసు సూరీడుగారు | అంబనవిల్లి |
| ,, జయంతి బుచ్చిరామశర్మగారు | ముక్తేశ్వరం |
| ,, పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు | చావలి |
| ,, దొడ్ల వెంకటరామిరెడ్డిగారు | కావలి |

| | |
|---|---|
| శ్రీ దువ్వూరి అప్పల నరసింహంగారు | అనకాపల్లి |
| ,, రావులపాటి నరసింహారావుగారు | నేలకొండపల్లి |
| ,, కంకిపాటి జగన్మోహనరావుగారు | |
| ,, బ్రహ్మాండం వేంకటలక్ష్మీనారాయణశాస్త్రిగారు | బాపట్ల |
| ,, పి. శంకరయ్యగారు | సికింద్రాబాదు |
| శ్రీమతి యార్లగడ్డ జానకమ్మగారు | జూలపాలెం |

పోషకులు ( ప్రతి సంవత్సరము రు. 25లు )

| | |
|---|---|
| శ్రీ నృసింహభారతీ స్వామివారు | తెనాలి |
| ,, చుండూరు రామయ్యగారు | |
| ,, పోలిశెట్టి సోమసుందరంగారు | గుంటూరు |
| ,, కొత్తూరు రామయ్య, కర్పూరపు రామకృష్ణమూర్తి గార్ల కంపెనీ | |
| ,, బెండపూడి పేరరాజుగారు | వాల్తేరు |
| ,, పుతుంబాక శ్రీకృష్ణయ్యగారు | పెదపాలెం |
| ,, వద్ద్యాల వెంకటేశ్వర్లుగారు | పూడివాడ |
| ,, పొట్టిబండ్ల వెంకటేశ్వర్లుగారు | దొడ్డవరప్పాడు |

సభ్యులు (ప్రతి సంవత్సరము రు. 10 లు)

| | |
|---|---|
| శ్రీ వ. వ. శ్రీ విద్యాశంకరభారతీస్వామివారు | బందరు |
| ,, కోటంరాజు కృష్ణారావుగారు | తెనాలి |
| శ్రీ ఖండ్రిక సాంబయ్యశాస్త్రిగారు | తెనాలి |
| ,, విష్ణుభొట్ల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు | |
| ,, ముక్కామల వేంకటాచలపతిరావుగారు | |
| ,, గాదేపల్లి వేంకటసుబ్బారావుగారు | |
| ,, ప్రత్తి సూర్యనారాయణగారు | |
| ,, అన్నంరాజు మాధవరావుగారు | |
| ,, కాజ వేంకట జగన్నాధరావుగారు | |
| ,, గుడివాడ హనుమంతరావుగారు | |
| ,, గోనుగుంట్ల సుబ్బారావుగారు | |
| ,, కాజ వేంకట నరసింహారావుగారు | |
| ,, అద్దేపల్లి శ్రీమన్నారాయణమూర్తిగారు | |
| ,, ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మగారు | |
| ,, ఎ. సుందరరావుగారు | |
| ,, కొమ్మూరి కాశీవిశ్వనాధంగారు | |
| ,, ధూళిపాళ వెంకటసుబ్బారావుగారు | |
| ,, ప్రొప్రైటర్సు రూబీ యింక్సు | |
| ,, త్రిపురమల్లు శ్రీరాములుగారు | |
| ,, ముక్కామల రామచంద్రరావుగారు | |
| ,, తూములూరి సత్యనారాయణగారు | |
| ,, యడ్లపాటి వెంకట్రావుగారు | |
| ,, పొలదుగు సీతారామయ్యగారు | |

| | |
|---|---|
| శ్రీ రూపాకుల సూర్యనారాయణగారు | తెనాలి |
| ,, రాళ్ళపల్లి వెంకటేశంగారు | |
| ,, రావినూతల నరసింహారావుగారు | ఒంగోలు |
| ,, పావులూరి వెంకట సుబ్బారావుగారు | |
| ,, ఉప్పలపాటి సుబ్రహ్మణ్యంగారు | |
| ,, తాతా పెదకన్నయ్యగారు | |
| ,, పేర్ల పిచ్చయ్యగారు | |
| ,, వల్లూరు వెంకటేశ్వర్లుగారు | హైదరాబాదు |
| ,, బొలిశెట్టి సీతారామయ్యగారు | బాపట్ల |
| ,, కె. మధుసూదనరావుగారు | |
| ,, మామిడిపూడి వెంకటసుబ్బయ్యగారు | మదరాసు |
| ,, సి. అలవందరయ్య | |
| ,, వై. యస్. నారాయణగారు | మదరాసు |
| ,, వారణాసి పార్వతీశంగారు | |
| ,, పిసిపాటి పిచ్చయ్యగారు | ఇంకొల్లు |
| ,, జరుగుల హరినారాయణగారు | |
| ,, ఇసుకపల్లి వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు | గార్లపాడు |
| ,, వసాన్నల లక్ష్మీనరసింహంగారు | గుంటూరు |
| ,, వసాన్నల రామకృష్ణయ్యగారు | |
| ,, జొన్నలగడ్డ వెంకటసుబ్రహ్మణ్యంగారు | |

| | |
|---|---|
| శ్రీ వేళ్ళచెర్వు వీరాంజనేయశాస్త్రిగారు | గుంటూ |
| ,, బొలిశెట్టి హనుమంతరావుగారు | |
| ,, ఎ. సత్యనారాయణరావుగారు | |
| ,, కూచిభొట్ల సుబ్బారావుగారు | బొంబాం |
| ,, గరిమెళ్ళ శ్రీరామమూర్తిగారు | గంగలకు |
| ,, గుండవరపు సూర్యనారాయణగారు | |
| ,, దుప్పూరి వేంకటపతి సోమయాజులు జమీందారుగారు | |
| ,, మద్దింశెట్టి బ్రహ్మయ్యగారు | అయినవిల్లి |
| ,, మద్దిరాల వెంకటకామేశ్వరరావుగారు | కానపల్లిలంక |
| ,, నలాది బాపయ్యగారు | అనాతవరం |
| ,, సరిపల్లె విశ్వనాథంగారు | |
| ,, నూకల అమ్మన్న సి[illegible]ంతిగారు | |
| ,, బులుసు పాపయ్యశాస్త్రిగారు | రాజమండ్రి |
| ,, వడ్లమాని వెంకట సుబ్బారాయుడుగారు | |
| ,, బులుసు సత్యనారాయణగారు | |
| ,, జి. వరదరావుగారు | |
| ,, జిల్లా సుబ్బారాయశ్రేష్ఠిగారు | |
| ,, ఇన్నమూరి చెంచయ్యగారు | |
| ,, మానాప్రగడ శ్రీరాములుగారు | కొవ్వూరు |
| ,, ధవళ సుబ్రహ్మణ్యనరసింహంగారు | విజయనగరం |

| | |
|---|---|
| శ్రీ కాజ సూర్యనారాయణగారు | విజయవాడ |
| ,, తంగిరాల వీరరాఘవయ్యగారు | |
| ,, నందిపాటి రామయ్య | |
| ,, మంథా సుబ్బారావుగారు | అమలాపురం |
| ,, కస్తూరి రామచంద్రమూర్తిగారు | |
| ,, గాడేపల్లి సీతారామయ్యగారు | రామచంద్రపురం |
| ,, ముక్కావిల్లి వెంకటనారాయణమూర్తిగారు | |
| ,, ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారు | |
| ,, దూర్వాసుల వెంకట సుబ్బారావుగారు | పెద్దాపురం |
| ,, ఉప్పల శ్రీరామమూర్తిగారు | అనకాపల్లి |
| ,, జి. వి. యల్. నరసింహంగారు | |
| ,, కోలగొట్ల సూర్యనారాయణరావుగారు | |
| ,, కంభంపాటి సోమనాథంగారు | తుని |
| ,, కోట పాలయ్యగారు | ఇరగవరం |
| ,, జోస్యుల వెంకటసత్యనారాయణమూర్తిగారు | భట్నవిల్లి |
| ,, వడ్లమాని రామేశ్వరరావుగారు | నందంపూడి |
| ,, నూకల లక్ష్మీనారాయణగారు | |
| ,, నూకల అమ్మన్న పంతులుగారు | |
| ,, చల్లా సుబ్రహ్మణ్యంగారు | నరేంద్రపురం |
| ,, ద్విభాష్యం వెంకట సూర్యనారాయణగారు | చింతలూరు |

| | |
|---|---|
| శ్రీ బూదరాజు వాసుదేవమూర్తిగారు | చీరాల |
| ,, మద్దూరి సుబ్రహ్మణ్యంగారు | |
| ,, జాగర్లమూడి కుప్పుస్వామిగారు | కారంచేడు |
| ,, బవరం కోటిరెడ్డిగారు | వంకాయలపాడు |
| ,, పాలూరి పుష్పేశ్వరరావుగారు | ఏలూరు |
| ,, పులిగెళ్ళ వెంకటకృష్ణయ్యగారు | నెల్లూరు |
| ,, ఆమంచర్ల రామనాథరావుగారు | |
| ,, మంగమూరి సుబ్బారావుగారు | |
| ,, వేగూరు సుబ్బారావుగారు | |
| ,, పంచాగ్నుల రామస్వామిగారు | |
| ,, కాసరం రామారావు గారు | |
| ,, చతుర్వేదుల రామచంద్రయ్యగారు | |
| ,, వవ్వేటి విశ్వనాథరావుగారు | |
| ,, కాళ్ళపల్లి పట్టాభిరామయ్యగారు | |
| ,, పనుమర్తి సత్యనారాయణగారు | కావలి |
| ,, యస్. సిద్ధాంతిగారు | వరంగల్ |
| ,, యస్. పి. విశ్వనాథశర్మగారు | సికింద్రాబాదు |
| ,, గొర్తి రామమూర్తిగారు | |
| ,, తాడేపల్లి శివరామకృష్ణయ్యగారు | |
| ,, చిట్టా వేంకట్రామశాస్త్రిగారు | |

| | |
|---|---|
| శ్రీ జూలూరి జగదీశ్వరయ్యగారు | సికింద్రాబాదు |
| ,, జూలూరి వీరేశలింగంగారు | |
| ,, సీర్నం సత్యనారాయణగుప్తగారు | |
| ,, ఎ. కృష్ణమూర్తిగారు | హైదరాబాదు |
| ,, చేతసభొట్ల విశ్వనాధంగారు | |
| ,, కె. వెంకట్రామయ్యగారు | |
| ,, పి. ఆదిశేషయ్యగారు | సిర్నపల్లి |
| ,, మాటూరి సీతారామారావుగారు | మధిర |
| ,, లొల్ల శంకరశాస్త్రిగారు | కొల్లూరు |
| ,, దుగ్గిరాల వేంకట సుబ్రహ్మణ్యంగారు | కూచినపూడి |
| ,, చావలి వేంకటనారాయణ | |
| ,, యం. శివరామయ్యగారు | బందరు |
| ,, ధూర్జటి సుబ్రహ్మణ్యంగారు | |
| ,, పారుపల్లి సుగుణవతిగారు | శ్రీకాకుళం |
| ,, సోమంచి శ్రీరామశాస్త్రిగారు | ఆత్రేయపురం |
| ,, భమిడిపాటి చినజగన్నాధంగారు | కోరుమిల్లి |
| ,, సతాని సూర్యనారాయణగారు | |
| ,, దేవరకొండ వెంకట్రామశాస్త్రిగారు | |
| ,, మాక్కవిల్లి సాంబమూర్తిగారు | |
| ,, మద్దుల శ్రీరామమూర్తిగారు | అనకాపల్లి |

| | |
|---|---|
| శ్రీ మంగళగిరి సత్యనారాయణగారు | వాల్తేరు |
| ,, డి. వెంకటేశ్వరరావుగారు | రాజమండ్రి |
| ,, అక్కపెద్ది వెంకటేశ్వరశర్మగారు | సికింద్రాబాదు |
| ,, యన్. ఆర్. గుప్తగారు | |
| ,, ములుగు వెంకటయ్యగారు | |
| ,, కొండా లక్ష్మయ్యగారు | |
| ,, వద్ది ఓబయ్యగారు | పుల్లంపేట |
| ,, గుండు వెంకట సుబ్రహ్మణ్యంగారు | కర్నూలు |
| ,, ఏచూరి సీతారామారావుగారు | |
| ,, బులుసు వెంకటేశ్వర్లుగారు | |
| ,, వై. వెంకటేశంగారు | వాల్తేరు |
| ,, అద్దంకి లక్ష్మీనారాయణగారు | |
| ,, కె. హరిహరస్వామిగారు | అమలాపురం |
| ,, జమలాపురపు వెంకటేశ్వరరావుగారు | ఖమ్మంమెట్టు |
| ,, సర్వదేవభట్ల రామకృష్ణయ్యగారు | |
| ,, యిరుకంటి రామచంద్రరావుగారు | |
| ,, పరాశరం లక్ష్మీనారాయణాచార్యులుగారు | |
| ,, బూరెల సాంబశివరావుగారు | |
| ,, చిక్కా నరసింహంగారు | |
| ,, గొల్లా ముత్తయ్య అండ్ లక్ష్మీనారాయణగార్లు | |

శ్రీమతి అరవపల్లి సత్యావతమ్మగారు ఖమ్మంమెట్టు
శ్రీ కొత్తూరు కాయన్నగారు
,, కోదాటి పాండురంగారావుగారు
,, అనుమోలు ప్రసాదరావుగారు
,, నోముల నాసుగారు
,, తెలుదేవలపల్లి రామనాధంగారు
,, బులుసు శ్రీహరిరావుగారు
,, మద్ది పిచ్చయ్యగారు
,, అరవపల్లి దుర్గయ్యగారు

శ్రీ చిట్టా రాజేశ్వరరావుగారు ఖమ్మంమెట్టు
,, సర్వదేవభట్ల వెంకటరాజయ్యగారు
,, పెండ్యాల యజ్ఞనారాయణగారు
,, రంగుభట్ల యజ్ఞనారాయణగారు
,, కల్వాల హనుమంతరావుగారు
,, పుల్లఖండం పుల్లయ్యగారు
,, సన్నిధానం నరసయ్యగారు
,, గుర్రాల రామయ్యగారు
,, పెండ్యాల కృష్ణమూర్తిగారు సేలకొండపల్లి

## రాజపోషకులు (శాశ్వతము రు. 58 లు)

శ్రీ పద్యాల వెంకటేశ్వర్లుగారు పూడివాడ
,, పాటిబండ్ల వెంకటేశ్వర్లుగారు దొడ్డవరప్పాడు